# ప్రకరణములు.

# సంకేతములు.

ఇ. లా. రి.—ఇండియన్ లా రిపోర్ట్స్.

14 మ.—మదరాసు సీరీస్, 14 వాల్యూం.

18 క.—కలకత్తా సీరీస్, 18 వాల్యూం.

32 బొం.—బొంబయి సీరీస్, 32 వాల్యూం.

21 అ.—అలహాబాదు సీరీస్, 21 వాల్యూం.

మ. హై.—మదరాసు హైకోర్టు రిపోర్టులు.

క. హై.—కలకత్తా హైకోర్టు (బంగాళా లా) రిపోర్టు

బొం. హై.—బొంబయి హైకోర్టు రిపోర్టులు.

అ. హై.—అలహాబాదు హైకోర్టు రిపోర్టులు.

మై.—మైసూరు చీఫ్ కోర్టుల రిపోర్టులు.

మూ. ఇ. అ.—మూర్సు ఇండియన్ అప్పీల్సు.

స.—సదర్లండుగారి వీక్లీ రిపోర్టులు.

మ. తీ.—మదరాసు తీర్పులు.

మ. స. తీ.—మదరాసు సదరు కోర్టుల తీర్పులు.

బం. స. తీ.—బంగాళా సదరు కోర్టుల తీర్పులు.

బొం. సి. రి.—బొంబయి సిలెక్టు రిపోర్టులు.

మ. లా. జ.—మదరాసు లా జర్నల్.

అ. లా. జ.—అలహాబాదు లా జర్నల్.

క. వీ. నో.—కలకత్తా వీక్లీ నోట్సు.

బారో.—బారో డేలు దొరగారి రిపోర్టులు.

మార్లి.—మార్లీ దొరగారి డైజెస్టు.

వె. బు.—వెస్ట్ అండ్ బూలర్ దొరగార్ల హిందూలా

డబ్లియు. మెక్.—డబ్లియు మెక్నాటన్ దొరగారి హిందూలా

ఎఫ్. మెక్.—ఎఫ్ మెక్నాటన్ దొరగారి హిందూలా.

స్ట్రేం.—స్ట్రేంజిదొరగారి హిందూలా.

19. కోర్టువారు వివాహమును నిలుపుట.
20. వివాహము రద్దుపరచుట.
21. వెంకటాచార్యుల కేసు.
22. జడ్జిమెంటులోని సారాంశములు.
23. వివాహము క్రమముగా జరిగినదా? సప్తపది, మాంగల్యధారణ. నిషేకము.
24. తలిదండ్రుల యిష్టము లేక పిల్లకు వివాహము ఎప్పుడు చెల్లును, ఎప్పుడు చెల్లదు? శిక్ష.
25. ఉదాహరణములు.
26. తలితండ్రుల యిష్టము లేక పిల్లవానికి వివాహము.
27. పిచ్చివాడు, నపుంసకుడు-ఇట్టివారికి వివాహము చెల్లునా?
28. నిశ్చయించుకొన్న వివాహమును మానుకొనుట. భర్త శాస్త్రములు.
29. తీర్పులు. నష్టమిప్పించుట.
30. సొమ్ము విషయమైన ఒడంబడిక.
31. భిన్నజాతి వివాహములు.
32. వధూవరుల కులగోత్రములు. సపిండసంబంధము. మేనమామకూతురు, మేనత్త కూతురు, అక్క చెల్లెండ్ర కూతురు-వీరితో వివాహము. సగోత్ర వివాహము.
33. నింద్య వివాహములు.
34. చెల్లని వివాహములు.
35. వేర్వేరు శాఖలవారికి వివాహములు.
36. భార్య సంరక్షణహక్కు.- రజస్వలా పూర్వము, రజస్వలానంతరము.
37. పండ్రెండు సం॥ లలోపల నిషేకము. శిక్ష.
38. భార్యాభర్తల ప్రధానవిధి
39. భార్యను స్వాధీనపరచుకొనుటకు భర్తవల్ల దావా. భార్యతిరుగబాటు చేసిన యెడల అమలు.
40. పై దావా ఎప్పుడు చెల్లును, ఎప్పుడు చెల్లదు? భర్తను విడిచి భార్య యెప్పుడు వేరుగా కాపురముండవచ్చును? తీర్పులు. కోడరికము, లంజనుంచుకొనుట,

## ప్రకరణము 3.—పుత్రస్వీకారము.

57. భార్య స్వతంత్రించి దత్తు చేసికొనవచ్చునా?

58. వితంతువు దత్తు చేసికొనవచ్చునా? వసిష్ఠ వచనము-నాల్గు అభిప్రాయములు.

59. స్వీకారాధికారము - స్టాంపు, రిజిష్ట్రేషను వగైరా.

60. స్వీకారాధికారము లా ప్రకారము క్రమమైనదిగానుండవలెను.

61. స్వీకారాధికారము ప్రకారము హెచ్చుతగ్గులేక జరిగించవలెను. ఉదాహరణములు. అయ్యాసిల్లి కేసు.

62. భార్యకుమాత్రమే భర్త స్వీకారాధికారమీవచ్చును

63. భర్త అధికార మిచ్చినను దత్తు చేసికొనుటకు భార్య బద్ధురాలుకాదు.

64. స్వీకారాధికారము ఎంత కాలమువరకు చెల్లును? ఉదాహరణలు. తీర్పులు.

65. స్వీకారాధికారము రద్దగుట, ముగియుట.

66. మైనరు వితంతువు దత్తు చేసికొనవచ్చునా?

67. వ్యభిచారిణియగు వితంతువు దత్తుగొనవచ్చునా?

68. సకేశయగు వితంతువు దత్తు చేసికొన వచ్చునా?

69. ఒకభర్తకే యిద్దరు ముగ్గురు వితంతువు లుండు నప్పుడు ఎవరు దత్తు చేసికొనవచ్చును?

70. భర్తయొక్క అనుజ్ఞ లేకున్నను, అతని సపిండుల అనుమతితో, మదరాసు ప్రెసిడెన్సీ యందలి వితంతువు దత్తు చేసికొనవచ్చును.

71. రామనాధపురపు కేసు. సారాంశములు.

72. త్రావన్కూరు కేసు.

73. బరంపురం కేసు.

74. జంటవాదము.

75. గుంటూరు కేసు. వితంతువు యొక్క మనోభావము.

76. దురుద్దేశము.

77. బొంబయి ప్రెసిడెన్సీయందలి వితంతువునకు గల స్వీకార స్వాతంత్ర్యము. తీర్పులు. నాలుగు ముఖ్యాంశములు.

102. దత్తువదలివేయవచ్చునా
103. దత్తపుత్రునివారసుహక్కు
104. స్వీకర్తకు ఇద్దరుముగ్గురు భార్యలు.
105. ద్వ్యాముష్యాయణుని తల్లులహక్కు.
106. ఔరసపుత్రుడు పుట్టినయెడల దత్తపుత్రుని భాగము. బంగాళాదేశము, కాశీరాజ్యము, మదరాసు ప్రెసిడెన్సీ, బొంబయి ప్రెసిడెన్సీ. జైనమతస్థులు. కులాచారములు. అవిభాజ్యముగు జమీందారీ ఆస్తి.
107. ఔరసపుత్రుడుమృతిచెందినయెడల దత్తునిహక్కు
108. ద్వ్యాముష్యాయణుడు, ఔరసుడు - వీరి భాగము
109. దత్తపుత్రునికిఆస్తిచేరుట ఉదాహరణలు, తీర్పులు.
110. స్వీకారమునకుపూర్వము ఆస్తి విషయమై జరిగింపబడిన కార్యములు.
111. దత్తపుత్రుని హక్కువిషయమై దత్తు తండ్రికిని జనక తండ్రినిఒడంబడికలు.
112. దత్తు చేసికొనకుండునట్లు ఒడంబడిక.
113. జనకతండ్రికి సొమ్మియ్యవచ్చునా?
114. దత్తు జరుగనియెడల హక్కు లేదు.
115. దత్తు చెల్లనియెడల దత్తపుత్రుని హక్కు.
116. దత్తు చెల్లనియెడల, దత్తపుత్రునికి చేయబడియుండు దానములు చెల్లునా? ఉదాహరణలు, తీర్పులు. పిఠాపురం కేసు.
117. కృత్రిమస్వీకారము-నియమములు.
118. జాఫ్నా దేశపు స్వీకారము
119. ఇల్లటపు అల్లునిహక్కు - తీర్పులు.
120. కన్యాస్వీకారము.
121. వేశ్యలలో చెల్లునట్టి వాడుక.
122. వ్యభిచారవృత్తి నిమిత్తము కన్యాస్వీకారము - కన్నెరికము - శిక్ష.

---

విషయసూచిక

## ప్రకరణము 4.—మైనర్ల సంరక్షణ.



## ప్రకరణము 5—సమష్టి కుటుంబము.

143. ఉదాహరణ నిమిత్తము వంశావళి.
144. అది పురుషుని వద్దనుండి మూడు తరములు కాదు.
145. దాయభాగ సంప్రదాయము ప్రకారము భాగస్థుల ప్రత్యేకపు హక్కు.
146. ఎట్టిసొత్తు పిత్రార్జితము? ఎట్టిది స్వార్జితము?
147. తండ్రి స్వార్జితము కుమారుల పిత్రార్జిత మగుట.
148. దాన రూపకముగా వచ్చిన తండ్రి ఆస్తి - ఉయిలు రూపకముగావచ్చిన తండ్రి ఆస్తి. మనోవర్తికై యిచ్చిన పిత్రార్జితము. ఒక భాగస్థుని అప్పులు అర్చుగా మిగిలిన పిత్రార్జితము.
149. తాకట్టు విడిపించిన పిత్రార్జితము. [ద్ధి.
150. పిత్రార్జితముయొక్క వృ
151. అవిభక్త జమీందారీ ఆదాయము.
152. కుటుంబ ద్రవ్యములో కలిపిన స్వార్జితము.
153. స్వార్జితము విషయమై యాజ్ఞ వల్క్య స్మృతి, మితాక్షరము.
154. విద్యాధనము గూర్చి మితాక్షర దాయభాగములు.
155. విద్యాధనము విషయమై తీర్పులు.
156. సమష్టి ద్రవ్యసహాయము వలన సంపాదించిన సొత్తు.
157. పోయిన పిత్రార్జితమును ఒకభాగస్థుడు రాబట్టినయెడల, దానియందు అతనికి గలుగు హక్కు.
158. సర్కారువారి బహుమానములు.
159. స్వార్జితపిత్రార్జితముల విషయమై రుజువుభారము.

---

## ప్రకరణము 6.—ఋణములు.

160. ఋణగ్రస్త దోషము - తండ్రి తాతల ఋణములు- ధర్మశాస్త్రములు.
161. తీర్పులు.
162. అయోగ్య ఋణములు రుజువు భారము.

---

ప్రకరణము 7.—ఆస్తి పరాధీనములు, దానములు.

180. పిత్రార్జితపు సొత్తుమీద తండ్రికి స్వాతంత్ర్యములేదు. కొన్ని విధ్యుక్తకార్యముల నిమిత్తము మాత్రము చరరూపక పిత్రార్జితముమీదతండ్రికిగలస్వాతంత్ర్యము.

181. తక్కిన సందర్భములయందు స్వాతంత్ర్యములేదు.

182. తండ్రిచేసిన పరాధీనములకు, కుమారుల సమ్మతి. వారి ఆక్షేపణహక్కు.

183. స్వీకారపుత్రునకు గల ఆక్షేపణ హక్కు.

184. కుమారులఅంగీకారము.

185. విధ్యుక్తకార్యముల విషయమై కుమారుల అంగీకారము ఆవశ్యకమా?

186. సమిష్టి కుటుంబపు మేనేజరునకు గల పరాధీన స్వాతంత్ర్యము.

187. అప్పిచ్చువాడువిచారించవలసిన అంశములు.

188. పరాధీనములను రద్దుపరచు విషయములో రుజువు భారము.

189. సమిష్టి భాగస్థులందరును ప్రతివాదులుగా చేర్చబడవలెను.

190. మీది కట్టుబాట్లయొక్క నిరుపయోగము. తండ్రి కోరినయెడల యావత్తు పిత్రార్జితమును ఆతడు పరాధీనపరచునట్టి మార్గములు.

191. తండ్రి గాక యితర భాగస్థులకుగల పరాధీన స్వాతంత్ర్యము - మదరాసు బొంబయి తీర్పులు.

192. క్రాంసుఫరు దారునికి కలుగునట్టి హక్కు - మదరాసు బొంబయి తీర్పులు.

193. అలహాబాదు, కలకత్తా హైకోర్టువారివ్యతిరేకపు తీర్పులు.

194. పరాధీనమునురద్దుపరచునపుడు క్రాంసుఫరు దారునకు సొమ్మిప్పించివేయుట. క్రాంసుఫరుసొత్తునందు చేయబడిన వృద్ధి, మరమ్మతు.

195. అవిభాజ్య జమీందారీ పరిపాలకుని పరాధీన స్వాతంత్ర్యము. తీర్పులు.

## ప్రకరణము 8.—ఉయిల్లు.

## ప్రకరణము 9.—ధర్మకార్యములు.



## ప్రకరణము 10.—జీవనాంశము.

## ప్రకరణము II.—విభాగము.

252. సమష్టి కుటుంబపు భాగస్థులు విభాగించుకొనుట.

253. ఏసొత్తులువిభాగయోగ్యములు? పిత్రార్జితము - జాయింటు సొత్తు.

254. ఏయేసొత్తులు అవిభాజ్యములు? స్వార్జితము, పురాతన జమీాందారీ, సర్కారు వారివల్ల ఇయ్యబడిన ఆస్తి, బిరుదుల నిమిత్తము ఏర్పాటు చేయబడిన ఆస్తి.

255. కుమారుడు, మనుమడు, మునిమనుమడు - వీరికిగల విభాగపు హక్కు. మితాక్షర దాయభాగములు.

256. దాసీపుత్రుల విభాగపు హక్కు.

257. జాతిభ్రష్టుని విభాగపు హక్కు.

258. విభాగానంతరము జన్మించిన పుత్రునిహక్కు.

259. మైనర్ల విభాగపుహక్కు.

260. దేశాంతరగతులైన భాగస్థుని హక్కు.

261. కుష్ఠరోగులునపుంసకులు పిచ్చివాండ్రు, గ్రుడ్డి, చెవిటివాండ్రు, వికలాంగులు, సన్యాసాశ్రమము నవలంబించినవాడు-వీరి విభాగపుహక్కు. వారి దత్తపుత్రులు.

262. విభాగానంతరము వ్యాధినివారణమగుట, లేకపుత్రుడు జన్మించుట.

263. ట్రాన్స్ఫర్ దార్ల విభాగపుహక్కు.

264. స్త్రీలకుగలహక్కు - దాయభాగ మితాక్షరములు.

265 విభాగమువద్దనియేర్పాటు

266. పిత్రార్జితముయొక్క విభాగము-తండ్రికిని కుమారులకును సమానభాగములు, పత్నీ విభాగము.

267. మితాక్షరము ప్రకారము స్వార్జితయొక్క అసమాన విభాగము.

268. బంగాళా సంప్రదాయము ప్రకారము అసమాన విభాగము చెల్లునా?

## ప్రకరణము 12.—వారసుహక్కు.

293. మితాక్షరము ప్రకారము బంధువుల వివరము.
294. వారసుదార్ల క్రమము— మితాక్షర దాయభాగ సిద్ధాంతములకు భేదము.
295. పుత్రపౌత్రప్రపౌత్రులు.
296. వీరికిసమానమగువారసు హక్కు. ఉదాహరణము.
297. విభాగ యోగ్యముకాని జమీందారీ విషయములో జ్యేష్ఠపుత్రుడు.
298-300. దాసీపుత్రుని హక్కు ధర్మశాస్త్రములు,తీర్పులు
301. దాసీపుత్రుని ఔరస సంతతి.
302. దాసీపుత్రుల ఆస్తి.
303. భార్యవారసుహక్కు.
304. అనేక భార్యలు.
305. భార్యమొదలగు స్త్రీవారసులకు అసంపూర్ణ స్వాతంత్ర్యము.
306. వ్యభిచారిణియగు భార్యయొక్క వారసు హక్కు.
307. పునర్వివాహము చేసికొన్న భార్య వారసుహక్కు.
308. కుమార్తెవారసుహక్కు.
309. వ్యభిచారదోషము, పునర్వివాహము.
310. అనేకకుమార్తె లుండు నపుడు ఎవరు వారసులు? భిన్న సంప్రదాయములు.
311. ఒకటే తరగతి కుమార్తెలకు సమానహక్కు.
312. దౌహిత్రుడు, అనగా, కుమార్తె కొడుకు.
313. దౌహిత్రులకు సమాన భాగములు.
314. దౌహిత్రునికి సంపూర్ణ స్వాతంత్ర్యము.
315. దౌహిత్రుల వారసు హక్కు సమష్టి హక్కా, ప్రత్యేకపు హక్కా?
316. తలి దండ్రులు.
317. తల్లికి అసంపూర్ణ స్వాతంత్ర్యము - వ్యభిచార దోషము, పునర్వివాహము.
318. సవతితల్లికిగల హక్కు. తీర్పులు.
319. దత్తతల్లి హక్కు.
320. అన్నదమ్ముల హక్కు. ఏకోదరులు, భిన్నోదరులు. సమభాగములు.

345. సంపూర్ణ స్వాతంత్ర్యము లేని స్త్రీ వారసుల అనుభవపు హక్కు, పరాధీనపుహక్కు.

346. కొన్ని అగత్యమైన కార్యములనిమిత్తముపరాధీనము చేయవచ్చును. శ్రాద్ధాదికర్మలు, తీర్థయాత్రలు, దానములు, అప్పులు, జీవనాంశములు, పెండ్లిండ్లు, సర్కారు బాకీ వగైరా తప్పరాని అగత్యములు.

347. స్త్రీ వారసుదారువల్ల విక్రయము.

348. అప్పిచ్చువానికి సంబంధించిన విషయములు.

349. స్త్రీ వారసుదారు చేయు అనగత్యమైన పరాధీనములు

350. స్త్రీ వారసుదారు తనహక్కులను వదులుకొని ఆస్తిని అనంతర వారసుదారున కిచ్చి వేయుట.

351. అనంతర వారసుల సమ్మతితో చేయు పరాధీనములు.

352. ఎవరు సమ్మతించవలెను?

353. అనంతర వారసులవల్లదావాకు లిమిటేషను. స్త్రీవారసురాలిని ఆస్తిస్వాధీనములోనుండి తొలగించి రిసీవరును ఏర్పరచుట.

354. దూరపువారసులు దావా తేవచ్చునా?

---

## ప్రకరణము 13.—స్త్రీధనము.

355. స్త్రీధనము.

356. 357. ఆరువిధములు—శుల్క, అధ్యగ్నిక, అధ్యావాహనిక, అన్వాధేయిక, యౌతక, అయౌతకములు.

358. సౌదాయికము.

359. జీవనాంశపు సొమ్ము—స్త్రీధనపు ఆదాయము.

360. స్త్రీ ధనముమీద స్త్రీకి గల స్వాతంత్ర్యము - పలువిధములు - సౌదాయికము మీద, భర్త వల్ల ఇయ్యబడిన స్థిరసొత్తు మీద, స్వసంపాద్యముమీద, వారసుహక్కువల్ల స్త్రీవద్దనుండివచ్చిన ఆస్తిమీద.

1896 సం॥లో ఈ గ్రంథము మొదటిసారి ముద్రణములో నుండగా, లాయర్లు, ప్లీడర్లు, డిస్ట్రిక్టు మునసఫులు, డిప్యూటీ కలెక్టర్లు, తహశ్శీల్‌దార్లు, మొదలగు వారివలన ఇయ్యబడిన

# కొన్ని అభిప్రాయములు.

---

1. మదరాసు గవర్నమెంటు చట్టనిర్మాణసభలో మెంబర్ శ్రీ ఆనరేబిల్ యన్. సుబ్బారావు పంతులు, బి.ఏ., బి.ఎల్., హైకోర్టు వకీలుగారు:—"తెనుగు హింధూలా గ్రంథమును తమరు వ్రాయబూనితిరని సంతోషించినాను. ఇప్పుడీ దేశమున కలిగియుండు గొప్ప కొఱతను అది నివారించుచున్నది. గ్రంథముయొక్క శైలి సులభముగానున్నది. అమలులోనుండు హింధూలా విషయములన్నియు తెలుపబడియున్నవి. ఈగ్రంథము సర్వత్ర వ్యాపించవలెనని కోరుచున్నాను."

2. మదరాసు గవర్నమెంటు చట్టనిర్మాణసభలో మెంబర్ శ్రీ ఆనరేబిల్ సి. జంబులింగ మొదల్యార్, బి.ఏ., ఎమ్.ఎల్., హైకోర్టు వకీలుగారు:—"గ్రంథముయొక్క అరేంజిమెంటును శైలియును చక్కగా నున్నవి. * * నా పార్టీలకు కొందరికి తమ గ్రంథమును చూపించగా, వారు చాలా సంతోషించి, పుస్తకమును తెప్పించుకొనవలెనని అపేక్షించిరి. తెనుగు దేశస్థులకు ఈ గ్రంథము మిక్కిలి సహకారిగా నుండునని నమ్ముచున్నాను."

3. బరంపురం జిల్లాకోర్టు గవర్నమెంటు ప్లీడరు, మ-రా-రా. డి. వెంకటరామయ్య పంతులుగారు:—"తీర్పుల వల్లను గ్రంథముల వల్లను స్థిరపడియుండు హింధూలా విషయముల

న్నియు వివరింపబడి యున్నవి. భాషాశైలి పరిశుద్ధముగాను, సులభముగాను, శాస్త్రీగా లాతెలియనివారికికూడ సుబోధముగాను, ఉన్నది. కాగితములును అచ్చును మిక్కిలి మనోహరములుగా నున్నవి."

4. మచిలీబందరు జిల్లా కోర్టులో లాయరుపని చూచుచున్న, మ - రా - రా. నల్లూరి - సూర్యనారాయణరావు పంతులు, బిఏ., బి. ఎల్., ఎల్. టీ, హైకోర్టు వకీలుగారు :— "ప్రతి హిందువునకును హిందూలా విషయమైన వ్యవహారములు తరుచుగా తటస్థించుచున్నందున, చాలకాలమునుండి కలిగియుండినకొఱత యీగ్రంథమువలన తీరినది. శాస్త్ర విధులు చక్కగా తెలుపబడి, తీర్పులు బాగుగా వివరింపబడి యున్నవి. శ్రమకోర్చి మిక్కిలి జాగ్రత్తతో వ్రాసిన గ్రంథమని స్పష్టముగా కనబడుచున్నది. అన్ని సంగతులు సంపూర్ణముగా వివరింపబడి యున్నవి. సమస్తమైనవారును యీగ్రంథమును మెచ్చుకొని తప్పక ఆదరింతురు. అందరికిని తెలియునట్లు సులభశైలిని వ్రాయబడియున్నది."

5. రాజమహేంద్రవరము జిల్లా కోర్టు ప్లీడరు, మ - రా - రా. అడివి కొలను - కనకరాజు పంతులు, బి.ఏ గారు:— "ధర్మశాస్త్ర విధులన్నియు చక్కగా ఆకళింపుచేసికొని మిగుల శ్రమ తీసికొని వ్రాసిన గ్రంథము. దీనిని విశ్వసించి వ్యవహారములు జరుపుకొనవచ్చును గనుక, సమస్తమైవారును ఈగ్రంథమును మిక్కిలి సంతోషముతో ఆదరింతురని నాకు నిశ్చయముగా నున్నది. ఈగ్రంథము మన దేశములో సర్వత్ర వ్యాపకము చెందవలెనని కోరుచున్నాను."

6. విశాఖపట్నము జిల్లాకోర్టు గవర్నమెంటు ప్లీడరు, మ - రా - రా. ఆకెళ్ల - సూర్యనారాయణరావు, బి. ఏ. గారు:

"చిరకాలమునుండి కలిగియుండిన కొఱత మీ గ్రంథమువలన తీరినది. దినదినమును తటస్థించునట్టి వ్యవహారపు చిక్కులు దీనివలన నివర్తియై, జనులు తమతమ హక్కులను చక్కగా తెలిసికొందురు. కొన్నిప్రతులు తెప్పించవలయునని నన్ను కొందరు కోరియున్నారు. కాగితములును అచ్చును మిక్కిలి శ్లాఘ్యముగా నున్నవి."

7. బరంపురం జిల్లాకోర్టులో లాయరుపని చూచుచున్న, మ-రా-రా. డబ్లియు-యల్-వెంకటరామయ్య, బి. ఏ., బి. ఎల్., హైకోర్టు వకీలుగారు :—"ఇంగ్లీషుభాషలోనుండు మెయిను, సర్వాధికారి, భట్టాచార్యులు - వీరి గొప్ప హిందూలా గ్రంథములను చదువుకొనజాలని, యింగ్లీషురాని జనులకు మీ గ్రంథము అత్యంతోపయోగముగా నుండును. దత్తు, వారసుహక్కు, సమష్టి హక్కు, విభాగము, స్త్రీధనము వగైరా విషయములలో కలిగియుండు అజ్ఞానము చేత అనేకులు వ్యాజ్యములపాలై గొప్ప నష్టములను చెంది చెడిపోవుచున్నారు. ఈ కష్టములు మీ గ్రంథమువల్ల తొలగిపోవును."

8. నెల్లూరు జిల్లాకోర్టుప్లీడరు, మ-రా-రా. వేదం వెంకటచలమయ్య, బి. ఏ, బి. ఎల్., గారు:— "మిక్కిలి శ్లాఘనీయమైన హిందూలా గ్రంథమును రచించినందునకు మిమ్ము ఎంతో కొనియాడుచున్నాడను. తీర్పులు చక్కగా వివరింపబడియుండుటచేత సర్వజనులకును మీ గ్రంథము మహోపయోగముగా నుండుట నిస్సందేహము."

9. కర్నూలు జిల్లాకోర్టు ప్లీడరు, మ్యూనిసిపలుచెయిర్మాన్, మ-రా-రా. టి. చిదంబరరావు పంతులు, బి. ఏ. గారు: "చిరకాలమునుండి కలిగియుండిన కొఱతను తమ గ్రంథము నివారించుచున్నది. మిక్కిలి ఉపయోగమైనది. నా స్నేహి

తులకు అనేకమందికి చూపగా, వారును ఇదే యభిప్రాయము నిచ్చియున్నారు. అందరికిని తెలియునట్లు సులభశైలిని చక్కగా వ్రాయబడినది. ఈ గ్రంథమును అనేకులు తెప్పించుకొందురని నాకు నిశ్చయము."

10. గోదావరి జిల్లా ఏలూరులో, జిల్లా కోర్టు ప్లీడరు, మ్యూనిసిపల్ చెయిర్మాన్, మ-రా-రా. చెరుకువాడ శీతారామయ్య పంతులుగారు:—"తెనుగు జనులకు అత్యంత సహాకారియైన గ్రంథము. చాలా కాలమునుండి నిలిచియున్న కొరతను తీర్చగలను."

11. బెజవాడ ప్లీడరు, మ-రా-రా. రావుబహద్దర్ శింగరాజు లింగయ్య పంతులు గారు:—"తమ హిందూలా గ్రంథము తెనుగు ప్లీడర్లకును తెనుగుజనులకును అంత్యంతోపయుక్తముగానున్నది."

12. మచిలీబందరు జిల్లా కోర్టు ప్లీడరు, మ-రా-రా. కే. అప్పయ్య దీక్షితులు, బి. ఏ. గారు:—"మీ గ్రంథమువల్ల ఆంధ్రదేశస్థులకు చాల ఉపకారము చేసియున్నారు. మీ ప్రఖ్యాతికి తగినట్లు అత్యంతోపయుక్తమగు గ్రంథమును రచియించితిరి. అన్ని అంశములును సంపూర్ణముగాను విరళముగాను తీర్పులతోగూడ అందరికిని తెలియునట్లు చక్కని సులభశైలిని వ్రాసియున్నారు. ఇట్టి గ్రంథ మిదివరకు ప్రచురింపబడి యుండలేదు. ఇంగ్లీషు భాషలో మెయిను దొరవారి గ్రంథమెట్టిదో తెలుగులో మీ గ్రంథ మట్టిదయ్యున్నది. * * ఇచ్చట మీ గ్రంథమును చూచినవారందరును ఇట్లే అభిప్రాయమును కలిగియున్నారు."

13. బళ్లారి జిల్లా కోర్టు ప్లీడరు, మ-రా-రా. డి-కృష్ణమాచార్యులుగారు:—"చిరకాలమునుండి కలిగియుండినట్టి

కొఱత తమ గ్రంథము వలన తీరినదని నేను దృఢముగా చెప్ప గలను. తెనుగుప్లీడర్లు మాత్రమేగాక, ప్రస్తుతము ప్లీడర్ల దయకు పాత్రులై వారినే నమ్ముకొని వ్యవహారములు జరుపుకొనుచున్న ప్రజలు కూడ మీ గ్రంథమును సంతోషముతో ఆదరింతురు."

14. విశాఖపట్నము జిల్లా కోర్టులో లాయగుపని చూచు చున్న మ. రా. రా. బలిజేపల్లి-సూర్యనారాయణరావు, బి.ఏ., బి. ఎల్., హైకోర్టు వకీలుగారు :— "తమ తెలుగు హిందూలా గ్రంథము మిక్కిలి చక్కగా వ్రాయబడి, చిరకాలమునుండి కలి గియుండిన కొఱతను నివారించుచున్నది. ఆయావిషయములకు సంబంధించిన తీర్పులను చక్కగా వివరించియున్నారు. శైలి సులభముగా మనోహరముగా నున్నది."

15. బెజవాడ డిస్ట్రిక్టు మునసఫు, మ-రా-రా. కొప్పరపు రామారావు పంతులుగారు:— "తమ హిందూలా గ్రంథము మిక్కిలి శ్లాఘ్యమైనదై తెనుగు జనులకు గొప్ప సహకారిగా నున్నది. ఇచ్చట అనేకమంది కరణములు మీ గ్రంథమును చూచి తెప్పించుకొందుమని చెప్పియున్నారు."

16. కాకినాడ డిస్ట్రిక్టు మునసఫు, మ-రా-రా. మున్నంగి-రామయ్య పంతులుగారు :— "నేను మునసఫు హోదాలో నుండియున్న ముప్పది సంవత్సరములకాలములో మీ తెనుగు హిందూలావంటి శ్లాఘ్యమైన గ్రంథమునుచూచి యుండలేదు. శైలి మృదువుగా స్పష్టముగా నున్నది. తీర్పులు వగైరా మూల ప్రమాణములు చక్కగా తెలుపబడి యున్నవి. ప్రతి హిందూ కుటుంబమునందు అవశ్యము ఉండవలసిన గ్రంథము."

17. నెల్లూరు డిప్యూటీ కలెక్టరు, మ-రా-రా. కేసాన పల్లి-నరసింహారావు పంతులుగారు :— "ఈ ప్రాంత్యపు హిందూ వులు మెచ్చుకొనునట్టి మంచి సులభ శైలిని వ్రాయబడియు

న్నది. వ్యవహారములో ఆవశ్యకమైన అంశములన్నియు మూల ప్రమాణములతోగూడ వివరింపబడి యున్నవి. జమీందారీ ఉద్యోగస్థులు కొందరు చూచి యీ గ్రంథము అతి శీఘ్రముగా వెలపోవునని చెప్పియున్నారు. తెనుగుభాషలో తమ హిందూ లా గ్రంథమునకు సాటి గ్రంథము మరియొకటి లేదు."

18. నరసాపురం డిప్యూటీ కలెక్టరు, మ-రా-రా. వల్లూరి-జగన్నాథరావు పంతులు, రాయబహదరుగారు :— "తెనుగు జిల్లాలలో చిరకాలమునుండి కలిగియుండిన కొఱతను యీ గ్రంథము నివారించును. దినదినమును తటస్థించునట్టి హిందూ లా సంబంధమగు వ్యవహారములలో, ఇంగ్లీషు చక్కగా రాని ప్లీడర్లు మొదలైనవారికి యీ గ్రంథము మిక్కిలి గొప్ప సహకారి. ఈ మధ్య ప్రచురింపబడిన చట్టము ప్రకారము గ్రామోద్యోగస్థుల హక్కులు వారసత్వమును బట్టి యుండును గనుక యీ గ్రంథము రివిన్యూ ఆఫీసులయందును ప్రతి గ్రామమునందును అత్యంతా వశ్యకముగా నుండును. తీర్పులుకూడ వివరింపబడి యుండుట చేత యీ గ్రంథము మరింత ఉపయోగముగా నున్నది. శైలి యింతకంటె బాగుగానుండుటకు వీలులేదు. శుద్ధముగాను మనోహరముగాను ఉన్నది."

19. గోదావరిజిల్లా నరసాపురం డిప్యూటీ కలెక్టరు, మ-రా-రా. చెవెంద్ర వెంకటాచలము పంతులుగారు: "అన్ని విషయములును చక్కగా సులభశైలిని అందరికిని తెలియునట్లు వివరింపబడియున్నవి. వేర్వేరు అంశములు ప్రత్యేక సెక్షనులుగా ఏర్పరచి, మార్జినులో చిన్న అక్షరములతో హెడ్డింగులు కనుపరచుటవలన, ఈ గ్రంథముయొక్క ఉపయోగము మిక్కిలి హెచ్చినది. తమ గ్రంథము ఎంతో శ్లాఘనీయమై సమస్తజనులు తెప్పించుకొని ఆదరించ వలసినదై యున్నది. వారికి కలుగు

చుండు వ్యవహారపు చిక్కులలో మంచి నమ్మదగిన స్నేహితుడు గా నుండును. ప్లీడర్లతో నిమిత్తము లేకయే అన్ని విషయములను తెలిసికొని సందేహములు నివర్తి చేసికొనవచ్చును."

20. విశాఖపట్నము డిప్యూటీ కలెక్టరు, మ-రా-రా. జయంతి-రామయ్య, బి. ఏ., బి. ఏల్. గారు:—"ఇంగ్లీషు భాషలో మెయిను దొరవారి గొప్ప హిందూలా గ్రంథము మో స్తరుగా తెనుగుభాషలో వ్రాయబడిన గ్రంథము. అత్యంతోప యోగమైనది. హిందూలా విషయములు తెలియక పోవుట చేత, అనేకులు వ్యాజ్యములలో చిక్కుకొని నష్టపడుచున్నారు. మీ గ్రంథమువల్ల అట్టి చిక్కులు తప్పిపోవును. చక్కగా తెలి యునట్టి సులభశైలిని వ్రాసియున్నారు."

21. కర్నూలుజిల్లా, నంద్యాల తా॥ తహశ్శీలుదారు, మ-రా-రా. కే. విజయరాఘవాచార్యులు, ఎమ్. ఏ. గారు:—"మీ హిందూలా గ్రంథము మిక్కిలి చక్కగా తయారు చేయ బడి యుండుటచేత, తెనుగు జనులకు అత్యంతోపయోగముగా నుండునని నిశ్చయముగా చెప్పగలను. ప్రతి గ్రామకరణము చేతిలో ఈ గ్రంథము ఒక్కొక ప్రతి యుండవలెనని నేను మిక్కి లి కోరుచున్నాను."

22. నెల్లూరు డిప్యూటీ కలెక్టరు, మ-రా-రా. పి. సీతా రావు పంతులుగారు:—"తమ హిందూలా గ్రంథము మిక్కిలి ప్రశస్తమైనదని నేనును నా స్నేహితులును అభిప్రాయులమై యున్నాము. శైలి సులభముగను స్పష్టముగను ఉన్నది. ఈ గ్రంథము తెనుగు జనులకు మహా వరప్రసాదముగా నున్నం దున, వారి వందనములకు మీరు అర్హులుగా నున్నారు."

23. గంజాం జిల్లా ఛత్రపురంలో, పెద్దపెద్ద డిప్యూటీ కలెక్టరు, మ-రా-రా. ఉన్నవ-వెంకటప్పయ్య పంతులుగారు:—

“తమ తెనుగు హిందూలావంటి గ్రంథము ఇదివరలో అచ్చు పడియుండలేదు. తెనుగుజనులకు మహోపయోగమని చెప్పు టకు సందేహ మేమియులేదు.”

24. మచిలీ బందరులో, పెన్షను సెటిలుమెంటు ఆఫీసరు, మ-రా-రా. శీరం నాగన్ననాయుడుగారు:— “మీ గ్రంథము మిక్కిలి ఉపయోగకరమైనదిగాను ప్రతి హిందూ కుటుంబమునందు ఉండదగినదిగాను ఉన్నది. మిక్కిలి ఉపయోగకరమైన విషయములను తెలుపుటచే, మీ గ్రంథముయొక్క సహాయమువల్లనే అనేక వ్యవహారపు తగాదాలు ఫైసలు చేసికోవచ్చును.”

25. నెల్లూరుజిల్లా, కావలి డిస్ట్రిక్టు మునసఫు, మ-రా-రా. దొడ్డి-వెంకోబారావు పంతులు, బి. ఏ., బి. ఎల్., గారు:— “ఇంగ్లీషురాని ప్లీడర్లు మొదలగు వారికి తమ తెలుగు హిందూలా పెన్నిధిగా నుండును.”

26. కర్నూలు డిస్ట్రిక్టు మునసఫు, మ-రా-రా. చల్లపల్లి బాపయ్య పంతులుగారు:— “ఆంధ్రజనులవల్ల తమగ్రంథము మిక్కిలి సంతోషముతో ఆదరింపబడును. ప్రస్తుత కాలము వరకును తీర్పులతో హిందూలా విషయములు చక్కగా తెలుపబడియున్నవి.”

27. నార్తు ఆర్కాటుజిల్లా, తిరుపతి డిస్ట్రిక్టు మునసఫు, మ-రా-రా. వారణాసి-సుబ్రహ్మణ్యము, బి. ఏ., బి. ఎల్., గారు:— “ఇంగ్లీషురానివారికి తమ గ్రంథము అత్యంతోపయోగముగా నుండునని నేను మనస్ఫూర్తిగా చెప్పగలను. * * తగిన గ్రంథములు లేక ప్రయివేటు ఏజెంట్లు ఇచ్చునట్టి తప్పు సలహాలవల్ల అనేక కుటుంబములు వ్యాజ్యముల పాలగుచున్నవి.”

28. గోదావరిజిల్లా, అమలాపురం డిస్ట్రిక్టు మునసఫు మ-రా-రా. వావిలాల-వెంకటశివావధానులు, బి. ఏ. గారు:—

"హిందూలా విషయములు మూలప్రమాణములతోడను తీర్పులతోడను చక్కని సులభమైన తెనుగులో వివరింపబడియున్నవి. నాకు చాలా సంతోషమైనది. ఇంగ్లీషు నేర్చినవారు మెయిను దొరవారి హిందూలా గ్రంథమును ఉపయోగించిన తీరున, తెనుగు ప్లీడర్లును తెనుగు జనులును మీా గ్రంథమును విశేషముగా ఉపయోగింతురు."

29. కర్నూలు జిల్లా మార్కాపురం డిస్ట్రిక్టు మునసబు, మ-రా-రా. రుద్రవరపు హనుమంతరావు పంతులుగారు :— "తమ తెనుగు హిందూలా గ్రంథము ఆంధ్రజనులకు అత్యంతోపయోగమైయున్నది. హిందూ కుటుంబములలో తరుచుగా కలుగుచుండు వ్యవహారములకు సంబంధించిన అంశములను చక్కగా తెలుపుటవల్ల మీా గ్రంథము గొప్పకొఱతను తీర్చినది."

30. కృష్ణా జిల్లా నరసారావుపేట డిస్ట్రిక్టు మునసబు, మ-రా-రా. జి. సుబ్బయ్య శాస్త్రిగారు :— "తమ హిందూలా గ్రంథము మిక్కిలి శ్లాఘ్యముగా రచియింపబడినది. తెనుగు జనులకు అత్యంతోపయోగముగా నుండుట నిశ్చయము."

31. నెల్లూరు జిల్లా వంగవోలు డిస్ట్రిక్టు మునసబు, మ-రా-రా. వి. నంజుండయ్యగారు:— "తెనుగు జిల్లాలలోనుండు ప్లీడర్లు మొదలైనవారికి మీా గ్రంథము అత్యంతోపయోగము."

32. మచిలీబందరు డిస్ట్రిక్టు మునసబు, మ-రా-రా. వేపా లక్ష్మీనరసింహాము పంతులుగారు:— "తమ గ్రంథము తీర్పులతో గూడ చక్కగా వ్రాయబడియుండుటచేత తెనుగు ప్లీడర్లు మొదలైనవారికి గొప్ప వరమయ్యున్నది."

33. విశాఖపట్నం జిల్లా రాజాం డిస్ట్రిక్టు మునసబు, జి. జగన్నాథరావు పంతులుగారు :— "చిరకాలమునుండి తెలుగు

జనులకు కలిగియున్న కొఱతను నివారించి, తమ హిందూలా గ్రంథము మిక్కిలి ఉపయోగముగా నుండును."

34. బళ్లారి జి॥ నారాయణ దేవరకెరె డిస్ట్రిక్టు మునసఫు, మ-రా-రా. ఆరణి - రఘునాధరావు పంతులు, బి. ఏ. గారు: "తెనుగుజనులకు అత్యంతోపయోగమైన గ్రంథము. హిందూలా విషయములన్నియు చక్కగా తెలుపబడియున్నవి."

35. కర్నూలుజిల్లా నంద్యాల డిస్ట్రిక్టు మునసఫు, మ-రా-రా. యన్. లక్ష్మణరావు పంతులుగారు:—"మీ హిందూలా విశదముగా మృదుశైలి నున్నది."

36. విశాఖపట్నం జి॥ పార్వతీపురము డిస్ట్రిక్టు మునసఫు, మ-రా-రా. పి. ఆదినారాయణయ్యగారు:— "తమ హిందూలా గ్రంథము అత్యంతోపయోగమని నిశ్చయముగా చెప్పగలను."

37. విశాఖపట్నం జిల్లా, చోడవరం డిస్ట్రిక్టు మునసఫు, మ-రా-రా. కొమ్ము - రామలింగ శాస్త్రిగారు:— "గ్రంథ శైలియు పద్ధతియు మిక్కిలి శ్లాఘ్యముగా నున్నవి. తెనుగు ప్లీడర్లు మొదలగువారికి ఈగ్రంథము పెన్నిధిగా నుండును."

38. బళ్లారి డిస్ట్రిక్టు మునసఫు, మ-రా-రా. వారణాసి - సూర్యనారాయణగారు:—"గ్రామాంతములలోని జనులకును గ్రామోద్యోగస్థులకును తెనుగు ప్లీడర్లకును తమ హిందూలా గ్రంథము అత్యంతోపయోగము."

39. తిరుపతి డిస్ట్రిక్టు మునసఫు, మ-రా-రా. ఎల్లాప్రగ్గడ - జానకిరామయ్యగారు:—"తమ హిందూలా గ్రంథము "ఇంగ్లీషు రాని వకీళ్లు మొదలగువారికి మిక్కిలి ఉపయోగము. అది, అధికమగు జాగ్రతతో తయారుచేయబడి, అన్ని విషయములును సరిగాను చక్కగాను తెలియునట్లు వివరింపబడి యున్నవి."

40. గోదావరి జి॥ నర్సాపురం తహశ్శీలుదారు, మ-రా-రా. ఎర్రమిల్లి. వెంకట్రావు పంతులుగారు:— "తమ హిందూలా గ్రంథము తెనుగు జనులకు గొప్ప వరప్రసాదమని నేను నిశ్చయముగా చెప్పగలను."

41. అనంతపురం జి॥ తాడిపత్రి తా॥ తహశ్శీలుదారు, మ-రా-రా. యస్. వాసుదేవరావు పంతులు, బి. ఏ. గారు:— "తమ హిందూలా గ్రంథము మిక్కిలి ప్రశస్తమైనది. రచయితలకును గ్రామోద్యోగస్థులకును అత్యంతోపయోగమైన గ్రంథము."

42. అనంతపురం జి॥ పెనుకొండ తహశ్శీలుదారు, మ-రా-రా. జీ. జగన్నాయకులు నాయుడు, బి. ఏ. గారు:— "తమ తెనుగు హిందూలా గ్రంథము మిక్కిలి చక్కగా తెలియునట్లు వ్రాయబడినది. దానిని చూచిన గ్రామోద్యోగస్థులందరును అత్యంతోపయోగమైన గ్రంథమని చెప్పుచున్నారు."

43. విశాఖపట్నం జి॥ సర్వసిద్ధి తా॥ తహశ్శీలుదారు, మ-రా-రా. యం. బి. వెంకయ్య పంతులు గారు:— "ఇంగ్లీషు రాని తెనుగు జనులకు మిక్కిలి ఉపయోగము. శైలి సులభముగా చక్కగానున్నది."

44. కృష్ణా జి॥ రేపల్లె తహశ్శీలుదార్, మ-రా-రా. పులిపాక - ఆచార్యులుగారు: "ఈ గ్రంథము తెనుగుజనులకు అత్యంతోపయోగము. పద్ధతి, విషయములు, శైలి, అచ్చు - సర్వము ప్రశస్తముగానున్నవి."

45. కృష్ణాజిల్లా బాపట్ల తా॥ తహశ్శీల్ దార్, మ-రా-రా. యే. లక్ష్మణరావు పంతులుగారు:— "ఇంగ్లీషురాని జనులకు మీ హిందూలా గ్రంథము మిక్కిలి ఉపయోగము."

46. బళ్లారి తహశ్శీల్ దార్, మ-రా-రా. యం. వి. చలపతి నాయుడుగారు:— "దేశభాషలో హిందూలా గ్రంథము ఇదివరకు గొప్ప కొఱతగా నుండెను. ఆ కొఱతను మీ గ్రంథము నివారించి, తెనుగుజనులకు గొప్ప ఉపకారము చేసినది. మీ గ్రంథము అందరికిని ఆవశ్యకమైనది."

47. గంజాంజిల్లా రసూలుకొండ తహశ్శీల్ దార్, మ-రా-రా. పి. వెంకట రమణయ్య పంతులుగారు:— "తమ హిందూలా గ్రంథము చాలా ఉపయోగమైనది."

48. నార్తార్కాడు జిల్లా పల్లనేరు తహశ్శీల్ దార్, మ-రా-రా. వి. రఘునాథరావు పంతులుగారు:— "నేనును నా స్నేహితులును గూడ తమ తెనుగు హిందూలా గ్రంథము తెనుగు జనులకు అత్యంతోపయుక్తమని అభిప్రాయమును గలిగియున్నాము."

49. కర్నూలు జిల్లా సిరివెళ్ల తా॥ తహశ్శీల్ దారు, మ-రా-రా. వి. వెంకట నారాయణ పిళ్లగారు:— "ఇంగ్లీషురాని జనులకు చిరకాలమునుండి కలిగిన కొఱతను మీ గ్రంథము నివారించును."

50. కృష్ణాజిల్లా గుడివాడ తా॥ తహశ్శీలుదారు, మ-రా-రా. గొల్లమూడి. లక్ష్మీకాంతరావు పంతులుగారు:— "తమ తెనుగు హిందూలా గ్రంథము మిక్కిలి ఉపయోగమైనది. శైలి అతి మనోహరముగా నున్నది."

51. కడప జి॥ ప్రొద్దుటూరు తహశ్శీల్ దారు, మ-రా-రా. డి. భీమారావు పంతులుగారు:— "మీ హిందూలా గ్రంథము ఇంగ్లీషురాని తెనుగు జనులకు మిక్కిలి ఉపయోగము."

52. గంజాం జిల్లా బరంపురం తా॥ తహశ్శీల్ దారు, మ-రా-రా. ఏ. కామేశ్వరరావు నాయుడు గారు:— "మీ హిం

దూలా గ్రంథము మిక్కిలి చక్కగా ఏర్పాటు చేయబడి అనే కులకు అత్యంతోపయోగముగా నున్నది."

53. కర్నూలు తహశ్శీల్ దారు, మ-రా-రా. ఏ. పీ. సింగారవేలు మొదల్యార్ గారు:— "తమ తెనుగు హిందూలా గ్రంథము తెనుగు జనులకు చిరకాలమునుండి నిలిచియుండిన కొఱతను నిస్సందేహముగా నివారించుచున్నది. శైలి సులభముగాను అందరికిని బోధపడునట్లుగాను ఉన్నది."

54. నెల్లూరుజిల్లా వంగవోలు తహశ్శీల్ దారు, మ-రా-రా. కే. వసంతరావు పంతులుగారు:— "తమ హిందూలా గ్రంథమును మిక్కిలి ఉత్సాహముతో చదివితిని. తెనుగు జనులకును తెనుగు ప్లీడర్లకును అత్యంతోపయుక్తముగా నున్నది."

55. బల్లారి జిల్లా హాసపేట తా॥ తహశ్శీల్ దారు, మ-రా-రా. యమ్. సాంబశివరావు నాయుడుగారు:— "తెనుగు జనులకు మీ హిందూలా గ్రంథము మహోపయోగముగా నుండునని చెప్పగలను."

56. కడపజిల్లా సిద్ధవట్టం తా॥ తహశ్శీల్ దారు, మ-రా-రా. వి. శేషయ్యగారు:— "తమ హిందూలా గ్రంథను మిక్కిలి ప్రశస్తముగా వ్రాయబడి యుండుటచేత ఇంగ్లీషురాని వారికి మహావరప్రసాదముగా నున్నది."

57. కృష్ణాజిల్లా దాచేపల్లి తా॥ తహశ్శీల్ దారు, మ-రా-రా. పండిత - నాగేశ్వర రావు పంతులు, బి. ఏ., బి. ఎల్., గారు:— "ఇంగ్లీషు రానివారికి అత్యంతోపయోగమైన గ్రంథము. విషయముల అరేంజిమెంటు మెయిను దొరవారి హిందూలా గ్రంథమునందు వలెనే స్పష్టముగాను సులభముగాను ఉన్నది."

58. బళ్లారిజిల్లా హువ్విన హడగలి తా॥ తహశ్శీల్ దారు, మ-రా-రా. పి.. రామారావుగారు:—“అన్ని విషయములును చక్కగా వివరింపబడి యున్నవి. హిందూ జనులకు మీ గ్రంథము అత్యంతోపయోగము.”

59. గోదావరిజిల్లా ఏలూరు తహశ్శీల్ దార్, మ-రా-రా. తాయ - సూర్యప్రకాశరావు నాయుడు, బి. ఏ. గారు:—“తె నుగు జనులకు కలిగియున్న కొఱతను తీర్చుచున్నది. అన్ని విషయములును చక్కగా చిక్కుదీసి అందరికిని తెలియునట్లు సులభశైలిని వివరింపబడి యున్నవి.”

60. అనంతపురంజిల్లా మడకసిరా తా॥ తహశ్శీల్ దారు, మ-రా-రా. యల్. వి. నరదరాజశ్రేష్ఠిగారు:—“మీ హిందూలా గ్రంథము మిక్కిలి చక్కగా రచియింపబడి తెనుగు జనులకు వరప్రసాదముగా నున్నది. తీర్పులతో కూడ అన్ని అంశములును సంపూర్ణముగా వివరింపబడి యున్నవి.”

61. సేలంజిల్లా ఉత్తంకర తహశ్శీల్ దారు, మ-రా-రా. జిడ్డు - ఏకాంబరయ్య, బి. ఏ. గారు:—“మీ హిందూలా గ్రంథమును మా తాలూకాలో కొందరు మునసబు కరణములకు చూపించగా, వారు దానిని మంచి గ్రంథమని తెలిసికొని అత్యద్భుతముగా కొనియాడిరి. ప్రతి దినమును కలుగుచుండు వ్యవహారపు విషయములను చక్కగా తెలుపుటచేత, చిరకాలము నుండి కలిగియుండిన గొప్ప కొఱత నివారణమైనది.”

---



# హిందూలా.

—:o:—

## ప్రకరణము 1.

—:o:—

### మూల ప్రమాణములు.

**1.** హిందూదేశము ఇంగ్లీషువారి ప్రభుత్వముక్రింద వచ్చిన పిదప, న్యాయపరిపాలన నిమిత్తము సివిల్ క్రిమినల్ విన్యా మొదలగు విషయములనుగూర్చి అనేకములగు చట్టములను నిబంధనలను వారు ఏర్పాటుచేసి యున్నారు. ఇప్పుడుకూడ క్రొత్తక్రొత్త చట్టములును వలయుచోట్ల ప్రాతచట్టములలో మార్పులును వారు ప్రతిసంవత్సరమును ప్రచురించుచున్నారు. కాని, మతాచార విషయములలోను, వివాహము స్వీకారము దాయభాగము స్త్రీధనము మొదలగు కుటుంబవిషయముల లోను, హిందూజనులకు చిరకాలమునుండి చెల్లుచు వచ్చిన హిందూధర్మశాస్త్రములనే వారికి ప్రమాణములుగా అంగీక రించి, ఆవిషయములకు సంబంధించిన వివాదములు వారిలో కలిగినప్పుడు అట్టిధర్మశాస్త్రముల ననుసరించియే వానిని తీర్పు మానము చేయుచున్నారు.

**2.** సకలమైన ఆచార వ్యవహారములకును శ్రుతులు-అనగా వేదములు-మూలప్రమాణములై యున్నట్లును వాని ననుసరించి

షే తాము స్మృతులను (ధర్మశాస్త్రములను) రచియించినట్టును ధర్మశాస్త్రకర్తలు చెప్పుచున్నారు. కాని, వ్యవహారమునందుపయోగించు విధులు విశేషముగ వేదములయందు కానంబడని హేతువుచే ఆయా స్మృతికర్తలు తమతమ కాలములయందు చెల్లుచుండిన ఆచారముల ననుసరించియే తమ గ్రంథములను లిఖించిరని మనము ఊహింపదగియున్నది. మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి - ఈ రెండును మూలస్మృతులలో ముఖ్యములు. ఇవిగాక, నారద వశిష్ఠ గౌతమ బౌధాయన ఆపస్తంబ యమ ఆంగిరస అత్రి దక్ష దేవల శంఖ లిఖిత హారిత కాత్యాయన బృహస్పతి వ్యాస పరాశర మొదలగు మహర్షులు రచించిన స్మృతులు గూడ పూర్వకాలమునందుండెనుగాని ఇప్పుడు వానిలో కొన్ని పూర్ణముగను కొన్ని కొంతవరకును నశించియున్నవి.

వ్యాఖ్యాన గ్రంథములు.

**3**. హిందూ ధర్మశాస్త్రములు సంస్కృత భాషయందు వ్రాయబడియుండుటచే అవి పండితులకు మాత్రమే బోధకములై వారికిగూడ పలువురకు పలువిధములుగ నర్థమిచ్చుస్థితిలో నుండియున్నవి. ప్రాచీన ధర్మశాస్త్రములకంటెను వానిననుసరించి మహావిద్వాంసులచే రచియింపబడిన వ్యాఖ్యానములును సంక్షేప గ్రంథములును ఇప్పుడు ముఖ్య ప్రమాణములుగా చెల్లుచున్నవి. స్మృతులు వ్రాయబడిన తర్వాత జనుల ఆచారవ్యవహారములలో కాలక్రమమున అనేకములగు మార్పులు కలుగుచు వచ్చెను. స్మృతులకు వ్యాఖ్యానాదులను రచియించిన విద్వాంసులుగూడ ఆమార్పుల కనుగుణ్యముగనే ఆయా స్మృతులలోని శ్లోకములకు యుక్తివాదములచే భిన్నార్థములు కల్పించుచు నచ్చిరి. ఇందువలన భిన్న సంప్రదాయము లేర్పడియెను.

మనుస్మృతి - కుల్లూక భట్టీయము

**4**. ప్రాచీన స్మృతులన్నిటిలో మనుస్మృతి మిక్కిలి ముఖ్యముగా నెంచబడుచున్నది. ఇతర స్మృతికర్తలుగూడ తమ గ్రంథ

ములందు మనుస్మృతిని ప్రమాణముగా చెప్పుచున్నారు. మను స్మృతిమీద అనేక వ్యాఖ్యానములు వ్రాయబడినవి. వానిలో కుల్లూకభట్టుడు వ్రాసిన వ్యాఖ్యానము మిక్కిలి ప్రశస్తము.

యాజ్ఞవల్క్యస్మృతిమీద సుమారు 800 సంవత్సరముల క్రిందట విజ్ఞానేశ్వరుడను మహాయోగి మితాక్షరమను వ్యాఖ్యానమును రచియించెను. ఇది బంగాళా సీమయందుతక్క హిందూస్థానములోని తక్కిన ప్రదేశములయందంతటను ముఖ్యప్రమాణముగా చెల్లుచున్నది. (12 మూ. ఇ. అ. 437; ఇ. లా. రి. 25 క. 367.)

విజ్ఞానేశ్వరునికంటె సుమారు 200 సంవత్సరములకు ముందు విశ్వరూపుడను పండితవరుడు యాజ్ఞవల్క్యస్మృతిమీద వ్యాఖ్యానము రచియించినట్లును అది యతికఠినమైయుండునట్లును మితాక్షరగ్రంథప్రారంభమునందు చెప్పబడియున్నది. కాని, ఆ వ్యాఖ్యానమెచ్చట గానంబడమిచే నది నశించినట్లు భావింపబడు చుండెను. పది పండ్రెండు సంవత్సరముల క్రిందట మలయాళ దేశములో విశ్వరూప వ్యాఖ్యాన మొక ప్రతి లబ్ధమై యింగ్లీషు భాషలోనికి తర్జుమా చేయబడియున్నది. విజ్ఞానేశ్వరునకు పిమ్మట అపరార్కుడను కొంకణదేశపురాజు యాజ్ఞవల్క్యస్మృతిమీద నొక వ్యాఖ్యానము రచియించెను. అది కాశ్మీరదేశమునందు ఉత్కృష్టప్రమాణముగా నంగీకరింపబడుచున్నది.

పరాశరస్మృతిమీద మాధవాచార్యులవారు మాధవీయ మను వ్యాఖ్యానము రచియించిరి. ఇది మిక్కిలి ఆదరణీయము. మనుస్మృతి కృతయుగమునకు నిర్ణయింపబడెననియు, కలియుగమున పరాశరస్మృతియే ముఖ్యప్రమాణమనియు, చెప్పుదురు. కాని, అన్ని వ్యవహారములయందును యాజ్ఞవల్క్యస్మృతియే సర్వోత్కృష్టముగా చెల్లుచున్నది.

దాయభాగము. **5.** బంగాళాసీమయందు-జీమూతవాహనుడను మహాపండితుడు సుమారు 500 సంవత్సరముల క్రిందట మితాక్షరమును ఖండించి దానికి వ్యతిరేకముగా తమ దేశమునందు చెల్లుచుండెడి భిన్నాచారముల కనుగుణ్యమగు దాయభాగమను గ్రంథమును రచియించెను. ఇది బంగాళా సీమయందు ముఖ్య ప్రమాణముగా చెల్లుచున్నది.

ఇతర గ్రంథములు **6.** ఈ చెప్పబడిన మితాక్షర దాయభాగ గ్రంథములకు తోడుగా కొన్ని కొన్ని దేశములయందు కొన్ని కొన్ని సంక్షేపగ్రంథములు ప్రమాణములుగా చెల్లుచున్నవి. ఈ సంక్షేప గ్రంథములు మితాక్షర దాయభాగగ్రంథములకు పిమ్మట వ్రాయబడినవై కొన్ని కొన్ని అంశములయందు వానితో భేధించుచున్నవి.

బంగాళా సీమయందు - దాయభాగమునకు తోడుగా రఘునందనునిచే రచింపబడిన దాయతత్వమను గ్రంథమును శ్రీకృష్ణతర్కాలంకారునిచే రచియింపబడిన దాయక్రమసంగ్రహమను గ్రంథమును జగన్నాధునిచే రచియింపబడిన వివాదభంగార్ణవమను గ్రంథమును ప్రమాణములుగా చెల్లుచున్నవి. బంగాళా సీమతక్క తక్కినచోట్ల మితాక్షరమే ముఖ్యప్రమాణముగా చెల్లుచున్నను దీనికి తోడుప్రమాణములుగానుండు గ్రంథములు కొన్ని ప్రదేశములయందు భేదించుచున్నవి.

దక్షిణ హిందూస్థానములో - అనగా మదరాసు ప్రెసిడెన్సీలో - దేవానందభట్టునిచే రచియింపబడిన స్మృతిచంద్రికయును ప్రతాపరుద్రుడు రచియించిన సరస్వతీవిలాసమును మాధవప్రణీతంబైన దాయవిభాగమును వరదరాజప్రణీతంబైన వ్యవహార నిర్ణయమును, ఈ గ్రంథములు మితాక్షర గ్రంథమునకు తోడు ప్రమాణములుగా అంగీకరింపబడుచున్నవి. (12 మూ. ఇ. అ. 437).

## 1. మూలప్రమాణములు

పశ్చిమ హిందూస్థానములో - అనగా బొంబాయి ప్రెసిడెన్సీలో - నీలకంఠునిచే రచియింపబడిన వ్యవహారమయూఖమను గ్రంథము మితాక్షరమునకు తోడు ప్రమాణముగా నున్నది. మహారాష్ట్ర దేశమందును ఉత్తరకనరా దేశమందును మితాక్షరమే ముఖ్యప్రమాణముగా నున్నది. గుజరాతు దేశమందును బొంబాయిపట్టణమందును వ్యవహారమయూఖము మితాక్షరముకంటె కూడ ఎక్కువ ప్రమాణముగా ఎంచబడుచున్నది. (ఇ. లా. రి. 2 బొం. 418; ఇ. లా. రి. 14 బొం. 605, 612, 623). ఉత్తరకొంకణదేశమందును మితాక్షరముకంటె మయూఖమే ఎక్కువగా ఆదరింపబడుచున్నది. (ఇ లా. రి. 3 బొం. 353; ఇ. లా. రి. 14 బొం. 624).

కాశీరాజ్యమందు - మితాక్షరమునకు తోడుగా, వీరమిత్రోదయము, నిర్ణయసింధు, ఈ గ్రంథములు ప్రమాణములుగా చెల్లుచున్నవి. (3 బొం. హై. 369).

మిథిల దేశములో — మితాక్షరమునకు తోడుగా, వాచస్పతి మిశ్రులురచించిన వివాదచింతామణి వ్యవహారచింతామణిగ్రంథములును మరియు వివాదచంద్రిక రత్నాకరము అను గ్రంథములును పాటింపబడుచున్నవి. (2 మూ. ఇ. అ. 134, 146).

దత్తక చంద్రిక, దత్తక మీమాంస — ఈ రెండును స్వీకార విషయమైన గ్రంథములు. ఇందు దత్తకచంద్రిక బంగాళసీమ యందును దక్షిణ హిందూస్థానమందును దత్తక మీమాంస మిథిల కాశీ రాష్ట్రములయందును ప్రమాణములుగా చెల్లుచున్నవి (12 మూ. ఇ. అ. 437).

**7.** దీనితర్వాతి పేజీలలో వివరింపబడిన పట్టీవలన, ఆయా దేశములందు ప్రమాణములుగా చెల్లుచుండు గ్రంథములు సులభముగా తెలియుచున్నవి.

సంప్రదాయములు ప్రమాణగ్రంథము

| దేశము. | గ్రంథము. | గ్రంథకర్త. |
|---|---|---|
| 1. బంగాళా దేశము - గౌడ సంప్రదాయము. | 1. దాయభాగము. | జీమూతవాహనుడు |
| | 2. దాయతత్త్వము. | రఘునందనుడు. |
| | 3. దాయక్రమసంగ్రహము. | శ్రీకృష్ణ తర్కాలంకారుడు. |
| | 4. వివాద భంగార్ణవము. | జగన్నాథుడు. |
| | 5. దత్తక చంద్రిక. | కుబేరుడు. [తలంచిరి. |
| | [ఈ గ్రంథము దేవానందభట్టునిదని | ముందటికాలమున కొందరు తప్పుగా |
| 2. దక్షిణ హిందూస్థానము-ద్రవిడ సంప్రదాయము. | 1. మితాక్షరము. | విజ్ఞానేశ్వరుడు. |
| | 2. స్మృతిచంద్రిక. | దేవానందభట్టు. |
| | 3. సరస్వతీవిలాసము. | ప్రతాపరుద్ర దేవుడు. |
| | 4. దాయవిభాగము. | మాధవుడు. |
| | 5. వ్యవహార నిర్ణయము. | వరదరాజు. |
| | 6. పరాశర మాధవీయము. | విద్యారణ్యుడు. |
| | 7. దత్తక చంద్రిక. | కుబేరుడు. [తలంచిరి. |
| | [ఈ గ్రంథము దేవానందభట్టునిదని | ముందటికాలమున కొందరు తప్పుగా |
| 3. పశ్చిమ హిందూస్థానము - మహారాష్ట్ర సంప్రదాయము. | 1. మితాక్షరము. | విజ్ఞానేశ్వరుడు. |
| | [ఇది మహారాష్ట్రదేశమందును ఉత్తర | కనరాదేశమందును ముఖ్యప్రమాణం. |
| | 2. వ్యవహారమయూ | ఖము — నీలకంఠుడు. |
| | [ఇది గుజరాతునందును బొంబయిపట్ట నెక్కువ ప్రమాణము—ఉత్తరకొంకణ | ణమందును మితాక్షరముకంటెగూడ దేశమునందును అట్లే.] |
| | 3. దత్తక మీమాంస. | నందపండితుడు. |

1. మూలప్రమాణములు

| దేశము. | గ్రంథము. | గ్రంథకర్త. |
|---|---|---|
| 4. కాశీరాజ్యము - కాశీ సంప్రదాయం. | 1. మితాక్షరము. | విజ్ఞానేశ్వరుడు. |
| | 2. వీరమిత్రోదయం | మిత్రమిశ్రులు. |
| | 3. నిర్ణయసింధు. | కమలాకరుడు. |
| | 4. దత్తకమీమాంస | నందపండితుడు. |
| 5. మిథిలదేశము — తిరుహూతురాజ్యము, నార్తుబీహారు— మిథిల సంప్రదాయము. | 1. మితాక్షరము. | విజ్ఞానేశ్వరుడు. |
| | 2. వివాదచింతామణి. | వాచస్పతి మిశ్రులు. |
| | 3. వ్యవహార చింతామణి. | వాచస్పతి మిశ్రులు. |
| | 4. వివాద చంద్రిక. | లక్ష్మీదేవి. |
| | 5. వివాద రత్నాకరము. | చండేశ్వరుడు. |
| | 6. దత్తకమీమాంస. | నందపండితుడు. |

**8.** వేరు వేరు గ్రంథములు ప్రమాణములుగా అంగీకరింపబడియుండు హేతువువలన ఐదు సంప్రదాయములున్నట్టు చెప్పబడుచున్నది. కాని, బంగాళా సంప్రదాయము తక్క తక్కిన నాల్గిటియందును కొన్ని పరస్పర భేదములున్నను సాధారణముగా మితాక్షరమే ప్రధానప్రమాణముగా అంగీకరింపబడుటచే, గౌడ సంప్రదాయము కాశీసంప్రదాయము - అని రెండేప్రధాన సంప్రదాయములున్నట్లు ఎంచదగియున్నది.

**9.** ఆయా సంప్రదాయములకు చేరిన ప్రదేశములయందు నివసించు హిందూజనులకు అచ్చట ప్రమాణములుగా నున్న ధర్మశాస్త్రములలో నియమింపబడియుండు పద్ధతులు చెల్లుచు

న్నవి. ఒకదేశము వారు మరియొకదేశమునకుబోయి కాపుర మున్నంత మాత్రముచేత, వారికి ఈక్రొత్తదేశపు పద్ధతులు చెల్లనేరవు. (ఇ. లా. రి. 23 బొం. 257; ఇ. లా. రి. 24 మ. 650; ఇ లా. రి. 29 క. 433; ఇ. లా. రి. 11 మ. 157, 162.) అది యేలాగంటే - బంగాళాదేశమువారు దక్షిణ హిందూస్థాన మునకుగాని దక్షిణ హిందూస్థానమువారు బంగాళాదేశమునకు గాని కాపురము మార్చినయెడల, వారికి పూర్వపుపద్ధతులే చెల్లునుగాని, క్రొత్తదేశపు ధర్మశాస్త్రముల యందలి పద్ధతులు చెల్లవు. (2 మూ. ఇ. అ. 132; 12 మూ. ఇ. అ. 91; ఇ. లా. రి. 17 క. 518). కాని, క్రొత్తదేశమునకు కాపురము మార్చుకొన్నవారు, తమ పూర్వపు ఆచరణలను విడచి వివాహాది కార్యములయందును శ్రాద్ధాది కర్మలయందును క్రొత్తదేశపు ఆచరణలనే అవలంబించినట్టు స్పష్టమైన రుజువు ఏర్పడినయెడల, వారికి క్రొత్తదేశపు ధర్మశాస్త్రములే చెల్లును. (12 మూ. ఇ. అ. 96).

మతము మారుట.

**10**. హిందూజనులు క్రీస్తు మహమ్మదీయ మతములలో చేరిన పిమ్మట, వారికి హిందూ ధర్మశాస్త్రములు చెల్లనేరవు. (10 మూ. ఇ. అ. 537. 1865 సం॥ 10 నెం॥ ఇండియన్ సక్సెషన్ ఆక్టు చూడవలసినది). కాని, వారికి అదివరకు కలిగి యుండిన ఆస్తి విషయమైన హక్కులు నశించవు. (1850 సం॥ 21 నెం॥ చట్టము). హిందూజనులు క్రీస్తు మతములో చేరిన పిమ్మట, ఇష్టముండినయెడల హిందూ ధర్మశాస్త్రముల దాయవిభాగ పద్ధతినే వారు నిలుపుకొనవచ్చును, ఇష్టము లేనియెడల వదిలివేయవచ్చును - అని ప్రివీకౌన్సిలువారు పూర్వము తీర్పుచేసియుండిరి. (9 మూ. ఇ. అ. 195). కాని, 1865 సం॥ 10 నెం॥ చట్టము - ఇండియన్ సక్సెషన్ ఆక్టు - అమలులోనికి వచ్చిన పిదప, క్రీస్తు

మతావలంబులకును క్రీస్తుమతస్థులకును ఆచట్టములోని పద్ధతులే చెల్లవలెనుగాని, హిందూదాయవిభాగ పద్ధతులు నిలువనేరవు.

క్రీస్తు మతావలంబకుడగు హిందువు పునః హిందూమతము లోచేరి హిందూధర్మశాస్త్ర పద్ధతులకు లోబడవచ్చుననియు, అట్టివాని సంరక్షణలోనుండు పసిబిడ్డగూడ పునఃహిందూమతమునకు చేరినట్లు భావింపబడుటచేత స్వీకార యోగ్యుడుగానుండు ననియు కలకత్తా హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 30 క. 999).

హిందూమతస్థునికి క్రీస్తుస్త్రీవల్ల కలిగినసంతతి తల్లిజాతికే చేరుటవలన హిందువులుగా భావింపబడరని మదరాసు హైకోర్టువారు తీరుమానించి యున్నారు. (ఇ. లా. రి. 27 మ. 13).

బొంబయి ప్రెసిడెన్సీలో, ఖోజా జాతివారును కచ్చిమేమను జాతివారును ముసల్మాను మతమునకు చేరినవారైనను, హిందూ ధర్మశాస్త్రములనే అనుసరించుచున్నారు. (1 బొం. హై. 71, 73; 2 బొం. హై. 292; 12 బొం. హై. 294; ఇ. లా. రి. 3 బొం. 34; ఇ. లా. రి. 6 బొం. 452; ఇ. లా. రి. 9 బొం. 115; ఇ. లా. రి. 10 బొం. 1; ఇ. లా. రి. 14 బొం. 19.)

బౌద్ధ, జైన, సీకు మతస్థులకు హిందూ ధర్మశాస్త్రములే చెల్లుచున్నవని తీర్పులుచేయబడియున్నవి. (8 స. 116; 10 బొం. హై. 258; ఇ. లా. రి. 1 అ. 688).

బ్రహ్మసమాజ మతస్థులకుగూడ హిందూధర్మశాస్త్రములే చెల్లదగినవనియు, హిందూ మతాచరణలను వారు వదిలినవారయ్యును 1865 సం॥ 10 నెం॥ ఇండియన్ సక్సెషన్ అక్టు 331 సెక్షను అర్థములోపల వారును హిందువులే యనియు, వాదింపదగియున్నది.

విశేషాచారములు, పద్ధతులు, లేక వాడుకలు.

**11**. ఏ ప్రదేశములయందైనను కులములయందైనను కుటుంబములయందైనను, ఏవయినను విశేషాచారములుగాని పద్ధతులుగాని వాడుకలుగాని చిరకాలమునుండి అనుసరింపబడు చుండినట్లు కనబడినయెడల, అవి ధర్మశాస్త్రములలోని పద్ధతులకు వ్యతిరేకముగా నున్నను న్యాయస్థానములయందు అంగీకరింపబడుచున్నవి. అట్టి వాడుకలు నిరాక్షేపణగా చెల్లవలయునని మనుస్మృతి యాజ్ఞవల్క్యస్మృతి మొదలగు ధర్మశాస్త్రములలో చెప్పబడి యుండుటయే గాక, ప్రివీకౌన్సిలువారుగూడ తీరుమానించియున్నారు. (12 మూ. ఇ. అ. 436; 3 మ. హై. 50.)

విశేషాచారములు చిరకాలమునుండి చెల్లుచు, తెంపులేకయుండవలెను.

**12**. ధర్మశాస్త్రములకు విరోధముగానుండు విశేషాచారములు, వాడుకలు, లేక పద్ధతుల విషయములో ఒక అంశము మిక్కిలి ముఖ్యమైనది. అది యేమనగా — ఆ యాచారములు, లేక పద్ధతులు మధ్య మధ్య తెంపులేక నిరాటంకముగను నిరాక్షేపణగను చెల్లుచువచ్చి, వాని ననుసరించువారు అవే తమకు న్యాయమైన ఆచారములు, వాడుకలు, లేక పద్ధతు లనెడి జ్ఞానముతోడను సమ్మతముతోడను నడచుకొనుచుండినట్లు, స్పష్టముగా రుజువు కనుపడవలెను. లేనియెడల అట్టి విశేషాచారములను వాడుకలను పద్ధతులను కోర్టువారు అంగీకరించరు. (3 మ. హై. 75, 77; 14 మూ. ఇ. అ. 570, 585.)

మరియొక విషయము—అట్టి విశేషాచారములు చిరకాలమునుండి చెల్లుచుండినను ఇటీవల వదిలి వేయఁబడినట్టు రుజువు కనబడిన యెడల, కోర్టువారు వానిని అంగీకరించక, ధర్మశాస్త్రములలోని పద్ధతుల ననుసరించియే తీరుమానించుచున్నారు. దీనికి నిదర్శనముగా, బంగాళా సీమయందు ఒక జమీందారీ విషయములో విభాగించుకొనెడి పద్ధతి యుండక జ్యేష్ఠపుత్రుడు

రాజ్యముచేయు వాడుకయే చిరకాలమునుండి చెల్లించు వచ్చెను. కాని, యిటీవల 20 సంవత్సరములనుండి సదరు జమీాందారీ ఆస్తి సమష్టిసొత్తుగా ఎంచుకొనబడి యనుభవింప బడుచుండిన హేతువువలన, పూర్వము అవిభాజ్యమయినను ప్రస్తుత మది విభాగ యోగ్య మయినదని ప్రివీ కౌన్సిలువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. I క. 186.)

కొందరు జనులుచేరి, తాము ఏదో విధముగా నడచుకొను వలెనని ఒక క్రొత్త పద్ధతి ఏర్పరచుకొన్నంత మాత్రము చేత, అందరికిని చెల్లదగిన ఒక విశేషాచారము ఏర్పడనేరదు. (ర మూా. ఇ. అ. 420; 9 మూా. ఇ. అ. 242; ఇ. లా. రి. 3 అ. 73ర.)

**13.** మరియు — నీచస్వభావముగల వాడుకలు ఎంతకాలమునుండి చెల్లుచుండినను, వానిని కోర్టువారు అంగీకరించరు. బొంబయి సీమయందు కొన్ని జాతులలో భార్యా భర్తలకు అనుకూల్యత పొసగని యెడల, భర్తను వదిలివేసి అతని యిష్టమునకు విరోధముగా భార్య మరియొకనిని పెండ్లి చేసికొను వాడుక యున్నట్టు ఒక దావాలో వాదింపబడెను. అట్టివాడుక నీచస్వభావము గలదిగావున చెల్ల నేరదని హైకోర్టువారు తీరుమానించిరి. (2 బొం. హై. 124; 7 బొం. హై. 133, A. C. J.) అలాగే మరియొక దావాలో దాసీపుత్రునకు వారసుహక్కు కలుగజేయు వాడుక యుండినట్టు వాదింపబడెను. కాని అట్టి వాదము అంగీకరింపబడ దయ్యెను. (ఇ. లా. రి. 2 బొం. 140.) 1876 సం॥లో మదరాసు ప్రెసిడెన్సీలో ఒకానొక దేవస్థానపు వేశ్యలు తమకుగల ప్రత్యేకపుహక్కు మూలమున తమచే నియమింపబడని యేవేశ్యలును సదరు దేవస్థానమునకు చేరగూడదని వాదించిరి. కాని, నీచవృత్తికేగాక నిషిద్ధకార్యములకు గూడ ప్రేరేపణ గల్గునని తలచి మదరాసు హైకోర్టువారు

సదరు హక్కు అంగీకరింపజాలరైరి. (ఇ. లా. రి. I మ. 168; చూడు — ఇ. లా. రి. I మ. 356).

తీర్పులు.

**14.** హిందూజనుల ఆచార వ్యవహారముల విషయమై ధర్మశాస్త్రములును వ్యాఖ్యానములును మూలాధారములై యున్నను, వాని ననుసరించి కలకత్తా బొంబయి అలహాబాదు మద్రాసు - ఈ నాల్గు హైకోర్టుల వారును ప్రివీకౌన్సిలు వారును అప్పటప్పటికి చేయుచుండు తీర్పులు అన్నిటికంటె ముఖ్య ప్రమాణములుగా చెల్లుచున్నవి. వివాదాంశముల విషయమై ధర్మశాస్త్రములను పరిశీలించి అభిప్రాయములను తెలుపు నిమిత్తము 1859 సం॥ వరకు న్యాయస్థానములయందు పండితులు ఏర్పరుపబడి యుండిరి. తప్పయినను ఒప్పయినను ఆ పండితులు చెప్పిన అభిప్రాయముల ననుసరించియే ముందటికాలమున తీర్పులు చేయబడుచుండెను. కాని, యిప్పుడు స్మృతులు మొదలగుమూలగ్రంథములకు ఇంగ్లీషుభాషలోనికి తర్జుమాలు చేయబడిన కారణము వలన ధర్మశాస్త్రములయందలి అంశములను న్యాయాధిపతులు తామే స్వతంత్రముగా తెలిసికొని తీర్పులు చేయుచున్నారు. ఇండియా దేశములోని నాల్గు హైకోర్టులవారును ప్రివీకౌన్సిలువారును చేయుచుండు తీర్పులు ప్రతి మాసమును ఇండియన్ లారిపోర్ట్సు సంచికల మూలకముగా ప్రకటింపబడుచున్నవి. ఈ తీర్పులను ధర్మశాస్త్రములలోని యంశములను సంక్షేపముగానమర్చి - మెయిను, వెస్టు బూలరు, కవెల్, జాలీ, బానర్జీ, మిత్ర, శిరోమణి, సర్వాధికారి, మొదలగు విద్వాంసులు ఇంగ్లీషుభాషలో గొప్పగొప్ప హిందూలాగ్రంథములను రచియించి యున్నారు. ఆగ్రంథముల ననుసరించి, ఇంగ్లీషు భాష నభ్యసింపని ఆంధ్రమహాజనుల యుపయోగార్థము ఈ గ్రంథము యత్నింపబడినది.

# ప్రకరణము 2.

—:o:—

## వివాహము.

**15.** పూర్వకాలమునందు బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య, గాంధర్వ, ఆసుర, రాక్షస, పైశాచములను అష్టవిధ వివాహములు వాడుకలో నుండెను. అందు, బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్యములు నాల్గును కన్యాదానములు - బ్రాహ్మణజాతికి యోగ్యములు. వధూవరులు పరస్పర ప్రేమచే గలియుట గాంధర్వ వివాహము. యుద్ధమునందు జయించిగాని కన్యను బలాత్కారముగ గొనిపోయిగాని పెండ్లియాడుట రాక్షసవివాహము. గాంధర్వ రాక్షసవివాహములు క్షత్రియజాతికి యోగ్యములు. కన్యను విక్రయించుట ఆసుర వివాహము - ఇది వైశ్య శూద్రజాతులకు యోగ్యము. నిద్రవలన, లేక నిషావలన, లేక పిచ్చివలన స్మృహతప్పియుండు స్త్రీతోడ సంగమముచేయుట - మోసముచేసిగాని బలాత్కారముగగాని సంభోగించుట - ఇది పైశాచ వివాహము. సర్వవర్ణ నిషిద్ధము. ఇట్లని ధర్మశాస్త్రములయందు చెప్పబడి యున్నది.

**16.** ఈ చెప్పబడిన అష్టవిధ వివాహములలో నిప్పుడు బ్రాహ్మ వివాహము (కన్యాదానము), ఆసురవివాహము (కన్యావిక్రయము)-ఈ రెండుమాత్రమే నిలిచియున్నవి. నాల్గుజాతుల వారికిని వేర్వేరువిధముల వివాహములు ధర్మశాస్త్రముల యందు నియమింపబడి యున్నను, ఈకాలమున అన్నిజాతుల వారికిని బ్రాహ్మ ఆసుర వివాహములు చెల్లుచున్నవి. అనేకప్రదేశములయందు బ్రాహ్మ వివాహము శూద్రజాతివారిలోను ఆసుర వివాహము బ్రాహ్మణజాతివారిలోను జరుగుచున్నవి. మద

రాసు సదరు కోర్టువారు గూడ నిశ్చే తీరుమానించియున్నారు. (1859 సం॥ మదరాసు తీర్పులు, 44 పేజీ). ఆసుర వివాహములు, అనగా కన్యావిక్రయములు, మదరాసు ప్రెసిడెన్సీలో అనేక ప్రదేశములందు బ్రాహ్మణజాతిలో జరుగుచున్నవనియు శాస్త్రనిషిద్ధములయ్యును అట్టి వివాహములు చెల్లుననియు మదరాసు హైకోర్టువారు తీరుమానించి యున్నారు. (ఇ. లా. రి. 13 మ. 83). కాని, యేపద్ధతి ప్రకారము వివాహము జరిగెనని వాదము కలిగినప్పుడు, శూద్రజాతివారిలో నైనను సరే, ఆసుర—అనగా కన్యా విక్రయ—వివాహము జరిగినట్లు కోర్టువారు ముందుగా భావింపరు. అట్టివాదము చేయువారే దానిని రుజువుపఱచగల భారము వహింతురు (1860 సం॥ మదరాసు తీర్పులు, 201; ఇ. లా. రి. 25 క. 354; 11మూ. ఇ. అ. 175; 16 మ. లా. జ. 550; ఇ. లా. రి. 33 బొం. 433).

ప్రత్యేకమైన రుజువులేనియెడల, భార్యా భర్తలుగా కలిసి కాపురము చేయుచుండి నంతమాత్రముచేత వివాహము జరిగినట్లు ఊహింపబడజాలదు. (3 అ. లా. జ. 807)

గాంధర్వ వివాహము.

**17.** గాంధర్వవివాహములు గూడ ఈ కాలమున అచ్చటచ్చట జరుగుచున్నట్లు చెప్పుచున్నారు. క్షత్రియజాతివారిలో గాంధర్వవివాహము చెల్లునని 1817 సం॥ లో బంగాళా సదరు కోర్టువారు తీర్పుచేసియుండిరి. పిమ్మట మరికొన్ని కేసులలోగూడ ఆలాగే తీర్పులు ఇయ్యబడెను. కాని, యిటీవల అలహాబాదు హైకోర్టువారు, క్షత్రియజాతిలోగూడ గాంధర్వవివాహములు చెల్లవనియు అట్టివివాహములవల్ల ఏర్పడిన భార్యలు దాసీస్త్రీలతో సమానలనియు వారివల్ల గలిగినసంతతి దాసీ సంతతితో తుల్యమనియు తీర్పుచేసిరి. (ఇ. లా. రి. 3 అ. 738). హోమాది క్రియలతోడ క్రమముగా జరిగినయెడల గాంధర్వ

వివాహము చెల్లునని మదరాసు హైకోర్టువారు తీర్పుచేసియు న్నారు. (ఇ. లా. రి. 12 మ. 72; 13 మూ. ఇ. అ. 506); కాని, హోమాది క్రియలును మంత్రములును ఆవశ్యకములని అది స్మృతులయందు వివరింపబడియుండు గాంధర్వ వివాహ మెట్లగునో ఊహింపజాలము.

**18.** కన్యకు తగిన వరుని సంపాదించి వివాహముచేయు అధికారము మొట్టమొదట తండ్రిదనియు - అతని తర్వాత వరుస గా - పితామహుడు, అన్న, పినతండ్రి పెత్తండ్రులు, మేన మామ, జ్ఞాతులు, వీరికిని, వీరెవ్వరును లేనియెడల తల్లికిని, ఆ అధికారము చేరుననియు-బంధువు లెవ్వరును లేనియెడల తానే వరుని నిశ్చయించుకొని కన్యవివాహమాడవచ్చుననియు, మితా క్షరము మొదలగు ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది.

భార్యను బిడ్డలను భర్త వదిలివేసియుండునప్పుడు, తల్లి తనే స్వతంత్రించి కుమార్తెకు వివాహముచేయవచ్చును. (ఇ. లా. రి. 11 బొం. 247). కాని, మరి యే సందర్భమునందును తండ్రి అనుమతిలేక తల్లిగాని మరియెవరుగాని కుమార్తెకు వివాహము చేసినయెడల అది చెల్లనేరదు. (ఇ. లా. రి. 12 బొం. 10. అయినను, దిగువ 21 పేరాలో ఇ. లా. రి. 14 మ. 316 చూడ వలసినది). తల్లి యిష్టములేకయే కుమార్తెను తండ్రి వివాహ ము చేయవచ్చుననుట స్పష్టము.

కుమార్తెకు వివాహముచేయుస్వాతంత్ర్యము చిట్టచివరకు గాని తల్లికి రాదని ధర్మశాస్త్రములయందు చెప్పబడియుండు న్యాయము అవిభక్తకుటుంబములకే చెల్లదగియున్నది. విభక్త కుటుంబములలో పినతండ్రి పెత్తండ్రులకంటె తల్లికే ఎక్కువ స్వాతంత్ర్యము కలదనియు, తల్లి యనుమతి లేక వారెవ్వరును

కన్యకు వివాహము చేయగూడదనియు, మదరాసు హైకోర్టు వారు తీరుమానించి యున్నారు. (4 మ. హై. 339).

కన్యకు వివాహముచేయు విషయమున, సవతి తల్లికంటె మాతామహునికి (తల్లియొక్క తండ్రికి) ఎక్కువ స్వాతంత్ర్యము కలదని కలకత్తా హైకోర్టువారు తీరుమానించిరి. (7 స. 321.)

కోర్టువారు వివాహమును నిలుపుట.

**19.** కన్యకు వివాహము చేయునట్టి అధికారము వరుసగా ఫలానా ఫలానా వారికి చెందియున్నదని పైన తెలుపబడియెను. అట్లు అధికారముగల వారి అనుమతికి వ్యతిరేకముగా కన్యకు వివాహము చేయుటకు ప్రయత్నము జరిగింపబడినయెడల, కోర్టులో పిటిషను దాఖలుచేసి వివాహమును నిలుపించవచ్చును. (ఇ. లా. రి. 11 బొం. 253). కన్యకు సంరక్షకులైనవారు దుగుద్దేశముతోగాని స్వప్రయోజనముకోరిగాని ఆచిన్నదాని శ్రేయస్సునకు విరోధకరమగు సంబంధము నేర్పరచి వివాహము చేయుటకు ఉద్యుక్తులై యుండునెడ, కన్యయొక్క బంధువులుగాని స్నేహితులుగాని కోర్టులో పిటిషను దాఖలుచేసి అట్టివివాహము నిలుపవచ్చును. కాని, ఆలాగున తండ్రియే సంబంధము కుదిర్చి వివాహము చేయునపుడు, అది యెంత అయోగ్యముగా నుండినను కోర్టువారు సాధారణముగా జోక్యము పుచ్చుకొనజాలరు. (ఇ. లా. రి. 12 బొం. 480).

నిలుపవలసినదని ఇంజంక్షన్ ఉత్తర్వు జారీచేసినపిమ్మట గూడ వివాహము జరిగింపబడినయెడల, దానిని కోర్టువారు రద్దుచేయజాలరు. (ఇ. లా. రి. 11 బొం. 247; ఇ. లా. రి. 12 క. 140; ఇ. లా. రి. 14 మ. 260). కాని, ఆలాగున కోర్టు ఉత్తర్వును ఉల్లంఘన చేసిన వారిని శిక్షింపగలరు.

వివాహమును రద్దుపరచుట.

**20.** సంపూర్తిగా జరుగకమునుపు వివాహమును కోర్టువారు నిలుపగలరు గాని, జరిగిన పిమ్మట రద్దుచేయజాలరు. అను

మతింపవలసిన వారి అనుమతిలేక జరిగినదని గాని, కన్య మరి యొకరి కియ్యబడునట్లు నిశ్చయింపబడినదని గాని, వధూవరులకు ఎంతమాత్రమును అనుకూల్యత పొసగ నేరదనిగాని, పెద్ద రోగము పిచ్చి నపుంసకత్వము మున్నగు కారణములవల్లగాని, మరియేకారణమువల్లగాని, జరిగిన వివాహము రద్దు కానేరదు. ఏర్పడిన పిమ్మట వివాహబంధ మెన్నడును విడగొట్టబడ నేరదు. (I బారో. 138; ఇ. లా. రి. 28 క. 37). ఈ విషయమై, మదరాసు హైకోర్టునకు భూషణముగా నుండిన లేటుజడ్జి సర్ టి ముత్తుసామయ్యర్ గారు "వెంకటాచార్యుల కేసు" లో సాకల్యముగా పరిశీలించి తీర్పు చేసియున్నారు. (ఇ. లా. రి. 14మ. 316).

**21.** ఈ కేసులో-భర్తయొక్క అనుమతి ఇయ్యబడినట్లు పురోహితునితో అబద్ధముచెప్పి, భార్య తాను స్వతంత్రించి కుమార్తెకు వివాహము జరిపించెను. పిమ్మట, ఆ వివాహమును భర్త నిరాకరించిన కారణమువల్ల, దానినిస్థాపించుటకై అల్లుడు దావా తెచ్చెను. చిన్నదాని తండ్రి సమ్మతించలేదను హేతువు వలన ఆ వివాహము రద్దుపరుపబడి యుండినయెడల, ధర్మశాస్త్రము లెట్లున్నను, అది జనులకు మిగుల అసమ్మతముగా నుండియుండును. ఎట్లయిన నేమి ధర్మశాస్త్రముల సారమును గ్రహించి జడ్జి ముత్తుసామయ్యరుగారు ఆ వివాహమును ఖాయపరచిరి. ఇంతేకాక, ఖాయపడినదని సంతోషించి కన్య తండ్రియొక్క అనుమతిలేకయే వివాహము జరిగింపవచ్చునని జనులు తలంచుటకవకాశము లేకుండునట్లు వారు యుక్తియుక్తముగా జడ్జిమెంటు వ్రాసిరి.

**22.** ఈ జడ్జిమెంటులోని సారాంశము లేమనగా:—

(I.) కన్యాదానము, సప్తపది - ఈ రెండు క్రియలును వివాహసంపూర్తికి ముఖ్యము. కన్యాదానమనగా కన్యయొక్క సంర

క్షణ వహించి యుండువారు, ఆ చిన్నదాని శ్రేయస్సునుకోరి మేలుతలంపుతో తగినవరునివిచారించి, అతనికి ఆ కన్యనిచ్చుట. సప్తపదియనగా, పాణిగ్రహణము చేసి ఆ చిన్నదానితోగూడ వరుడు హోమాగ్ని యెదుట మంత్రపూర్వకముగా ఏడడుగులు నడచుట — దీనివలన అభేద్యమగు వివాహబంధ మేర్పడుచున్నది. (2) ఈ చెప్పబడిన ప్రకారము కన్యయొక్క సంరక్షణ వహించి యుండువారు క్రమముగా కన్యాదానముచేసి సప్తపది కర్మ జరిగినవెనుక, వివాహమును రద్దుచేయుటకు సాధ్యము కాదు. (3) మోసముచేసిగాని బలాత్కారముగాగాని కన్యను గొనిపోయి వివాహము జరిగింపబడినయెడల, సప్తపది కర్మ నడచినను, ఆ వివాహము చెల్లనేరదు. ఏలనంటే - కన్యయొక్క సంరక్షణకర్త వలన కన్యాదానము లేనపుడు, సప్తపదికర్మ ఫలింపదుగావున వివాహబంధ మేర్పడజాలదు.

"వెంకటాచార్ల కేసు" లో, కన్య సంరక్షకురాలగు తల్లి, ఆ చిన్నదాని శ్రేయస్సును కోరి, లేశమును దురుద్దేశముగాని బలవంతముగాని లేక, తగినవరుని నిశ్చయించి తనకుమార్తెకు వివాహము జరిగించినట్లు కోర్టువారికి నమ్మకము తోచినందున, క్రమమగు కన్యాదానముండెననియు, సప్తపదికర్మ క్రమముగా ముగిసి వివాహబంధ మేర్పడెననియు, భర్తయొక్క అనుమతి లేక వివాహము జరిగించుట అక్రమమైనను మించి జరిగినదిగావున రద్దుచేయుట సాధ్యముకాదనియు కోర్టువారు తీర్మానించిరి. (ఇ. లా. రి. 14 మ. 316.)

వివాహము క్రమముగా జరిగినదా ?

**23.** పై పేరాలో తెలుపబడిన అంశములవలన వివాహ సంపూర్తికి కన్యాదానము, సప్తపది - ఈ రెండు ఆవశ్యకమని తేటపడుచున్నది. వివాహము జరిగినట్లు ఒప్పుకొనబడిన యెడల, అది క్రమముగా జరిగినదనియే కోర్టువారు తలంతురు.

క్రమముగా జరుగలేదని వాదించువారు, ఆ విషయమై సప్రమాణకమగు రుజువు కనుపరచవలయును. (ఇ. లా. రి. 12 క. 140.)

శాస్త్రోక్తము ప్రకారము, సప్తపదికర్మలో ఏడవ యడుగు పెట్టువఱకు వివాహము ముగియనట్లును, అంతనుండకు వివాహము మానవచ్చునట్లును, ఏర్పడుచున్నది. కాని, సప్తపదినిలనగాక మరియేకర్మవల్లనైనను వివాహము సంపూర్తియగునట్లు దేశాచారము స్థిరపడియుండునెడ, అట్టి యాచారము చెల్లును. (ఇ. లా. రి. 5 క. 692; ఇ. లా. రి. 10 క. 138). చిన్నదాని మెడకు మంగళసూత్రము కట్టిన వెంటనే వివాహబంధమేర్పడునట్లు దక్షిణ హిందూస్థానమున సర్వసాధారణముగా నమ్మబడుచున్నది. సప్తపది ముగిసినవెనుక, వివాహము సంపూర్తియైన దనుటకు ఎంతమాత్రమును సందేహముండదు.

వివాహబంధము సంపూర్ణముగా ఏర్పడుటకు నిషేకము అనావశ్యకము. ఎప్పటికిని నిషేకము జరుగక పోయినను, దాంపత్యబంధము విడనేరదు. (ఇ. లా. రి. 9 మ. 466). కాని, యీ విషయమై బంగాళా ప్రెసిడెన్సీలో కొన్ని జాతులవారిలో భిన్నాచారములు అంగీకరింపబడి, వివాహకర్మ జరిగినను నిషేకకర్మ జరిగించుటకు పురుషుడు నిరాకరించిన యెడల కన్య తిరుగా మరియొకనిని వివాహము చేసికొనవచ్చునని తీరుమానింపబడెను. (25 స. 386). వధూవరులు పసిబిడ్డలుగానుండి ఏ విధమైన కర్మలోపము లేకుండ వివాహము జరిగింపబడినను, అట్టి వివాహకాలమున ఏర్పరచుకొనబడు కొన్ని ఒడంబడికలు నెరవేర్పబడువరకు సదరువివాహము అసంపూర్ణముగనే భావించునట్టి ఆచారము చెల్లునని బొంబయిలో అంగీకరింపబడెను. (ఇ. లా. రి. 17 బొం. 400).

తలిదండ్రుల యిష్టము లేక పిల్లకు వివాహము.

**24.** బలాత్కారముగాగాని మోసముచేసిగాని పిల్ల నెత్తుకొనిపోయి పెండ్లి చేసినయెడల, ఆ పెండ్లి చెల్లదు సరేకదా, ఆలాగున పిల్ల నెత్తుకొని పోయినవారు, పినల్ కోడు 363 సె॥ ప్రకారము, సంరక్షకుల వద్దినుండి వారి సమ్మతిలేకుండ పిల్లను గొనిపోయినందునకు 7 సంవత్సరములవరకు ఖైదు శిక్షకు పాత్రులగుదురు. ఆ పిల్లకు పెండ్లి జరుగని యట్లే భావించి మరల వివాహము చేయవచ్చును. కాని, తలిదండ్రులిష్టపడి, పినతల్లి పెత్తల్లి మేనమామ తాత ముత్తవలు మొదలగు బంధువుల సంరక్షణలో పిల్లను ఉంచినపుడు వారు స్వతంత్రించి తలిదండ్రుల యెరుక లేకయే ఆ పిల్లకు వివాహము చేసినయెడల, ముత్తుసామయ్యరుగారి జడ్జిమెంటునుబట్టి ఆ వివాహము చెల్లదని నిశ్చయముగా చెప్పుటకు వీలులేదు. అట్టి వివాహము జరిగినపుడు, తలిదండ్రులు దానిని సమ్మతింపక పిల్లకు మరల పెండ్లి చేసిన యెడల, పినల్ కోడు 494 సెక్షను ప్రకారము "పునర్వివాహ" నేరముక్రింద, వారు 7 సం॥ల వరకు ఖైదు శిక్షకు పాత్రులు కావచ్చును. కాబట్టి, అట్టి అక్రమ వివాహము జరిగింపబడినప్పుడు, ముందు దానిని రద్దుపరచుటకు కోర్టులో దావా తెచ్చి, రద్దుపరచిన పిమ్మట మరల వివాహము చేయుట ఉత్తమము.

ఉదాహరణలు.

**25.** ఈ క్రింది రెండు ఉదాహరణలను గమనించుట ఆవశ్యకము. (I) తలిదండ్రుల యిష్టముతో ఒక చిన్నది బావగారియింట అక్క సంరక్షణలో నుండెను. ఆ చిన్నదానిని ఒక భాగ్యవంతుడగు వృద్ధునకిచ్చి సొమ్ము పుచ్చుకొనవలెనని తలిదండ్రులు ఉద్దేశించియుండిరి. అది తెలిసికొని ఆ చిన్నదానికి తగినవరుని సంపాదించి, తలిదండ్రులతో చెప్పకయే బావగారు వివాహము చేసెను. ఈ వివాహము రద్దు కానేరదని ముత్తుసామయ్యరుగారి జడ్జిమెంటువలన ఏర్పడుచున్నది.

(2) తల్లి మృతి చెందిన కారణముచే, ఒక చిన్నది బాల్యము నుండియు మేనమామయింట ముత్తవతల్లి సంరక్షణలో నుండెను. తండ్రి యెరుకలేకయే, ఆ చిన్నదానికి తగిన సంబంధము కుదిర్చి మేనమామ వివాహము చేసెను. ఈ వివాహము రద్దుకానేరదు.

పైన ఉదహరింపబడిన రెండు సందర్భములయందును, వివాహము జరుగకమునుపు చిన్నదానితండ్రి కోర్టులో పిటిషన్ దాఖలుచేసి వివాహమును ఆపవచ్చును.

**26.** తలిదండ్రుల యిష్టములేక పిల్లవానిని గొనిపోయి కన్యయొక్క తలిదండ్రులు పిల్లనిచ్చి బలవంతముగా పెండ్లి చేసిన యెడల, వారు ఎట్టిశిక్షకుగాని నష్టమిచ్చుటకుగాని పాత్రులయ్యెను వివాహము చెల్లకతప్పదు.

**27.** ఇంతకుముందు చెప్పబడినదానివలన, హిందువులలో వివాహమును మతసంబంధమగు కర్మగా తలంపవలసిన దేగాని, క్రీస్తు మతస్థులయందువలె వధూవరులు సమ్మతించి యేర్పరచుకొను కంట్రాక్టు (ఒడంబడిక) గా భావింపగూడదని స్పష్టమగుచున్నది. కనుకనే బుద్ధి తెలియని చిన్నపిల్లలకు చేసిన వివాహములుకూడ చెల్లుచున్నవి. (ఇ. లా. రి. 5 అ. 513). ఈ కారణమువల్లనే నపుంసకునికిగాని పిచ్చివానికిగాని పిల్లనిచ్చి వివాహము చేసినను, ఆ వివాహము చెల్లుచున్నది. (ఇ. లా. రి. 1 అ. 549). అట్టి పిచ్చివానికిగాని నపుంసకునికిగాని వారసుహక్కు లేక పోయినను, వాని కుమారునికి వారసు హక్కు కలదు. మరియు, ఎవిడెన్సు ఆక్టు (సాక్ష్యపుచట్టము) 112 సెక్షను ప్రకారము భార్యాభర్తలకు కలిగిన సంతానము, అది ప్రాప్తింపగల కాలములో వారు కలిసియుండలేదని స్పష్టమైన రుజువు కనుపడనప్పుడు, క్రమముగా కలిగిన సంతానమనియే యెంచబడును.

**28.** సంబంధము నిశ్చయించుకొన్న తర్వాత, నీతిగల వారు మాటతప్పి వివాహమును మానుకొనరని మను స్మృతి యందు చెప్పబడి యున్నది. ఒప్పుకొనియుండు సంబంధమున కంటె మంచి సంబంధము కుదిరినయెడల మొదటి సంబంధమును మానవచ్చుననియు, దుర్వ్యాధి నపుంసకత్వము ఇట్టివిషయములు తెలియవచ్చినయెడల వివాహమును మానుకొనుట దోషము కాదనియు, యాజ్ఞవల్క్య స్మృతియందు చెప్పబడియున్నది. నిశ్చితార్థమైన వెనుక నిష్కారణముగా వివాహమును మానుకొన్న యెడల, బలవంత పెట్టి ఆ వివాహమును జరిపింపవచ్చునని నారద స్మృతియందు చెప్పబడి యున్నది.

**29.** ధర్మశాస్త్రములయం దెట్లున్నను, ఈకాలమునందు సంబంధము నిశ్చయమై లగ్నపత్రిక పంపబడి నిశ్చితార్థము జరిగిన పిమ్మట గూడ ఇష్టములేనియెడల వివాహము మానుకొనవచ్చుననుట నిస్సందేహము. బలవంతపరచి వివాహమును జరుపుటకు కోర్టువారికి అధికారములేదు. (స్పెసిఫిక్ రిలీఫు ఆక్టు, 1877 సం॥ I నెం॥ చట్టము, 21 సెక్షను 6 క్లా).

అక్రమముగా ఒడంబడిక తప్పినవారిమీద రెండవవారు దావా తెచ్చి అందువల్ల తమకు కలిగిన ఖర్చులను నష్టమును పుచ్చుకొనవచ్చును. (7 బొం. హై. 122; ఇ. లా. రి. I క. 74; ఇ. లా. రి. II బొం. 412; 3 మైసూరు లారిపోర్టులు 153; ఇ. లా. రి. 16 బొం. 673; ఇ. లా. రి. 21 బొం. 23). దావా తెచ్చినవారిదే లోపమయ్యుండునపుడు నష్టము ఇప్పించబడ నేరదు. (1860 సం॥ మదరాసు తీర్పులు, 274 పేజీ). దుర్వ్యాధి మొదలగు విషయములు తెలియవచ్చుటవలనగాని వధూవరు లిరువురిలో ఎవరైనను సమ్మతింపక తిరుగబడినందున

గాని వివాహము మానుకొనబడినప్పుడు, నష్టమునకు దావా చెల్లనేరదు.

పిల్లనిచ్చునట్లు సమ్మతించినమీద, పిల్లతలిదండ్రులకు కొంత సొమ్మియ్యబడెను. పిమ్మట వారు ఆ చిన్నదానికి మరియొక సంబంధము కుదిర్చి వివాహముచేసిరి. సొమ్ము నిమిత్తము దావా తేవచ్చును. (ఇ. లా. రి. I క. 1054).

**30.** పిల్ల నిచ్చినయెడల, ఇంత సొమ్మియ్య గలవాడనని ముందుగా పెండ్లికొడుకుతండ్రి పెండ్లికూతురు తండ్రితో ఒప్పుకొనియుండి, వివాహము జరిగెను. ఆసొమ్ము నిమిత్తము దావా చెల్లునని మదరాసు హైకోర్టువారు ముందటికాలమున తీరుమానించి యుండిరి. (ఇ. లా. రి. 13 మ. 83). కాని, యిటీవల నొక ఫుల్ బెంచి అప్పీలులో సదరు తీర్పు రద్దుచేసి, ఆసుర వివాహములు జరిగినప్పుడు చెల్లుచున్నను, తత్సంబంధమున కన్యాశుల్కము చెల్లించునట్టి విషయమై యేర్పరచుకొనబడు ఒడంబడికలు, పిల్లదాని తండ్రితోగాని గార్డియనుతోగాని చేసికొనబడినను పెండ్లికొడుకు అన్నదమ్ములొండొరులతో చేసికొన్నను సరే యెంతమాత్రమును చెల్లజాలవనియు, అట్టియొడంబడికలు దేశ క్షేమమునకు భంగకరములనియు నీతిబాహ్యములనియు తీరుమానింపబడెను. (ఇ. లా. రి. 32 మ. 185, వెంకటకృష్ణయ్య *v.* లక్ష్మీనారాయణ).

**31.** పూర్వకాలమునందు, భిన్నజాతి వివాహములు చెల్లుచుండెనని ధర్మశాస్త్రములవలన తెలియవచ్చుచున్నది. ఎక్కువజాతి పురుషుడు తన జాతి స్త్రీనైనను తక్కువజాతి స్త్రీనైనను వివాహమాడవచ్చునని చెప్పబడియున్నది. కాని, అట్టి పద్ధతి యిప్పుడు నశించుటవలన, భిన్నజాతి వివాహములు చెల్లనేరవు. (ఇ. లా. రి. 28 అ. 458).

వధూవరుల కుల గోత్రములు.

**32.** ఈ కాలమున వధూవరులు ఒకటేజాతివారై భిన్న కుటుంబములకును భిన్నగోత్రములకును చేరియుండవలయును. ప్రవరలు కలియగూడదు. వధూవరులకు సపిండ బంధుత్వము కలిగియుండునెడ, వివాహము కూడదని ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. అనగా, పిల్లవాని పెద్దలును పిల్లదాని పెద్దలును, (పిల్లవానినిగాని పిల్లదానినిగాని కలుపుకొని) పితృవర్గమున ఏడు తరముల లోపలను మాతృవర్గమున ఐదు తరముల లోపలను ఏకమయినయెడల, వివాహముకూడదని చెప్పబడి యున్నది. కాని, దక్షిణ పశ్చిమ హిందూస్థానములయందు ఈ నిబంధనకు వ్యతిరేకముగా ఆచారము ఏర్పడి, మేనమామ కూతురు, మేనత్తకూతురు, అక్కచెల్లెండ్రకూతురు - వీరితో వివాహము అశాస్త్రీయమయ్యును చెల్లుచున్నది. ఇట్టి వివా వివాహములు బ్రాహ్మణజాతి వారిలో గూడ తరుచుగ జరుగుచు కోర్టులలో అంగీకరింపబడు చున్నవి.

వధూవరు లిరువురును ఒకటేజాతివారై యుండునప్పుడు వారిలో ఒకరుగాని ఉభయులుగాని లాప్రకారము దాసీ సంతతితో తుల్యులుగా భావింపబడు చున్నారను కారణమువల్ల వివాహము రద్దుకాజాలదు. (ఇ. లా. రి. 18 క. 264).

గోత్రభేధము బ్రాహ్మణులకే ముఖ్యముగాని శూద్రజాతి వారికి ఆవశ్యకము లేదు. (ఇ. లా. రి. 5 క. 708). బ్రాహ్మణ జాతిలో సగోత్రీకులకు జరిగిన వివాహము చెల్లనేరదు.

నింద్యవివాహములు.

**33.** వివాహవిషయమున సవతితల్లికి సంబంధించిన బంధువులను కన్నతల్లికి సంబంధించిన వారినిగానే భావించి నిషేధములు పాటింపవలయునని ధర్మశాస్త్రములయందు చెప్పబడి యున్నది. కాని, రక్తసంబంధమువలని నిషేధము లేనప్పుడు సామీప్య బంధుత్వము కలదను ఆక్షేపణవల్లగాని చెల్లని వావి

యనెడి ఆక్షేపణవల్లగాని వివాహము రద్దుకానేరదు. భార్య యొక్క- అక్కచెల్లెండ్ర కూతురు, భార్యయొక్క-పినతల్లి, భార్య అన్నదమ్ముల కూతురు, సవతితల్లియొక్క- చెల్లెలు, సవతితల్లి యొక్క- అక్కచెల్లెండ్ర కూతురు, పినతండ్రి పెత్తండ్రుల మరదలు, పినతండ్రి పెత్తండ్రుల వదినె మరదండ్ర కూతురు - ఇట్టి వారిని వివాహమాడుట జననింద్యమయ్యును రద్దుకానేరదని తీరుమానింపబడి యున్నది. (ఇ. లా. రి. 20 మ. 283). భార్య అన్నదమ్ముల మరదలు, భార్య మేనమామకూతురు - ఇట్టివారి తోడ వివాహములు దక్షిణహిందుస్థానమున జరిగియున్నవి. కాని, సామాన్యముగా జనులు వరుసవావులను పాటించుచునే యున్నారు.

**34**. అన్నదమ్ముల కుమార్తెను వివాహమాడిన యెడల, ఆ వివాహము శూద్రులలోగూడ చెల్లనేరదని తీరుమానింపబడి యున్నది. (ఇ. లా. రి. 6 మ. 43). మరియు - తనచెల్లెలు, తండ్రిచెల్లెలు, తల్లిచెల్లెలు (అనగా పినతల్లి) - పినతండ్రి పెత్తండ్రికూతురు, పినతల్లి పెత్తల్లి కూతురు - వీరితో వివాహము కూడదని సర్వ వర్ణములవారును సమ్మతించి యున్నారు.

దత్తపుత్రుడు రక్త సంబంధమువలన జనక కుటుంబమునందును స్వీకృత కారణమువలన దత్త కుటుంబమునందును గూడ వివాహమాడరాదు. ఈ నిబంధన ముఖ్యముగా బ్రాహ్మణజాతి వారికి చెల్లును.

ఇంకను అనేకములగు నిషేధములు స్మృతులయందు చెప్పబడియున్నవి. కాని, అవి యీ కాలమున పాటింపబడవు. గురుశిష్యుల కుమార్తెనుగాని, తన తల్లి పేరుగల పిల్లనుగాని పెండ్లియాడగూడదని ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. పెండ్లికొడుకు కంటె పెండ్లికూతురు పెద్దదిగా నుండరాదనియు

అక్కను వదలి చెల్లెలికి పెండ్లిచేయరాదనియు గూడ చెప్పబడి యున్నది. ఇట్టి వివాహములు జరుగుటయు లేదు. కాని జరిగిన యెడల చెల్లవని చెప్పుటకు వీలులేదు.

రజస్వల కాకమునుపే కన్యకు వివాహము చేయవలెనని ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. కాని, యీ ఆచారము బ్రాహ్మణజాతివారిలో మాత్రమే స్థిరపడియున్నది. వీరిలో గూడ నిప్పుడు కొందఱు సంఘ సంస్కరణాభిలాషులు రజస్వలానంతర వివాహములు అశాస్త్రీయములు కావని వాదించుచు వానిని వాడుకలోనికి తేవలెనని ప్రయత్నించుచున్నారు. కాని, యింతవర కట్టివివాహము లెచ్చటను జరిగియున్నట్లు కానంబడదు. జరిగినను వానినిగూర్చి బహిరంగముగా వివాదమును ఆక్షేపణయు కలుగకయే పోవచ్చును. కలిగినప్పుడు కోర్టువారి తీరుమాన మెట్లుండునో చూడవలసియున్నది. అట్టి వివాహములు చెల్లవని తీరుమానింపబడినయెడల, వానివల్ల కలిగెడి సంతతి దాసీ సంతతితో తుల్యముగా జూడబడవలసి యుండును.

వేరువేరు శాఖల వారికి వివాహములు.

**35.** ధర్మశాస్త్రములయందు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులని నాల్గు వర్ణములవారే చెప్పబడి యున్నారుగాని, యీ క్రమమున దేర్పడియుండు అనేక శాఖోపశాఖలు చెప్పబడి యుండలేదు. భాషాభేదము మాట బొత్తిగనే చెప్పబడియుండ లేదు. కాబట్టి ఆయా వర్ణములలో వేర్వేరు శాఖలవారికి వివాహములు జరిగినయెడల అవి శాస్త్రీయములనియే తలంపవలసి యున్నది. అనగా, బ్రాహ్మణులలో ఆంధ్రకర్ణాటకద్రావిడులు గాని, స్మార్త వైష్ణవ (మధ్వ) శ్రీ వైష్ణవులుగాని, మురుకనాడు వెలనాడు బడగనాడు మొదలగు శాఖలవారుగాని, నియోగులు వైదికులుగాని – శూద్రులలో నాయలు మొదలార్లు పిళ్లలు మున్నగువారుగాని – యిట్లు వేర్వేరు శాఖలవారు పిల్లనిచ్చి పు

చ్చుకొనిన యెడల, వివాహము రద్దుకానేరదు. కాని, చిరకాలమునుండి ఆచారము లేకుండిన కారణమువలన సుఖదాయకములుగా నుండవని వెఱచి అట్టి వివాహములు చేయుటను జనులు వెనుదీయుచున్నారు. శూద్రజాతిలో వేర్వేరు శాఖల వారికి వివాహము శాస్త్రీయమేయని బొంబాయి హైకోర్టు వారు తీరుమానించియున్నారు. (II బొం. లా. రి. 822).

ఏ ప్రదేశమునందైనను ఒక వర్ణములో వేర్వేరు శాఖలవారికి వివాహము జరిగినప్పుడు, అట్టి పూర్వాచారమచ్చట యేర్పడి యుండిననే ఆ వివాహము చెల్లునుగాని, లేనియెడల చెల్లదని పూర్వము కలకత్తా హైకోర్టువారు తీర్పుచేసిరి. (9 స. 552; ఇ. లా. రి. I క. I). కాని, పూర్వాచారము లేకున్నను వేర్వేరు శాఖలవారికి వివాహములు చెల్లునని యితరహైకోర్టులవారివల్లను ప్రివీకౌన్సిలువారివల్లనుగూడ తీర్పులుచేయబడియున్నవి. (I వ హై. 478; 13 మూ. ఇ. అ. 141; 14 మూ. ఇ. అ. 346, 352; ఇ. లా. రి. 15 క. 708; ఇ. లా. రి. 22 బొం. 277).

**36**. వివాహ బంధమువలన దంపతులు ఇహపర కర్మల యందు ఐక్యమగుచున్నారు. వివాహబంధమేర్పడినది మొదలు భార్య యెంత చిన్నదైనను ఆ చిన్నదాని సంరక్షణ హక్కు భర్తకు చెందుచున్నదనియు, భర్త మైనరై యుండునప్పుడు అతని గార్డియనుకు(అనగా పోషకునికి) చెందుచున్నదనియు, ధర్మ శాస్త్రములయందు చెప్పబడియున్నది. కాని, అనేక ప్రదేశములయందు రజస్వల యగువరకును చిన్నది పుట్టింటనే యుండునట్టి ఆచారము ఏర్పడియుండుటచేత అంతకుముందు భార్యను తనయింటికి పంపుమని నిర్బంధించుటకు భర్తకు హక్కు లేదు. (23 స. 178, 22; ఇ. లా. రి. 17 క. 298; ఇ. లా. రి. 28 క.

37, 751). పిల్లయొక్క యోగక్షేమమునకు తలిదండ్రుల సంరక్షణ భంగకరముగా నుండునెడల దానిని తొలగించి పిల్లను పెనిమిటివద్దికి పంపవచ్చును. (ఇ. లా. రి. 24 మ. 255).

రజస్వలానంతరము.

రజస్వలానంతరము భార్యను తనయింటికి పంపుమని కోరుటకు భర్తకు సంపూర్ణమైన హక్కు కలదు. ఆలాగున పంపక నిరాకరించి తలిదండ్రులుగాని మరి యితర బంధువులుగాని ఆ చిన్నదానిని తమయొద్ద నుంచుకొన్నయెడల, వారిమీద భర్త దావా తెచ్చి భార్యను తన స్వాధీనము చేసికొనవచ్చును.

12 సంవత్సరముల లోపల నిషేకము.

**37.** చిన్నది రజస్వలయైనను, 12 సంవత్సరముల యీడు దాటకమునుపు నిషేకము జరిగింపగూడదు. జరిగించినయెడల, పినల్‌కోడ్డు 375 సె॥ ప్రకారము "బలాత్కార సంభోగము" అనెడి నేరము ఏర్పడి 376 సె॥వల్ల యావజ్జీవము ద్వీపాంతరవాసమునకుగాని పది సంవత్సరములవరకు ఖైదు శిక్షకుగాని భర్త పాత్రుడగుచున్నాడు. అతనికి కుమ్మకు చేసినవారుగూడ నేరస్థులగుదురు.

భార్యాభర్తల ప్రధానవిధి.

**38.** భార్య తనయొద్దికి వచ్చిన పిదప అన్నవస్త్రములిచ్చి ఆపెను సంరక్షించుటకు భర్త బద్ధుడగుచున్నాడు. ఆపెయు భర్త ఆజ్ఞకులోబడి అతనియిష్టమునకు విరోధముగా ఎచ్చటికిని పోక గృహకృత్యములను చక్కబెట్టుచు అతనియొద్దనుండి సంసారము చేయుటకు బద్ధురాలగుచున్నది. ఇట్లని అలహాబాదు హైకోర్టులో జడ్జీగానుండిన మహమూదుగారు తీరుమానించియున్నారు. (ఇ. లా. ౭. 13 అ. 126). భర్త యెచ్చట కాపురమున్నను అచ్చట తానుగూడ నుండుటకు భార్య బద్ధురాలు. (ఇ. లా. రి. 28 క. 751).

భార్యను స్వాధీన పరచుకొనుటకు భర్తవలన దావా.

**39.** ఈడువచ్చిన భార్య తన భర్తయింటికి రాక నిరాకరించిన యెడల, లేక భర్తయిల్లు విడిచి లేచిపోయిన యెడల,

ఆపె మీదగాని తలిదండ్రులు మొదలగు వారి దుర్బోధనవలన వారి యొద్ద ఆపె నిలిచియున్న పక్షమున వారిమీదగాని దావా తెచ్చి, భార్య తనయొద్ద నుండునట్లు భర్త తీర్పును పొంద వచ్చును. (ఇ. లా. రి. 5 క. 500; ఇ. లా. రి. 1 బొం. 164). భార్య మైనరుగానున్నను సంసారమునకు అర్హురాలై యున్న యెడల ఈ దావా తేవచ్చును. (5 క. వీ. నో. 195). కోర్టు వారు తీర్పుచేసినమీదట గూడ భర్తయింటికిపోక భార్య నిరాకరించినయెడల, వారు ఆపెను బలవంతముగా మగనియొద్దికి పంపజాలరు. కాని, సివిల్ ప్రొసీడరుకోడ్ 260 సె॥ ప్రకారము అమలు జరిగించవచ్చును. ఈ సెక్షనువల్ల కోర్టువారికి ఉచితమని తోచినయెడల 6 మాసములవరకు భార్యను సివిల్ ఖైదులో నుంచవచ్చును; లేక ఆపె కేదైనను స్వంత ఆస్తిగాని స్త్రీ ధనముగాని యున్నయెడల దానిని జప్తుచేసి అట్లు జప్తుచేసిన పిమ్మటగూడ ఒకసంవత్సరమువరకు భర్తయొద్దికి పోక ఆపె తిరస్కరించిన యెడల ఆ సొత్తును ఏలమువేసి భర్తకు కలిగిన నష్టము నిప్పించవచ్చును. లేక, యీ రెండువిధములనుగూడ కోర్టువారు అమలు జరిగించవచ్చును. కాని, యెంతో మంచి కారణము లేనిది సాధారణముగా ఖయిదు విధింపరు. (ఇ.లా.రి. 5 క. 500; ఇ. లా. రి. 3 అ. 506; ఇ.లా. రి. 13 అ. 126; ఇ. లా. రి. 10 బొ. 301 – "రుక్మాబాయి కేసు.")

**40**. భార్యను స్వాధీనపరచుకొనుటకై భర్త దావా తెచ్చినపుడు, భార్య అతనిని వదిలి యుండుటకు ఎంతో గొప్ప కారణముండిననేతప్ప లేనపుడు భర్తయొద్ద నుండవలసినదనియే కోర్టువారు తీర్పుచేయుదురు. అవశ్యమని తోచినయెడల, భార్య యొక్క క్షేమము నిమిత్తము వారు ఏవయినను కొన్ని షరతులకు భర్తను లోబరుప వచ్చును.

అన్యపురుషునితో సంసారము చేయుటవలన కులభ్రష్టురాలైన భార్యను స్వాధీనపరచుకొనుటకై భర్త దావా తెచ్చిన యెడల, అతడు ఆమెను తిరుగా కులములో చేర్చుకొనునట్టి యేర్పాట్లుచేసి తన భార్యగా గౌరవించి కుటుంబలో నుంచుకొనుటకు సమ్మతించిననే కోర్టువారివల్ల డిక్రీ యివ్వబడును. (5 క. వీ. నో. 195).

భర్త సంరక్షణతో తన కనశ్యము లేదనియు తనకేమియు జీవనాంశ మియ్యనక్కరలేదనియు, అతనియొద్ద నుంచుటకు తన కెంతమాత్రము నిష్టము లేదనియు చెప్పుటకు భార్య స్వతంత్రురాలుకాదు. వివాహబాధమువలన భర్తకులోబడి అతని యొద్ద నుండుటకు భార్య బద్ధురాలని ధర్మశాస్త్రములు వక్కాణించుచున్నవి. భార్య విద్వాంసురాలు, అందగత్తె - భర్త మూఢుడు, గ్రుడ్డివాడు, కుంటివాడు, అయోగ్యుడు - ఇట్లున్ననుగూడ భర్తను వదిలివేయు స్వాతంత్ర్యము భార్యకు లేదు. అట్టిసందర్భములయందు గూడ భర్తయొద్ద నుండవలసినదనియే కోర్టువారు తీరుమానింతురు. కాని, అతనియొద్దకి పోక భార్య తిరస్కరించిన యెడల, ఆమెకు ఖైదు విధింపజాలరు.

తలిదండ్రులు అన్నదమ్ములు మొదలగు వారిలోనుండి వేరుపడియుండిననే అల్లునియొద్దికి పిల్లను పంపుదుముగాని లేకున్న పంపజాలమని కొందరు అత్తమామలు ఒకప్పుడు చెప్పుచున్నారు. ఈ వాదము శాస్త్రవిరుద్ధముగావున కోర్టువారివలన అంగీకరింపబడదు.

భార్య పుట్టింటనేయుండి భర్తగూడ అచ్చటనే కాపురమున్న యెడల అతనితో సంసారము చేయుటకు సమ్మతించినను, ఆమెను తనవద్దికి తెచ్చి యుంచుకొనుటకై భర్త దావాతీసికొని రావచ్చును. (ఇ. లా. రి. 28 క. 751). కాబట్టి, భర్త

యెంత దూరదేశమందున్నను అతని వద్దనుండుటకు భార్య బద్ధురాలై యున్నది. భార్యను ఎల్లప్పుడును పుట్టింటనే యుంచు నట్లును, అత్తవారి యిష్టములేకుండ అల్లుడు ఎచ్చటికిగాని కాపురము మార్చకుండునట్లును — ఈ తీరున వివాహకాలమందు గాని అంతకుముందేగాని ఒడంబడిక చేసికోబడి యున్నను, అట్టి యొడంబడిక దేశక్షేమమునకును హిందూ ధర్మశాస్త్రములకు గూడ వ్యతిరేకముగా నుండుటవల్ల కోర్టువారివల్ల అంగీకరింపబడ నేరదు. (ఇ. లా. రి. 28 క. 751).

కుష్ఠరోగము మొదలగు దుర్వ్యాధులవలన భర్త పీడితుడై యుండునపుడును, భర్తయొద్ద నుండుటవల్ల భార్యకు అపాయముగాని అనారోగ్యముగాని ప్రాణభయముగాని తటస్థించు నట్టి సందర్భమునందును, అత్తింట అత్తగారుగాని ఆడుబిడ్డలు మొదలగువారుగాని మగడుగాని భార్యను అతికాఠిన్యపు క్రూరత్వమునకు లోబరచి హింసించుచుండునప్పుడును, ఆమె భర్త యింట నుండవలసినదని కోర్టువారు తీర్పుచేయజాలరు. (11 మూ. ఇ. అ. 551; ఇ. లా. రి. 1 బొం. 164; ఇ. లా. రి. 5 క. 500; ఇ. లా. రి. 19 క. 84; ఇ. లా. రి. 13 అ. 126). మరియు, ఇట్టి కారణములవలన వేరుగానుండునట్టి భార్యకు కోర్టువారు జీవనాంశ మిప్పింతురు. క్రూరత్వము మొదలగునవి స్పష్టముగా రుజువుకావలెను. సాధారణ గృహకృత్యపు కలహములు, మితముగాశిక్షించి బుద్ధిచెప్పుట — ఇవి చాలవు.

భర్త తిట్టెననిగాని, కోపించుకొనెననిగాని, నిందించెననిగాని, వ్యభిచారము చేసినట్లు తనపై అన్యాయపు అపవాదము మోపెననిగాని, తన నగలు తీసికొనెననిగాని, తన మనసునకు విచారము కలిగించెననిగాని చెప్పి, అతనిని వదిలివేయుటకు భార్యకు హక్కు లేదు. (ఇ. లా. రి. 4 అ. 374).

భర్త వ్యభిచారమున దగిలియున్నను, లంజను తెచ్చి యింట నే యుంచుకొన్నను, నిష్కారణముగా రెండవ వివాహము చేసికొన్నను కూడ, క్రూరత్వము మొదలగు కారణములు లేనియెడల, అతనియొద్దనేయుండుటకు భార్య బద్ధురాలని తీర్పులు చేయబడియున్నవి. (I మ. హై. 375).

తురకదానిని తెచ్చి యింట నుంచుకొన్నయెడల భర్తకుల భ్రష్టు డగుచున్నాడు గావున అట్టి సందర్భమున అతనియొద్ద నుండుటకు భార్య బద్ధురాలు కాదని కలకత్తా కోర్టువారు చాల కాలముక్రిందట తీర్పు చేసియుండిరి. (14 స. 451). కాని, లాప్రకారము వివాహము రద్దుపఱచుకొనదగిన సందర్భము ఏర్పడనియెడల భర్త కులభ్రష్టుడైనాడనే కారణమువల్ల అతనియొద్ద నుండుటకు భార్య నిరాకరింప కూడదని అలహాబాదు హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 27 అ. 178). నీచజాతిలంజను తనయింట నుంచుకొని కాపురము చేయుచు భార్యను ఇల్లు వెడలగొట్టిన యొక బ్రాహ్మణభర్త తిరుగా ఆ పెను స్వాధీనపరచుకొనుటకై దావా తీసికొనిరాగా, సదరు సందర్భములలో ఆ పెను భర్తవద్దనుండునట్లు బలవంతపెట్టుట క్రూరముగా నుండుననియు అపాయకరముగా కూడ నుండ వచ్చుననియు అభిప్రాయపడి కలకత్తా హైకోర్టువారు డిక్రీ యిప్పింపజాలరైరి. (ఇ. లా. రి. 34 క. 971).

భర్త క్రీస్తుమతములో చేరినయెడల అతడు తన హిందూ భార్యను స్వాధీనపరచుకొనుటకు దావా తీసికొని రాకూడదు. (5 స. 235). 1866 సం॥ 21 నెం॥ చట్టముప్రకారము క్రీస్తు మతములో చేరిన భర్తయొద్ద నుండుటకు అతనిభార్య సమ్మతింపనియెడల, అతడుగాని ఆపెగాని కోర్టువారికి అర్జీ యిచ్చుకొని వివాహమును రద్దుపరచుకొనవచ్చును.

**41**. దాంపత్య బంధము మరణముతోగాని విడిపోదుగాన, భార్యను స్వాధీన పరచుకొనుటకై తేబడు దావాకు లిమిటేషను - అనగా కాలదోషము - లేదనియు, లిమిటేషను ఆక్టు 35-వ ఆర్టికిలు హిందువులకు చెల్లనేరదనియు అలహాబాదు హైకోర్టువారును కలకత్తా హైకోర్టువారును తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 13 అ. 126; ఇ. లా. రి. 28 క. 37). కాని, బొంబయి మదరాసు హైకోర్టువారు వ్యతిరేకముగా అనగా, సదరు లిమిటేషను ఆక్టు 35 - వ ఆర్టికిలు హిందూజనులకు చెల్లుననియు, భార్యాభర్త లిరువురును యుక్తవయస్సు వచ్చినవారై యుండునపుడు, కలిసి కాపురము చేయునట్లు కోరుట తిరస్కరించుట - యివి జరిగినదినము మొదలు 2 సం॥ ల లోపల దావా తేబడవలయుననియు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 25 బొం. 646; ఇ. లా. రి. 28 మ. 436).

భార్యను స్వాధీనపరచుకొనుటకై తేబడిన దావా కొట్టివేయబడినను, దానివలన దాంపత్యబంధము విడగొట్టబడినట్లు ఎంచగూడదు. భర్తనువిడిచి విడిగానున్నను, భార్య పునర్వివాహమునకు అర్హురాలు కానేరదు.

**42**. తనతో సంసారము చేయుచుండునపుడును, తగిన కారణమువలన వేరుగా నుండునపుడును, భార్యను సంరక్షించుటకు భర్త బద్ధుడగును. కాని, నిష్కారణముగా భర్తను వదలిపెట్టి ఆపె వేరుగా నుండునపుడు జీవనాంశమిచ్చుటకు అతడు బద్ధుడుకాడు. (ఇ. లా. రి. 2 బొం. 634).

ఎవరి వెంబడినైనను భార్య లేచిపోయి పిమ్మట పశ్చాత్తాపము కలిగి భర్తయొద్దికి వచ్చినయెడల, ఆపెను తనయింట నుంచుకొనుటకు భర్త బద్ధుడుకాడు. వ్యభిచారిణియగు భార్యను తన

యింటనుండి వెడలగొట్టి జీవనాంశమియ్యకయే యుండవచ్చును. కాని, తరువాత వ్యభిచారవృత్తి మానియుండు నెడల, కనికరించి గంజినీటికి గతిచూప వలసినదని ధర్మశాస్త్రములలో చెప్పబడి యున్నది.

భార్యాభర్తలు కలిసియుండునపుడు సంసారపు ఖర్చుల నిమిత్తము భార్య చేసిన అప్పులను తీర్చుటకు భర్త బద్ధుడై యున్నాడు. కాని, ఆమె స్వంతఖర్చుల నిమిత్తము చేసిన అప్పులనుగాని భర్తను విడిచిపెట్టి వేరుగా నుండునపుడు ఆమె చేసిన అప్పులను గాని తీర్చుటకు అతడు బద్ధుడుకాడు. (1 మ. హై. 375; ఇ. లా. రి. 3 అ. 122; ఇ. లా. రి. 1 బొం. 121). ఈ అప్పులను భార్యయే తీర్చవలెను. స్త్రీధనము మొదలగు ఆమె స్వంత ఆస్తిమీద డిక్రీఅమలు జరుపవలెనుగాని, ఆమె శరీరముపై జగుపుటకు వీలులేదు. (సివిల్ ప్రొసీడరుకోడ్డు, సె॥ 245 ఏ.).

భర్తయింట చేరుటకై భార్యవలన దావా.

**43.** భార్యను నిష్కారణముగా భర్త వదిలివేసిన యెడల, భర్తయింట చేరుటకై ఆమె అతనిమీద దావా తేవచ్చును. అతనియింటికిపోయి కష్టమునకు లోబడుటకంటె వేరుగా నుండుటయే అనేక సందర్భములయందు ఉత్తమముగా నుండును గావున, ఈ చెప్పిన దావా తీసికొనిరాక జీవనాంశమునకు మాత్రమే దావా తేవచ్చును. వ్యభిచారిణియగు భార్య ఈ దావా తెచ్చుటకు అర్హురాలుకాదు.

భార్యను సంరక్షించక భర్త వదిలివేసినయెడల, క్రిమినల్ ప్రొసీడరుకోడ్డు 488 సె॥ ప్రకారము, ఆమె మేజిస్ట్రేటువారికి పిటిషను ఇచ్చుకొని, నెల 1 కి రూ. 50 లు మించని జీవనాంశమును పొందవచ్చును. వ్యభిచారిణియగు భార్యకు జీవనాంశమిప్పింపబడనేరదు.

## 2. వివాహము

**44.** అపుత్రత్వము, నిస్సంతానత్వము, దుర్వ్యాధి, దుష్ట ప్రవర్తనము, దుర్గుణము — ఈ లోపములలో నేదైనను ప్రథమ భార్యయందుండినప్పుడు మాత్రమే మరియొక భార్యను పురుషుడు వివాహమాడ వచ్చునని ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. ఇట్లున్నను, ఈ చెప్పిన కారణములలో నేదియు లేకుండియు పురుషుడు పునర్వివాహమాడినయెడల, అది నింద్యమయ్యును చెల్లక తప్పదని యర్థముచేసి మదరాసు హైకోర్టు వారు తీరుమానించిరి. ఈ తీర్పు ప్రకారము, పురుషుడు ఒకటే సారిగాని ఒకరితర్వాత నొకరినిగాని తనయిష్టము వచ్చినంత మంది భార్యలను పెండ్లియాడవచ్చును. ఏకారణమును అవశ్యములేదు. అతని యిచ్ఛయే చాలును. (I మ. హై. 375). భర్త మరల వివాహమాడిన కారణమువల్ల ప్రథమభార్య అతనిని విడిచిపోగూడదు. (I మ. హై. 375). భర్తయు ప్రథమభార్యను విడిచిపెట్టగూడదు. విడిచిపెట్టినయెడల జీవనాంశ మియ్యవలయును.

**45.** భర్త జీవించియుండగా ఏకారణమువల్లగాని మరల వివాహమాడుటకు భార్య అర్హురాలుకాదు. హిందూ వివాహమువలన కలిగెడి దాంపత్యబంధము భార్యాభర్తలిరువురును జీవించియుండువరకు విడగొట్టబడనేరదు. కాబట్టి, వారిద్దరును సమ్మతించి వేరుగా నుండినను గూడ వివాహబంధము విడనేరదు. భర్త వదిలివేసినను, మరియొక వివాహమాడినను, దేశాంతరగతుడైనను, నపుంసకుడైనను, దుర్వ్యాధిపీడితుడైనను, కులభ్రష్టుడైననుగూడ, భార్యకు పునర్వివాహయోగ్యతకలుగదు.

కొన్ని హీనకులములయందు మాత్రము, ఒక భర్తను వదలి వేసి మరియొక భర్తను వివాహమాడు ఆచారము కొన్నిప్రదేశములందు స్థిరపడియున్నది. మహారాష్ట్ర దేశమునందు శూద్ర

జాతిలో, భర్త సమ్మతించి వివాహబంధము విమోచనము చేయునట్టి కాగితము వ్రాసియిచ్చినచో, అతని భార్య మరియొకనిని వివాహమాడునట్టి పద్ధతి కలదు. (ఇ. లా. రి. 4 బొం. 330). దక్షిణ కనడా దేశములో లింగాయతు జాతివారిలో భార్యను భర్తవదిలివేసిన యెడల, ఆపె మరల వివాహమాడవచ్చునని మద్రాసు హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 8 మ. 440). వివాహబంధము నివృత్తిచేసికొని స్త్రీలు పునః వివాహము చేసికొనుటయు, వితంతువులు వివాహము చేసికొనుటయు, పలనికొండలపైనుండు కొందలు హీనజాతులవారిలో ఆచారముగా నేర్పడియుండునట్లు మదరాసు హైకోర్టువారు తీరుమానించియున్నారు. (6 మ. హై. 329; ఇ. లా. రి. I మ. 226; ఇ. లా. రి. 17 మ. 479).

విధవా వివాహములు.

**46**. ధర్మశాస్త్రముల ప్రకారము విధవా వివాహములు చెల్లునా చెల్లవా యని నిశ్చయించుటకై అనేక సంవత్సరముల నుండి మహావిద్వాంసులు పెక్కండ్రు గుద్దులాడుచున్నారు. పూర్వకాలమున విధవావివాహములు చెల్లుచుండెననుట కే మాత్రమును సందేహము లేదు. కాని, యిటీవల, కొన్ని కొన్ని హీనజాతులలోతక్క తక్కినజాతులలో ఈ ఆచారము క్రమ క్రమముగా నశించుటవలన, విధవావివాహములు చెల్లవని శ్లోకములు కల్పింపబడి స్మృతులయం దిరికింపబడినవి. అందువలన ఉభయవాదముల వారికిని తగిన యాధారములు ధర్మశాస్త్రములయం దీకాలమున కనబడుచున్నవి. అక్షతయోనికి, అనగా, గర్భాధానమునకుముందే వైధవ్యమును పొందిన కన్యకు మరల వివాహము చేయవచ్చునని మను స్మృతిలో చెప్పబడియున్నది. ఈ న్యాయమును అనేకులు ఒప్పుకొని యున్నారు. ధర్మశాస్త్రము లెట్లున్నను, ఈ కాలమున విధవా వివాహమును

సదాచారముగా భావించి అంగీకరించుటయే శ్రేయస్కరమని అందరికిని తోచియున్నది. కాని, ధైర్యముచేసి ఆచారమును శీఘ్రముగా స్థిరపరుప జాలకయున్నారు.

విధవా వివాహములుచెల్లునా చెల్లవాయను సందేహమును నివర్తించుటకై సర్కారువారు 1856 సం॥ 15 నెం॥ చట్టమును ఏర్పరచియున్నారు. ఏ జాతివారిలోనైనను భర్త చనిపోయిన పిమ్మట భార్య మరల పెండ్లియాడిన యెడల, ఆవివాహము శాస్త్రీయముగా ఎంచబడుననియు, దానివలన గలుగు సంతానము కుల స్త్రీ సంతానముగా భావింపబడుననియు ఈచట్టము చెప్పుచున్నది. (సె. 1). పునర్వివాహముచేసికొన్న విధంతువునకు ప్రథమభర్తయొక్క సొత్తునందు ఏవిధమగు హక్కునునిలువదు. కాని, భర్త మృతిచెందునపుడు, పునర్వివాహము చేసికొనుటకు భార్యకు అనుమతి యిచ్చినయెడల, అతని ఆస్తియందు ఆపెకు గల హక్కునశింపదు. (సె. 2).

**47.** భర్త క్రైస్తుమతములో చేరినపుడు, అతనియొద్దనుండుటకు భార్య సమ్మతించినయెడల, అతడు మరియొకవివాహము చేసికొనుటకు వీలులేదు. భర్తయొద్దనుండుటకు భార్య సమ్మతింపని యెడల, అతడు 6 మాసములు నిరీక్షించియుండి, పిమ్మట 2 రూపాయల స్టాంపుమీద డిస్ట్రిక్టుకోర్టులో పిటిషను దాఖలుచేసి వివాహమును రద్దుపరుచుకొనవచ్చును. అట్లు వివాహము రద్దుపరుపబడిన వెనుక, భర్తయును భార్యయును తమ యిష్టము వచ్చిన వారిని పెండ్లియాడవచ్చును. భర్తకు 16 సం॥ల యీడును భార్యకు 13 సం॥ల యీడును నిండక మునుపు ఈపిటిషను దాఖలు చేయగూడదు. ఇట్లు క్రైస్తుమతావలంబకుల వివాహబంధ నివృత్తి విషయమై యేర్పరుపబడిన 1866 సం॥ 21 నెం॥ చట్టములో చెప్పబడియున్నది.

భార్య క్రీస్తుమత ములో చేరుట.

భార్య క్రీస్తుమతములో చేరినపుడు ఆమెతో కలిసియుండుటకు భర్త యిష్టపడనియెడల, మీాద చెప్పిన ప్రకారమే ఆమె 6 మాసములు నిరీక్షించియుండి పిమ్మట కోర్టులో పిటిషన్ మూలకముగా వివాహము రద్దుపరచుకొని, మరియొకనిని పెండ్లియాడవచ్చును. (డిటో చట్టము).

---

# ప్రకరణము 3.

—:o:—

## పుత్రస్వీకారము.

**48.** మరణానంతరము పుత్రహీనునియాత్మ "పుత్" అను నరకమున బడిపోవుననియు, ఆ నరకమునుండి రక్షించుటకై పుత్రుడు ఆవశ్యకమనియు, అట్లు పుత్ అను నరకమునుండి రక్షించువాడు గనుకనే పుత్రుడు అని పేరువచ్చెననియు, కాబట్టి పుత్రహీనుడైనవాడు తన అపరక్రియలను నడుపుటకే గాక తన వంశాభివృద్ధినిగూడ కోరి అవశ్యము పుత్రస్వీకారమును చేసికొనవలయుననియు, హిందూ ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి.

**49.** ఈ ప్రకరణము ఎనిమిది భాగములుగా విభజింపబడియున్నది—

(1.) పుత్రస్వీకారమును ఎవరు చేసికొనవచ్చును?

(2.) ఎవరు పుత్రస్వీకారము నియ్యవచ్చును?

(3.) ఎట్టివానిని పుత్రునిగా స్వీకరింపవచ్చును?

(4.) పుత్రస్వీకారమునకు విధాయకములగు కర్మలేవి?

(5.) ఎప్పుడు పుత్రస్వీకారమును రద్దుపరచ వచ్చును?

(6.) పుత్రస్వీకారమును ఎట్లు స్థాపింప వచ్చును?

(7.) పుత్రస్వీకారమువలని ఫలితములు.

(8.) కృత్రిమ స్వీకారము వగైరా.

(1) పుత్రస్వీకారమును ఎవరు చేసికొనవచ్చును ?

దత్తుచేసికొనువానికి పుత్ర, పౌత్ర, ప్రపౌత్రు లుండగూడదు.

**50.** పుత్ర సంతానములేని పురుషులందరును పుత్రస్వీకారమును చేసికొనవచ్చును. పుత్ర సంతానమనగా, పుత్ర, పౌత్ర, ప్రపౌత్రులు. వీరిలో ఎవరున్నను ఉత్తరక్రియలు జరుపుటకు సంపూర్ణార్హత గలవారును వారసులును అగుదురుగావున, కుమారుడు లేకపోయినను మనుమడుగాని మునిమనమడుగాని యుండునపుడు దత్తుచేసికొనగూడదని దత్తకమీమాంస దత్తకచంద్రిక గ్రంథములయందు చెప్పబడియున్నది. మరియు, ఔరసుడు (అనగా తనకు బుట్టినకొడుకు) లేకున్నను, దత్తపుత్ర పౌత్ర ప్రపౌత్రులలో నెవ్వరున్నను స్వీకారముకూడదు. ప్రపౌత్రుని కుమారుడు (అనగా మునిమనుమని కొడుకు) మూడుతరములు దాటినవాడగుటవలన, ఉత్తరక్రియలుజరుపుటకు అర్హుడుకాడు. కాబట్టి అట్టివాడున్నను దత్తుచేసికొనవచ్చును. కాని, యీ కాలమున ప్రపౌత్రపుత్రుని కండ్లజూచువరకు జీవించువారు లేరనియే చెప్పవచ్చును. దౌహిత్రుడు (అనగా కూతురుకొడుకు) ఉన్నను, మరియొకనిని దత్తుచేసికొనుటకు అభ్యంతరములేదు. (ఎఫ్. మెక్‌నాటన్ హిందూలా, 149).

ఔరసపుత్ర పౌత్ర ప్రపౌత్రులుగాని, దత్తపుత్ర పౌత్ర ప్రపౌత్రులుగాని ఎవరైనను జీవించియుండునపుడు దత్తు చేసికొనబడినయెడల అది చెల్లనేరదు. మరియు, ఈ చెప్పబడిన వారిలో నెవడైనను బ్రతికియుండగా, అతని సమ్మతితో దత్తుచేసికొన్నను అది చెల్లదు. ఇంతేగాక, అట్లు సమ్మతించినవాడు తర్వాత మృతి చెందిననుగూడ, రెండవవాడు దత్తపుత్రుడు కానేరడు. మొట్టమొదట నిష్ప్రయోజనమైన దత్తు ఏ కారణమువల్లగాని పిమ్మట చెల్లగలది కాజాలదు. (4 మూ. ఇ. అ. 1; 1856 సం॥ మదరాసు తీర్పులు, 20 పేజి ; ఇ. లా. రి. 20 క. 487).

## 3. పుత్ర స్వీకారము

**51.** ఔరసపుత్రుడుగాని దత్తపుత్రుడుగాని పుత్రసంతానము లేక మృతిచెందినయెడల, అతనితండ్రి దత్తుచేసికొనుటకు కేయభ్యంతరమును లేదు. కాని, పుత్రుడు మృతిచెందక జాతిభ్రష్టుడైనయెడల స్వీకారము చేసికొనవచ్చునా యను విషయము కొంచెము ఆలోచనీయమై యున్నది. జాతిభ్రష్టుడైన పుత్రుడు మృతతుల్యుడై అపరక్రియలు జరుపుటకు అయోగ్యుడగును గావున, అతని తండ్రి దత్తు చేసికొనవచ్చుననియే చెప్పవచ్చును. కాని, జాతిభ్రష్టతవలన ఆస్తిహక్కులు నశింపజాలవని 1850 సం॥ 21 నెం॥ చట్టము ఏర్పరుపబడి యుండుటచేత, అట్లు దత్తుచేసికొనబడు పుత్రుడు తండ్రియొక్క స్వార్జితమునకు మాత్రమే హక్కుగలవాడగును. జాతిభ్రష్టుడైన పుత్రుడు నిస్సంతానుడుగా మృతిచెందిన యెడల, అతనికి చెందదగిన పిత్రార్జితపు సొత్తు దత్తపుత్రునికి చేరవచ్చును.

జాతి భ్రంశము చేతగాని, వెఱ్ఱి, తీరనిరోగము మొదలగు కారణముల చేతగాని, పురుష సంతతివారు తన యపరక్రియలు జరుపుట కర్హులు కానియెడల, వారు లేరని యెంచి పుత్రుడు లేనివానివలె దత్తు చేసికొనవచ్చునని సర్ థామస్ స్ట్రేంజి దొరవారు అభిప్రాయపడిరి. (1 స్ట్రేంజి హిందూ లా, 77 పుట).

**52.** ఒక దత్తపుత్రుడు మృతిచెందిన యెడల మఱియొకనిని, అతడు మృతిచెందిన యెడల యింకొకనిని, ఈలాగున ఎన్ని సార్లయినను దత్తు చేసికొనవచ్చును. (4 మూ. ఇ. అ. 1). కాని ఒకటేసారి ఇద్దరు ముగ్గురిని దత్తుచేసికొన్న యెడల వారిలో ఎవని దత్తును చెల్లజాలదు. (ఇ. లా. రి. 12 క. 406, 686; ఇ. లా. రి. 19 క. 513). కాబట్టి, ఇద్దరు సవతులు ఒకటేకాలమున వేర్వేరు పుత్రులను దత్తుగొన్న యెడల, ఏ దత్తును చెల్లదు.

కాని, కాలభేదముండి యితర అంశములలో క్రమముగా నుండిన యెడల, వానిలో ముందు జరిగిన దత్తు చెల్లును.

బ్రహ్మచారులు, భార్యా వియోగను చెందినవారు-వీరు దత్తుగొనవచ్చునా?

**53.** గృహస్థాశ్రమము నవలంబించి సంతానార్హత తప్పిన పిమ్మటనే స్వీకార యోగ్యత సిద్ధించుననియు, కాబట్టి బ్రహ్మచారులును భార్యావియోగము చెందినవారును దత్తుగొనుటకు అర్హతను కలిగియుండరనియు, కొందరూహించిరి. కాని, అట్టి వారివలన జరిగింపబడు స్వీకారములు చెల్లునని తీర్పులు చేయబడి యున్నవి. (2 మ. హై. 367; 4 మ. హై. 270; ఇ. లా. రి. 12 బొం. 329; ఇ. లా. రి. 12 అ. 352).

భార్య గర్భిణియై యుండగా దత్తు గొనవచ్చునా?

**54.** భార్య గర్భిణియై యుండగా చేసికొన్న దత్తు చెల్లదని ఒక కేసులో మదరాసు సదరుకోర్టువారు తీరుమానించి యుండిరి. పుత్రప్రాప్తికి అవకాశముండునపుడు, దత్తు చేసికొనగూడదను అభిప్రాయమువలన అట్లు తీర్పుచేయబడెను. (1860 సం॥ మదరాసు తీర్పులు, 97 పేజి). ఈ అభిప్రాయము సరియైనయెడల, మరణమాసన్నమయ్యెండు వరకు, అథవా, వృద్ధాప్యదశ సిద్ధించువరకు, ఎవరును దత్తుచేసికొనగూడదని యేర్పడుచున్నది. మరియు, తన భార్యమాత్రమేగాక, తన కుమారుని భార్యగాని, మనుమని భార్యగాని, గర్భిణియై యున్నను, దత్తు చేసికొనక నిరీక్షింపవలసి యుండును. ఇట్లు నిరీక్షించి యుండుటయే క్రమమైన చో, ఔరస పుత్రుడు జనించిన యెడల దత్తపుత్రుని కింత భాగ మియ్యవలయునను విధులు ధర్మశాస్త్రములయందును దత్తకమీమాంస దత్తకచంద్రిక మున్నగు గ్రంథములయందును ఏల ఏర్పరుపబడియుండును? ఇట్లని తర్కించి, దరిమిలాను మరియొక కేసులో భార్య గర్భిణియై యుండుట యెరిగియుండి భర్త చేసికొనిన దత్తును మదరాసు హైకోర్టువారు ఖాయ

పరచిరి. ఇ. లా. రి. 3 మ. 180; ఇ. లా. రి. 12 బొం. 105; ఇ. లా. రి. 29 అ. 310).

**55.** కుష్ఠరోగులు, నపుంసకులు, పిచ్చివాండ్రు, పుట్టుక మొదలు అనివార్యమగు గ్రుడ్డితనము మూగతనము చెవుడు - ఈజబ్బులు కలవారు, కాలుసేతులు లేని వికలాంగులు - ఇట్టివారు కూడ దత్తుచేసికొనవచ్చునని దత్తకచంద్రిక మొదలగు గ్రంథములయందు చెప్పబడి యున్నది. కాని, అట్టి కుష్టురోగులు మున్నగువారికి పిత్రార్జితమునం దేమాత్ర హక్కును లేనందున వారి దత్తపుత్రులుగూడ ఆ హక్కులేనివారై తండ్రులవలెనే జీవనాంశమునకు మాత్రము యోగ్యులగుదురు. దత్తు చేసికొన్న తండ్రికి ఏదయినను స్వార్జితపు సొత్తున్న యెడల, అట్టిసొత్తు దత్తపుత్రునికి చెందును. (1857 సం॥ మ. తీ. 210).

కుష్ఠరోగులు, గ్రుడ్డి, మూగ, చెవిటి, వికలాంగులు, ఇట్టి వారు దత్తు చేసికొన వచ్చునా?

పరిశుద్ధి ప్రాయశ్చిత్తమున కర్హతలేని కుష్ఠరోగులకు స్వీకారము గొను యోగ్యత యుండదని కలకత్తా హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 22 క. 843) ప్రాయశ్చిత్తమువల్ల పరిశుద్ధిగాక పూర్వము వేదోక్తకర్మలు నడపుటకు వీలుండదనే కారణమునుబట్టి యిట్లు తీరుమానింపబడెను. కావున, ఈ విధి శూద్రజాతివారికి చెల్లనేరదు. వీరిలో చేసికొనబడు స్వీకారమునకు వైదికకర్మలనావశ్యకమగుటచే కుష్ఠరోగులుగూడ స్వీకారము చేసికొనవచ్చునని తీరుమానింపబడియెను. (ఇ. లా. రి. 28 క. 171).

**56.** దత్తు అనగా ఇట్టిది, దీనివలని ప్రయోజనమిది, యని తెలిసికొనజాలిన జ్ఞానము కలిగినవాడై యుండు నెడల, మైనరు (అనగా యుక్తవయసురాని యతడు) కూడ దత్తుచేసికొనవచ్చుననియు, తాను మృతిచెందిన పిమ్మట దత్తు చేసికొనుటకై భార్యకు అనుజ్ఞగూడ యీవచ్చుననియు బంగాళా బొంబయి హై

మైనరు దత్తు చేసి కొనవచ్చునా?

కోర్ట్లకు వారివలన తీర్పులు చేయబడియున్నవి. ప్రివీకౌన్సిలు వారు కూడ ఈ తీర్పును ఒప్పుకొనియున్నారు. (15 స. 548; ఇ. లా. రి. 15 బొం. 565; ఇ. లా. రి. 1 క. 289; 19 స. 127)

కోర్టాఫ్ వార్డ్స్‌వారి సంరక్షణలోనుండు మైనర్లు, వారి అనుమతిలేక స్వీకారము చేసికొనగూడదు – స్వీకారము విషయమై భార్యకు అధికారమును ఇయ్యగూడదు. అట్టి అనుమతి లేక చేసికొన్న దత్తుగాని యిచ్చిన అధికారముగాని చెల్లనేరదు. (ఇ. లా. రి. 1 క. 289; 9 మూ. ఇ. అ. 287; ఇ. లా. రి. 2 బొం. 529).

భార్య స్వతంత్రించి దత్తు చేసికొనవచ్చునా?

**57.** పుత్రస్వీకారముయొక్క ఆవశ్యకత భర్తదిగాని భార్యదికాదు. కాబట్టి, భార్య యిష్టమును లెక్కింపకయే భర్త దత్తు చేసికోవచ్చును. (4 మూ. ఇ. అ. 2). భర్త యిష్టము లేక భార్య దత్తు చేసికొన్న యెడల, ఆదత్తు చెల్లదు. భార్య తన కొరకై దత్తు చేసికొన్ననుగూడ, మిథిలదేశమునందు తప్ప మరి యెచ్చటను ఆ దత్తు చెల్లదు. మరియు ఆ స్తి విషయమైన యేహక్కును అట్టి దత్తపుత్రునికి కలుగదు. (12 మూ. ఇ. అ. 356). భర్త యిష్టముతోడ భార్య దత్తు చేసికొన్నప్పుడుగూడ ఆ దత్తు భర్తనిమిత్తము చేసికొనబడినట్లు ఎంచవలసినదే గాని, భార్య నిమిత్తము చేసికొనబడినట్లు ఎంచగూడదు.

వితంతువు దత్తు చేసికొనవచ్చునా?— నాల్గు అభిప్రాయములు.

**58.** భర్త మృతిచెందిన పిమ్మట అతని వితంతువు దత్తు చేసికొనవచ్చునా, కూడదా-యను విషయమునుగూర్చి నాలుగు భిన్నాభిప్రాయములు స్థిరపడియున్నవి. “భర్త యనుజ్ఞలేని స్త్రీ పుత్రదానమునకుగాని పుత్రస్వీకారమునకు గాని అర్హురాలు కాదు”— అనెడి వసిష్ఠవాక్యము ననుసరించి యీనాల్గు అభిప్రాయములును పుట్టినవి.

# 3. పుత్రస్వీకారము

మిథిల సంప్రదాయమువారు - పుత్రస్వీకార కాలమున భర్త జీవించియుండి అనుమతి యిచ్చిననే భార్య దత్తుచేసికొనవచ్చునని పైనుదహరింపబడిన వసిష్ఠవచనమున కర్థముచేసిరి. కాబట్టి, మిథిల దేశమునందలి వితంతువు స్వీకారము గొనుట కర్హురాలు కాదు. కాని, కృత్రిమ స్వీకారము చేసికొను ఆచార మేర్పడి యున్నది. ఈ విషయము ఈప్రకరణాంతమున వివరింపబడును.

మహారాష్ట్ర సంప్రదాయమువారు-భర్త జీవించియుండగా చేసికొను స్వీకారమునకు మాత్రమే అతని యనుమతి యావశ్యకముగాని, అతడు మృతిచెందిన పిమ్మట చేయు స్వీకారమునకు ఆవశ్యకముకాదని యర్థముచేసిరి. స్వీకారమనునది భర్తయొక్క ఆత్మోజ్జీవనము నిమిత్తమై చేయబడు కార్యము గనుక స్వీకారము వలదని అతడు స్పష్టముగా చెప్పిపోయినప్పుడుతప్ప తక్కిన సందర్భములయందు అతని యనుమతి యుండునట్లు భావింపవలసినదని యీ సంప్రదాయము వారు సిద్ధాంతపరచిరి. కాబట్టి, బొంబయి ప్రెసిడెన్సీలో, వితంతువు తానే స్వతంత్రించి యెవరి అనుమతియు లేకయే స్వీకారము చేసికొనవచ్చును.

కాశీ సంప్రదాయమువారును బంగాళా సంప్రదాయమువారును - భర్త జీవించియుండగా అతని యనుజ్ఞనుపొందిన పక్షమున అతని యనంతర మతని వితంతువు స్వీకారము జరిగింపవచ్చుననియు, ఇతర సందర్భములందు కూడదనియు, సిద్ధాంతిపరచిరి. (ఇ. లా. రి. 12 అ. 328).

ద్రవిడ సంప్రదాయమువారు - భర్త అనుజ్ఞ యిచ్చిపోయినపుడు మాత్రమేగాక, అతని యనుజ్ఞ లేనపుడు అతని సపిండుల యొక్క, అనగా దాయాదుల యొక్క, అంగీకారముతో వితంతువు దత్తుచేసికొనవచ్చునని సిద్ధాంతపరచి యున్నారు. కాబట్టి, భర్త్రనుజ్ఞ లేకున్నను జ్ఞాత్యంగికారముతో వితంతువు స్వీకారి

మును గొను ఆచారము మదరాసు ప్రెసిడెన్సీ యందును మైసూరు రాష్ట్రమునందును స్థిరపడి యున్నది.

స్వీకారాధికారము - స్టాంపు, రిజిస్ట్రేషను, వగైరా.

**59**. భార్యకు భర్త యొసగు స్వీకారాధికారము ఫలానా విధముగా నుండవలయునని నియామకము లేదు. నోటిమాట మూలకముగానైనను, వ్రాతమూలకముగానైనను ఉండవచ్చును. (7 మూ. ఇ. అ. 54, 64). నోటిమాటవలన అట్టి అధికార మియ్యబడిన యెడల, వివాదము కలిగినప్పుడు రుజువుచేయుటకు తగిన సాక్ష్య ముండవలయును. వ్రాత మూలకముగా స్వీకారాధికార మియ్యబడినప్పుడు 10 రూపాయల స్టాంపు కాగితము మీద వ్రాయబడి రిజిస్టరు చేయింపబడిననే అది చెల్లునుగాని, లేనిపక్షమున చెల్లదు. లిఖిత మూలకమైన ఉయిలువలన ఈ చెప్పబడిన అధికార మియ్యబడినప్పుడు, స్టాంపుగాని రిజిస్ట్రేషను గాని ఆవశ్యకము లేదు. (రిజిస్ట్రేషను ఆక్టు, 17 సె.).

స్వీకారాధికార మిచ్చుటకు భర్త యిష్టమే ప్రధానము. స్వీకారమువలన సమష్టి ద్రవ్యమునకు బాధకము కలుగుననిగాని అన్నదమ్ముల కిష్టముండదనిగాని భర్త విచారింపవలసిన ఆవశ్యకము లేదు.

స్వీకారాధికారము లా ప్రకారము క్రమమైనదిగా నుండవలెను.

**60**. స్వీకారాధికారము లా ప్రకారము క్రమమైనదిగా నుండవలెను. అప్పుడు జీవించియున్న పుత్రుడు మృతిచెందిన యెడల దత్తు చేసికొనవలసినదనిగాని - దత్తపుత్రుడు మృతిచెందినయెడల మరియొకనిని, అతడుగూడ మృతిచెందిన యెడల ఇంకొకనిని, ఈ లాగున ఎన్నిసార్లయినను దత్తు చేసికొనవచ్చునని గాని - అధికార మిచ్చినయెడల, ఆ అధికారము చెల్లును. (10 మూ. ఇ. అ. 279; ఇ. లా. రి. 1 క. 289; ఇ. లా. రి. 1 మ. 174). కాని, కుమారుడు జీవించి యుండగానే దత్తు చేసికొనవలసినదనిగాని, కుమారునికిని తల్లికిని విరోధము కలిగిన

యెడల దత్తు చేసికొనవచ్చుననిగాని, ఒకటేసారి యిద్దరు ముగ్గురిని దత్తు చేసికొనవలసినదనిగాని అధికారమిచ్చినయెడల, అది చెల్లదు. ఆలాగున జరిగించుటకు భర్తకే స్వాతంత్ర్యము లేనపుడు అతడు తనభార్యకధికారమియ్యజాలడనుట స్పష్టమే. మరియు, పుత్రుడు మృతిచెందిన పిమ్మట గూడ దత్తుచేసికొనుటకా యధికారము ముపయోగింపదు. (19 స. 12; 1849 సం॥ బంగాళా సదరు కోర్టు తీర్పులు, 41 పేజీ.)

ఒక భర్తకు ఇద్దరు భార్యలుండిరి. వారిరువురును ప్రత్యేకముగా ఒక్కొక పుత్రుని స్వీకారము చేసికొనునట్లు భర్త అధికారమిచ్చెను. వారిద్దరును దత్తు చేసికొన్నను, లేక వారిలో ఒక భార్య మానుకొని రెండవ భార్యమాత్రమే దత్తు చేసికొన్నను గూడ, అధికారము అక్రమమైనది గావున, దత్తు చెల్లనేరదు. (ఇ. లా. రి. 19 క. 513).

**61.** స్వీకారాధికారమిచ్చునపుడు ఫలానా చిన్నవానిని దత్తు చేసికొనవలసినదని నిష్కర్షచేసి చెప్పవలసిన ఆవశ్యకము లేదు. కాని, ఆ యధికారము ఎంతమట్టున కేవిధముగా నియ్యబడునో ఆప్రకారమే కొంచెముగూడ హెచ్చుతగ్గు లేకుండ స్వీకారమును జరిగింపవలయును. అట్లు జరిగించక యేమాత్రము అతిక్రమించినను, లేక భేదించినను, స్వీకారము చెల్లనేరదు. స్వీకారాధికారము ప్రకారమే దత్తు తప్పక జరుగవలెను.

ఉదాహరణములు—

(1.) ఫలానా చిన్నవానినే దత్తు చేసికొనవలసినదని భర్త అధికారమిచ్చినయెడల, వానినేగాని మరియొక చిన్నవానిని దత్తు చేసికొనగూడదు. ఆ చిన్నవాడు మృతిచెందినను, వాని తలిదండ్రులు దత్తు ఇయ్యక పోయినను, ఊరకుండవలసినదేగాని మరియొకనిని దత్తు చేసికొన్నయెడల, ఆ దత్తు చెల్లనేరదని యేర్పడుచున్నది. [6-వ ఉదాహరణము చూడుడు.]

(2.) మదరాసు ప్రెసిడెన్సీలో, భర్త అనుజ్ఞ లేనప్పుడు అతని సపిండుల అంగీకారముతో వితంతువు దత్తు చేసికొనవచ్చు నుగావున, మొట్టమొదట భర్త అనుజ్ఞతో నొక స్వీకారము చేసికొనబడి ఆ స్వీకారపుత్రుడు మృతిచెందగా సపిండుల అంగీకారముతో మరియొక స్వీకారము చేసికొనబడిన యెడల, అది చెల్లుటకు ఆక్షేపణయుండదని తీరుమానించిరి. ఇట్లు రెండవ తూరి స్వీకారము చేసికొనగూడదని భర్త నిషేధించియుండిన యెడల, కోర్టువారి తీరుమానము భిన్నముగా నుండియుండును. (ఇ. లా. రి. 2 మ. 202.)

(3.) ఒక చిన్నవానిని దత్తు చేసికొనవలసినదని భర్త అధికార మిచ్చినయెడల, ఏ చిన్నవానినైనను దత్తుగొనవచ్చును. కాని, అట్లు దత్తు చేసికొనబడిన పుత్రుడు మృతిచెందిన యెడల మరియొకనిని దత్తుగొనగూడదనియు, ఒకసారి దత్తు చేసికొన్న తోడనే ఆ యధికారము తీరినట్లు ఎంచవలసినదనియు ముందటికాలమున తీరుమానింపబడెను. (12 మూ. ఇ. అ. 356; ఇ. లా. రి. 14 మ. 65). కాని, యిటీవల దీనికి వ్యతిరేకముగా తీరుమానింపబడి యున్నది. పేరు చెప్పిగాని మఱి యేవిధముగా గాని ఫలానాచిన్నవాని నని సూచింపక, చిన్నవాని నిరూపణము భార్య యిష్టమునకే వదిలిపెట్టి, ఒక చిన్నవానిని దత్తుచేసికొనవలసినదని ఆమెకు భర్త అధికారమిచ్చి యుండునప్పుడు, ఆమె ఒకసారి దత్తు చేసికొన్న తోడనే ఆ యధికారము నశింపదనియు దత్తుడు అపత్నీకుడుగను నిస్సంతానుడుగను మృతిచెందినయెడల సదరుఅధికారమునుబట్టి మఱిమఱల స్వీకారము గొనవచ్చుననియు, అట్టి సందర్భమునందు భర్త యుద్దేశము తనకవశ్యము స్వీకారపుత్రుడు ఏర్పడియుండవలెననియే యని భావింపదగు ననియు, మదరాసు హైకోర్టువారు తీరుమానించిరి.

(ఇ. లా. రి. 26 మ. 681). ప్రివీ కౌన్సిలు వారును ఈ తీరుమానమును ఖాయపరచియున్నారు. (ఇ. లా. రి. 29 మ. 382).

(4.) స్వీకారాధికారమిచ్చినపుడు భార్య గర్భిణిగానుండెను. "పుట్టబోవు పిల్లవాడు మృతిచెందిన యెడల దత్తు చేసికొన వలసినది" అని యధికారమిచ్చి భర్త మృతిచెందెను. పిమ్మట కుమార్తె కలిగెను. దత్తు చేసికొనగూడదని తీరుమానించిరి. (1864 సం॥ కలకత్తా హైకోర్టు తీర్పులు - కారిటక్ - 42 పేజి).

(5.) ఉయిలువలన తన యెస్టేటున కేర్పరచిన మేనేజరు సలహాపొంది దత్తు చేసికొన వలసినదని ఒక భర్త తన భార్యకు స్వీకారాధికార మిచ్చెను. ఆ మేనేజరుసలహాను పొందకయే ఆమె దత్తు చేసికొనెను. అట్లు చేసికొనబడినను దత్తు చెల్లునని యు, సదరు సలహా యనునది భార్య మేలుకొరకు ఏర్పరచిన విషయమేగాని, దత్తు రద్దుపరచు తాత్పర్యముతో ఏర్పరచ బడినది కాదనియు, కలకత్తా హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ లా. రి. 18 క. 335). ఇటీవల నొక కేసులో ఒక ఆస్తి దారుడు భార్యకును ఎగ్జిక్యూటర్లకును జాయింటుగా స్వీకారాధికారమిచ్చి మృతిచెందగా, ఎగ్జిక్యూటర్లకిచ్చిన అధికారము చెల్లదు గావున దానితో మిళితమైయుండు కారణముచేత భార్య కిచ్చిన అధికారముగూడ నిరుపయోగమని తీరుమానించిరి. (ఇ. లా. రి. 24 క. 589; ఇ. లా. రి. 25 క. 662; ఇ. లా. రి. 27 క. 996).

(6.) "ఆయ్యాపిళ్లకు రెండవ కుమారుడు కలిగిన యెడల వానిని దత్తుచేసికొన వలసినది" - అని స్వీకారాధికార మియ్య బడెను. కొంతకాలము వేచియుండి మరియొక పిల్లవానిని భార్య దత్తుచేసికొనెను. ఈ దత్తు చెల్లునని పూర్వకాలమున మదరాసు ఛీఫ్ జడ్జిగానుండిన సర్ తామస్ స్ట్రేంజి దొరవారు తీరుమా

నించిరి. (I థామస్ స్ట్రేంజి దొరవారి తీర్పులు, 91). దత్తు చేసి కొనవలెనని యిచ్చి యుండినట్లును, సాధ్యమైన యెడల దత్తపుత్రుడు అయ్యాపిళ్లె కుమారుడుగా నుండవలయుననియు, భర్త యుద్దేశమని స్ట్రేంజి దొరవారు భావించిరి. కాని, మెక్నాటన్ దొరవారు ఈ తీర్పు సరికాదని ఖండించిరి. ఎంతకాలమైనను వేచియుండి అయ్యాపిళ్లెకు రెండవకొమరుకు పుట్టినయెడల వానినే దత్తు చేసికొన వలయుననియు లేకున్న ఊరకుండ వలసినదే యనియు, వారు సిద్ధాంతము చేసిరి. ఇప్పటి కాలమున బొంబయి హైకోర్టువారి తీరుమానములు స్ట్రేంజి దొరవారి అభిప్రాయమును ఉర్జితపరచుచున్నవి. భార్యకు స్వీకారాధికార మిచ్చినప్పుడు ఫలానా చిన్నవానిని దత్తుగొనునట్లు భర్త చెప్పిపోవుట సర్వసామాన్యమైయున్నందున, ఆ చిన్నవాడు మృతి చెందుటవల్లగాని దత్తిచ్చుటకు అతని తలిదండ్రులు సమ్మతింపక పోవుటవల్లగాని సదరు అధికారము నశింపదనియు, అట్టి సందర్భమున మఱియొక చిన్నవానిని దత్తుగొనవచ్చుననియు బొంబయి హైకోర్టువారు తీరుమానించి యున్నారు. ఫలానాచిన్నవానిని దత్తుగొనవలసినదని భర్త అధికారమిచ్చి, ఆచిన్నవాడు తప్ప మఱియొకడు వద్దని నియమింపక యుండునప్పుడు, ప్రథమతః భర్తకు స్వీకారేచ్ఛ యుండునట్లును అతనికి ఎక్కువ యిష్టుడైన చిన్నవానిని సూచించినట్లును కోర్టువారు భావించిరి. (ఇ. లా. రి. 22 బొం 996).

(7.) "బీ" అనువాని కుమారులలో నొకనిని దత్తుచేసికొనునట్లు భార్యకు అనుజ్ఞయిచ్చి "ఏ" యను భర్త మృతిచెందెను. ఆ యనుజ్ఞ యిచ్చినకాలమున "బీ" యనువానికి నలుగురు కుమారులుండిరి. కాని, వారిలో నెవ్వరిని దత్తుగొనక, పిమ్మట చాలకాలమునకు "బీ" యనువానికి గలిగిన మఱియొక

చిన్నవానిని "ఏ" యను వానివితంతువు దత్తుచేసికొనెను. ఈ స్వీకారము చెల్లుననియు, భర్తయొక్క అధికారమును మీరలేదనియు, తీరుమానించిరి. (ఇ. లా. రి. 28 అ. 377).

**62**. తనకు స్వీకారముచేయు విషయమై అధికారము తన భార్యకు మాత్రమే యియ్యవచ్చునుగాని మరియొకరికిచ్చుటకు భర్త యశక్తుడు. తన భార్య మృతిచెంది, వితంతువగు కోడలు మాత్ర ముండిన యెడల, ఆపెకు స్వీకారాధికారమిచ్చు విషయములో కుమారునకు దత్తు చేయవలసినదని యీవచ్చునేగాని, తనకు దత్తుచేయుమని అధికార మియ్యగూడదు. (ఇ. లా. రి. 12 బాం. 185; ఇ. లా. రి. 25 క. 662; ఇ. లా. రి. 27 క. 996). మఱియు, మృతిచెందిన భర్తయొక్క జీవించియుండు అంశముగా వితంతువు భావింపబడుటచేత స్వీకారవిషయమున ఆపె యొక్క యిష్టమును ఆలోచనయు భర్తయొక్క యిష్టము గాను ఆలోచనగాను భావింపబడియుండును. కావున, భర్త యొక్క అధికారము లేకున్నను జ్ఞాతులఅంగీకారముతో స్వీకారముచేసికొనగూడిన దక్షిణ హిందుస్థానమందును, ఎవరివల్లను అధికారము పొందకయే స్వీకారము చేసికొనగూడిన పశ్చిమ హిందుస్థానమందునుగూడ, స్వీకార కార్యము వితంతువువల్ల, జరిగింపబడ వలసినదేగాని యితరులవల్ల జరిగించుటకు వీలు లేదు. (సర్ తామస్ స్ట్రేంజదొరవారి మద్రాసు కేసులనోట్సు, 1-వ వాల్యుం, 103; 10 బా. హై. 241).

**63**. స్వీకారాధికార మియ్యబడిన వితంతువు తప్పక దత్తు చేసికొనవలెనను నిర్బంధము లేదు. ఇష్టమున్న యెడల ఆపె దత్తు చేసికొనవచ్చును. లేకున్న, ఊరకుండవచ్చును. దత్తు చేసి కొన వలసినదని ఆపెను బలవంతపెట్టుటకు వీలులేదు. (7 మూ. ఇ. అ. 190; ఇ. లా. రి. 7 క. 288). బలవంతపెట్టగాని భయ

పెట్టిగాని జరిగించిన దత్తు చెల్ల నేరదు. (ఇ. లా. రి. 13 మ. 214, 220; ఇ. లా. రి. 29 మ. 437 చూడుము.)

భార్య యిష్టమువచ్చి దత్తు చేసికొనువరకును స్వీకారాధికారము లేనియట్లే యెంచబడుటవలన, ఈ లోపల భర్త సొత్తునందు ఆమెకు కలిగియుండు హక్కులకు ఎట్టిబాధకమును కలుగజాలదు. భర్త ఆస్తికి ఆమెయే వారసుగానున్న యెడల, దానిని స్వాధీన పరచుకొని తన హక్కువెంబడి ఆమె స్వేచ్ఛగా అనుభవింప వచ్చును. స్వీకారాధికార మియ్యబడియుండు కారణమువలన ఆమెయనుభవమును అడ్డుపెట్టుటకు వీలులేదు. (7 మూ. ఇ. అ. 169). భర్త ఆస్తికి ఆమె వారసుగానుండక, అది యితరుల స్వాధీనమయిన యెడల, దత్తు చేసికొనువరకును సదరు ఆస్తియందు ఆమె యే భోక్త్యమును కలిగియుండదు. (7 బంగాళా సదరుకోర్టు తీర్పులు, 143).

ఫలానా చిన్నవానిని దత్తుచేసికొని సొత్తంతయు వానికియ్యవలసినదని భర్త ఆజ్ఞాపించి పోయినను, దత్తు మాని, సదరు సొత్తును భార్య తానే అనుభవింపవచ్చును. (ఇ. లా. రి. 12 బొం. 202).

స్వీకారాధికార మియ్యబడిన వితంతువు, తాను స్వీకారము చేసికొననని షరతు వ్రాసి యిచ్చినయెడల, అది చెల్లునా? - యీ విషయము ముఖ్యమై యున్నది. ఇట్టి వివాదము ఒక బొంబయి కేసులో కలిగెను. దత్తు చేసికొనననని షరతు వ్రాసి యిచ్చిన పిమ్మట ఒక వితంతువు స్వీకార ప్రయత్నము జరిగింపగా, ఇంజంక్షను జారీచేసి దత్తు నిలుప వలయునని కోర్టులో పిటిషను దాఖలుచేయబడెను. కోర్టువారు ఇంజంక్షను ఇయ్యజాలమనిరి. కాని, ఆ వివాద మంతటితో ముగియక, తుదివర

కును దావా జరుపబడినయెడల, దత్తు స్థిరపడి యుండునో లేదో చెప్పజాలము. (ఇ. లా. రి. 13 బొం. 56).

**64.** స్వీకారాధికారమును బట్టి యింతకాలము లోపల దత్తు చేసికొనవలసినదని నిర్బంధములేదు. ఒక బంగాళా కేసులో భర్త మృతిచెందిన 15 సం॥లకు చేసికొనబడిన దత్తును కోర్టువారు అంగీకరించిరి. కొన్ని బొంబయి కేసులలో భర్త మృతిచెందిన 20, 25, 52, 71 సం॥లకు చేసికొన్న స్వీకారములు గూడ అంగీకరింపబడెను. (4 బొం. హై. 191; ఇ. లా. రి. 9 బొం. 58). కాని, స్వీకారాధికార మిచ్చిన యతని ఆస్తి, మరి యొకరికి - అనగా, స్వీకారాధికారము పొందిన భార్యకుగాక మరియెవరికైనను - చేరిపోయిన పక్షమందు, అంతటితో ఆ స్వీకారాధికారము నశించుననియు, దానిననుసరించి యటుపిమ్మట దత్తుచేసికొన్న యెడల చెల్లదనియు, ప్రివీకౌన్సిలువారు తీరుమానించి యున్నారు. (10 మూ. ఇ. అ. 279; ఇ. లా. రి. 10 మ. 205; ఇ. లా. రి. 17 క. 122). ఉదాహరణములు:-

(I.) కుమారుడు మృతిచెందినయెడల దత్తు చేసికొనవలసినదని ఒక పురుషుడు తన భార్యకు అధికారమిచ్చెను. పిమ్మట ఆ కుమారుడు వివాహము చేసికొని నిస్సంతానుడై మృతిచెందిన కారణమువలన అతని యాస్తియంతయు శాస్త్రరీత్యా అతనిభార్యకు చేరెను. తరువాత, స్వీకారాధికారమును పొందిన అత్తగారు దత్తు చేసికొనెను. ఈ దత్తు చెల్లదనియు, కోడలికి ఆస్తిచెందిన వెంటనే వెనుకటి స్వీకారాధికారము నశించెననియు, కోడలు మృతిచెందిన పిమ్మట ఆమె యనుభవములోనున్న ఆస్తి ఆమె భర్తయొక్క దాయాదులకే చెందునుగాని దత్తపుత్రునికి చెందదనియు, ప్రివీకౌన్సిలువారు తీరుమానించిరి. (10 మూ. ఇ. అ. 279; ఇ. లా. రి. 17 క. 122). ఈ తీరుమా

నము ననుసరించి, ఒక కేసులో కుమారుడు నిస్సంతానుడుగా మృతిచెంది ఆస్తి అతనిభార్యకు చెందినపిమ్మట అతనితల్లి తన భర్త సపిండులయొక్క అనుమతితో స్వీకారము చేసికోగా అది చెల్లజాలదని మదరాసు హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 10 మ. 205).

(2.) ఈ చెప్పబడిన కేసులో అత్త జీవించియుండగానే కోడలు మృతిచెందిన యెడల, ఆస్తి యంతయు శాస్త్రరీత్యా అత్తకు - అనగా భర్త తల్లికి - చెందుచున్నది. అప్పుడుగూడ ఆమె తాను పొందిన స్వీకారాధికారమునుబట్టి దత్తు చేసికొనగూడదు. ఏలనంటే — ఆస్తి యెప్పుడు కోడలి స్వాధీనమయ్యెనో అప్పుడే ఆ స్వీకారాధికారము నశించెను. (10 మూ. ఇ. అ. 279; ఇ. లా. రి. 10 మ. 205; ఇ. లా. రి. 17 క. 122).

(3.) ఈ చెప్పబడిన కేసులో కుమారుడు పెండ్లి చేసికొనుటకు మునుపే మృతిచెందుటవలన గాని, పెండ్లి చేసికొన్నను ముందుగా భార్య గతించి పిదప తాను నిస్సంతానుడై మృతి చెందుటవలనగాని, అతని ఆస్తి తల్లికి చేరినయెడల - సదరు అధికారము ననుసరించి ఆమె దత్తు చేసికొనవచ్చును. (10 మూ. ఇ. అ. 311; 22 స. 121; ఇ. లా. రి. 27 బొం. 492).

(4.) బొంబయి ప్రెసిడెన్సీలో భర్తయొక్క అనుమతి లేకయే స్వీకారముచేసికొను స్వాతంత్ర్యము వితంతువునకు కలిగి యున్నను, మీద చెప్పబడిన 1, 2 ఉదాహరణములయందువలె భర్తయొక్క ఆస్తి ఇతరుల వశమైనయెడల, వెంటనే స్వీకార స్వాతంత్ర్యము నశించును. కాబట్టి, అటు పిమ్మట ఆమె దత్తు చేసికొనగూడదు. (ఇ. లా. రి. 6 బొం. 498; ఇ. లా. రి. 9 బొం. 94; ఇ. లా. రి. 17 బొం. 164). కుమారుడు మృతి చెంది ఆస్తి కోడలికి చెందినపిమ్మట, కోడలును అత్తగారునుగూడ స్వీ

కారములు చేసికొనిరి. కోడలు చేసికొన్న స్వీకారము చెల్లునని యు అత్త చేసికొన్న స్వీకారము చెల్లదనియు తీరుమానించిరి. (ఇ. లా. రి. 19 బొం. 331; ఇ. లా. రి. 23 బొం. 331; ఇ. లా. రి. 25 బొం. 306; ఇ లా. రి. 7 బొం. 225; ఇ. లా. రి. 11 బొం. 397). కుమారుని ఆస్తి ముందుగా కోడలికి చెంది ఆపె యనంతరము అత్తకు - అనగా ఆపెభర్త తల్లికి - వారసురీత్యా చెందినప్పుడు గూడ, అత్తగారు స్వీకారము చేసికొనగూడదని తీరుమానించిరి. (ఇ. లా. రి. 26 బొం. 526). ఆలాగుననే భర్త యొక్క ఆస్తిగాక భర్తయొక్క సోదరుల ఆస్తిని గోత్రజసపిండు రాలుగా పొందినప్పుడును వితంతువునకు స్వీకారార్హత యుండ దని తీరుమానించిరి. (ఇ. లా. రి. 32 బొం. 499).

**65.** భార్యకు స్వీకారాధికార మిచ్చిన పిదప భర్త తానే దత్తు చేసికొన్న యెడల, సదరు అధికారము రద్దుచేయబడినట్లు ఎంచవలెను. తరువాత దత్త పుత్రుడు మృతిచెందినను గూడ ఆ యధికారమునుబట్టి దత్తు చేసికొన గూడదు. (ఎస్. మెక్నాటన్ హిందూ లా, 81). స్వీకారాధికారము రద్దగుట, మరి యుం[illegible]

ఒక దత్తపుత్రుడు మృతిచెందినయెడల మరియొకనిని, అతడు మృతిచెందిన యెడల యింకొకనిని, ఇట్లు ఎన్నిసార్లయినను దత్తు గొనునట్లు భర్తవలన స్వీకారాధికార మియ్యబడి యున్నను, ఏదత్తపుత్రుడుగాని మృతిచెందిన కాలమున అతనికి వితంతువు ఉండినయెడల, వారసురీత్యా ఆస్తి ఆపెకు చేరును గనుక, పైన చెప్పిన స్వీకారాధికార మంతటితో ముగిసినట్లు భావింపబడును. (10 మూ. ఇ. అ. 279, ఇ. లా. రి. 8 క. 302, ఇ. లా. రి. 9 బొం. 94, ఇ. లా. రి. 17 క. 122 — యీ తీర్పుల ననుసరించి ఇ. లా. రి. 32 క. 861). పై సందర్భములో దత్తపుత్రుడు అవివాహి తుడుగా మృతిచెందినప్పుడును అతడు మృతిచెందిన కాలమున

వితంతువు చేసప్పుడును సదరు స్వీకారాధికారము ఉపయోగపడు ననియు తీరుమానింపబడి యున్నది.

సైనరు వితంతువు దత్తు చేసికొనవచ్చునా?

**66** స్వీకారము భర్త నిమిత్తమై చేయబడు కారణము వల్ల, భార్య అతని యేజెంటుగా భావింపబడుచున్నది. కాబట్టి, స్వీకారాధికారము పొందిన వితంతువు మైనరుగానున్నను గూడ ఆమె దత్తు చేసికొనవచ్చును. (ఇ. లా. రి. 18 క. 69). బొంబయి ప్రెసిడెన్సీలో వితంతువు స్వతంత్రించి స్వీకారము చేసికొనగూడిన హేతువుచేత, వయసురాక మునుపు - అనగా 16 సంవత్సరముల యీడులోపల - ఆమె దత్తు చేసికొనరాదని చెప్పుచున్నారు.

వ్యభిచారిణియగు వితంతువు దత్తుచేసికొనవచ్చునా?

**67**. భర్త అనుజ్ఞ పొందినదయ్యును వ్యభిచారిణియగు వితంతువు దత్తు చేసికొనుటకు అర్హురాలు కాదనియు, వ్యభిచార దోషమువలన స్వీకారమునకు ప్రధానమగు వైదిక కర్మలను జరిగించుటకు యోగ్యత తప్పిపోవుననియు, కలకత్తా హైకోర్టువారు తీరుమానించి యున్నారు. (5 క. హై. 362). వ్యభిచార దోషమును ప్రాయశ్చిత్తమువలన బోగొట్టుకొని పిమ్మట దత్తు చేసికొనవచ్చుననియు, గర్భిణిగానున్న స్త్రీ ప్రాయశ్చిత్తమున కర్హురాలు కాదనియు చెప్పుచున్నారు. (5 క. హై. 362; 13 క. హై. 39). శూద్రులలో స్వీకారమునకు వైదికకర్మలావశ్యకము కానందున వ్యభిచారిణియగు శూద్రజాతి వితంతువు స్వీకారము చేసికొనవచ్చునా? - యీ విషయము ఆలోచనీయమై యున్నది.

సకేశయగు వితంతువు దత్తుచేసికొనవచ్చునా?

**68**. బొంబయికోర్టువారి యెదుట ఒక కేసులో, సకేశయగు వితంతువు చేసికొనిన స్వీకారము చెల్లదని వాదింపబడెను. కాని, స్వీకారమునకు పూర్వము, ఆమె కొందరు పండితుల యభిప్రాయమును పొంది ఆ యభిప్రాయము ప్రకారము

కేశదోష పరిహారార్థము కొన్ని దానములు సమర్పించినట్లు రికార్డువలన కనుపడినందున, కేశదోష విషయమైన వాదమును కోర్టువారు అంగీకరింపరైరి. (ఇ. లా. రి. 11 బొం. 381,392). పిమ్మట నొక కేసులో కేశదోష పరిహారార్థమైన ప్రాయశ్చిత్తము ఒక వైదికకర్మగా భావింపవలసినదేగాని స్వీకారమునకు ప్రధానమైనట్లు ఎంచగూడదని తీరుమానించిరి. (ఇ. లా. రి. 22 బొం. 590).

**69**. ఒక భర్తకే యిద్దరు ముగ్గురు వితంతువు లున్నపుడు, వారిలో నెవరికి అతడు స్వీకారాధికార మిచ్చిపోయెనో ఆమె మాత్రమే దత్తు చేసికొనవచ్చును. అందరు భార్యలకును ప్రత్యేకముగా స్వీకారాధికార మియ్యబడియుండి, జ్యేష్ఠ భార్య దత్తు గొనక నిరాకరించినయెడల, ఆమె సమ్మతి గొనకయే రెండవ భార్య దత్తు చేసికొనవచ్చును. (ఇ లా. రి. 18 క. 69). బొంబయి ప్రెసిడెన్సీలో జ్యేష్ఠ భార్య, రెండవ భార్య అనుమతి లేకయే దత్తు చేసికొనవచ్చును. కాని, జ్యేష్ఠురాలి యనుమతి గొనక రెండవ భార్య దత్తు చేసికొనగూడదు. జ్యేష్ఠ భార్య వ్యభిచారిణియై కులభ్రష్టురాలగుట వలన ఆమెకు స్వీకారాధికారము తప్పిపోయినయెడల, ఆమె యనుమతి లేకయే రెండవభార్య దత్తు చేసికొనవచ్చును. (5 బొం. హై. 181 ; ఇ. లా. రి. 13 బొం. 160).

ఒక భర్తకే యిద్దరు ముగ్గురు వితంతువు లున్నపుడు ఎవరు దత్తు చేసికొనవచ్చును?

భర్తయొక్క ఆస్తికి హక్కుదారురాలుగా నున్నప్పుడే జ్యేష్ఠభార్యకు పైన చెప్పబడిన స్వీకారస్వాతంత్ర్యము కలదుగాని యితర సందర్భము లందుండజాలదు. ఒక బొంబయి కేసులో ఆస్తిదారుడు మృతిచెందినప్పుడు ఇద్దరు భార్యలును రెండవభార్య వలన కుమారుడును ఉండిరి. పిమ్మట కుమారుడు మృతిచెందగా ఆస్తికి రెండవ భార్య హక్కుదారురాలాయెను. అంతట జ్యేష్ఠ భార్య రెండవ భార్య అనుమతిని పొందకయే స్వీకారము చేసి

కొనగా అది చెల్లజాలదని తీరుమానించిరి. (ఇ. లా. రి. 28 బొం. 461). రెండవభార్య అనుమతితో చేసికొన్నను గూడ సదరు స్వీకారము చెల్లజాలదనియే తేటపడుచున్నది.

ఇద్దరు వితంతువులకు జాయింటుగా స్వీకారాధికార మియ్యబడిన యెడల, అది వారికి ప్రత్యేకముగా నియ్యబడినట్లే భావింపబడును గనుక, వారిలో నొకరు మృతిచెందుటవలన ఆ యధికారము నశింపదు. (ఇ. లా. రి. 29 మ. 437).

భర్తయొక్క అనుజ్ఞ లేకున్నను, అతని సపిండుల యంగీకారముతో దక్షిణహిందుస్థానమున వితంతువు దత్తు చేసికొన వచ్చును.

**70**. భర్తయొక్క అనుజ్ఞ లేకున్నను అతని సపిండుల యంగీకారముతో దక్షిణహిందూస్థానమున వితంతువు దత్తు చేసికొనవచ్చును. సపిండుల యంగీకారమన్నప్పుడు, ఎవరో ఒక దూరపు జ్ఞాతి యొక్క అనుమతిచాలదు. కుటుంబము అవిభక్తమై యుండు నెడల వితంతువు మామగారి అనుమతి ముఖ్యము. ఆయనయొక్క అనుమతి మాత్రమే చాలును. మామగారు మృతిచెందిన యెడల, భర్తయొక్క అవిభక్తసోదరుల యనుమతి ఆవశ్యకము. కుటుంబము విభక్తముగా నుండునపుడు సమీప జ్ఞాతులలో కొందరి యనుమతి మాత్రమే చాలును. అందరు జ్ఞాతుల యనుమతియును ఆవశ్యకము కాదు. భర్త మృతిచెందునపుడు కుమారుడు జీవించియుండి పిదప అతడు సంతానహీనుడుగా గతించిన సందర్భమునందు గూడ, ఇతని తల్లి జ్ఞాత్యంగీకారముతో దత్తు చేసికొనవచ్చును. దత్తు చేసికొనుట తన కిష్టము లేనట్టు భర్త చెప్పిపోయిన యెడల, లేక సూచించిపోయిన యెడల, జ్ఞాత్యంగీకార మున్నను స్వీకారము చేసికొనగూడదు. ఈ అంశములన్నియు ఈ దిగువ వివరింపబడు కేసులలో స్థాపింపబడినవి. (12 మూ. ఇ. అ. 397; ఇ. లా. రి. 1 మ. 69; ఇ. లా. రి. 1 మ. 174; ఇ. లా. రి 23 మ. 486).

**71.** "రామనాథపురం కేసు"– ఈ కేసులో భర్తయొక్క ప్రత్యేకాస్తియగు జమీందారీకి వారసురాలుగా నేర్పడిన వితంతువు, అతని జ్ఞాతులలో చాలమంది యనుమతిమీద దత్తు చేసికొనెను. ఈ దత్తును ఖాయపరచుచు, దక్షిణ హిందూస్థానమునందు భర్త్రాజ్ఞలేనపుడు అనుజ్ఞయియ్యగల జ్ఞాతులెవ్వరు అను విషయమును ప్రివీకౌన్సిలువారు సంపూర్ణముగా చర్చించిరి. వారి జడ్జిమెంటులోని సారాంశము లేమనగా:— "రామనాథపురం కేసు."

(1.) అవిభక్త కుటుంబ విషయములో – వితంతువుయొక్క మామగారు సజీవుడై యున్నయెడల, కుటుంబమునకు యజమానియు వితంతువునకు రక్షకుడు నగుటచే, అతనియొక్కని అనుమతియే చాలును. మామగారు మృతిచెందినయెడల, భర్తయొక్క అవిభక్త సోదరులందరును సమ్మతించవలసి యుండును. దత్తువలన వీరి భాగములకు బాధకము కలుగుటవలన, వీరి యనుమతి యుండవలెననుట న్యాయముగా యున్నది.

(2.) విభక్త కుటుంబ విషయములో జ్ఞాత్యంగీకార ముండవలెననుట హిందూ స్త్రీలకు స్వతంత్ర వృత్తిలేని కారణమువల్లనేగాని, భాగస్థుల హక్కునకు భంగము కలుగునను కారణమువల్ల కాదు. వితంతువుయొక్క మామగారు సజీవుడై యున్నయెడల, కుటుంబమున కంతకు పెద్దతల గనుక, అతనియొక్కని అనుమతియే చాలును. (ఇ లా. రి. 15 బొం. 510 లో ఈ అభిప్రాయము వెంబడి తీరుమానింపబడెను). మామగారు లేనియెడల, ఎంత దూరపు వారైనను అందరు జ్ఞాతులును సమ్మతింపవలసిన పనిలేదు. కాని, దురుద్దేశముతో గాక తన భర్తయొక్క ఆత్మోజ్జీవనమును కోరి వితంతువు దత్తు చేసకొనునట్లు కనుపించదగిన జ్ఞాత్యంగీకారము ఆవశ్యకము. ఈ అంశము ఆయా సంగతి సందర్భములనుబట్టి ఆలోచింపవలసి యుండును.

(3.) స్వీకార మనునది భర్తయొక్క క్షేమము నిమిత్తమైన కార్యము గావున, అతఁడు అనుజ్ఞ యియ్యక మృతిచెందినను అతనికి ఇష్టముగానే యుండుననుతాత్పర్యముచేత జ్ఞాత్యంగీకారముతో జరిగింపవచ్చునని ఆచారము స్థిరపడి యున్నది. కాబట్టి, స్వీకారము తనకిష్టము లేదనిగాని వద్దనిగాని భర్త స్పష్టముగా చెప్పిపోయినప్పుడును, ఆస్తియంతయు వారివారికి పంచిపెట్టి పోవుటవలనగాని ఇతర కారణములవల్లగాని భర్తకు స్వీకారేచ్ఛ లేనట్లు కనుపడు నప్పుడును, అతని వితంతువు జ్ఞాత్యంగీకారమును బడసి దత్తు చేసికొనగూడదు. చేసికొన్న యెడల చెల్ల నేరదు. ("రామనాధపురపు కేసు" — 2 మ. హై. 206; 12 మూ. ఇ. అ. 397).

(4.) ఇటీవల నొక మద్రాసు కేసులో ఒక వితంతువు ఏక పుత్రుఁడుగానున్న చిన్నవానిని దత్తుచేసికొనెను. ఏకపుత్రస్వీకారము లాప్రకారము చెల్లుచున్నను ధర్మశాస్త్ర నిషిద్ధమై దోషావహమైనదిగావున, అట్టి స్వీకారమునకు భర్తయొక్క అనుమతి యుండునట్లు భావింపరాదనియు, ఈ హేతువుచే అట్టి స్వీకారమునకు సపిండులయంగీకారము వినియోగించదనియు, వాదింపబడెను. కాని, ఆ వాదమును సమ్మతింపక, సపిండుల అనుమతితో జరిగించిన ఏకపుత్రస్వీకారము చెల్లుననియు, స్వీకార విషయమున భర్తకుగల స్వేచ్ఛ స్వాతంత్ర్యములు సపిండుల యనుమతిని పొందిన వితంతువునకుగూడ గలుగుననియు తీరుమానించిరి. (ఇ. లా. రి. 22 మ. 398).

"త్రావన్కూరు కేసు." **72.** "త్రావన్కూరు కేసు"— ఈ కేసులో నొక వితంతువు, తన భర్తయొక్క అవిభక్త సోదరుని యనుమతిని పొందక, విభక్తులగు కొందరు జ్ఞాతుల యంగీకారమును బడసి దత్తు చేసికొనెను. రామనాధపురపు కేసులో ప్రివీకౌన్సిలువారు చేసిన తీర్పు

ను సాకల్యముగా పరిశీలించి త్రావన్కూరు హైకోర్టువారు ఈ దత్తును రద్దుపరచిరి. హిందూ ధర్మశాస్త్రములనుబట్టి ఆమరణా మును హిందూ స్త్రీలకు స్వాతంత్ర్యము లేదనియు, మొదట తండ్రియు పిదప భర్తయు భర్త్రనంతరము కుటుంబయజమా నియు సంరక్షకులగుదురనియు - భర్త్రనుజ్ఞలేక దత్తుచేసికొను విషయములో వితంతువునకు జీవనాంశము జరుపుటకును ఆపె కుమార్తెలకు పెండ్లి పేరంటములు చేయుటకును బద్ధుడగు కుటుంబయజమాని యెవ్వడో అతని యనుజ్ఞ ఆవశ్యకముగావున, మామగారు సజీవుడై యున్న యెడల ఆయన అనుమతింపవలె ననియు, ఆయన లేనియెడల భర్తయొక్క సోదరులలో జ్యేష్ఠుడు అనుమతింప వలెననియు - చీఫ్ జడ్జిగారు తీర్పుచేసిరి. ఈతీర్పు ప్రివీకౌన్సిలు వారివలన మిక్కిలి ఆదరింపబడుచున్నది. (8 మదరాసు జూరిస్టు, 58).

**73.** "బరంపురం కేసు" — ఈ కేసులో చినఖిమిడి జమీం 'బరంపురం కేసు' దారుడు మృతిచెందినకాలమున, అతని వితంతువును, ఒక అవిభక్త సోదరుడును, విభక్తుడైన యొక దూరసపిండుడును — ఈ ముగ్గురుమాత్ర ముండిరి. వేరు సపిండు లెవ్వరును లేరైరి. ఈ చెప్పబడిన దూరసపిండుడు పెద్దఖిమిడికి జమీందారుడుగానుం డెను. వితంతువు దత్తు చేసికొనని పక్షమున ఆపె మరదియే చినఖిమిడిజమీందారీకి వారసుగా నుండెను. ఇట్టి సందర్భమున, ఆవితంతువు అవిభక్తుడగు తన మరది యనుమతినిగొనక, విభక్తసపిండుడగు పెదఖిమిడి జమీందారుగారి కుమారుని దత్తుగొనెను. ఈ దత్తును రద్దుపరచుటకు తేబడిన దావాలో - (1) భర్తవలన లిఖిత మూలకమగు స్వీకారాధికార మియ్యబడి యుండునట్లును, అదిగాక (2) భర్తయొక్క సపిండుడగు పెద్ద ఖిమిడి జమీందారు సమ్మతించి తన కుమారుని దత్తిచ్చినందున,

భర్త్రనుజ్ఞ లేకున్నను స్వీకారము చెల్లదగిన జ్ఞాత్యంగీకార ముండెననియు, వాదింపబడెను. డిస్ట్రిక్టు కోర్టువారు ఈ రెండు అంశములను వితంతువునకు విరోధముగా తీర్మానించిరి. అప్పీలులో మదరాసు హైకోర్టువారు, భర్తవలన ఇయ్యబడి నట్లు చెప్పబడిన స్వీకారాధికార పత్రిక నిజమైనదిగా నమ్మి దత్తు స్థిరపరచిరి. ఇంతేగాక, అట్టి స్వీకార పత్రిక లేకున్నను, దత్తిచ్చిన పెద్దఖిమిడి జమీందారుగారు భర్తయొక్క సపిండుడై యున్నందున, స్వీకారమునకు వలయు జ్ఞాత్యంగీకార ముండెననియు, అట్టి యంగీకారము ఒక్క సపిండుడు మాత్రమే యిచ్చినను చాలుననియు, అతడు సమీప సపిండుడుగా నుండవలసినది ఆవశ్యకము కాదనియు, వక్కాణించిరి. దీనిపై అప్పీలులో ప్రివికౌన్సిలువారుగూడ భర్తవలన ఇయ్యబడిన స్వీకారాధికారమును నమ్మి దత్తు ఖాయపరచిరి. కాని, హైకోర్టువారి తీర్పులో జ్ఞాత్యంగీకారము విషయమైన భాగమును ఖండించి రెండు ముఖ్యాంశములను స్థిరపరచిరి. అవి యేవనగా—(1.) అవిభక్త కుటుంబమునందలి వితంతువుచే జరిగింపబడు స్వీకారమునకువలయు జ్ఞాత్యంగీకారము, త్రావన్కూరు కేసులో తీర్పు చేయబడిన ప్రకారము ఆ కుటుంబమునందుండియే యీయబడవలెను గాని, ఎవరో ఒక దూరపుజ్ఞాతివలన ఇయ్యబడిన యెడల, చాలదు. (2.) వితంతువునకు స్వీకారము విషయమై భర్తయొక్క సపిండులిచ్చు అంగీకారమనునది - భర్తవలన ఆమెకు స్వీకారాధికారమియ్యబడి యుండలేదనియు, ఆమె స్వీకారము చేసికొనుట ఆవశ్యకమనియు ఉచితమనియు, ఇట్టి నమ్మికతో వారివల్ల ఇయ్యబడి యుండవలెను. అట్టి నమ్మికతో ఇయ్యబడని యంగీకారము చెల్లనేరదు. ఈ బరంపురం కేసులో, పెదఖిమిడి జమీందారుగారు తన కుమారుని దత్తిచ్చినపుడు, దత్తుచేసి

కొన్న వితంతువునకు ఆమె భర్త యిచ్చిన స్వీకారాధికారముండె నని నమ్మెనుగాని, భర్తనిచ్చిన లేని వితంతువునకు తాను అనుజ్ఞ యిచ్చునట్లు తలంచియుండలేదు. కాబట్టి, అతడు సమీపజ్ఞాతిగా నుండినను గూడ, ఈ కేసులో చేసికొనబడిన స్వీకారమునకు జ్ఞాత్యంగీకారము లేనట్లే ఏర్పడును. ("బరంపురం కేసు" – ఇ. లా. రి. I మ. 69).

**74**. ఈ చెప్పబడిన కేసులో ప్రివీకౌన్సిలువారి తీరుమాన మును బట్టి చూడగా, భర్తవల్ల స్వీకారాధికార మియ్యబడెనని యు, అది నమ్మకముగా కనుపడని యెడల జ్ఞాత్యంగీకార ముండె ననియు, ఈ రెండువిధములను ఒకటే కేసు విషయమై వాదించు టకు సాధ్యముకాదు. కనుకనే, దరిమిలాను ఒక కేసులో భర్త వలన స్వీకారాధికార మియ్యబడినట్లు చెప్పి అతని యవిభక్త సోదరుని యంగీకారమునుకూడ బడసి ఒక వితంతువు దత్తు చేసి కొన్న పిమ్మట, భర్త యధికార మిచ్చెనను విషయము అబద్ధ మైనట్లు ఏర్పడగా, ఆ దత్తు చెల్లదని మదరాసు హైకోర్టువా రు తీరుమానించిరి. సదరు దత్తు, భర్తయొక్క అవిభక్త సో దరుని యంగీకారముతో చేసికొనబడినను, ఈ యంగీకార మును నది భర్తయొక్క అనుజ్ఞ యున్నదను నమ్మికతో ఇయ్యబడినది గావున, చెల్లజాలదని వక్కాణించిరి. (ఇ. లా. రి. 2 మ 270; ఇ. లా. రి. 8 మ. 845; ఇ. లా. రి. 30 మ. 50).

**75**. 'గుంటూరు కేసు' (ఇ. లా. రి. 1 మ. 174) – ఈ కేసు లో, ఒక జమీందారుడు గతించినప్పుడు, అతనికి వితంతువును కుమార్తెలును ఒక మైనరు కుమారుడును ఉండిరి. జమీందారీ ఆస్తి కుమారునిదయ్యెను గాని, అతడు వివాహము చేసికొనక మునుపే మృతిచెందుటవలన, సదరు ఆస్తి అతని తల్లికి చేరెను. అటు పిమ్మట, ఆమె తన భర్తయొక్క సపిండులైనవారి అందరి

యనుమతితో ఒకచిన్నవానిని దత్తుగొని, అతని తరఫున గార్డి యనుగా సదరు ఆస్తిని కాపాడుచుండెను. ఆపె మృతిచెందిన పిమ్మట చిక్కులు కలిగెను. గవర్నమెంటువారు ఆపె దత్తు చేసికొన్న చిన్నవాని హక్కును అంగీకరింపక, ఆస్తిని కుమార్తెల వశము చేసిరి. అందుమీద దత్తపుత్రుడు దావా తేగా, దత్తు చెల్లదని మదరాసు హైకోర్టువారు తీరుమానించిరి. భర్త యొక్క ఆత్మోజ్జీవనమునకు వలయు ఉత్తరక్రియలు నెరవేర్చి అతనికి మేలుచేయవలెనను ఉద్దేశముతో వితంతువువలన సదరు దత్తుచేసికొనబడినట్లు కనుపడలేదనియు, అందుచేత సపిండుల అనుమతియున్నను దత్తు చెల్లదనియు, వారు తెలిపిరి. ప్రివీ కౌన్సిలువారు, ఈ తీరుమానమును త్రిప్పివేసి దత్తును ఖాయపరచుచు, దత్తు చేసికొన్న వితంతువుయొక్క ఉద్దేశమును ఊహింప బూనుట మిగుల మోసకరమనియు - భర్తయొక్క క్షేమమునిమిత్తము స్వీకారము ఆవశ్యకమనితలంచి యియ్యబడిన జ్ఞాత్యంగీకారముతో ఒక వితంతువు దురుద్దేశము లేకుండ దత్తుచేసికొన్నయెడల, ఆపెయొక్క మనోభావ మెట్టిదో, స్వీకారము వలన భర్తయొక్క ఆత్మకు మేలుకలుగునని ఆపె నమ్మెనో లేదో, యీ విషయము విచారింప గూడదనియు - వారు స్పష్టముగా తెలిపిరి. ఈ యభిప్రాయము ననుసరించి, వితంతువుయొక్క మనోభావమును విచారించుట అనావశ్యకమని బొంబయి హైకోర్టువారు తీరుమానించి యున్నారు. (ఇ. లా. రి. 15 బొం. 134, 565; ఇ. లా. రి. 22 బొం. 199, 206, 558).

పుత్రసంతతి లేనప్పుడు మాత్రమే గాక, ఉండి మృతిచెందినప్పుడుగూడ జ్ఞాత్యంగీకారమును బడసి వితంతువు దత్తు చేసికొనవచ్చును - ఈ విషయముగూడ, "గుంటూరు కేసు" వలన స్థాపింపబడియున్నది.

## 3. పుత్రస్వీకారము

**76.** స్వీకారము నిమిత్తమై వితంతువునకు ఇయ్యబడు స్వీకృత్యంగీకారము దగావల్లగాని దుష్టోపాయముల వల్లగాని పొందబడినప్పుడును, సదరు అంగీకార మిచ్చిన సపిండులు స్వలాభము నుకోరి యిచ్చినప్పుడును, అది చెల్లదు. (ఇ. లా. ి. 2 మ. 270, 202). దురుద్దేశము రుజువుకానప్పుడు సపిండుల అంగీకారము సదుద్దేశముతో నియ్యబడినట్లే భావింపబడును. (ఇ. లా. ి. 23 మ. 486). దురుద్దేశము.

భర్తయొక్క విభక్త సపిండులు అనేకులుండి, వారిలో కొందరు దురుద్దేశమువలన స్వీకారమున కంగీకరింపక యున్న యెడల తక్కినవారి యనుమతియే చాలును - ఒక్కడే యనుమతించినను చాలును - అని మదరాసు హైకోర్టువారు తీర్మానించిరి. (ఇ. లా. ి. 2 మ. 202). కాని, యీ అంగీకారము నిమిత్తము వితంతువు తన భర్తయొక్క ప్రతి సమీప సపిండుని — అనగా ఒకటే తరగతిలో చేరిన ప్రతి సమీప సపిండుని — అడుగుట ఆవశ్యకము. అడిగినను అనుమతియియ్యడని నిశ్చయముగా తెలిసియున్నదనే కారణమువల్ల సమీప సపిండులలో ఒక్కడినైనను అడుగుట మానినయెడల తక్కినవారి అంగీకారము లాప్రకారము చెల్లజాలినది కాదు. (ఇ. లా. ి. 26 మ. 627; ఇ. లా. ి. 30 మ. 50).

**77.** భర్త జీవించియుండగా చేసికొను స్వీకారమునకు అతని యనుమతి యావశ్యకమేగాని (7 బొం. హై. 153), అతడుమృతిచెందిన పిమ్మట చేసికొను స్వీకారమునకు ఆవశ్యకము కాదని మహారాష్ట్ర సంప్రదాయమువారు సిద్ధాంతము చేసినట్టు వెనుక 58 పేరాలో చెప్పియుంటిమి. బొంబయి ప్రెసిడెన్సీలో గొప్ప ప్రమాణముగా ఆదరింపబడుచున్న మయూఖ గ్రంథమువలన ముఖ్యముగా ఈలాగున సిద్ధాంత పరచబడియు భర్తృ మృతి తర్వాత చేయు స్వీకారమునకు భర్తృ అనుజ్ఞ అనావశ్యకము.

న్నది. మహారాష్ట్ర దేశమందును గుజరాతు దేశమందును వితంతువునకు గల స్వీకార స్వాతంత్ర్యము విషయమై, ఈ క్రింద వివరింపబడిన అంశములు బొంబయి హైకోర్టు వారి తీర్పుల వలన స్థాపింపబడి యున్నవి.

(1) విభక్తునిగా భర్తమృతిచెందుటవలన అతని యాస్తికి ప్రత్యేకముగాగాని మరియొకరితో జాయింటుగాగాని వారసుగా నేర్పడిన వితంతువు, భర్తవలన అధికారమును పొందకుండియు దత్తు చేసికొనవచ్చును. ఎవరియొక్క అనుమతియు ఆవశ్యకము కాదు. దుష్ట తాత్పర్యము లేనియెడల, యెట్టి మనోభావముతో ఆమె దత్తు చేసికొనెనో విచారించుటయు అనావశ్యకము. (5 బొం. హై. 181; 10 బొం. హై. 257; ఇ లా. రి. 6 బొం 498, 505; ఇ. లా. రి. 9 బొం. 58). దుష్ట తాత్పర్యముండెనని చెప్పువారు రుజువు భారమును వహింతురు. (ఇ. లా. రి. 15 బొం. 565).

(2.) అవిభక్తునిగా భర్త మృతిచెందిన యెడల, అతని ఆస్తి అతని యవిభక్త భాగస్థులకు చెందుచున్నది. కావున, దత్తు విషయమై భర్తయొక్క ఆజ్ఞ లేనియెడల, మామగారి యనుజ్ఞగాని భర్తయొక్క అవిభక్త సోదరుల యనుజ్ఞగాని పొందక వితంతువు దత్తు చేసికొనగూడదు. (7 బొం హై. 153). భర్తయొక్క ఆస్తి తన స్వాధీనమందుండక, మరియొకరి స్వాధీనములోనికి వారికి శాస్త్రరీత్యా గల హక్కు వలన చేరిన యెడల, అట్టి వారి యనుమతిలేక వితంతువు దత్తుచేసికొనగూడదు. (8 బొం. హై. 114; ఇ. లా. రి. 23 బొం. 250).

(3.) దత్తు వలదని భర్తవలన స్పష్టముగా చెప్పబడిగాని తెలుపబడిగాని యుండునపుడు, వితంతువు దత్తు చేసికొనగూడదు. (7 బొం. హై. అప్పెండిక్సు, 1). ఒక కేసులో ఏకపుత్రు

డుగానుండు చిన్నవాని నొకవితంతువు స్వీకరింపగా ఆస్వీకారము చెల్లదని బొంబాయి హైకోర్టువారు తీరుమానించిరి. ఏకపుత్ర స్వీకారము పాపకరమైనందున అట్టి స్వీకారము విషయమై భర్త అనుమతి యుండునట్లు భావింపరాదని కోర్టువారు అభిప్రాయపడిరి. (12 బొం. హై. 364).

(4.) భర్త మైనరుగా మృతిచెందినను, వితంతువు దత్తుచేసికొనవచ్చును. (ఇ. లా. రి. 15 బొం. 565.)

**78.** జైన మతస్థులలో వితంతువునకు స్వీకారవిషయమై సంపూర్ణ స్వాతంత్ర్యముకలదు. భర్తయొక్కగాని మరియొకరి యొక్కగాని అనుమతి లేకయే ఆమె దత్తు చేసికొనవచ్చును. (6 అ. హై. 382; ఇ. లా. రి. 1 అ. 688; ఇ. లా. రి. 8 అ. 319; ఇ. లా. రి. 17 క. 518. ఇ. లా. రి. 27 క. 379). జైన మతము వారిలో మృతిచెందినవారికి అపరక్రియలు జరుపునట్టి ఆచారమే లేదనియు, స్వీకారమనునది కుటుంబ ప్రవర్థనము నిమిత్తమేగాని తండ్రియొక్క ఆముష్మిక శ్రేయస్సు నిమిత్తము కాదనియు కోర్టువారు వక్కాణించిరి. జైన మతస్థులలో భర్తయొక్క అనుమతిలేకయే వితంతువు స్వీకారము చేసికొనునట్టి ఆచారము స్పష్టముగా రుజువు కాబడవలయునని మదరాసు హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 16 మ. 182).

జైన మతస్థులలో వితంతువునకు స్వీకారస్వాతంత్ర్యము.

---

(2.) పుత్ర స్వీకారమును ఎవరు ఇయ్యవచ్చును?

---

**79.** తల్లి యిష్టము లేకయే తండ్రి తనకుమారుని దత్తు ఇయ్యవచ్చును. (11 బొం. హై. 199). తండ్రి యిష్టము లేకగాని, అతని యిష్టమునకు విరోధముగా గాని తల్లి దత్తు ఇయ్యకూడదు. తండ్రి మృతుడై యుండునపుడును, చిరకాలమునుండి దేశాంతరగతుడై యుండుటవలనగాని సన్న్యాసాశ్రమము నవలం

తల్లి యిష్టము [illegible] ప్రతిబంధకము.

బించి యుండుటవలన గాని జాతిభ్రష్టుఁడై యుండుటవలన గాని అతఁడు మృతతుల్యుఁడై యుండునపుడును, తల్లియే స్వతంత్రించి తనకుమారుని దత్తు ఇయ్యవచ్చును. (1847 సం॥కు వెనుకటి మదరాసు తీర్పులు, 1 వాల్యూం, 154; ఇ. లా. రి. 2 బొం. 377; 7 బొం. హై. అప్పెండిక్సు, 26; ఇ. లా. రి. 30 క. 965). ఒకఁడే పుత్రుఁడుండునపుడు, వానిని దత్తియ్యవచ్చునని భర్త అనుమతి యిచ్చిననే తప్ప, ద్వ్యాముష్యాయణునిగా * దత్తిచ్చుటకుఁగూడ వితంతువునకు స్వాతంత్ర్యము లేదని బంగాళా బొంబయి హైకోర్టులవారి వలన తీర్పులు చేయబడియున్నవి. (4 బంగాళా సదరు కోర్టు తీర్పులు, 320; 12 బొం. హై. 364; ఇ. లా. రి. 6 బొం. 524). దత్తుఇచ్చు విషయమున భార్యను భర్తయొక్క యేజెంటుగా భావించి, అతనికిష్టముగా నుండదని యెన్నదగిన సందర్భమునందు ఆమె దత్తియ్యఁగూడదని హైకోర్టువారు అభిప్రాయపడిరి.

పునర్వివాహము చేసికొన్న వితంతువునకు ఆమె ప్రథమ భర్తవలన గలిగిన పుత్రుని దత్తిచ్చునట్టి స్వాతంత్ర్యము కలదని తీరుమానింపబడియున్నది. (ఇ. లా. రి. 33 బొం. 107).

దత్తియ్యఁగూడదని భర్త స్పష్టముగా చెప్పిపోయినపుడు తన కుమారులలో ఎవనినిగాని దత్తిచ్చుటకు భార్య స్వతంత్రురాలుకాదు. (ఇ. లా. రి. 11 మ. 113; ఇ. లా. రి. 18 మ. 58; ఇ. లా. రి. 22 మ. 198)

భర్తవలన అనుజ్ఞ యియ్యబడిన సందర్భమునందు తప్ప మరి యెప్పుడుగాని తన సవతి కుమారుని దత్తిచ్చుటకు సవతితల్లి స్వతంత్రురాలు కాదు. (ఇ. లా. రి. 16 మ. 384).

---

* ఈ పదముయొక్క అర్థము కొఱకు 89 - వ పేరా చూడవలయును.

**80.** పిల్లవానిని దత్తిచ్చునట్టి స్వాతంత్ర్యము, మీఁద చెప్పబడిన తీరున తలిదండ్రులకు మాత్రమే కలదు గాని, అన్న, పినతండ్రి పెత్తండ్రులు, పితామహుఁడు మొదలగువారికిగాని, తలిదండ్రులుతప్ప మరియెవరికిగాని, లేదు. (3 బంగాళా సదరు కోర్టు తీర్పులు, 337; 1852 సం॥ మదరాసు తీర్పులు, 97; 10 బొం. హై. 235). మేలుకీడు లాలోచించి తమ చిన్నవానిని ఎవరికైనను దత్తియ్యవలసినదని తలిదండ్రులు అధికార మిచ్చి పోయినను గూడ, దత్తిచ్చు స్వాతంత్ర్యము ఇతరులకు కలుగనేరదు. అట్టి యధికారము ననుసరించి యియ్యబడిన దత్తు చెల్లదు. (10 బొం. హై. 268). దీనినిబట్టి చూడఁగా, తలిదండ్రులు లేని చిన్నవాఁడు స్వీకారమునకు యోగ్యుఁడు కాఁడని గ్రహింపఁబడుచున్నది. అట్టివాని దత్తు చెల్లజాలదని తీర్పులుగూడ చేయబడియున్నవి. (2 మ. హై. 129; 6 బొం. హై. 83; 10 బొం. హై. 268; 10 మైసూరు రిపోర్టులు, 384).

అన్న మొదలగు వారికి స్వాతంత్ర్యము.

పిల్లవానిని దత్తిచ్చునట్టి విషయమై ఆలోచనాధికారమును ఇతరులకు తలిదండ్రులు ఒప్పగింపఁగూడదు గాని, తామే మేలుకీడు లాలోచించి ఫలానా వారికి దత్తిచ్చునట్లు నిశ్చయపరచిన పిదప, వ్యాధి మొదలగు కారణములవల్ల తమ చేతిమీఁదుగనే దానము చేయుటకు సాధ్యపడని యెడల, అట్టి దాన ప్రక్రియను ఇతరులచేత జరిపింపవచ్చును. అట్టి సందర్భమునందు తలిదండ్రులు మృతిచెందినను, తల్లిగాని తండ్రిగాని నిశ్చయించి తమతో చెప్పిపోయిన ప్రకారము, పిల్లవాని యొక్క అన్న మొదలగువారు దత్తు జరుపవచ్చును. (8 బొం. హై. 244; ఇ. లా. రి. 7 మ. 549; ఇ. లా. రి. 21 మ. 497). మహమ్మదీయ మతము నవలంబించినట్టి యొకహిందువు తన పిల్లవానిని దత్తిచ్చుటను నిశ్చయపరచుకొని దానప్రకియమాత్రము చిన్నవాని పినతండ్ర

చేత జరిపించవచ్చునని బొంబాయి హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 25 బొం. 551).

ఫలానా వారికి దత్తియ్యవలసినదని తామే నిశ్చపరచి, దాన ప్రక్రియను జరుపు అధికారము తలిదండ్రులు ఇతరులకిచ్చి పోయినపుడు, వారు ఏవయినను షరతులు ఏర్పరచిపోయిన చో, వానికిలోబడియే దత్తు జరిగింపవలయును. లేకున్న, అది చెల్ల నేరదు. ఇది యేలాగంటే — ఫలానావారికి తన చిన్నవానిని దత్తియ్యవలసినదనియు, అట్లు దత్తు జరిగించుటకు పూర్వము సర్కారువారి అనుమతిని పొందవలసినదనియు చెప్పి దాన ప్రక్రియనుజరుపుట కధికారమిచ్చి తండ్రిమృతిచెందెను. ఈదత్తునకు సర్కారువారి అనుమతి అనావశ్యకమయ్యును, అది పొందక జరిగింపబడిన యెడల చెల్ల నేరదు. (ఇ. లా. రి. 2 బొం. 377).

---

(3.) ఎట్టివానిని పుత్రునిగా స్వీకరింపవచ్చును?

---

స్వీకార్యునిజాతి. **81.** స్వీకార్యుడు—అనగా, దత్తు చేసికొనబడు పిల్లవాడు స్వీకర్తయొక్క జాతివాడుగానే యుండవలెను. భిన్నజాతి స్వీకారములు పూర్వకాలమున చెల్లుచుండినట్లు స్మృతులవల్ల తెలియవచ్చుచున్నది. కాని, అవి యీకాలమున అంగీకరింపబడవు.

గోత్రము. స్వీకార్యుడు సగోత్రుడై యుండవలసిన ఆవశ్యకము లేదు. సాధ్యమయినయెడల సగోత్రులనే స్వీకారము చేసికొన వలయుననియు, వారిలోగూడ సమీప సపిండులనే స్వీకరింపవలయుననియు, అన్నదమ్ముల పుత్రులుండు నెడల వారిలోనుండియే స్వీకరింప వలయుననియు, ధర్మశాస్త్రములందు చెప్పబడియున్నది. కాని, యిప్పుడు అట్టి నిర్బంధము లేదు. సగోత్రులలో తగిన పిల్లవాండ్రున్నను సమీప సపిండులున్నను అన్నదమ్ముల కొడు

కులున్నను గూడ, వారిని విడిచి, స్వజాతిలో ఇతర గోత్రముల వారిని దత్తు చేసికొనవచ్చునని తీర్పులు చేయబడి యున్నవి. (15 క. హై. 405; ఇ. లా. రి. 3 క. 587; 6 బొం. హై. 70; ఇ. లా. రి. 10 బొం. 80).

**82.** స్వీకార్యుడు స్వీకర్తకు ఔరస ప్రతిబింబుడుగా, అనగా పుత్రసదృశుడుగా, నుండవలెనని అర్థము చేయబడినట్టి శౌనకవచనమునుబట్టి — స్వీకార్యునితల్లి, ఆమె కన్యకా స్థితియందు స్వీకర్తను శాస్త్రరీత్యా వివాహము చేసికొనదగిన వాని కలదై యుండవలయును — అను నియమము ఏర్పడినది. ఈ నియమము శూద్రజాతివారికి తక్క తక్కిన మూడుజాతులవారికిని ముఖ్యమనియు, దానికి వ్యతిరేకముగా చేసికొనబడునట్టి స్వీకారములు చెల్లవనియు తీర్పులుచేయబడి యున్నవి. (1 మ. హై. 420; 2 మ. హై. 462; 7 మ. హై. 250; 9 మూ. ఇ. అ. 506; ఇ. లా. రి. 3 బొం. 273, 298; ఇ. లా. రి. 8 అ. 1; ఇ. లా. రి. 12 అ. 51; ఇ. లా. రి. 11 మ. 49; ఇ. లా. రి. 21 అ. 412 - ప్రివీ కౌన్సిలువారి తీర్పు). ఈ నియమము ప్రకారము అక్క చెల్లెండ్ర కొడుకు, పినతల్లి పెతల్లి కొడుకు, కూతురు కొడుకు, మేనత్త కొడుకు, తమ్ముడు, సవతితమ్ముడు, పినతండ్రి, మేనమామ — ఇట్టివారిని దత్తు చేసికొన గూడదని యేర్పడుచున్నది. (2 బంగాళా సదరుకోర్టు తీర్పులు, 245; 1852 స॥ మదరాసు తీర్పులు, 96 పేజి; ఇ. లా. రి. 3 మ. 15; ఇ. లా. రి. 11 మ. 45). మరియు, స్వీకర్త తానే దత్తుడై యున్నప్పుడు, ఈ చెప్పబడినవారిని తన జనకకుటుంబమునందును, స్వీకారకుటుంబమునందును, రెంటియందును, పరికింపవలయును. (1858 స॥ మదరాసు తీర్పులు, 117 పేజి).

స్వీకార్యుని శక్తి ని స్వీకారానుకూలుం డవలసిన విధి.

స్వీకార్యునితల్లి, స్వీకర్తను శాస్త్రరీత్యా వివాహము చేసికొనదగిన వావిగలదై యుండవలెనని మీాద చెప్పబడిన విధి విషయములో – ఆపెయొక్క కన్యకాస్థితియందలి వావిని మాత్రమే పరికింపవలయును. కాబట్టి, అన్నదమ్ముల కొడుకు, అన్నదమ్ముల మనుమడు, భార్యయొక్క అక్కచెల్లెండ్ర కొడుకు – వీరిని స్వీకారము చేసికొనవచ్చును. (1856 సం॥ మదరాసు తీర్పులు 213 పేజి; 1857 సం॥ మదరాసు తీర్పులు, 94 పేజి; ఇ. లా. రి. 3 మ. 15; 2 జాక్సోడేల్ రిపోర్టులు, 662). మేనత్తకూతురి కొడుకును స్వీకరింప వచ్చునని తీరుమానింపబడియున్నది. (ఇ. లా. రి. 7 మ. 549). పినతండ్రి కొడుకు స్వీకారము చెల్లునని తీరుమానింపబడి యున్నది. (ఇ. లా. రి. 14 మ. 459).

**83.** పైపేరాలో చెప్పబడిన నియమము బ్రహ్మక్షత్రియ వైశ్య జాతులవారికి మాత్రమే ముఖ్యము కాబట్టి, సర్వత్ర శూద్రజాతి వారిలో, కూతురుకొడుకు, అక్కచెల్లెండ్ర కొడుకు, పినతల్లి పెత్తల్లి కొడుకు, ఇట్టివారిని దత్తుగొనవచ్చును. (ఇ. లా. రి. 1 మ. 62; ఇ. లా. రి. 10 క. 688). జైన మతస్థులలోగూడ ఇట్టి స్వీకారములు చెల్లునని తీర్పులు చేయబడియున్నవి. (ఇ. లా. రి. 1 అ. 288, 688; ఇ. లా. రి. 8 అ. 319).

దక్షిణ హిందూస్థానమందు బ్రహ్మక్షత్రియ వైశ్య జాతులలో, కూతురు కొడుకును అక్కచెల్లెండ్ర కొడుకును స్వీకరించు ఆచారము స్థిరపడలేదని 1873 సం॥ లో మదరాసు హైకోర్టువారు అభిప్రాయపడిరి. (7 మ. హై. 250). కాని, 1881 సం॥లో సదరు విషయమును సాకల్యముగా పరిశీలించి, అట్టి స్వీకారములు బ్రాహ్మణజాతివారిలో చెల్లుచున్నవనియే తీరుమానించిరి. మలయాళదేశపు నంబూదిరి బ్రాహ్మణులలోగూడ నిట్టి

విశేషాచారములు.

యాచారము చెల్లుచున్నదని తీరుమానింపబడెను. (ఇ. లా. రి. 9 మ. 44; ఇ. లా. రి. 7 మ. 3; ఇ. లా. రి. 11 మ. 55). సోదరుని యొక్క దౌహిత్రుని స్వీకారముగొనుట దక్షిణ హిందుస్థానమునందేర్పడియున్న ఆచారమువల్ల చెల్లుచున్నదని తీరుమానింపబడెను. (15 మ లా. జ. 211—ఇ. లా. రి. 9 మ. 44 అనుసరింపబడెను. ఇ లా. రి. 36 క. 780 కూడచూడుము). మహారాష్ట్ర దేశమందుగూడ ఇట్టి యాచారమే కన్పట్టుచున్నది. (వెస్టు బూలర్ హిందూలా, 887; 2 బారొడేల్ రిపోర్ట్సు, 85). కాశీ ప్రాంతములయందలి బొహరా బ్రాహ్మణులలో అక్క చెల్లెండ్ర కుమారుని దత్తుగొను ఆచారము కలదని అలహాబాదు హైకోర్టువారు తీరుమానించి యున్నారు. (ఇ. లా. రి. 14 అ. 53).

**84**. అన్నదమ్ముల కుమారుని అక్క చెల్లెండ్రు దత్తుగొనరాదని దత్తకమీమాంస గ్రంథమునందు నందపండితుడు అభిప్రాయము తెలిపియున్నాడు. ఈ యభిప్రాయము ననుసరించి అలహాబాదు హైకోర్టువారు ఒక కేసులో వితంతువువలన క్రమముగా జరిగింపబడిన ఆమె సోదరపుత్రుని స్వీకారమును రద్దుపరచిరి. (7 అ. హై. 117). అట్లే మఱియొక కేసులో, పినతండ్రి పెత్తండ్రి కొడుకులను వితంతువు దత్తు చేసికొనరాదని సర్. ఎఫ్. మెక్నాటన్ దొరవారు అభిప్రాయపడిరి. కాని, యీ అభిప్రాయమునకు తగిన ఆధారము కానంబడదు. భర్త జీవించియుండగా, భార్యయొక్క అన్నదమ్ముల కొడుకునుగాని ఆమె పినతండ్రి పెత్తండ్రి కొడుకునుగాని అతడు దత్తు చేసికొనవచ్చునుగదా, అతడు మృతిచెందిన పిమ్మట అతని నిమిత్తము అతనికి ప్రత్యామ్నాయముగా వితంతువుమాత్రము అట్టివారిని ఏల దత్తుగొనగూడదు? స్వీకర్తకును పిల్లవాని తల్లికిని గల వావియే ప్రధానముగాని, స్వీకరించు తల్లికిని పిల్లవాని తండ్రికిని గల వావి

స్వీకారించు తల్లికిని
పిల్లవాని తండ్రికిని
గల వావి పద్ధతి
తేలేని.

కూడ ముఖ్యమనుట కేవలము నూతన కల్పనగా దలంపవల యును. ఇట్లనే, మదరాసు హైకోర్టువారును బొంబయి హైకోర్టువారును తీరుమానించి యున్నారు. (ఇ. లా. రి. 3 మ. 17; ఇ. లా. రి. 22 బొం. 973). అలహాబాదు హైకోర్టువారును వెనుకటి తమ తీరుమానమును రద్దుపరచి భార్య అన్న కొడుకునుగాని భార్య అన్న మనుమనిగాని దత్తుగొనుటకు ఆక్షేపణ లేదనియు పిల్లవాని తండ్రికిని దత్తు తల్లికిని గలవావి అనావశ్యకమనియు తీరుమానించిరి. (ఇ. లా. రి. 27 అ. 417).

మూగ, గ్రుడ్డి, కుష్ఠరోగి, వగైరా.

**85.** మూగతనము, గ్రుడ్డితనము, కుష్ఠరోగము మొదలగు దోషములు గలిగియుండు పిల్లవాడు స్వీకారమునకు అర్హుడు కాడు. అట్టివాడు తండ్రియొక్క ఉత్తరక్రియలు నెరవేర్చుటకు అయోగ్యుడుగా నుండుటయేగాక, వారసు హక్కునకును తగి యుండడు. కాబట్టి, అట్టి వానివలన ఏ ప్రయోజనమును కలుగదు.

తలిదండ్రు లిద్దరును మృతిచెందియుండు చిన్నవాడు స్వీకారమునకు అర్హుడు కాడని వెనుక చెప్పియుంటిమి. ఫలానావారికి దత్తిచ్చునట్లు తల్లిగాని తండ్రిగాని నిశ్చయించి, దానప్రక్రియను మాత్రము మరి యొకరికి ఒప్పగించి వారు మృతిచెందినయెడల, అట్టి చిన్నవాడు స్వీకారమునకు యోగ్యుడుగా నుండును. (78 పేరా చూడుడు).

ఒకరివల్ల స్వీకరింపబడినవాడు పిమ్మట మరి యెవరివల్లను స్వీకరింపబడుటకు యోగ్యుడు కాడు.

స్వీకార్యుని వయసు, ఉపనయనము, వివాహము.

**86.** దత్తు చేసికొనబడునట్టి పిల్లవానికి 5 సంవత్సరముల యీడు దాటియుండ గూడదనియు, అతని జనకకుటుంబమునందు చౌలకర్మ జరిగి యుండగూడదనియు - అనగా పుట్టు వెండ్రుకలు తీయించియుండ గూడదనియు - దత్తక మీమాంస గ్రంథమునందు

చెప్పబడి యున్నది. చౌలకర్మ విషయము ముఖ్యము కాదనియు, జనకకుటుంబమున చౌలకర్మ జరిగింపబడినను స్వీకర్త కుటుంబమునందు మరల జరిగింపవచ్చుననియు - పిల్లవాని వయసు విషయముగూడ ముఖ్యము కాదనియు - బ్రహ్మ క్షత్రియ వైశ్యజాతులు మూడింటిలో పిల్లవానికి ఉపనయనము కాక పూర్వమును, శూద్రజాతిలో వివాహము కాకపూర్వమును దత్తుగొనవచ్చునని యు - దత్తక చంద్రికయందు చెప్పబడియున్నది. ఎంత వయసు వానినైనను దత్తుగొన వచ్చుననియు పెండ్లియై బిడ్డలు కలిగిన వానినిగూడ దత్తుచేసికొన వచ్చుననియు మయూఖ గ్రంథము నందు చెప్పబడియున్నది. ఈ మయూఖ గ్రంథము ననుసరించి బొంబయి దేశమునందును, దత్తక చంద్రిక ననుసరించి తక్కిన దేశములయందును, తీర్పులు ఇయ్యబడి యున్నవి.

బ్రహ్మ క్షత్రియ వైశ్యజాతులలో ఉపనయనమునకు పూర్వమును, శూద్రులలో వివాహమునకు పూర్వమును, పిల్లవానిని దత్తు గొనవచ్చునని బొంబయి ప్రెసిడెన్సీతక్క తక్కిన ప్రదేశములయందు స్థిరపడి యున్నది. (ఇ. లా. ర. 9 అ. 253; 6 బంగాళా సదరుకోర్టు తీర్పులు, 219; 1853 సం॥ బంగాళా సదరు కోర్టు తీర్పులు, 553; 1859 సం॥ బంగాళా సదరుకోర్టు తీర్పులు, 229; 1 మదరాసు తీర్పులు, 106, 406; 1859 సం॥ మదరాసు తీర్పులు, 118; ఇ. లా. ర. 6 మ. 43; ఇ. లా. ర. 13 మ. 128; ఇ. లా. ర. 16 మ. 396). ఉపనయనము విషయమై ఈ చెప్పబడినవిధి, దత్తహోమము నిమిత్తమేర్పడినదనియు - పిల్లవాడు భిన్నగోత్రుడై యుండునపుడు బ్రహ్మ క్షత్రియ వైశ్య జాతులలో దత్తహోమము జరిగించుట ఆవశ్యకము గావున ఉపనయనము కాకమునుపే దత్తు జరుగవలెననియు - పిల్లవాడు సగోత్రుడై యుండునపుడు దత్తహోమము అనావశ్యకమై యు

న్నందున, ఉపనయనానంతరముగూడ దత్తు చేసికొనవచ్చుననియు - ఎల్లిస్ దొరవారు అభిప్రాయపడిరి. ఈ యభిప్రాయము వెంబడి త్రావన్కూరు హైకోర్టువారు ఒక కేసు తీరుమానించి యున్నారు. (8 మదరాసు జూరిస్టు, 58). మదరాసు హైకోర్టువారును ఈ విషయమును సాకల్యముగా పరిశీలించి, సగోత్రుడగు పిల్లవానిని ఉపనయనానంతరముగూడ దత్తు చేసికొనునట్టి ఆచారము దక్షిణ హిందూస్థానమున స్థిరపడి యుండునట్లు తీరుమానించిరి. (ఇ. లా. రి. 9 మ 148, ఫుల్ బెంచ్).

బొంబయి ప్రెసిడెన్సీయందు అన్ని జాతులవారిలోను, ఎంత వయసు వానిని దత్తుచేసికొన్నను చెల్లుననియు - స్వీకార్యుడు సగోత్రుడైనను భిన్నగోత్రుడైననుగూడ ఇట్టి దత్తు చెల్లుననియు, స్వీకార్యుడు స్వీకర్తతండ్రికంటె వయసునందు పెద్దవాడుగా మాత్రముండరాదనియు - తీర్పులు చేయబడియున్నవి. (4 బొం. హై. 191; 8 బొం. హై. 67; 11 బొం. హై. 190; 12 బొం. హై. 364. ఇ. లా. రి, 10 బొం. 80). స్వీకరించు తల్లికంటె స్వీకార్యుడు చిన్నవాడుగానుండుట ఆవశ్యకముకాదు. (ఇ లా. రి. 23 బొం. 256).

జ్యేష్ఠపుత్ర ఏకపుత్ర స్వీకారములు.

**87.** జ్యేష్ఠపుత్ర స్వీకారమనగా, ఒకతండ్రికి ఇద్దరు ముగ్గురు కుమారులుండునపుడు వారిలో పెద్దవానిని దత్తుగొనుట. ఏకపుత్ర స్వీకారమనగా, ఒకతండ్రికి ఒకడే కుమారుడుండునపుడు, వానిని దత్తుగొనుట.

జ్యేష్ఠపుత్ర ఏకపుత్ర స్వీకారములు కూడవనియు, ఇచ్చువారికిని తీసికొనువారికినిగూడ దోషమును కలిగించుననియు, ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. కాని, యిది మేలుకొరకు చెప్పబడినమాటయని కొందరును, మీరరానివిధియని కొందరును, భిన్నాభిప్రాయములు గలిగియుండుటవలన, అట్టి స్వీకార

ములు చెల్లుననియు చెల్లవనియుగూడ పూర్వకాలమున తీర్పులు చేయబడుచుండెను. ఇప్పుడీవిషయమై నాల్గు హైకోర్టుల వారి వల్లను స్పష్టమైన తీర్పులు ఏర్పడియున్నవి.

జ్యేష్ఠపుత్ర స్వీకారము - తీర్పులు.

జ్యేష్ఠపుత్ర స్వీకారము దోషకరమని ధర్మశాస్త్రములందు చెప్పబడియున్నను, జరిగింపబడినయెడల అది సర్వత్ర చెల్లుచున్నది. (ఇ. లా. రి. 2 క. 365; ఇ. లా. రి. 9 క. 766; ఇ. లా. రి. 7 బొం. 221, 225).

ఏకపుత్ర స్వీకారము - మదరాసు తీర్పులు.

**88.** ఏకపుత్ర స్వీకారము ధర్మశాస్త్రనిషిద్ధమై దోషావహమయ్యును, జరిగింపబడిన యెడల చెల్లక తప్పదని మదరాసు హైకోర్టువారు తీరుమానించియున్నారు. (1 స్ట్రేంజివొర వారి తీర్పులు, 91, 125; 1 మ. హై. 54; ఇ లా. రి. 11 మ 43; ఇ. లా. రి. 18 మ. 53 - దీనిని ప్రివీకౌన్సిలువారు ఖాయపరచిరి - ఇ. లా. రి. 22 మ. 398).

అలహాబాదు తీర్పులు.

అలహాబాదు హైకోర్టువారుగూడ ఏకపుత్ర స్వీకారము పాపకరమయ్యును చెల్లుననియే తీరుమానించి యున్నారు. (ఇ. లా. రి. 2 అ. 67). పిమ్మట ఒక కేసులో స్ట్రేట్ జడ్జిగారివల్లను మామూదు జడ్జిగారివల్లను ఈతీరుమానము సంశయింపబడెను. (ఇ. లా. రి. 12 అ. 33-37). కాని, మరియొక కేసులో అలహాబాదు హైకోర్టువారు ఏకపుత్ర స్వీకారము చెల్లుననియే స్థిరపరచిరి. (ఇ. లా. రి. 14 అ. 67). ప్రివికౌన్సిలువారు ఈ తీరుమానమును ఖాయపరచిరి. (26 ఇండియన్ అప్పీల్సు 113).

బొంబాయి తీర్పులు.

పూర్వము కొన్ని కేసులలో, ఏకపుత్ర స్వీకారము చెల్లునని బొంబాయి హైకోర్టువారు తీరుమానించిరి. ఒక కేసులో, ఒకనికి ఇద్దరు పుత్రులుండి, ఇద్దరును దత్తీయ్యబడగా, పాపకరమయ్యును, స్వీకారములు చెల్లునని తీరుమానించిరి. (2 బొరోడేల్ రిపోర్టులు, 75; 7 బొం. హై. అప్పెండిక్సు 26; 4 బొం.

హై. 191; ఇ. లా. రి. 2 బొం. 379). పిమ్మట కొన్ని కేసుల లో ఏకపుత్రస్వీకారము చెల్లజాలదని తీర్పులియ్యబడెను. (12 బొం. హై. 364; ఇ. లా. రి. 7 బొం. 221; వె. బు. 129; ఇ లా. రి. 14 బొం. 249; ఇ. లా. రి. 19 బొం. 658). కాని, మదరాసు అలహాబాదు కేసులలో ప్రివీకౌన్సిలువారిచ్చిన తీరుమానము ననుసరించి, యిటీవల నొక కేసులో బొంబయి హైకోర్టువారు ఏకపుత్ర స్వీకారముచెల్లుననియే తీరుమానించిరి. (ఇ. లా. రి. 24 బొం. 473; ఇ. లా. రి. 19 బొం. 428 కూడ చూడుడు).

కలకత్తా తీర్పులు.

కలకత్తా హైకోర్టువారు ఏకపుత్ర స్వీకారము చెల్లగూడదని తీరుమానించియున్నారు. (3 బంగాళా సదరుకోర్టు తీర్పులు, 232; 1 క. హై. 221; 10 స. 347; ఇ. లా. రి. 2 క. 365). ఒకడే పుత్రుడుండునపుడు, వానిని దత్తిచ్చుటకు తండ్రి స్వతంత్రుడు కాడని, కలకత్తా హైకోర్టులో జడ్జిగానుండిన ద్వారకనాథ మిత్రులు అభిప్రాయము తెలిపిరి. శూద్రజాతి వారిలో గూడ ఏకపుత్ర స్వీకారములు చెల్లజాలవని తీర్పులుచేయబడినవి. (ఇ లా. రి 3 క 443).

ఒక కేసులో, ఒకతండ్రికి ముగ్గురు కుమారులుండి, వారిలో పెద్దవాడు మృతిచెందగా, అతని విధంతువు దత్తుచేసికొనియెను. దత్తుడగు మనుమడున్నందున, జీవించియున్న యిద్దరు కుమారులను దత్తియ్యవచ్చునని కలకత్తా హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 17 క. 518, 536).

ద్వ్యాముష్యాయణ స్వీకారము.

**89**. ద్వ్యాముష్యాయణ రూపకముగా జరిగింపబడిన ఏకపుత్ర స్వీకారము సర్వత్ర చెల్లుచున్నదని అనేకములు తీర్పులు చేయబడియున్నవి. (2 బంగాళా సదరు కోర్టు తీర్పులు, 189; 1851 సం॥ మదరాసు తీర్పులు, 234; 13 మూ. ఇ. అ. 101;

I మ. హై. 57; ఇ. లా. రి. 3 క. 587). ఇ. లా. రి. 26 అ. 472).

ఒకడే పుత్రు డుండునపుడు, అతడు మరియొకరికి దత్తియ్యబడి, కన్నతండ్రికిని పెంచుకొన్న తండ్రికిని ఉభయులకు అతడు పుత్రుడుగానుండి ఉత్తరక్రియలు జరుపునట్లు ఏర్పాటు చేసికొనబడిన యెడల, అట్టి దత్తపుత్రుడు ద్వ్యాముష్యాయణుడు - అనగా ఇద్దరు తండ్రులబిడ్డ - అని చెప్పబడును.

ఒకడు తనకుగల యేకపుత్రుని తనసోదరునికే దత్తిచ్చినయెడల, ఏ యేర్పాటును లేకయే ఆ పిల్లవాడు ఇద్దరికిని పుత్రుడుగా నిలిచి ద్వ్యాముష్యాయణుడగుచున్నాడు.

పుత్రహీను లిద్దరుచేరి మరియొకరి పుత్రుని ద్వ్యాముష్యాయణునిగా దత్తుగొనువాడుకలేదు. పుత్రహీనులగు ఇద్దరు సోదరులుగూడ అట్లు ద్వ్యాముష్యాయణుని గొనగూడదు. పుత్రహీనులగు ఇద్దరు సోదరులు మరియొకసోదరునియొక్క పుత్రుని ద్వ్యాముష్యాయణునిగా దత్తుగొనవచ్చునని దత్తకమీమాంస గ్రంథమందు చెప్పబడియున్నది. కాని, యిది చెల్లదని డబ్లియు మెక్నాటన్ దొరవారు దృఢముగా అభిప్రాయమును వెలిపిరి. ఒకసోదరుని దత్తపుత్రుడు మరియొక సోదరునివలన ద్వ్యాముష్యాయణుడుగా స్వీకరింపబడుటకు వీలులేదని మైసూరు ఛీఫ్ కోర్టువారు తీరుమానించిరి. (4 మైసూరు రిపోర్టులు 88)

బొంబాయి ప్రెసిడెన్సీలో ద్వ్యాముష్యాయణ పద్ధతిని దత్తుగొనుటయు ఇచ్చుటయు - ఈ ప్రక్రియ సోదరులవల్ల మాత్రమే గాక వారి వితంతువులవల్లగూడ జరిగింపబడ వచ్చును. (ఇ. లా. రి. 25 బొ. 537).

ఒకడే పుత్రు డుండునపుడు వానిని దత్తియ్యవచ్చునని శా... అనుమతించి యుండిననే తప్ప, అతడు మృతిచెందిన పిమ్మట

ద్వాహ్యముష్యాయణ పద్ధతిని గూడ దత్తిచ్చుటకు వితంతువు స్వతంత్రురాలు కాదని బంగాళా బొంబయి హైకోర్టుల వారివల్ల తీర్పులు చేయబడి యున్నవి. (4 బం. స. 320; 12 బొం. హై. 364; ఇ. లా. రి. 6 బొం. 524). 79 - వ పేరా చూడుము.

(4.) పుత్ర స్వీకారమునకు ముఖ్యమగు కర్మలు.

దానము, పరిగ్రహము.

**90.** స్వీకారసిద్ధికి దాన పరిగ్రహములు రెండును ముఖ్య క్రియలు. అనగా దత్తిచ్చుటకు స్వాతంత్ర్యముగలవారి చేతి మీదుగా పిల్లవాడు దానము చేయబడి, దత్తుగొనుటకు అర్హులైన వారివలన తీసికొనబడవలెను. ముగ్గులువేసి కలశములు పెట్టి మంత్రములు చదివిన పిమ్మట, దత్తు తీసికొను నతడు ఇచ్చు నతనివద్దికి పోయి పిల్లవానిని తనకు దత్తియ్య వలసినదని యడుగగా, ఇచ్చితినని అతడు చెప్పవలయును. అంతట స్వీకర్త — "నేను నిన్ను దానము గొంటిని. శాస్త్రోక్తమగు మతాచరణలను జరుపు నిమిత్తమును నా వంశాభివృద్ధి నిమిత్తమును దత్తు గొంటిని" అను మాటలతో పిల్లవానిని గొనవలయును. ఇట్లని దాన పరిగ్రహ విధానమును బౌద్ధాయనులవారు వివరించి యున్నారు. కాని, యీ దానపరిగ్రహములవిషయమై ఆ యా ప్రదేశములయందు ఎట్టి పద్ధతులు నాడుకలో నుండునో వాని ప్రకారము అవి జరిగింపబడిన యెడల చాలును - అని యిప్పుడు తీర్పులు చేయబడి యున్నవి. (ఇ. లా. రి. 6 క. 381; ఇ. లా. రి. 11 మ. 5; ఇ. లా. రి. 13 మ. 214).

దాన పరిగ్రహములు రెండును లేనియెడల స్వీకార మేర్పడ జాలదు. (ఇ. లా. రి. 6 క. 381; ఇ. లా. రి. 13 మ. 214; ఇ. లా. రి. 19 క. 452). మరియు, దానములేని పరిగ్రహము చెల్లదు. చిన్నతనమునుండి పెంచుచున్న పిల్లవానికూడ దాన

పరిగ్రహములు రెండును లేనిచో దత్తపుత్రుడు కాజాలడు. పిల్ల వానిని దత్తిచ్చునట్లును పుచ్చుకొనునట్లును జాబులు మాత్రము వ్రాసికొనబడి, దాన పరిగ్రహములు జరుగకున్న యెడల, దత్త ఏర్పడజాలదు. (2 క. హై. 279; ఇ. లా. రి. 6 క. 381). చేతి మీదుగా దత్తిచ్చుటయు దత్తుగొనుటయు ఆవశ్యకము.

*దత్త ఇచ్చుటయు తీసికొనుటయు మఱియొకరి మూలమున జరుగవచ్చును.*

**91**. స్వీకరింపబడు పిల్లవానిని అతని తండ్రి మఱియొకరి చేతిమీదుగా దానమిప్పించవచ్చునని వెనుక చెప్పియుంటిమి. (80 - వ పేరా). పిల్లవానిని దానముగొనుటయు మఱియొకరి మూలమున జరుపుకొనవచ్చును. ఒక బొంబాయి కేసులో నొక బాలవితంతువు వైధవ్యము ప్రాప్తించిన కొద్దిదినములలోనే స్వీకారము చేసికొనుచు తాను గదిలోపటనుండి పిల్లవానిని దానముగొనుటయు హోమాది కర్తనడపుటయు తన బంధువులలో నొకరిచేత జరిపించుకొనియెను. ఇట్లు జరుపవచ్చుననియు, దానివల్ల స్వీకారమునకు బాధకము లేదనియు, తీర్మానించిరి. (ఇ. లా. రి. 22 బొం. 590).

*దత్త హోమము.*

**92**. అన్ని జాతులవారిలో, స్వీకారసంసిద్ధికి దత్తహోమము ఆవశ్యకమని దత్తక మీమాంస దత్తకచంద్రిక గ్రంథములయందు చెప్పబడియున్నది. కాని, దానికి వ్యతిరేకముగా ఇప్పుడు తీర్పులు ఏర్పడియున్నవి.

*శూద్రులు.*

శూద్రజాతి వారిలోగూడ స్వీకారమునకు దత్తహోమము ఆవశ్యకమని పూర్వకాలమున తీర్పులు చేయబడుచుండెను. (4 క. హై. 162; 5 క. హై. 366; 7. క. హై. 1). కాని, యిటీవల ఆ తీర్పులను రద్దుచేసి, శూద్రజాతివారిలో స్వీకారమునకు దానపరిగ్రహములు రెండుమాత్రమే ఆవశ్యకమనియు, దత్తహోమముగాని మరియే విధమయిన కర్మలుగాని క్రియలుగాని ఆవశ్యకము కావనియు, కలకత్తా హైకోర్టు ఫుల్ బెంచ్ వారు

తీర్పు చేసియున్నారు. (13 క. హై. 401). ఈ తీర్పును ప్రివీకౌ
న్సిలువారంగీకరించియున్నారు. (ఇ. లా. రి. 5 క. 770; ఇ. లా.
రి. 6 క. 381). దరిమిలానుగూడ ఆలాగే తీరుమానింపబడి
యున్నది. (ఇ. లా. రి. 28 క. 168). మదరాసు హైకోర్టువారు
గూడ ఆలాగే తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 5 మ. 358)

శూద్రజాతివారిలో స్వీకారసిద్ధికి దానపరిగ్రహములు మా
త్రమే ప్రధానములై దత్త హోమమును మంత్రములును అనా
వశ్యకమయ్యును, సదరు దానపరిగ్రహములు ఆయా ప్రదేశము
లయందు వాడుకలో నుండెడి పద్ధతుల ప్రకారము జరిగింపబడ
వలెను. అనగా, హోమాది క్రియలతో దానపరిగ్రహములు
జరిగించెడి ఆచార మేర్పడియుండు ప్రదేశములయందు, వట్టి దా
నపరిగ్రహములు చెల్లవు. (ఇ. లా. రి. 6 క. 381; ఇ. లా. రి. 11
మ. 5; ఇ. లా. రి. 13 మ. 214).

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు.

**93.** బ్రహ్మ క్షత్రియ వైశ్యజాతులలో దత్త హోమము
యొక్క ఆవశ్యకతను గూర్చి ముందుకాలమున కొంతవరకు అ
భిప్రాయ భేదముండెను. వీరిలోగూడ దత్త హోమము అనా
వశ్యకమని మదరాసు హైకోర్టువారు తీరుమానించిరి. (4 మ.
హై. 165; ఇ. లా. రి. 6 మ. 20; ఇ. లా. రి. 15 మ. 7).
కాని, యిటీవల ఈ తీరుమానము సంశయింపబడి (ఇ. లా. రి.
7 మ. 548; ఇ. లా. రి. 11 మ. 5; ఇ. లా. రి. 13 మ. 214;
ఇ. లా. రి. 21 మ. 497) — దత్తపుత్రుడు సగోత్రుడై యుండు
నప్పుడును, కూతురు కుమారుని (దౌహిత్రుని) దత్తు విషయ
మునందును తప్ప, తక్కిన సందర్భములయందు బ్రహ్మ క్షత్రియ
వైశ్యజాతులు మూడింటిలో స్వీకారమునకు దత్త హోమము
ఆవశ్యకమనియే యిప్పుడు నాల్గు హైకోర్టులవారివల్లను సిద్ధాం
తపరచబడి యుండునట్లు కనబడుచున్నది. (ఇ. లా. రి. 11 మ.

5; ఇ. లా. రి. 13 మ. 214; ఇ. లా. రి. 5 క. 770; ఇ. లా. రి. 6 క. 381; 5 బం. స. 356; 6 బం. స. 219; 16 స. 179; 2 బారో. 75, 87; ఇ. లా. రి. 11 బొం. 381; ఇ. లా. రి. 6 అ. 276; ఇ. లా. రి. 24 బొం. 218) మదరాసు తీర్పులను పరికించి చూడగా, బ్రాహ్మణులకు మాత్రమే దత్త హోమము ఆవశ్యకముగాని తక్కిన మూడు జాతులకును ఆవశ్యకముకాదని చెప్పుటకు కొంతవరకు అవకాశము కలుగుచున్నది.

**94.** దత్తహోమము ఆవశ్యకమైనప్పుడు అది దానపరిగ్రహణకాలమందే జరిగించుట ఆవశ్యకముకాదు. దానపరిగ్రహణములు జరిగిన 5 సం॥ లకు దత్త హోమముచేసికొనబడిన రెండు కేసులలో మదరాసు హైకోర్టువారు స్వీకారమును స్థిరపరచిరి. (ఇ. లా. రి. 7 మ. 548; ఇ. లా. రి. 21 మ. 497). కాని, అట్టిదాన పరిగ్రహణకాలమందు, స్వీకారము సంపూర్ణముగా ముగిసినదని భావింపక, పిమ్మట దత్తహోమాదికర్మలో జరిగించుకొనునట్టి ఉద్దేశముండుట ఆవశ్యకము. దత్తహోమము ఎప్పుడు జరిగింపవలెను?

**95.** వేద మంత్రము లుచ్చరించి హోమాది క్రియలు జరుపుటకు యోగ్యత యుండదు కాబట్టి సూతకదినములలో బ్రహ్మక్షత్రియ వైశ్యజాతులవారు దత్తు చేసికొనగూడదని ప్రివీ కౌన్సిలువారు అభిప్రాయము కనుపరచిరి. (9 మూ. ఇ. అ. 506). ఒక మదరాసు కేసులో భర్తవలన స్వీకారాధికారమును పొందిన యొక వైశ్య వితంతువు, భర్తశవము ఇంటినుండి తీసికొనిపోకమునుపే దత్తు చేసికొనెను. ఆ దత్తు చెల్లదని మదరాసు హైకోర్టువారు అభిప్రాయపడిరి. (ఇ. లా. రి. 13 మ. 222). దత్తుగొను తండ్రియును స్వీకార్యుడును ఏకగోత్రమువారుగా నుండునెడల దత్తహోమము అనావశ్యకము గావున, అట్టివారి స్వీకారము సూతక దినములలో జరిగింపబడినను చెల్లునని మద సూతక దినములలో స్వీకారము.

రాసు హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. ౯. 27 మ. 539).

శూద్రజాతి వారిలో స్వీకారమునకు మంత్ర పూర్వకము లగు కర్మ లెవ్వియు ఆవశ్యకము కానందున, సూతక కాలము నందు గూడ దత్తు చేసికొనవచ్చునని యేర్పడుచున్నది.

(5) & (6.) పుత్రస్వీకారము రద్దుపరచుట, స్థాపించుట.

దత్తు ఎప్పుడు చెల్లును ? ఎప్పుడు చెల్లదు ?

**96**. ఇంతవరకు ఈ ప్రకరణమునందు చెప్పబడిన ప్రాముఖ్యమైన దత్తు గొనుటకు యోగ్యత లేనివారు చేసికొన్న దత్తులును, దత్తిచ్చుటకు అధికారము లేనివారిచ్చిన దత్తులును, దత్తు గొనగూడని పిల్లవాండ్ర దత్తులును, శాస్త్రోక్తములగు ప్రధాన విధులు వదిలిపెట్టి చేసికొన్న దత్తులును చెల్లనేరవు. శాస్త్రములయందలి విధులలో కొన్ని ఆవశ్యకమైనవిగాను కొన్ని మేలుకొరకు సూచింపబడిన విషయములుగాను ఉన్నవి. ఈ రెండవతరగతి విధులను అతిక్రమించినయెడల దత్తు రద్దుకానేరదు. (12 బొం. హై. 398; ఇ. లా. ౯. 9 అ. 253; ఇ. లా. ౯. 3 బొం. 293; ఇ. లా. ౯. 10 బొం. 86; ఇ లా. ౯. 3 క. 601). ఇది యెట్లనగా—సగోత్రుడుండునపుడు వానినే దత్తు గొనవలెనని ధర్మశాస్త్రములయందు చెప్పబడి యున్నను, ఇతరులను దత్తు చేసికొన్న యెడల చెల్లుచున్నది. (ఇ. లా. ౯. 3 క. 587). అలాగుననే, పిల్లవానికి 5 సంవత్సరములు దాటకమునుపే దత్తు గొనవలెనని దత్తక మీమాంస గ్రంథమునందు చెప్పబడియున్నను, ఆ వయసు దాటిన పిమ్మట చేసికొన్న దత్తులు కూడ చెల్లుచున్నవి. (ఇ. లా. ౯. 9 అ. 254).

దత్తు విషయమైన దావాలకు లిమిటేషను – స్టాంపు.

**97**. ఏ కారణము వల్లనైనను దత్తు చెల్లగూడదని చెప్పవలెనన్నచో, దత్తు విషయము వాదికి తెలిసినది మొదలు 6 సం॥ల లోపల

దావా తెచ్చి దానిని రద్దుపరచవచ్చును. దత్తు జరుగనేలేదని తీర్పు పొందుటకు గూడ, 6 సం॥ల లోపలనే దావా తేవలయును. (1877 సం॥ 15 నెం॥ లిమిటేషను ఆక్టు 2-వ షెడ్యూలు, 118 ఆర్టికిల్). దత్తును స్థిరపరచుకొనుటకు దావా, దత్తపుత్రుని హక్కులకు బాధకముకలిగిన దినము మొదలు 6 సం॥ల లోపల తేవలయును. (డిటో ఆక్టు, 119 ఆర్టికిల్). ఈ దావాలకన్నిటికి స్టాంపు 10 రూపాయలు.

దత్తును స్థిరపరచు తీర్పు.

**98.** ఏదైనను దావాలో స్వీకారమును ఊర్జితపరచి కోర్టువారు తీర్పుచేసిన యెడల, ఆ దావాకు పార్టీలుగా నుండిన వారును వారిద్వారా హక్కు కలిగినవారును మాత్రమే ఆతీర్పు వలన బద్ధులగుదురు. తక్కినవారు బద్ధులుకారు. కాబట్టి, పిమ్మట ఏదైనను దావా తటస్థించిన యెడల, ఈ తక్కినవారు స్వీకారమును అంగీకరించక తగిన రుజువువలన రద్దుపరచవచ్చును. (2 మ. హై. 276; 3 మ. హై. 217; 11 క. హై. 244; 14 మూ. ఇ. అ. 367; 9 మూ. ఇ. అ. 539; ఇ. లా. రి. 1 క. 289).

బంధువుల ప్రవర్తనము - కాలదోషము.

**99.** స్వీకారము చాలకాలము క్రిందట జరిగియుండి, అనేక సంవత్సరములనుండి బంధువులు మొదలగు వారివలన దత్తపుత్రుడు నిరాక్షేపితుడై యుండినయెడల, అతని దత్తు క్రమముగా జరిగినదనియే కోర్టువారు ఊహింతురు. (14 మూ. ఇ. అ. 67; 7 బొం. హై. అప్పెండిక్సు, 33). కాని, యెన్ని సంవత్సరములనుండి దత్తపుత్రుడుగా బంధువులు మొదలగు వారివలన భావింపబడినను, స్వీకారార్హుడుగాని పిల్లవాడు - అనగా బ్రాహ్మణులలో అక్క సెల్లెండ్రకొడుకు, ఇట్టివాడు - దత్తపుత్రుడు కాజాలడు. కాబట్టి, ఆస్తి మొదలగువాని విషయమై హక్కు స్థాపించుకొనుటకు అతడు దావా తెచ్చినయెడల చెల్ల నేరదు. కాని, అతనిని దత్తపుత్రునిగా సమ్మతించి ప్రవర్తించిన బంధువు

లకు, అతని స్వీకారమును ఆక్షేపించి అతని అనుభవములోనున్న ఆస్తిని తీసికొనగల హక్కు, సదరు ప్రవర్తనవల్లగాని కాలదోషము వల్లగాని తప్పిపోవచ్చును. ఇది యేలాగంటే —

(1.) "ఏ" అనువాడు "బీ" అను పిల్లవానిని ఒకరియొక్క దత్తపుత్రునిగా సమ్మతించి అతనిని అనేకవిధముల ప్రోత్సాహపరచి దత్తువలన అతనికి చేరగల ఆస్తిని అతడు అనుభవించునట్లును జనక కుటుంబమునందలి హక్కు వదులుకొనునట్లును చేసెను. పిమ్మట, "బీ" యొక్క దత్తును "ఏ" యనువాడు ఆక్షేపించగూడదు, (2 మ. హై. 114, 270, 428; ఇ. లా. రి. 28 బొం. 440).

(2.) "ఏ" యను ఒక వితంతువుయొక్క అనుభవములోనున్న ఆస్తికి "బీ" యనువాడు తదనంతర వారసుహక్కు కలిగియుండెను. "బీ" యనువాడు "ఏ" యను వితంతువును ప్రోత్సాహపరచి, "సీ" యను పిల్లవానిని ఆమె దత్తు గొనునట్లు చేసెను. "సీ" యొక్క దత్తు చెల్లగూడనిదైనను, అది రద్దు పరచుటకు దావా తెచ్చి అతని ఆస్తిని స్వాధీనపరచుకొనుటకు "బీ" యను వానికి హక్కులేదు. (7 మ. హై. 250; 11 బొం. హై. 190; ఇ. లా. రి. 11 బొం. 381, 396; ఇ. లా. రి. 15 మ. 486; ఇ. లా. రి. 18 మ. 397, 54; ఇ. లా. రి. 2 అ. 366). అట్లు దావా తేనిచ్చుట అన్యాయమని ప్రివీకౌన్సిలువారుకూడ తీరుమానించిరి. (14 మూ. ఇ. అ. 77).

(3.) పైరెండు ఉదాహరణలలో చెప్పినప్రకారము దావా తెచ్చునట్టి హక్కు తప్పిపోవుటకు, బుద్ధిపూర్వకముగా దురుద్దేశముతో ప్రవర్తించి యుండుట యావశ్యకముకాదు. అశాస్త్రీయమగు దత్తు శాస్త్రీయమనియు చెల్లదగినదనియు పొరబాటున నమ్మి ప్రవర్తించిన సందర్భములయందు గూడ పిమ్మట

సదరు దత్తును ఆక్షేపించునట్టి హక్కు తప్పిపోవునని తీరుమా నింపబడి యున్నది. (ఎవిడెన్సు ఆక్టు 115 సె; ఇ. లా. రి. 20 క. 206 - ఇది ఇ. లా. రి. 2 అ. 809, ఇ. లా. రి. 7 మ. 3 ను రద్దుచేసినది; ఇ. లా. రి. 30 క. 539; 7 క. హై. 216).

**100.** స్వీకారము చేసికొనబడినట్లు వాదించువారే దానిని రుజువు చేయవలసిన భారమును వహింతురు. (3 క. హై. 146). స్వీకారము బహుశః చేసికొనబడియుండునో చేసికొనబడి యుండదో - అను విషయమును కోర్టువారు ఆయా సందర్భములను బట్టి కొంతవరకు ఊహింతురు. స్వీకర్త వృద్ధు, రోగపీడితుడు, ఆస్తివంతుడు, జ్ఞాతులయెడ అధికమగు ప్రీతిలేనివాడు, భార్య యెడల అధికమగు అపేక్షగలవాడు - ఇట్టి సందర్భములయందు స్వీకారము బహుశః జరిగి యుండవచ్చునని కోర్టువారు ఊహింతురు. (4 మూ. ఇ. అ. 414; 7 మూ. ఇ. అ. 64; ఇ. లా. రి. 1 మ. 69; 15 స. 548). స్వీకర్త పడుచువాడు, సంతానము కలుగదగినవాడు, నిరుపేదవాడు — ఇట్టి సందర్భమునందు స్వీకారమును నమ్ముటకు కోర్టువారు కొంచెము సంశయింతురు. (2 బం. స. 21). మరియు స్వీకారమునకు ఏవిధమైనపత్రముగాని దస్తావేజుగాని బంధువులు మొదలగు వారిని తాంబూలమునకు పిలుచుటగాని ఆవశ్యకముకాకున్నను, ఎవ్వరికిని తెలియకుండ రహస్యముగా చేసికొనబడినట్లు చెప్పబడు స్వీకారమును కోర్టు వారు సులభముగా నమ్మజాలరు. (1857 సం॥ మదరాసు తీర్పులు 53; 2 బం. స. 21). ఎట్టి సందర్భములయందును, స్వీకారము నిశ్చయముగా జరిగినట్లు స్పష్టమైన రుజువు కనుపడిననే కోర్టు వారు దానిని అంగీకరింతురు.

రుజువు భారము.

సదరు దత్తును ఆక్షేపించునట్టి హక్కు తప్పిపోవునని తీరుమా నింపబడి యున్నది. (ఎవిడెన్సు ఆక్టు 115 సె; ఇ. లా. రి. 20 క. 206 - ఇది ఇ. లా. రి. 2 అ. 809, ఇ. లా. రి. 7 మ. 3 ను రద్దుచేసినది; ఇ. లా. రి. 30 క. 539; 7 క. హై. 216).

**100.** స్వీకారము చేసికొనబడినట్లు వాదించువారే దానిని రుజువు చేయవలసిన భారమును వహింతురు. (3 క. హై. 146). స్వీకారము బహుశః చేసికొనబడియుండునో చేసికొనబడి యుండదో - అను విషయమును కోర్టువారు ఆయా సందర్భములను బట్టి కొంతవరకు ఊహింతురు. స్వీకర్త వృద్ధు, రోగపీడితుడు, ఆస్తివంతుడు, జ్ఞాతులయెడ అధికమగు ప్రీతిలేనివాడు, భార్య యెడల అధికమగు అపేక్షగలవాడు - ఇట్టి సందర్భములయందు స్వీకారము బహుశః జరిగి యుండవచ్చునని కోర్టువారు ఊహింతురు. (4 మూ. ఇ. అ. 414; 7 మూ. ఇ. అ. 64; ఇ. లా. రి. 1 మ. 69; 15 స. 548). స్వీకర్త పడుచువాడు, సంతానము కలుగదగినవాడు, నిరుపేదవాడు — ఇట్టి సందర్భమునందు స్వీకారమును నమ్ముటకు కోర్టువారు కొంచెము సంశయింతురు. (2 బం. స. 21). మరియు స్వీకారమునకు ఏవిధమైనపత్రముగాని దస్తావేజుగాని బంధువులు మొదలగు వారిని తాంబూలమునకు పిలుచుటగాని ఆవశ్యకముకాకున్నను, ఎవ్వరికిని తెలియకుండ రహస్యముగా చేసికొనబడినట్లు చెప్పబడు స్వీకారమును కోర్టు వారు సులభముగా నమ్మజాలరు. (1857 సం॥ మదరాసు తీర్పులు 53; 2 బం. స. 21). ఎట్టి సందర్భములయందును, స్వీకారము నిశ్చయముగా జరిగినట్లు స్పష్టమైన రుజువు కనుపడిననే కోర్టు వారు దానిని అంగీకరింతురు. రుజువు భారము.

గాని స్వీకారమును వదిలి వేయుటకు మార్గము లేదు. (ఇ. లా. రి. 2 అ. 366). స్వీకారమువలన పెంపుడు కుటుంబమునందు తనకు కలిగిన హక్కులను దత్తపుత్రుడు వదిలివేయవచ్చును. కాని, యట్లు చేయుటవలన, జనక కుటుంబమునందు ముందు నశించిన హక్కులు కొంచెముగూడ తిరిగి రానేరవు. (2 బాలో. 656). దత్తుగొన్న తండ్రిగాని తల్లిగాని తాను చేసికొన్న స్వీకారము చెల్లదని ఏ సందర్భమునందును వాదించగూడదు. (2 మ. హై. 114, 270, 428. ఎవిడెన్సు ఆక్టు 115 సె.)

**103.** దత్తు చేసికొన్న తలిదండ్రులకును వారికి సంబంధించిన బంధువులకును, ఔరసపుత్రుడు (అనగా కన్నకొడుకు) ఎట్లో అట్లే దత్తపుత్రుడు వారసుదారుడగుచున్నాడు. ఈ విషయమై ధర్మశాస్త్రములందు సందిగ్ధముగా చెప్పబడియుండుట చేత, పూర్వకాలమునందు పలుతెరగులుగా తీర్పులుచేయబడుచుండెను. కాని, యిప్పుడు హైకోర్టువారును ప్రివీకౌన్సిలువారునుగూడ దత్తపుత్రుని వారసుహక్కును సంపూర్ణముగా స్థిరపరచియున్నారు. దత్తు తండ్రి, అతనితండ్రి (అనగా తాత), దత్తుతండ్రి అన్నదమ్ములు (అనగా పినతండ్రి పెత్తండ్రులు), ఈ మొదలగువారికిని - దత్తుతల్లి, ఆమె తలిదండ్రులు మొదలగువారు, అనగా మాతామహుడు మేనమామ మొదలగువారికిని - గూడ దత్తపుత్రుడు వారసుదారుడు కాదగునని తీర్పులుచేయబడియున్నవి. సవతితల్లికిని ఆమె వంకవారికినిగూడ దత్తుడు వారసుడుకావచ్చును. (ఇ. లా. రి. 6 క. 289; ఇ. లా. రి. 5 క. 615; ఇ. లా. రి. 8 క. 302; 1 బం. స. 209; 9 స. 423; 1859 సం॥ బం. స. తీ. 1091; 3 స. 49; ఇ. లా. రి. 1 అ. 256; ఇ. లా. రి. 6 క. 256; ఇ. లా. రి. 10 క. 232 - ప్రి. కౌ.; ఇ. లా. రి. 9 క. 70).

దత్తపుత్రుని వారసు హక్కు.

దత్తపుత్రుని కొడుకులు, మనుమలు, మొదలగువారు ఔరసపుత్రుని కొడుకులు మనుమలు మొదలగువారెట్లో అట్లే భావింపబడుదురు.

స్వీకర్తకు ఇద్దరు ముగ్గురు భార్యలు.

**104**. స్వీకర్తకు ఇద్దరు ముగ్గురు భార్యలుండి వారిలో నెకరికంటె నొకరికి ఏవిధమైన ఆధిక్యతయు గలిగింపక అతడు దత్తు చేసికొన్న యెడల, వారందరును దత్తపుత్రుని తల్లులుగా భావింపబడి అట్టి దత్తపుత్రుని ఆస్తికి సమానహక్కుదారు లగుచున్నారు. కాని, వారిలో ఏ భార్యనుగాని దత్తుని తల్లిగా నియమించి స్వీకారము చేసికొనబడిన యెడల, ఆపెమాత్రమే దత్తుని తల్లిగా భావింపబడి తక్కినవారు సవతితల్లులుగా భావింపబడుదురు. దత్తుని మరణానంతరము అతని యాస్తికి, మాతృస్థానమునకు నియమింపబడిన యాపెమాత్రమే హక్కుదారురాలగును. మఱియు, ఆపె యనంతరము జ్ఞాతులు వారసు లగుదురుగాని, సవతితల్లి స్థానమునకు త్రోయబడినవారు వారసులు కాజాలరు. (1864 సం॥ సదర్లంపు వీక్లిరిపోర్టర్ 171).

భర్త, తనభార్యలలో నొకరికిమాత్రమే స్వీకారాధికారమిచ్చి మృతిచెందినపుడు, ఆ యధికారమును పొందిన భార్య దత్తపుత్రునికి కన్నతల్లిగాను తక్కినభార్యలు సవతి తల్లులుగాను భావింపబడి, ఆతీరుననే దత్తుని ఆస్తికి వారసుహక్కు కలవారై యుందురు. అనగా, దత్తుని మరణానంతరము, స్వీకారాధికారమును పొందిన తల్లిమాత్రమే హక్కుదారురాలై ఆపె యనంతరము దత్తుని జ్ఞాతులు వారసులగుదురు. (వె. బు. 1181).

అవిభాజ్యమగు ఆస్తివిషయమైన ఒక మదరాసు కేసులో ప్రథమభార్యను వదిలివేసిన భర్త, ద్వితీయభార్యతోగూడి స్వీకారమును చేసికొనెను. స్వీకారపుత్రుని మరణానంతరము ప్రథమభార్య దావాతెచ్చి, దత్తపుత్రుని తల్లులలో జ్యేష్ఠత్వము

వలన తనహక్కు మొదటిదని వాదించగా, మదరాసు హైకోర్టువారు అంగీకరింపక స్వీకార కాలమున భర్తతో చేర్చుకొనబడిన ద్వితీయభార్య హక్కును స్థిరపరచిరి. (ఇ. లా. రి. 18 మ. 277). ఈ తీర్పును ప్రివీకౌన్సిలువారు ఖాయపరచిరి. (ఇ. లా. రి. 23 మ. 1).

ప్రథమ భార్య, సపిండుల యనుమతిని మాత్రము పొంది, ద్వితీయభార్య యిష్టమును కనుగొనకయే దత్తుచేసికొన్న యెడల, అట్లుచేయుట చాల అక్రమమయ్యును దత్తు రద్దుకానేరదు. ద్వితీయభార్య యిష్టమును కనుగొన్నప్పుడు, ఆమెయు సమ్మతించుటకు బద్ధురాలు. (ఇ. లా. రి. 28 మ. 315).

**105.** ద్వాముష్యాయణుడుగా గొనబడిన యొక దత్తపుత్రుడు దత్తు తండ్రియొక్క ఆస్తికి వారసుదారుడైన కొంతకాలమునకు మృతిచెందగా, ఆస్తి అతనిభార్యకు చెందెను. ఆమె మృతిచెందినపిమ్మట సదరు ఆస్తి విషయమై ద్వ్యాముష్యాయణుని కన్నతల్లికిని దత్తు తండ్రియొక్క అన్న మనుమనికిని వివాదము కలిగెను. సాధారణ స్వీకారమైనచో కన్నతల్లిహక్కులు నశించి దత్తు తండ్రియొక్క అన్నమనుమడే సదరు ఆస్తికి హక్కుదారుడగును. కాని, ద్వాముష్యాయణ స్వీకారమగుటచే దానియందు గల విశేష యొడంబడికవల్ల కన్నతల్లియొక్క వారసుహక్కు నశింపదనియు, పై సందర్భములో కన్నతల్లికే ఆస్తిచెందుననియు అలహాబాదు హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 26 అ. 472). దత్తుతల్లికూడ జీవించియుండిన యెడల, యిద్దరు తల్లులును ద్వాముష్యాయణుని ఆస్తికి వారిసుదారులై యుండి యుందురనుట స్పష్టము.

ద్వాముష్యాయణుని తల్లుల వారిసు హక్కు.

**106.** దత్తు చేసికొన్న పిమ్మట, దత్తుతలిదండ్రులకు కుమారుడు పుట్టినయెడల, ఈ ఔరసపుత్రునికంటె దత్తపుత్రుడు తి

ఔరసపుత్రుడు పుట్టినయెడల దత్త పుత్రుని భాగము.

క్కువగా నెంచబడుచున్నాడు. అట్టి సందర్భమున దత్తపుత్రుని కియ్యవలయు భాగమునుగూర్చి ధర్మశాస్త్రములలో వేర్వేరుగా చెప్పబడియున్నది. మరియు, ఆయాప్రదేశములయందలి వ్యాఖ్యానకర్తలు భిన్నార్థములు చేయుటచేత ఈ విషయమై స్థిరపడియున్న తీర్పులు ఆయా ప్రెసిడెన్సీలయందు భేదించుచున్నవి.

బంగాళా దేశము. బంగాళా దేశములో, దత్తపుత్రునికి 1 పాలు, ఔరసపుత్రునికి 2 పాళ్లు - ఈలాగున ఆస్తి విభజింపబడును. అనగా, ఒకడే ఔరసపుత్రుడు పుట్టినపుడు, ఆస్తిని 3 భాగములుచేసి, 1 భాగము దత్తపుత్రునికిని 2 భాగములు ఔరసపుత్రునికిని ఇయ్యబడును. ఇద్దరు ఔరసపుత్రులున్నయెడల, ఆస్తిని (1, 2, 2) ఐదు భాగములుచేసి, ఒక భాగము దత్తపుత్రునికిని రెండేసి భాగములు ఔరసపుత్రులకును ఇయ్యబడును. ముగ్గురు ఔరసపుత్రులుండునపుడు, ఆస్తి (1, 2, 2, 2) ఏడు భాగములుగా విభజింపబడును. (9 స. 423).

కాశీ రాజ్యము. కాశీ రాజ్యములో దత్తపుత్రునికి 1 పాలు, ఔరసునికి 3 పాళ్లు - ఈలాగు ఆస్తి విభజింపబడును. అనగా, ఒకడే ఔరసపుత్రుడుండునపుడు ఆస్తిలో (1, 3) నాల్గవభాగమును, ఇద్దరు ఔరసపుత్రులుండునపుడు (1, 3, 3) ఏడవభాగమును, ముగ్గురుండునపుడు (1, 3, 3, 3) పదియవ భాగమును - ఈలాగు దత్తపుత్రునికి చెందును. (9 స. 423).

మదరాసు ప్రెసిడెన్సీ. మదరాసు ప్రెసిడెన్సీలో, దత్తపుత్రునికి 1 పాలు ఔరసునికి 4 పాళ్లు - అని తీరుమానింపబడియున్నది. కాబట్టి, ఒకడే ఔరసపుత్రుడుండునపుడు ఆస్తిలో (1, 4) ఐదవ భాగమును, ఇద్దరుండునపుడు, (1, 4, 4) తొమ్మిదవ భాగమును, ముగ్గురుండు

నపుడు (I, 4, 4, 4) పదమూడవ భాగమును - ఈలాగున దత్త పుత్రునికిచెందును. (I మ. హై. 45).

బొంబయి ప్రెసిడెన్సీలోకూడ మదరాసు ప్రెసిడెన్సీయందువలెనే దత్తపుత్ర ఔరసపుత్ర భాగములు ఏర్పడియున్నవి. (ఇ. లా. రి. 17 బొం. 100) బొంబాయి ప్రెసిడెన్సీ.

జైనమతస్థులలో ఔరసుడు జన్మించిన యెడల దత్తపుత్రునికి యావదాస్తిలో 4 - వ భాగము చెందునని తీరుమానింపబడియున్నది. (ఇ. లా. రి. 16 బొం. 347). జైన మతస్థులు.

కొన్నికొన్ని జాతులలో చెల్లుచుండెడి కులాచారముల ప్రకారము, ఔరసుడు జన్మించినపుడు, దత్తపుత్రునికి అర్ధభాగమును, మూడింట ఒక భాగమును, నాల్గింట ఒక భాగమును, కొన్ని చోట్ల దత్తుతండ్రికి ఇష్టమువచ్చినంత స్వల్పభాగమును - ఇచ్చుట కలదు. మదరాసుప్రెసిడెన్సీలో శూద్రజాతివారిలో ఔరసపుత్రుడును దత్తపుత్రుడును సమాన భాగములుగా ఆస్తిని పంచుకొనవలయునని తీరుమానింపబడియున్నది. (ఇ. లా. రి. 7 మ. 253). కులాచారములు.

పై నిబంధనలు విభాగయోగ్యమగు ఆస్తికే చెల్లునుగాని అవిభాజ్యమగు ఆస్తికి చెల్లవు. అవిభాజ్యమగు ఆస్తి దత్తపుత్రునికిచెందక, స్వీకారానంతరము జన్మించిన ఔరసునికే సంపూర్ణముగా చెందునని మదరాసు హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 17 మ. 245). అవిభాజ్యమగు ఆస్తి.

**107.** తండ్రి మృతిచెందిన పిమ్మట ఔరసపుత్రుడును దత్తపుత్రుడును అవిభక్తులుగానుండి, ఔరసుడు పుత్రసంతానములేక గతించిన యెడల, వారిద్దరును ఏకగర్భ జనితులయినట్లు యావదాస్తియును దత్తపుత్రునికి చేరునని మదరాసు హైకోర్టువారు తీరుమానించియున్నారు. (I మ. హై. 49). ఇట్టి సందర్భమున ఔరసుడు మృతి చెందిన యెడల దత్తుని హక్కు.

బంగాళా సీమయందు ఔరసపుత్రుని భాగము- అతని వితంతువు, కుమార్తె, మొదలగు వారికి చేరునుగాని దత్త పుత్రునికి చేరదు.

ద్వ్యాముష్యాయణుడు-ఔరసుడు.

**108.** ద్వ్యాముష్యాయణ రూపకముగా స్వీకరింపబడిన దత్త పుత్రుడు, ఇద్దరు తలిదండ్రుల ఆస్తికిని హక్కుదారుడగు చున్నాడు. ఇట్టివాని జనకతండ్రికి మరియొక కుమారుడు పుట్టినయెడల, ద్వ్యాముష్యాయణునికి అతని భాగములో అర్థభాగము వచ్చును. అనగా ఆస్తిని (1, 2) మూడు పాళ్లుచేసి, 1 పాలు ద్వ్యాముష్యాయణుని కియ్యవలయును. ఇద్దరు కుమారులు పుట్టినయెడల, ఆస్తిలో (1, 2, 2) అయిదవ భాగము ద్వ్యాష్యాయణునికి వచ్చును. ఇట్లని దత్తక చంద్రికయందు చెప్పబడియున్నది.

ద్వ్యాముష్యాయణుని దత్తుతండ్రికి ఔరసుడు జన్మించినయెడల, స్వీకారపుత్రునికి సాధారణముగా రాదగిన భాగమును లెక్కించి దానిలో అర్థ భాగమును ద్వ్యాముష్యాయణుని కియ్యవలయును. అనగా, ఒకడే ఔరసు డుండునపుడు, బంగాళా దేశమునందు ఆరింట ఒక పాలును, కాశీరాజ్యమున ఎనిమిదింట ఒక పాలును, మదరాసు బొంబయి రాష్ట్రములయందు పదింట ఒక పాలును ద్వ్యాష్యాయణునికి చెందును. ఈలాగున దత్తకచంద్రిక చెప్పుచున్నది.

ఉభయ కుటుంబములయందును ఔరసుడు జన్మించిన యెడల ద్వ్యాముష్యాయణునికి జనక కుటుంబమునందు భాగము లేదనియు, దత్త కుటుంబమునందు నిండుభాగము-అనగా అతడు సాధారణ దత్త పుత్రుడైన యెడల ఆయా ప్రదేశములయందు నిర్ణయింపబడియుండు భాగము- అతనికి చేరుననియు, మయూఖగ్రంథము చెప్పుచున్నది. ఒక కుటుంబమునందు మాత్రమే ఔరసుడు జన్మించిన సందర్భమును గూర్చి మయూఖగ్రంథమం దేమియు చెప్పబడి యుండలేదు.

**109.** స్వీకారాధికారమును పొందిన వితంతువు ఇంతకాలములోపల దత్తు గొనవలసిన నిర్బంధము లేదని వెనుక 64 - వ పేరాలో చెప్పియుంటిమి. ఆపె దత్తు చేసికొనువరకును భర్త యొక్క ఆస్తి అనామతుగా నిలిచియుండదు. భర్త మృతి చెందిన తక్షణమే, అతని సమీపవారసు లెవ్వరో వారికి అతని ఆస్తి చెందుచున్నది. వితంతువునకు స్వీకారాధికార మియ్యబడి యున్నను, స్వీకారము జరుగువరకును అట్టి యధికారము లేనట్లే ఎంచబడును. స్వీకారము జరిగిన పిమ్మట, సదరు ఆస్తి ముందటి వారసుల స్వాధీనములో నుండి తప్పి దత్తపుత్రునికి చెందును. కాని, ఆయాస్తి, స్వీకారాధికార మిచ్చిన యతని వారసులకు ముందుగా చేరి, తర్వాత వితంతువునకు చెందక అట్టి వారి వారసుల స్వాధీనములోనికి పోయిన పక్షమున, అటుపిమ్మట స్వీకరింపబడు దత్తపుత్రునికి చేరనేరదు. (10 మూ. ఇ. అ. 279; ఇ. లా. రి. 10 మ. 205; ఇ. లా. రి. 17 క. 122; ఇ. లా. రి. 18 క. 74, 398; ఇ. లా. రి. 14 బొం. 469, 479; ఇ. లా. రి. 20 బొం. 257. వెనుక 64 - వ పేరా చూడు). ఉదాహరణములు—

దత్తపుత్రునికి ఆస్తి చేరుట.

(1.) భర్తయొక్క ఆస్తి వితంతువునకే వారసు రీత్యా చేరి యుండినయెడల, స్వీకారము జరిగిన వెంటనే ఆపె హక్కు తప్పి సదరు ఆస్తి దత్తపుత్రునికి చెందుచున్నది. (3 మూ. ఇ. అ. 229; ఇ. లా. రి. 1 మ. 174; ఇ. లా. రి 7 బొం. 225; ఇ. లా. రి. 11 బొం. 381, 397). మృతిచెందిన యతనికి ఇద్దరు ముగ్గురు వితంతువు లుండి వారి కందరికిని అతనియాస్తి చెంది యుండినయెడల, వారిలో స్వీకారాధికారమును పొందిన యాపె దత్తు చేసికొన్న వెంటనే, వారందరి హక్కును తప్పి సదరు ఆస్తి దత్తపుత్రునికి చెందుచున్నది. (ఇ. లా. రి. 18 క. 69). పశ్చిమ

హిందుస్థానమున భర్తవలన అధికారము పొందకుండియు వితంతువు స్వీకారము చేసికొనవచ్చునుగాన్నున, ఆస్తిదారున కిద్దరు ముగ్గురు భార్యలుండునప్పుడు, తక్కిన భార్యల సమ్మతి గానక యే జ్యేష్ఠభార్య స్వీకారముచేసికొని అందరి భార్యల హక్కును తప్పించి ఆస్తి దత్తపుత్రునికి చెందించవచ్చును. (5 బొం. హై. 181, 192).

(2.) మదరాసు ప్రెసిడెన్సీలో ఒక విభాగింపగూడని జమీందారీని ఏలుచుండిన "ఏ" యను అతడు తనవితంతువునకు స్వీకారాధికారమిచ్చి మృతిచెందెను. ఆపె స్వీకారము చేసికొను లోపల, సదరు జమీందారీ ఆస్తి, "ఏ" యనువాని అవిభక్త సోదరుడగు "బీ" యనువాని స్వాధీనములోనికి చేరెను. అట్లు చేరినను, "ఏ" యనువాని వితంతువు దత్తుచేసికొన్న వెంటనే, దత్తపుత్రుడు జమీందారీకి హక్కుదారుడగును. (ఇ. లా. రి. 1 మ. 69).

(3.) మదరాసు ప్రెసిడెన్సీలో, "ఏ", "బీ" యను ఇద్దరు అవిభక్తసోదరులలో, "ఏ" యనువాడు తనభార్యకు స్వీకారాధికారమిచ్చి మృతిచెందెను. స్వీకారము చేసికొనులోపల, ఆస్తియావత్తును "బీ" యొక్క స్వాధీనములోకి పోవునుగనుక, "ఏ" యనువాని వితంతువునకు జీవనాంశపుహక్కు మాత్రము నిలిచియుండును. కాని, ఆపె స్వీకారము చేసికొన్న వెంటనే, దత్తపుత్రుడు "బీ" యనువానితోగూడ యావదాస్తికిని జాయింటు హక్కుదారుడగుచున్నాడు. (ఇ. లా. రి. 18 క. 385; ఇ. లా. రి. 15 బొం. 110).

(4.) ఈ మూడవ యుదాహరణములో, "ఏ" యనువాని వితంతువు దత్తు చేసికొనుటకుముందు "బీ" యనువాడు మృతిచెంది ఆస్తియంతయు అతని కుమారునికిగాని భార్యకు

గాని ఎవరైన దూరబంధువునకుగాని చేరిపోయినయెడల, అటుపిమ్మట ,, ఏ " యనువాని వితంతువు స్వీకరించుదత్తపుత్రునికి ఆస్తి రానేరదు. (8 బొం. హై. 114; ఇ. లా. రి. 6 బొం. 498, 505; ఇ. లా. రి. 15 బొం. 565; ఇ. లా. రి. 2 క. 295; ఇ. లా. రి. 7 క. 298; ఇ. లా. రి. 12 క. 18; ఇ. లా. రి. 22 క. 565; ఇ. లా. రి. 28 బొం. 461; కాని 29 బొం. 51 చూడుడు). అట్టి సందర్భమున చేసికొనబడు స్వీకారముగూడ చెల్లదు. (వెనుక 64 - వ పేరా చూడుడు).

(5.) ఒక ఆస్తిదారుడు మృతిచెంది ఆస్తియంతయు అతని వితంతువులకు చేరెను. పిమ్మట సదరు ఆస్తిదారుని వితంతు కోడలు తనభర్తయిచ్చియుండిన స్వీకారాధికారమునుబట్టి దత్తు చేసికొనగా, అట్టి స్వీకారమువల్ల సదరు ఆస్తికి ఏవిధమైన హక్కును కలుగజాలదని బొంబయి హైకోర్టువారు తీర్మానించిరి. (ఇ. లా. రి. 20 బొం. 250).

(6.) మదరాసు ప్రెసిడెన్సీలో, ,, ఏ " యను ఒక ఆస్తిదారుడు పెండ్లిచేసికొనకమునుపే మృతిచెందెను. ఆకాలమున అతని సవతితల్లి జీవించియుండెను గాని, ఆమెకు శాస్త్రరీత్యా వారసు హక్కు లేనందున, అతని ఆస్తి ఒకదూరపుజ్ఞాతి స్వాధీనము లోనికిచేరెను. అటుపిమ్మట, ,, ఏ " యనువాని సవతితల్లి ఆమె భర్తయిచ్చియుండిన స్వీకారాధికారమునుబట్టిదత్తు చేసికొనెను. దత్తపుత్రునికి ఆస్తి చేరనేరదని మదరాసు హైకోర్టు వారు తీర్మానించిరి. (8 మ. హై. 108). కలకత్తా హైకోర్టు వారును బొంబయి హైకోర్టువారును ఈ తీర్మానమును అంగీకరించిరి. (ఇ. లా. రి. 12 క. 246; ఇ. లా. రి. 9 బొం. 94; ఇ. లా. రి. 14 బొం. 463). ఇట్టి సందర్భమున చేసికొనబడు స్వీకారముగూడ చెల్లజాలదు. 64 - వ పేరా చూడుడు.

(7.) ఈ చెప్పబడిన 6 - వ ఉదాహరణలో, "ఏ" యను వాడు మృతిచెందునప్పుడు, అతని కన్నతల్లి జీవించియున్న యెడల, ఆపెకే శాస్త్రరీత్యా ఆస్తిచేరును. అటుపిమ్మట ఆపె దత్తు చేసికొన్నచో, సదరు ఆస్తికి దత్తపుత్రుడు హక్కుదారుడగుచున్నాడు. ("గుంటూరు కేసు" ఇ. లా. రి. 1 మ. 174).

(8.) ఒక ఆస్తిదారుడు మృతిచెందుకాలమున ఇద్దరుకుమార్తెలును విధంతు కోడలును ఉండగా, తన కుమారునికి దత్తు చేయుటకై కోడలికి అనుమతి యిచ్చుచు ఉయిలు వ్రాసి యతడు గతించెను. పిమ్మట ఆ కోడలు ఒక చిన్నవానిని స్వీకరించెను. ఆ స్వీకారము చెల్లజాలదనియు, తండ్రి మృతిచెందిన వెంటనే వారసు రీత్యా కుమార్తెలకు ఆస్తి చెందుటచేత అతడు కోడలికిచ్చిన స్వీకారానుమతి యతని జీవముతోనే ముగిసినట్లు భావింపబడవలయుననియు, స్వీకర్త వద్దినుండి గాక అతని తండ్రివద్దనుండి వారసు రీత్యా కుమార్తెలకు సంక్రమించిన ఆస్తి వారి స్వాధీనములోనుండి తొలగింపబడ జాలదనియు, బొంబయిహైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 29 బొం. 410).

స్వీకారమునకు పూర్వము ఆస్తివిషయమై జరిగింపబడిన కార్యములు.

**110.** దత్తపుత్రునికి చేరునట్టి ఆస్తియందు అతనిహక్కులు స్వీకారముచేసికొనబడిన దినమునుండి ప్రారంభించును. కాబట్టి, అంతకు పూర్వము సదరు ఆస్తిని స్వాధీనమందు గలవారు న్యాయముగా, అనగా తమకు గలిగియుండు బాధ్యతను అతిక్రమించకుండ, దాని విషయమై జరిగించిన కార్యములను రద్దుపరచుటకు దత్తపుత్రునికి హక్కులేదు. బాధ్యతను అతిక్రమించి చేయబడిన పరాధీనములు మొదలగు కార్యములను దత్తపుత్రుడు రద్దుపరచవచ్చును. (1850 సం॥ బం. స. తీ. 533; 7 మూ. ఇ. అ. 169, 178; ఇ. లా. రి. 5 క. 251; ఇ. లా. రి. 5 బొం. 630; 3 బం. స. 220, 367; 1856 సం॥ బం. స. 170;

1859 సం॥ బం. స. 421, 515 ; ఇ. లా. రి. 4 మ. 160 ; 8 మూ. ఇ. అ. 443 ; ఇ. లా. రి. 11 బొం. 609, 614 ; ఇ. లా. రి. 19 బొం. 36, 809 ; 24 స. 183 ; ఇ. లా. రి. 2 క. 307 ; ఇ. లా. రి. 16 క. 40)

హిందూ వితంతువుచేయునట్టి ఆస్తి పరాధీనములు అనావశ్యకమైనను ఆపె జీవితకాలమువరకు, లేక ఆపె వితంతుత్వము నిలిచియున్నంతవరకు, నిరాక్షేపణగా చెల్లదగును కాబట్టి, స్వీకారమునకు పూర్వము ఆస్తి విషయమై ఆపె జరిగించిన కార్యములను పైగడువులోపల ఆక్షేపించుటకుగాని రద్దుపరచుటకుగాని దత్తపుత్రునికి హక్కు లేదని ఒక మదరాసు కేసులో జస్టిసర్ భాష్యం అయ్యంగారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 26 మ. 148). కాని, యీ విషయమై తిరుగా వివాదము కలిగినప్పుడు, ఆస్తి విషయమై హక్కు కలిగించునట్టి వితంతుత్వముయొక్క జీవితము స్వీకారముతో ముగియలేదా ? యను విషయమును చక్కగా తర్కించవలసి యుండును. (కాని, ఇ. లా. రి. 33 బొం. 88 చూడుము)

దత్తపుత్రు డేర్పడక మునుపు ఒక జమీందారీసొత్తు అతని పినతండ్రి స్వాధీనములోనుండి, స్వీకారమునకు పిమ్మట దత్తపుత్రునికి చెందెను. పినతండ్రి స్వాధీనములోనుండిన కాలములో సదరు జమీందారీ ఆస్తియొక్క ఆదాయమును వెచ్చపెట్టుటకు అతడు లా ప్రకారము సంపూర్ణ స్వాతంత్ర్యము కలిగియుండెను గావున, దాని విషయమై లెక్క చెప్పుటకు అతడు బద్ధుడు కాడని ప్రివీకౌన్సిలువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 1 మ. 69).

**111.** భార్యకు స్వీకారాధికార మిచ్చునప్పుడు, ఆపె యావజ్జీవము ఆస్తిని అనుభవించి, అటుపిమ్మట దత్తపుత్రుడు పొందవలెనని భర్త షరతు ఏర్పరచినయెడల, అట్టిషరతు చెల్లుటకు

దత్తపుత్రుని హక్కు విషయమై ఒండుదీలు.

ఆక్షేపణయుండదు (1855 సం॥ బం. స. 139; 1859 సం॥ బం. స. 162; ఇ. లా. రి. 8 క. 357).

దత్తు చేసికొను కాలమునందు, దత్తుతండ్రి, తన ఆస్తిలో కొంతభాగము విషయమై కొన్నికొన్ని యేర్పాట్లు చేసి, తక్కిన భాగము మాత్రమే దత్తపుత్రునికి చేరునట్లు దత్తుని జనకతండ్రితో ఒడంబడిక చేసికొనిన పక్షమున, దానివల్ల దత్తుడు బద్ధుడగునని తీరుమానింపబడి యున్నది. (ఇ. లా. రి. 12 మ. 490; ఇ. లా. రి. 21 మ. 13; ఇ. లా. రి. 14 మ. 172; 6 బొం. హై. 224; ఇ. లా. రి. 19 బొం. 428). కాని, యావదాస్తియును ఇతరులకు చెందునట్లు ఉయిలువ్రాసి, పిమ్మట దత్తుగొన్న యెడల, సదరు దత్తువలన ఉయిలు రద్దుచేయబడినట్లు బహుశః ఎంచబడును. (6 బొం. హై. 230; 6 మూ. ఇ. అ. 320).

తాను జీవించియుండువరకును తన యనుభవములోనే ఆస్తి యుండునట్లును, తన తర్వాత దత్తపుత్రునికి చెందునట్లును, దత్తుని జనక తండ్రితోగాని జనక తల్లితోగాని ఒక వితంతువు స్పష్టముగా ఒడంబడిక చేసికొని దత్తుగొన్న యెడల, అట్టి ఒడంబడిక చెల్లునని బొంబాయి హైకోర్టువారు తీరుమానించియున్నారు. (11 బొం. హై. 199; ఇ. లా. రి. 11 బొం. 398; ఇ. లా. రి. 19 బొం. 36). కాని, యీ విషయమునుగూర్చి ప్రివీకౌన్సిలువారు సందేహాభిప్రాయులై, అట్టి యొడంబడిక బొత్తిగా రద్దుకాదనియు, దత్తునకు యుక్తవయస్సువచ్చిన పిదప అతడు సమ్మతించిన యెడల చెల్లదగుదనియు, తీరుమానించిరి. (ఇ. లా. రి. 2 మ. 91. కాని, ఇ. లా. రి. 16 క. 56 చూడుడు). అట్టి యొడంబడికవలన దత్తపుత్రుడుబద్ధుడు కాజాలడని కొన్ని కేసులలో మదరాసుహైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 4 మ. 160; ఇ. లా. రి. 16 మ. 400). కాని, అట్టి యొడంబడిక మొత్తము మీద న్యా

యమైనదనియు, దత్తపుత్రునికి లాభకరమైనదనియునై, దానికి లోబడియే స్వీకారము సమ్మతింపబడి స్వీకారదస్తావేజులో అది స్పష్టముగా వివరింపబడినప్పుడు, చెల్లదగునని ఫుల్ బెంచివారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 27 మ. 577). ఒక కేసులో, కుటుంబమునకు గలిగియుండిన 27 యకరముల ఆస్తిలో 16 యకరములను ఇతరులకు ఇచ్చివేయగల స్వాతంత్ర్యము తనకు నిలుపుకొనుచు దత్తుని జనకతండ్రితో దత్తు తల్లి ఒడంబడిక చేసికోగా, అట్టి యొడంబడిక అక్రమమైనదనియు దాని వల్ల దత్తుడు బద్ధుడు కాజాలడనియు బొంబయి హైకోర్టువారు తీరుమానించిరి. (8 బొంబయి లారిపోర్టర్ 346).

దత్తపుత్రునికి యుక్తవయస్సు వచ్చిన పిమ్మట అతడు తన ఆస్తి విషయమై దత్తు తల్లితో చేసికొను ఒడంబడికలు చెల్లుటకు ఆక్షేపణ లేదు. (3 బం. స. 387 ; 15 స. 63).

**112.** కుటుంబములో ఎవరును స్వీకారము చేసికొనగూడదని ఒకరికొకరు చేసికొను ఒడంబడిక చెల్ల నేరదు. అట్టి యొడంబడికను అతిక్రమించి చేసికొనబడిన స్వీకారము రద్దుకానేరదు. (ఇ. లా. రి. 9 మ. 499. వెనుక 63 - వ పేరా చివర చూడుడు.) దత్తుగూడదని ఒడంబడిక.

**113.** దత్తు నిమిత్తమై చిన్నవాని జనకతండ్రికి దత్తుగొను తండ్రి సొమ్మిచ్చుట మిక్కిలి నింద్యమయ్యును, అన్ని అంశములలో నిరాక్షేపణగా చెల్లునట్టి స్వీకారము ఆకారణముచేత రద్దు కాజాలదు. (ఇ. లా. రి. 29 మ. 161) జనకతండ్రికి సొమ్మిచ్చుట.

**114.** దత్తపుత్రునియొక్క హక్కులు, స్వీకారమునకు పిమ్మటనే కలుగునుగాని అంతకుముందు కలుగజాలవు. కాబట్టి, ఫలానా చిన్నవానిని దత్తు చేసికొని సొత్తంతయు వానికియ్యవలసినదని భర్త యేర్పాటు చేసిపోయినను, వితంతువు దత్తు చేసికొనక ఊరకున్న యెడల, సదరు పిల్లవానికి ఏవిధమయిన హ

క్కుగాని కలుగనేరదు. (ఇ. లా. రి. 12 బొం. 202; ఇ. లా. రి. 16 మ. 355; ఇ. లా. రి. 11 క. 463; ఇ. లా. రి. 12 క. 688).

దత్త చెల్లనియెడల, దత్తపుత్రుని హక్కు.

**115**. దత్తు అశాస్త్రీయమై చెల్లనియెడల, దత్తునికి దత్త కుటుంబమునందు ఏ విధమగు హక్కులును కలుగజాలవు. కాని, జనక కుటుంబమునందలి హక్కులు నిలిచియుండును.

దత్తు చెల్లనియెడల దత్తుకుటుంబమునుండి జీవనాంశమును పొందునట్టి హక్కు దత్తపుత్రుడు కలిగియుండునని పూర్వకాలమున కొన్ని తీర్పులు చేయబడి యుండెను. (I మ. హై. 367, 45). కాని యిటీవల ఆ తీర్పులు రద్దుచేయబడి దత్తు చెల్లనపుడు దత్తు కుటుంబమునందే హక్కును కలుగక జనకకుటుంబమునందలి హక్కులు మాత్రము నిలిచియుండునని తీరుమానింపబడినది. (I మ. హై. 363; 12 బొం. హై. 397).

దత్తు అశాస్త్రీయమై చెల్లకున్నను, దాన పరిగ్రహములు క్రమముగా జరిగియుండిన యెడల దత్తునికి జనక కుటుంబముతో సంబంధము సంపూర్ణముగా వదిలిపోవుననియు, దత్తు కుటుంబమునందే హక్కులును కలుగకున్నను జనక కుటుంబమునందలి హక్కులు నిలువనేరవనియు - దాన పరిగ్రహములు క్రమముగా జరుగని యెడల, బ్రహ్మ క్షత్రియ వైశ్యజాతులలో ఉపనయనమునకు పూర్వమును శూద్రులలో వివాహమునకు పూర్వమును దత్తుడు జనక కుటుంబములో చేరవచ్చుననియు, పిమ్మట చేరుటకు సాధ్యముకాదనియు - కలకత్తా హైకోర్టువారు అభిప్రాయము తెలిపిరి. (1856 - 59 సంIIల కలకత్తా సుప్రీంకోర్టుతీర్పులు, 137 పేజి; 13 క. హై. అప్పెండిక్సు, 42).

దత్తు చెల్లనియెడల, దత్తపుత్రునికి చేయబడియుండు దానములు చెల్లునా

**116**. దత్తు చెల్లని పక్షమున, దత్తపుత్రునికి చేయబడి యుండు దానములు చెల్లునా, చెల్లవా?—యీ విషయమును నిర్ణయించుటకు ఒకటే ప్రధానవిధి కలదు. ఫలానావానికి అని

పేరుచెప్పి దానము చేయబడినయెడల, దానపత్రికలో అతఁడు దత్తపుత్రుఁడుగా వివరింపబడియుండి పిమ్మట ఆ దత్తు చెల్లని దత్తుగా ఏర్పడినను, దానము చెల్లుచున్నది. కాని, అతడు దత్తపుత్రుడను నమ్మికవల్లనే దానము చేయబడినదనియు, లేనియెడల చేయబడి యుండదనియు, స్పష్టముగా కనుపడునప్పుడు, సదరు దానము చెల్ల నేరదు. ఉదాహరణములు—

(1.) "పురాణంపుల్లయ్యగారి దత్తపుత్రుడగు రామస్వామికి పదివేల రూపాయలు ధానముగా ఇచ్చితిని" — అని మరణశాసనములో వ్రాయబడిన యెడల, పిమ్మట రామస్వామియొక్క దత్తు చెల్లని దత్తుగా ఏర్పడినను, దానము చెల్లుచున్నది.

(2.) "రామస్వామి యను చిన్నవానిని నేను స్వీకరించితిని గనుక అతని స్వీకారమునకు ఆవశ్యకమగు కర్మలను నా భార్య జరుపవలసినది. మరియు, అతఁడు జీవించియుండగా నాభార్య మరి యెవ్వరిని స్వీకరించగూడదు. అతనికే నా ఆస్తి చేరవలసినది" — అని మరణ శాసనము (ఉయిలు) వ్రాయబడియెను. అటు పిమ్మట, అతనిభార్య స్వీకార కర్మలేమియు జరిగించక పోయినను, సదరు దానము చెల్లునని ప్రివీకౌన్సిలువారు తీరుమానించియున్నారు. (26 స. 91; ఇ. లా. రి. 19 క. 452; ఇ. లా. రి. 24 అ. 140 కూడ చూడుడు).

(3.) "ఏ" యనువాఁడు ఒక పిల్లవానిని పసితనమునుండియు తన అభిమాన పుత్రునిగా పెంచి, అతనికి తన యావదాస్తియును ఉయిలువ్రాసి మృతిచెందెను. ఈ పిల్లవాఁడు శాస్త్రరీత్యా దత్తపుత్రుఁడు కానందున, పెంపుడు తండ్రికి ఉత్తరక్రియలు జరిగించునట్టి యోగ్యత కలిగియుండఁడు. అయినను, దానము చెల్లుచున్నది. (1861 సం॥ మదరాసు తీర్పులు, 124; 1 మ. హై. 393).

(4) ఈ చెప్పబడిన 3-వ యుదాహరణములోని పిల్లవాడు శాస్త్రరీత్యా తన స్వీకార పుత్రుడేయనియు, తన ఉత్తరక్రియలు నెరవేర్చుటకు అర్హుడనియు "ఏ" యనువాడు భావించియుండెను. అట్టిభావము నిష్ప్రయోజనమయ్యెను, దానము రద్దుకానేరదు. ఏలనంటే — చిన్నతనమునుండియు పెంచిన అభిమానమువల్లను అపేక్షవల్లను సదరు దానము చేయబడి యుండవచ్చును.

(5.) "ఏ" యనువాడు ఒక పిల్లవానిని దత్తు చేసికొని, "నిన్ను నేను శాస్త్రరీత్యా స్వీకరించితిని కాబట్టి, నాకును నా పితృపితామహులకును శాస్త్రోక్త కర్మలు జరిగించి నాయనంతరము నా యావదాస్తికిని హక్కుదారుడవు కావలసినది" — అని ఒక అంగీకార పత్రిక వ్రాసెను. "ఏ" యనువాడు మృతి చెందిన పిమ్మట, స్వీకారము చెల్లజాలనిదిగా ఏర్పడెను. సదరు దానమునకు స్వీకారమే కారణమనియు, స్వీకారము చెల్లక తనకును తన పితృపితామహులకును శాస్త్రోక్త కర్మలు జరిగించునట్టి యోగ్యతలేని పక్షమున ఆ పిల్లవానికి తన ఆస్తి చేర్చవలెనను ఉద్దేశము లేశమును "ఏ" యను వానికి ఉండలేదనియు నిశ్చయించి, సదరు దానము చెల్లదని ప్రివీకౌన్సిలువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 11 క. 463; ఇ. లా. రి. 12 క. 686; ఇ. లా. రి. 12 బొం. 185, 202; ఇ. లా. రి. 15 బొం. 573; ఇ. లా. రి. 16 మ. 355; చూడు ఇ. లా. రి. 19 క. 513. ఇ. లా. రి. 23 బొం. 271).

(6.) పిఠాపురం కేసులో రాజాగారికిని దత్తపుత్రునికిని కలహములు పొసగిన కొంతకాలమునకు ఆయనకు ఔరసుడు సంభవమయ్యెను. ఈ ఔరసుడు తన యావదాస్తికిని హక్కుదారుడని వక్కాణించి, దత్తపుత్రునికి జీవనాంశమును కొన్ని కొన్ని దానములును ఏర్పాటుచేసి, తక్కిన యావత్తు జమీందారీ ఆస్తి

యును తన ఔరస పుత్రుడగు ఫలానా చిన్నవానికి దానముగా ఇచ్చివేసితినని ఉయిలువ్రాసి కొంతకాలమునకు రాజా మరణించెను. ఉయిలు చెల్లగూడదనియు, ఔరసుడు కల్పితుడనియు రాజాకుగాని రాణీకిగాని నిజముగా జన్మించినవాడు కాడనియు, జమీందారీ తనకు చెందవలెననియు, దత్తుడు దావా తీసికొని రాగా, క్రింది కోర్టువారు అన్ని అంశములును అతని పక్షము గా తీరుమానించిరి. కాని, యీ తీరుమానమును హైకోర్టు వారు ఉయిలు పాయింటు మీద రద్దుపరచిరి. ప్రివీకౌన్సిలు వారును హైకోర్టువారితో ఏకీభవించిరి. ఔరసుడు కల్పితుడేయనియు, కల్పితుడని రాజాకు తెలిసియే బూటకముగా ఔరసుడని ఉయిలులో వ్రాసెననియు - ఈ అంశములు సన్మతించిననుగూడ, ఉయిలు లా ప్రకారము చెల్లదగినదై యున్నందున దానిలో స్పష్టముగా వివరింపబడియుండు దానము చెల్లక తప్పదనియు - తీరుమానించిరి. (ఇ. లా. రి. 20 మ. 167; ఇ. లా. రి. 22 మ. 383 — ప్రి. కౌ. — చూడుము ఇ. లా. రి. 24 మ. 214). అవిభాజ్యమగు ఆస్తిని ఈ ప్రకారము దానమిచ్చివేయు స్వాతంత్ర్యము ఇటీవల “ ఇంపార్టిబిల్ ఎస్టేట్స్ ఆక్టు ” వల్ల రద్దు చేయబడెను.

(8.) కృత్రిమ స్వీకారము వగైరా.

**117.** కృత్రిమ స్వీకారము మిథిల రాజ్యములో మాత్రము నిలిచియున్నది. (2 బం. స. తీ. 173). మలయాళ దేశమునందు నంబూదిరి బ్రాహ్మణులలో సాధారణ స్వీకారములును కృత్రిమ స్వీకారములును గూడ వాడుకలో నున్నవి. (ఇ. లా. రి. 11 మ. 174). కృత్రిమ స్వీకారము.

కృత్రిమ స్వీకారముయొక్క పద్ధతి ప్రకారము భార్యాభర్తలిరువురును చేరిగాని ప్రత్యేకముగా గాని స్వీకారము చేసికొన

వచ్చును. భర్త మృతి చెందిన పిమ్మట అతని పేర స్వీకారము గొనుటకు వితంతువు అర్హురాలు కాదు. కాని, తనకే స్వీకారము చేసికొనవచ్చును.

స్వీకార్యుడు ఒకటే జాతికి చేరియుండవలెను. ఇదితప్ప మరి యే నియమముగాని నిర్బంధముగాని లేదు. అతనికి ఎంత వయసైనను సరే, ఉపనయనమును వివాహమునుగూడ జనకకుటుంబమునందు జరిగియుండినను సరే, అతని తలిదండ్రు లిద్దరును మృతిచెంది యుండినను సరే స్వీకారము చెల్లును. (8 స. 155; 6 బం. స. తీ. 192; 3 బం. స. తీ. 145). అన్న, తమ్ముడు, మేనల్లుడు, ఇట్టివారినిగూడ స్వీకరింపవచ్చును. (3 బం. స. తీ. 144; 6 బం. స. తీ 192). తండ్రినిగూడ స్వీకరింపవచ్చును. (1 మొక్నాటన్ 76). ఏకపుత్రుడుగూడ స్వీకరింపబడవచ్చును. (3 బం. స. తీ. 197).

కృత్రిమ స్వీకారమునకు ఏ విధమైన కర్మలును ఆవశ్యకము కావు. ఏదైనను మంచిదినమునాడు, స్వీకర్తయును స్వీకార్యుడును స్నానము చేసిన మీదట, "నీవు నా పుత్రుడవుగా నుండవలయును" — అని స్వీకర్త అడిగి, "నేను నీ పుత్రుడనైతిని" — అని స్వీకార్యుడు బదులు చెప్పిన తోడనే స్వీకారము ముగియుచున్నది. స్వీకర్త స్వీకార్యుల యిరువురి సమాధానమే ప్రధానము. (1 బం. స. తీ. 9; 6 బం. స. తీ. 271).

కృత్రిమ స్వీకార పుత్రునకు జనకకుటుంబమునందలి వారసు హక్కులు నశింపవు. అతని యింటిపేరు భేదముగానున్న యెడల అది మారజాలదు. స్వీకార కుటుంబమునందు స్వీకర్తకు మాత్రమే అతడు వారసుదారు డగునుగాని, స్వీకర్తయొక్క తండ్రి మొదలగు వారికి వారసుదారుడు కాడు. (1 బం. స. తీ. 15; 3 బం. స. తీ. 307; 2 బం. స. తీ. 23; 8 స. 155). అతని

కుమారులును స్వీకర్తకు వారసులు కాజాలరు. (25 స. 255). నంబూదరి బ్రాహ్మణులలో మాత్రము కృత్రిమ స్వీకార పుత్రుడు పెండ్లియాడి సంతానమును బడసి స్వీకర్తయొక్క వంశమును నిలుపునట్లు నియమించుకొనబడు చున్నాడు. (ఇ. లా. రి. 11 మ. 158, 175, 179).

భార్యగాని భర్తగాని తనకు మాత్రమే ప్రత్యేకముగా స్వీకారము చేసికొన్నపుడు, తల్లియొక్కగాని తండ్రియొక్కగాని ఉత్తరక్రియలు మాత్రమే జరుపుటకు బద్ధుడై, ఆపెయొక్క లేక అతనియొక్క ఆస్తికి మాత్రమే స్వీకారపుత్రుడు వారసుదారుడగును. (2 బాం. స. తీ. 23; 7 స. 500; 8 స. 155).

**118.** సింహళ ద్వీపమునందలి జాఫ్నా దేశపు అరవవారిలో వాడుకగానుండు స్వీకారము, ఇంచుమించుగా అన్ని అంశములయందును కృత్రిమ స్వీకారమునే పోలియున్నది. మరియు వారిలో స్వీకార పుత్రుడు స్వీకర్తయొక్క కుమార్తెను వివాహమాడవచ్చును. ఇంతేగాక, ఒక కుమారుని ఒక కుమార్తెను గూడ స్వీకరించి, యిద్దరికి వివాహము చేయు వాడుకయు గలదు. జాఫ్నా దేశములో స్వీకారము.

**119.** మదరాసు ప్రెసిడెన్సీయందు శూద్రజాతి వారిలో — ముఖ్యముగా కమ్మవారు, కాపులు, రెడ్లు, వీరిలో — ఇల్లరికపు అల్లుని నియమించుకొను వాడుక, అనగా, అల్లునే దత్తపుత్రుని వలె ఇంట నుంచుకొను వాడుక యేర్పడియున్నది. ఇల్లరికపు అల్లుడు

ఇల్లరికపు అల్లునికి జనక కుటుంబమునందలి హక్కులు నశింపవు. (ఇ. లా. రి. 6 మ 267). మామగారు జీవించియుండగా ఆస్తి విభాగముకోరునట్టి హక్కుకలదో లేదో ఆయా ప్రదేశములందలి యాచారములను బట్టియుండును. మామగారి మరణానంతరము అతని ఆస్తికి ఇల్లరికపు అల్లుడు హక్కుదారుడగును. (ఇ. లా. రి. 4 మ. 272; ఇ. లా. రి. 21 మ. 220; ఇ. లా. రి.

17 మ. 287). మామగారి వద్దనుండి ఇల్లరికపు అల్లునికి వచ్చు ఆస్తి అతని స్వార్జితముగా నెంచబడును. (7 మ. హై. 25). కాబట్టి దానివిషయమై అతనికి సంపూర్ణ పరాధీన స్వాతంత్ర్యము కలిగియుండును. మఱియు ఇల్లరికపు అల్లుని కిచ్చిన మామగారి ఆస్తి అతని స్వంత వారసులకే చెందునుగాని మామగారి వారసులకు పోజాలదు. (ఇ. లా. రి. 12 మ. 442). ఇల్లరికపు అల్లుడు ఏర్పరచు కొనబడిన పిమ్మట, మామగారికి పుత్రసంతానము కలిగిన యెడల, అతనికిగూడ పుత్రులతో సమానముగా భాగమువచ్చును. (ఇ. లా. రి. 4 మ. 272; ఇ. లా. రి. 21 మ. 226; ఇ. లా. రి. 17 మ. 287).

ఇల్లరికపు అల్లుడును ఔరసపుత్రుడును కలిసి యేక కుటుంబముగానున్నను ఆస్తిలో వారి భాగములు ప్రత్యేకములుగానే భావింపబడుటచేత, వారిలోనొకరు మృతిచెందినప్పుడు అతని భాగము అతని స్వంతవారసులకే చెందును గాని రెండవవానికి చెందదు. (ఇ. లా. రి. 9 మ. 114; ఇ. లా. రి. 17 మ. 114).

కన్యా స్వీకారము.

**120.** వేశ్యలలోతప్ప మరియే జాతివారిలోను కన్యాస్వీకారము చేసకొను వాడుక లేదు. ఈ మధ్య, పూనా పట్టణములో ఒక బ్రాహ్మణుడు ఒక కన్యను పెంచుకొని ఆపె తన స్వీకృతకుమారి యని వాదించెనుగాని, సదరు స్వీకారము చెల్లదని కోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 13 బొం. 690).

వేశ్యలలో వాడుక

**121.** దక్షిణ పశ్చిమ హిందూస్థానములయందు వేశ్యలు కన్యాస్వీకారము చేసికొనునట్టి వాడుక యేర్పడియున్నది. అట్టి స్వీకారములు చెల్లునని మదరాసు హైకోర్టువారును (ఇ. లా. రి. 11 మ. 393; ఇ. లా. రి. 12 మ. 214; ఇ. లా. రి. 13 మ. 133) - చెల్లగూడదని కలకత్తా బొంబాయి హైకోర్టువారును (2 మార్లీస్ డైజెస్ట్, 133; ఇ. లా. రి. 4 బొం. 545) -

తీరుమానించి యున్నారు. ఇటీవల, బొంబాయి హైకోర్టువారు అట్టి స్వీకారములు చెల్లుననియే అభిప్రాయ మిచ్చియున్నారు. (ఇ. లా. రి. 14 బొం. 90).

వేశ్యలు చేసికొను కన్యాస్వీకారమునకు ఏ విధమయిన కర్మలుగాని దాన పరిగ్రహణములుగాని ఆవశ్యకము కావు. ఫలానా జాతి కన్యనే స్వీకరింపవలెనను నియమము గూడ లేదు. ఆకన్యను సొమ్మిచ్చి పుచ్చుకొన్నను మరి యే విధముగా తెచ్చికొన్నను సరే, కుమార్తెగా భావించి పెంచుటయే ఆవశ్యకము. (1856 సం॥ మదరాసు తీర్పులు, 65; ఇ. లా. రి. 13 మ. 133).

ఒక్క కన్యనే స్వీకరింపవచ్చును గాని, యిద్దరు ముగ్గురు కన్యలను స్వీకరింప గూడదనియు, విశేషాచారము ఏర్పడి యుండిన యెడల ఇద్దరు ముగ్గురు కన్యలను స్వీకరింపవచ్చుననియు తీరుమానింపబడి యున్నది. (ఇ. లా. రి. 11 మ. 393; ఇ. లా. రి. 12 మ. 214).

**122.** వేశ్యలు సర్వసామాన్యముగా వ్యభిచారవృత్తివలన జీవించువారయ్యును, వారు కన్యాస్వీకారము చేసికొనునప్పుడు వ్యభిచారవృత్తి నిమిత్తమే చేసికొనిరని నిస్సందేహముగా చెప్పుటకు వీలులేదు. ఆ కన్య తమ సొత్తునకు వారసురాలుగా నుండవలెననిగాని, ఆ చిన్నదానిని పెంచి పెద్దదానినిచేసి వివాహము చేయవలెననిగాని, గాననాట్యాభినయాదివృత్తులు గఱపవలెననిగాని, యిట్టి సదుద్దేశముతో గూడ స్వీకారము జరుగనచ్చును. ఈ హేతువుచేతనే, వేశ్యలలో కన్యాస్వీకారములు చెల్లుననితీర్పులు చేయబడినవి. (ఇ. లా. రి. 26 బొం. 491). వ్యభిచారవృత్తి నిమిత్తము కన్యా స్వీకారము.

వ్యభిచారవృత్తి నిమిత్తము కన్యను స్వీకరించుట పినల్ కోడ్డు 372, 373 సెక్షనుల ప్రకారము నేరమగుచున్నది. ఈ నేరమునకు 10 సం॥లవరకు ఖైదుశిక్ష విధింపబడి యున్నది. కాబట్టి, వేశ్య

లు పెంచుకొను కన్యల విషయమై, వ్యభిచారవృత్తి నిమిత్తము వారిని పెంచుచున్నట్లుగాని 16 సం॥ల యీడులోపల కన్నెరికము చేయించి వారిని వ్యభిచార వృత్తికి లోబరచినట్లుగాని రుజువు కనుపడిన యెడల, పీనల్ కోడ్డులో చెప్పబడిన ప్రకారము శిక్ష విధింపబడును. 16 సం॥ల యీడు లోపల వేశ్యాకన్యలకు కన్నెరికము చేసిన పురుషులును వారితో వ్యభిచార వృత్తియందు సంచరించు పురుషులును గూడ దుష్కృకుదాసులుగా శిక్షకు పాత్రులగుదురు.

---

# ప్రకరణము 4.

—:o:—

## మైనర్ల సంరక్షణ.

**123.** మైనర్లు అనగా యుక్తవయస్సు రానివారు. పది యారు సంవత్సరముల యీడున స్త్రీపురుషులకు బాల్యదశ వదలి యుక్తవయస్సు వచ్చినట్లు ఎంచబడునని హిందూ ధర్మశాస్త్రములలో చెప్పబడి యున్నది. (ఇ. లా. రి. 1 క. 108; 12 బాం. హై. 281, 290). కాని, యిప్పుడీ విషయమై 1875 సం|| 9 నెం|| ఇండియన్ మెజారిటీ ఆక్టు అమలులో నున్నది. ఈ చట్టము ప్రకారము, బ్రిటిష్ ఇండియాలో నివసించియుండు జనులకందరికిని 18 సం||ల వయస్సు ముగిసిన వెంటనే యుక్తవయస్సు వచ్చినట్లు ఎంచబడును; కోర్ట్ ఆఫ్ వార్డ్స్‌వారి సంరక్షణ క్రిందనుండు మైనర్లు మాత్రము 21 సం||ల వయస్సు ముగిసిన పిమ్మట యుక్తవయస్కులుగా నెంచబడుదురు. యుక్తవయస్సు.

**124.** యుక్తవయస్సురాని బిడ్డల రక్షకత్వపు హక్కు హిందూ ధర్మశాస్త్రముల ప్రకారము మొదట తండ్రిది; పిదప తల్లిది; తల్లి లేనప్పుడును సంరక్షకురాలుగా నుండుటకు తగియుండనప్పుడును, అన్న, పినతండ్రి, పెత్తండ్రి మొదలగు తండ్రివంక వారును - వారి వెనుక తల్లివంకవారును - సంరక్షకులగుదురు. (1852 సం|| మదరాసు తీర్పులు, 105; 1854 సం|| బం. స. తీ. 329). బిడ్డల రక్షకత్వపు హక్కు.

మిథిల దేశమునందు చెల్లుచుండెడి ఆచారముల ప్రకారము యుక్తవయస్సురాని బిడ్డలను పెంచి పోషించెడి విషయమున తండ్రికంటె తల్లికే యెక్కువ స్వాతంత్ర్యము కలదని తీర్మానింపబడి యున్నది. (ఇ. లా. రి. 5 క. 43).

అవిభక్త కుటుంబమునందు మైనరునకు చేరవలయు ఆస్తి యెవరి స్వాధీనములో నున్నను, అతని శరీర సంరక్షణహక్కు మాత్రము తల్లికే చెందుచున్నది. (3 మ. హై. 69; ఇ. లా. రి. 5 క. 219; 1847 సం॥ బం. స. తీ. 557).

బిడ్డల రక్షకత్వము విషయమై, పినతండ్రి పెత్తండ్రి మొదలగు వారికంటె సవతితల్లికి ఎక్కువ హక్కు కలదు. (1 మార్లీ డైజెస్ట్, 275. ఈ విషయమై 2 బాగో. 144, 7 స. 321 కూడ చూడవలసినది.)

వ్యతిరేకమగు కారణము కనుపడనప్పుడు చంటిపిల్ల రక్షకత్వము విషయములో పితామహునికంటె కన్నతల్లికే యెక్కువ హక్కుగలదనియు, ఆమె కులమునుండి వెలివేయబడిన కారణమువల్ల సదరు హక్కు నశింపదనియు, అలహాబాదు హైకోర్టు వారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 28 అ. 233).

ఉయిలు మూలముగా తన మైనరు బిడ్డలకు సంరక్షకులను ఏర్పరచునట్టి స్వాతంత్ర్యము తండ్రికి లేదని బొంబయి హైకోర్టు వారు తీరుమానించి యున్నారు. మరియే విధముగానైన ఏర్పరచ వచ్చునా అను అంశమును తీరుమానింపరైరి. (9 బొంబయి లారిపోర్టర్ 553).

లంజబిడ్డల రక్షకత్వము.

**125.** ఉంచుకొన్న లంజకు పుట్టిన బిడ్డలకు శాస్త్రరీత్యా లంజయే సంరక్షకురాలు. కాని, తండ్రియొక్క సంరక్షణలో నైనను తండ్రి యేర్పరచిన వారి సంరక్షణలో నైనను వారు పెరుగుచుండిన యెడల, తల్లియొక్క హక్కు తప్పిపోవును. అటుపిమ్మట తన బిడ్డలను తనయొద్దకి గొనిపోవుటకై లంజవలన దావా తేబడిన యెడల అది అంగీకరింపబడదు. 1860 సం॥ మ. తీ. 154; ఇ. లా. రి. 4 క. 374; ఇ. లా. 19 మ. 461). ఇంకను లంజరికమువల్లనే ఆ మనిషి జీవించుచుండు నపుడును, దాసి

సంరక్షణ బిడ్డల క్షేమమునకు భంగకరముగా నుండునప్పుడును, తండ్రి యేర్పరచిన సంరక్షణను తప్పించుటకు కోర్టువారు బొత్తిగా ఇష్టపడరు. (ఇ. లా. రి. 12 మ. 67).

**126.** మైనరు వితంతువునకు శాస్త్రరీత్యా ఆమె భర్త యొక్క సపిండులే సంరక్షకు లగుచున్నారు. ఆమె తండ్రిగాని అన్న దమ్ములుగాని తండ్రివంకవారు గాని శాస్త్రరీత్యా సంరక్షకులుగారు. (ఇ. లా. రి. 16 క. 584). మైనరు వితంతువు యొక్క రక్షకత్వము.

**127.** మైనర్లను సంరక్షించు స్వాతంత్ర్యము శాస్త్రరీత్యా తండ్రి, తల్లి, అన్న మొదలగు వారికి చెందియున్నను, వీరి దుష్ప్రవర్తనము మున్నగు కారణములవలన సదరు మైనర్ల శ్రేయస్సునకును క్షేమమునకును హానికరముగా నుండునట్టి సందర్భముల యందు, ఎవరైనను బంధువులు గాని స్నేహితులు గాని కోర్టులో పిటిషను దాఖలుచేసి సదరు సంరక్షకులను తప్పించి మరియొకరిని సంరక్షకులనుగా ఏర్పాటు చేయించవచ్చును. (3 మ. హై. 69; 14 మూ. ఇ. అ. 309; ఇ. లా రి. 1 అ. 549, 598). రక్షకత్వపు హక్కు ఎప్పుడు తప్పిపోవును ?— సంరక్షకుల దుష్ప్రవర్తనము.

మైనర్ల రక్షకత్వము మొదలగు అనేక విషయములగూర్చి హిందూ ధర్మశాస్త్రములలో విస్తరించి చెప్పబడనందున, 1890 సం॥ 8 నెం॥ గార్డియన్ అండ్ వార్డ్స్ ఆక్టు ముఖ్యాధారముగా నున్నది.

**128.** కుమారుని దత్తిచ్చిన పిమ్మట కన్న తలిదండ్రుల రక్షకత్వపు హక్కు తప్పిపోవుచున్నది. అయినను, దత్తు తలిదండ్రులు గాని, వారి యిలాకా వారుగాని, దత్తపుత్రుని యెడల విరోధభావము వహించి అతనిని హింసించుచుండు నప్పుడును, మరి యేకారణము వల్లనైనను వారి సంరక్షణ అతని క్షేమమునకు హానికరముగా నుండునప్పుడును, జనకతండ్రి మొదలగు వారు రక్షకులు కావచ్చును. (3 బొం. హై. 1). దత్తిచ్చుట.

తల్లి పునర్వివాహము చేసికొనుట.

**129.** వితంతువు పునర్వివాహము చేసికొన్న యెడల, ప్రథమ భర్తవలన ఆమెకు కలిగిన బిడ్డలను ఆమె రక్షణలోనుండి తప్పించి తమ సంరక్షణలో నుంచవలయునని కోరి ప్రథమభర్త బంధువులు కోర్టులో పిటిషను దాఖలు చేయవచ్చును. దాని మీద కోర్టువారు వారియొద్ద తగిన జామీను పుచ్చుకొని, సదరు బిడ్డలను వారికి ఒప్పగించగలరు. (1856 సం॥ 15 నెం॥ చట్టము, 3 సె.)

తల్లి అన్యమతము లో చేరుట.

**130.** బిడ్డలయొక్క మతము తండ్రిమతము ననుసరించియే యుండవలయును. కాబట్టి, తల్లి కులభ్రష్టురాలైనప్పుడును, క్రీస్తుమతము మొదలగు అన్యమతములలో చేరినప్పుడును, మయినరు బిడ్డల విషయమై రక్షకత్వపు హక్కు ఆమెకు తప్పిపోవును. ఆమె యొద్దనేయుండి ఆమె మతమునే అవలంబించుటకు బిడ్డలు ఇష్టపడినను గూడ, వారిని ఆమె సంరక్షణనుండి కోర్టువారు తొలగింతురు. కాని, బిడ్డలు డాదాపు యుక్తవయస్సు వచ్చినవారును యుక్తాయుక్త వివేకము కలిగిన వారునై తల్లి సంరక్షణలోనుండి వారిని తప్పించుట వారి శ్రేయస్సునకు భంగకరముగా నుండునట్లు కనుపడినప్పుడు, వారి యిష్టమునకు విరోధముగా కోర్టువారు తీర్పు చేయరు (14 మ. ఇ. అ. 309).

భర్తను విడిచి భార్య వేరుగా నుండునెడల, బిడ్డల రక్షకత్వము విషయమై ఆమెకు ఏ హక్కును నిలువజాలదు. భర్త యిష్టమునకు విరోధముగా బిడ్డలను వెంట తీసికొనిపోయి భార్య వేరుగా నుండునెడల, భర్త దావా తెచ్చి బిడ్డలను స్వాధీనపరచుకొనవచ్చును. (ఇ. లా. రి. 8 క. 369).

తండ్రి అన్యమతము నవలంబించుట.

**131.** తండ్రి క్రీస్తుమతము మొదలగు మతములను అవలంబించి, జాతిభ్రష్టుడైనను, అతనికి తన మయినరు బిడ్డల విషయమైగల రక్షకత్వపు హక్కు తప్పిపోదు. కాని, సదరు అన్య మ

తావలంబముతో దుర్నీతివ్యాపారమును దుష్ప్రవర్తనమును చేరియుండి బిడ్డల శ్రేయస్సునకు హానికరముగానుండునెడల, తండ్రియొద్ద నుండవలసినదని బిడ్డలను కోర్టువారు బలవంత పెట్టజాలరు. (పెర్రీగారి ఓరియెంటల్ కేసెస్ 91).

తండ్రి అన్యమతము నవలంబించునప్పుడు బిడ్డలను హిందూమతము ప్రకారము పెంచునట్లు కోరి ఒకరి సంరక్షణలో నుంచియు,పిమ్మట వారిని తన సంరక్షణక్రింద నుంచుకొనుటకు యత్నించినయెడల, అట్లు వారిని తండ్రి స్వాధీనముచేయుట బిడ్డలకు క్షేమకరమా కాదా ? అను విషయమును కోర్టువారు ఆలోచింతురు. (ఇ. లా. రి. 28 క. 881. కాని, ఇ. లా. రి. 25 బొం. 574 చూడుము; ఇ. లా. రి. 26 అ. 594). ఒక మైసూరు కేసులో క్రీస్తుమతము నవలంబించిన భర్త తన మైనరు బిడ్డలను భార్య స్వాధీనమునుండి తప్పించి తనసంరక్షణలో నుంచుకో గోరెను. కాని, కోర్టువారంగీకరింపరైరి. మతభ్రష్టుడైన తండ్రియొక్క సంరక్షణ హిందూమతస్థులగు బిడ్డలకు హానికరమనియు, బిడ్డల మతము మార్చి వారివలన ముక్తిపొందగల తాత ముత్తాతలకు నష్టము కలిగించుట ధర్మశాస్త్ర విరుద్ధమనియు తీరుమానించిరి. (17 మై. 324). కాని, యీ తీరుమానమును వాదమును బ్రిటిషు హైకోర్టువారివలన అమోదింపబడుట సందేహము.

మైనర్లు అన్యమతములు అవలంబించుట.

**132.** తమ యిచ్చవచ్చినట్లు విచ్చలవిడిగా నుండుటకు మైనర్లు స్వతంత్రులుకారు. యుక్తవయస్సు వచ్చువరకును సంరక్షకుల ఆజ్ఞకులోబడి వారి యొద్దనే యుండుటకు మైనర్లు బద్ధులుగా నున్నారు. కాబట్టి, క్రీస్తు మతము మొదలగు అన్యమతములలో చేరునట్టి స్వాతంత్ర్యము వారికి లేదు. యుక్తాయుక్తవివేకము కలిగియుండి అన్యమతము నవలంబించిన మైనర్లను వారి యిష్టము వెంబడి వదిలివేయ వలయునని పూర్వకాలమున కొన్ని

తీర్పులు చేయబడెను. కాని, దరిమిలాను 12, 14, 15 సం॥ల యీడుగల మైనర్లు క్రీస్తుమతము నవలంబించి తమ నవీన గురుస్వాములవద్దనే యుందుమని వారెంత కోరుకొన్నను, వారి యిష్టము పాటింపక వారిని సంరక్షకులకు ఒప్పగించునట్లు తీర్పులు చేయబడెను. (పెర్రీగారి ఓరియెంటల్ కేసెస్, 103 ; స్ట్రేంజ్ గారి రిపోర్ట్సు, 111). ఈ తీర్పులను కొన్ని సంవత్సరముల క్రిందట మదరాసు హైకోర్టువారు చక్కగా పరిశీలించి, 1875 సం॥ 9 నెం॥ చట్టము ప్రకారము మైనార్టీ గడచువరకును, అనగా, 18 సం॥ల యీడు దాటువరకును, మైనర్లు తమ సంరక్షకులకు లోబడి వారియొద్దనే యుండుటకు బద్ధులయ్యున్నారని తీరుమానించిరి. (ఇ. లా. రి. 9 మ. 391) కాబట్టి మైనర్లు అన్యమతము లో చేరినప్పుడు తలిదండ్రులు మొదలగు సంరక్షకులు వారిని బలవంతముగా తమ యొద్దికి తీసికొని పోవచ్చును. మరియు, సదరు మైనర్లను పంపించక తమయొద్ద నుంచుకొను మత గురువులపై దావా తేవచ్చును.

14 సం॥ల యీడునకు లోబడిన మగబిడ్డలనుగాని 16 సం॥ల యీడునకు లోబడిన ఆడు బిడ్డలనుగాని, వారి సంరక్షకుల సమ్మతి లేకుండ క్రీస్తుమతము మొదలగు అన్యమతములలో చేర్చుకొనువారు పినల్ కోడ్డు 361 సె॥ ప్రకారము నేరస్థులగుదురు. అట్టి వారికి 363 సె॥ ప్రకారము 7 సం॥ల వరకు శిక్ష విధింపబడ వచ్చును. మైనర్లయొక్క సమ్మతి యున్నదనే కారణమువల్ల నేరము తప్పిపోజాలదు.

ఇటీవల కొన్ని కేసులలో బొంబాయి కలకత్తా హైకోర్టుల వారు భిన్నముగా తీరుమానించి యున్నారు. తండ్రియొక్క, లేక యితర గార్డియనుయొక్క, దుష్ప్రవర్తనము వల్లగాని వికటప్రవర్తనము వల్లగాని మైనర్ల క్షేమమునకు ఏవైనను ప్రధానాంశముల

యొందు భంగము కలుగునట్లు కనుపడినప్పుడును - తండ్రి మొదలగు గార్డియనులవల్ల సదరు మైనర్లు చిరకాలము ఇతరుల సంరక్షణలో నుంచబడి వారి పెంపు సంరక్షణ పద్ధతులకు మైనర్లు అలవాటుపడియుండగా, స్వార్థ యోజనము నిమిత్తముగాని దురుద్దేశముతోగాని సదరు మైనర్లను తండ్రి మొదలగు అసలుగార్డియనులు స్వాధీనపరచుకొనగోరినప్పుడును-అట్టివారి ప్రార్థన అంగీకరించి మైనర్లను వారివశముచేయుట అప్రశస్తమని తీర్పులు చేయబడెను. (ఇ. లా. రి. 16 బొం. 307; ఇ. లా. రి. 23 క. 290; ఇ. లా. రి. 25 క. 881).

**133.** ఋతుమతియైన పిమ్మటనే వివాహముచేయ నిశ్చయించి ఒక బ్రాహ్మణబాలికతండ్రి 13-14 సం॥ ల యీడు వరకు కుమార్తెలను పెరుగ నిచ్చినప్పుడు, వారు తమకు ఆ నూతన పద్ధతి యిష్టము లేదనియు దానివల్ల గలుగు లోకనిందకును కుల భ్రష్టత్వమునకును కష్టములకును లోబడజాలమనియు వక్కాణించి పినతండ్రి మున్నగు బాధువుల సంరక్షణలో చేరి వివాహ ప్రయత్నము చేయుచున్నచో, అట్టి సందర్భమున వారిని కోర్టువారు తండ్రి స్వాధీనములోనికి బలవంతముగా బంపుదురా? - యీ విషయము కొన్ని కాలములోనే మదరాసు హైకోర్టువారివల్ల తీర్మానింపబడనున్నది. మైనర్ల ఇష్టము.

**134.** మైనరుల తరఫున ఆస్తి మేనేజిమెంటు చేయు విషయములో ఆస్తిని గార్డియను, అతని సంరక్షకుడు, జరిగించునట్టి కార్యములవల్ల సదరు మైనరు బద్ధుడగుచున్నాడు. కాని, యీ కార్యములు అగత్యముగునవిగాను, మైనరునకు లాభకరముగాను, యుక్తవయస్సు వచ్చిన యెడల మైనరు తానే జరిగించుకొనునట్టివిగాను ఉండవలెను. మరియు దురుద్దేశముతో గాని గార్డియనుయొక్క స్వలాభము నిమిత్తముగాని జరిగింప గార్డియనుల అధికారము— మైనరు హక్కులు.

బడి యుండగూడదు. (2 మ. హై. 47 ; ఇ. లా. రి. 12 బొం. 686 ; ఇ. లా. రి. 14 బొం. 562 ; ఇ. లా. రి. 4 క. 76 ; ఇ. లా. రి. 5 క. 363 ; ఇ. లా. రి. 3 అ. 535 ; ఇ. లా. రి. 9 బొం. 365 ; ఇ. లా. రి. 20 బొం. 70, 286 ; ఇ. లా. రి. 17 మ. 306 ; ఇ. లా. రి. 26 మ. 330 ; ఇ. లా. రి. 8 క. 656, 620 ; ఇ. లా. రి. 5 అ. 142 ; ఇ. లా. రి. 15 క. 40, 627 ; ఇ. లా. రి. 25 క. 909 ; ఇ. లా. రి. 23 బొం. 287 ; ఇ. లా. రి. 25 అ. 59, 407 ; ఇ. లా. రి. 20 బొం. 777 ; ఇ. లా. రి. 20 క. 508 ; ఇ. లా. రి. 22 క. 545 ; ఇ. లా. రి. 18 మ. 415 ; ఇ. లా. రి. 26 క. 820 ; ఇ. లా. రి. 27 బొం. 287 ; ఇ. లా. రి. 25 క. 585 ; ఇ. లా. రి. 26 అ. 22 ; ఇ. లా. రి. 17 మ. 221 ; ఇ. లా. రి. 26 మ. 330 ; ఇ. లా. రి. 13 క. 292 ; ఇ. లా. రి. 20 బొం. 74 ; ఇ. లా. రి. 26 బొం. 221 ; 10 మూ. ఇ. అ. 454 ; 6 మూ. ఇ. అ. 393 ; ఇ. లా. రి. 28 బొం. 330 ; ఇ. లా. రి. 23 అ. 394). కాలదోషము పట్టిన అప్పులు తీర్చిన యెడల, మైనరు బద్ధుడు కాజాలడని యూహింపదగి యున్నది. (ఇ. లా. రి. 5 మ. 169 ; ఇ. లా. రి. 17 బొం. 512).

గార్డియను జరిగించిన కార్యములను యుక్తవయస్సు వచ్చిన పిమ్మట మయినరు సమ్మతించి ఊర్జితపరచిన యెడల, వానివలన అతడు బద్ధుడగును. (8 మూ. ఇ. అ. 319 ; ఇ. లా. రి. 17 క. 223).

మయినరు యొక్క లాభము నిమిత్తము అతని ఆస్తిని గార్డియను విక్రయము చేసిన యెడల, అట్టి విక్రయమువలన సదరు మయినరు బద్ధుడగును. కాని అక్రమముగా, లేక అనగత్యముగా, లేక అతిస్వల్పమగు వెలకు, జరిగింపబడు విక్రయమువలన మయినరు బద్ధుడు కాడు. ఇట్టి క్రయములను రద్దుపరచుటకు మయినరు యుక్తవయస్సు వచ్చిన పిమ్మట దావా తేవచ్చును.

(8 బాం. హై. 81; ఇ. లా. రి. 3 బాం. 234, 237; 7 అ. హై. 201).

మయినరు యొక్క ఆస్తిని విక్రయించేటు విషయమున అతని గార్డియనుకుగల అధికారము మిగుల మితమయినది. కావున, సదరు గార్డియను మూలకముగా మయినరు ఆస్తిని కొనువారు అన్ని విషయములను జాగరూకతతో కనుగొనవలయును. సదరు ఆస్తిని విక్రయింపవలయు అగత్యమేమి కలదో, విక్రయించుటవలన మయినరునకు ఏమి ప్రయోజనమో, విక్రయించని యెడల అతనికి ఏమి నష్టము, లేక, అపాయము కలుగునో, ఈ విషయములను చక్కగా విచారింపవలయును. ఇంతేగాక ఆస్తికి క్రమమయిన వెల యియ్యవలయును. (6 మూ. ఇ. అ. 393; ఇ. లా. రి. 26 బాం. 433). అట్టి విక్రయము మైనరుకు లాభకరముగా నున్నను దాని విషయమై యేబాబతు నష్టమునుగూర్చిగాని యియ్యబడిన పూచీ ఒడంబడికవల్ల మైనరు బద్ధుడు కాజాలడు. (ఇ. లా. రి. 11 బాం. 561; ఇ. లా. రి. 20 బాం. 61). విక్రయములు.

గార్డియను మూలకముగా మయినరు ఆస్తిని కొన్నవారు, సదరు ఆస్తి విషయమై తగాదా కల్గిన యెడల, దానిని విక్రయించుటకు తగిన అగత్యముండెనని రుజువుచేయవలయును. (ఇ. లా. రి. 5 మ. 33). ఫలానా కారణమువలన విక్రయింపబడినట్లు క్రయ దస్తావేజులో వ్రాయబడియుండు మాత్రముచేత, అది నిజమని కోర్టువారు విశ్వసింపజాలరు. (ఇ. లా. రి. 6 అ. 417; ఇ. లా. రి. 3 బాం. 234, 237).

ఒక కేసులో గార్డియనుగా నుండిన తల్లి, మయినరుయొక్క సంరక్షణ నిమిత్తము అతని ఆస్తిని మిక్కిలి తక్కువ వెలకు అమ్మివేసెను. మైనరు యుక్తవయస్కుడైన పిమ్మట దావా తెచ్చెను. కోర్టువారు సదరు క్రయమును రద్దుపరచి క్రయదారునికి సొమ్ము

ఇప్పించివేసి, ఆస్తిని మయినరు స్వాధీనము చేసిరి. (ఇ. లా. రి. 6 అ. 417; చూడు 32 క. 832).

డిక్రీలు, రాజీలు.

గార్డియనువలన అక్రమముగా సమ్మతింపబడు డిక్రీలు రాజీలు వగైరాలను రద్దుపరచుటకు మయినరు యుక్తవయస్సు వచ్చిన పిమ్మట దావా తేవచ్చును. (ఇ. లా. రి. 3 మ. 103; ఇ. లా. రి. 13 బొం. 137). కాని, గార్డియనుమీద క్రమముగా పొందబడిన డిక్రీలవల్లను అతడు క్రమముగా సమ్మతించిన రాజీలవల్లను మయినరు బద్ధుడగును. (ఇ. లా. రి. 11 మ. 309; ఇ. లా. రి. 12 మ. 483; 14; మూ. ఇ. అ. 393; ఇ. లా. రి. 5 క. 450; ఇ. లా. రి. 10 క. 357; 1859 సం॥ బం. స. తీ. 913; ఇ. లా. రి. 17 క. 347; ఇ. లా. రి. 15 బొం. 594).

దగావలన పొందబడిన తీర్పులు డిక్రీలు రాజీలు వగైరాలను రద్దుపరచుటకు నిరభ్యంతరముగా దావా తేవచ్చును. డిక్రీతేది మొదలు 1 సంవత్సరము లోపలగాని యుక్తవయస్సువచ్చిన 1 సంవత్సరము లోపలగాని అట్టి దావా తీసికొని రావలయును. (14 మూ. ఇ. అ. 393; ఇ. లా. రి. 6 క. 687; ఇ. లా. రి. 10 క. 357; ఇ. లా. రి. 12 క. 69). కాని, దగావలనగాక గార్డియనుయొక్క అజాగ్రతవలన మయినరునకు విరోధముగా వ్యాజ్యము తీర్పు చేయబడి యుండినయెడల, యుక్తవయస్సు వచ్చిన పిమ్మట అతడు దావా తెచ్చి సదరు తీర్పును రద్దు చేయించుకొనవచ్చునా? — యీ అంశము స్పష్టముగా తీరుమానింపబడి యుండలేదు. (ఇ. లా. రి. 17 క. 361).

గార్డియనుయొక్క అక్రమపు వ్యవహారములవల్ల సంభవించిన నష్టము నిమిత్తము అతనిమీద మైనరు యుక్తవయస్కుడైన పిమ్మట దావా తేవచ్చును. (1860 సం॥ బం స. తీ. 349).

# ప్రకరణము 5.

—○:०:○—

## సమష్టి కుటుంబము.

**135.** హిందువులలో సాధారణముగా తండ్రి, కుమారులు, మనుమలు మొదలగువారు కలిసి యేక కుటుంబముగా జీవించుచున్నారు. వీరిలో కొందరుగాని అందరుగాని సమష్టి ఆస్తిని విభాగించుకొని ప్రత్యేకముగా కాపురము యేర్పరచుకొన్నను గూడ, వారికి సంతానము కలిగినతోడనే మరల సమష్టి కుటుంబము లేర్పడుచున్నవి. ఈ సమష్టికుటుంబము యొక్కయు సమష్టి సొత్తుయొక్కయు స్వభావము ఈ ప్రకరణమునందు వివరింపబడును. సమష్టి కుటుంబము.

**136.** సమష్టి కుటుంబమునందలి స్త్రీలు జీవనాంశమునకు మాత్రమే హక్కు కలిగి యుందురు. పురుషులుగూడ అందరును సమష్టి ఆస్తికి భాగస్థులు కానేరరు. ఈ విషయము ముందు వివరముగా తెలుపబడును. సాధారణముగా సమష్టి కుటుంబమునకు తండ్రియే యజమానుడుగానుండి గృహకృత్యములను నడపునట్టి అధికారమును వహించును. వృద్ధాప్యము మొదలగు కారణములవలన తండ్రి అసమర్థుడుగా నుండునపుడును, అతడు లేనపుడును, కుమారులలో పెద్దవాడు యాజమాన్యమును వహించును. అన్న అసమర్థుడుగా నుండు నెడల, బుద్ధిమంతుడగు తమ్ముడు గృహకృత్యములను నడుపుట కలదు. యజమానుడు, లేక, మేనేజరు.

**137.** కుటుంబమునందలి స్త్రీ పురుషులకును, బిడ్డలకును తలయు అన్న వస్త్రముల నిమిత్తమును, వారి వివాహము ఉపనయనము విద్య మొదలగు కార్యముల నిమిత్తమును, పండుగ పర్వములు శ్రాద్ధాదికర్మలు మొదలగువాని నిమిత్తమును, సమష్టి కుటుంబ ప్రయోజనములు.

ద్రవ్యమును వ్రయము చేయుటకు యజమానునకు సంపూర్ణా ధికారము కలదు. ఇంతే ఖర్చు చేయవలసినదనిగాని ఇంత ఖర్చు చేయవలసినదనిగాని నిర్బంధము లేదు. తక్కిన భాగస్థులు చెప్పి నట్లు గృహకృత్యములను నడుపుటకుగాని ఖర్చు తగ్గించి ఆదాయము చేయుటకుగాని అతడు బద్ధుడుకాడు. కుటుంబ సంరక్షణమునందు అతడు అధిక లోభిత్వమును వహించినను అతిదుబారాగా నడచుకొన్నను, తక్కిన భాగస్థులు విభాగము చేసికొనవలసినదేగాని వేరు సాధనము లేదు. (3 మ. హై. 177; ఇ. లా. రి. 10 బొం. 528; ఇ. లా. రి. 17 బొం. 271). కుటుంబద్రవ్యమును యజమానుడు దుర్వినియోగము చేసినయెడల, విభాగము చేసికొనునప్పుడు అతని భాగములో తగ్గించవచ్చును. కాని, కుటుంబముయొక్క లాభము నిమిత్తము అతడు వర్తకము చేసియుండి దానివలన నష్టము సంభవించినయెడల, ఆ నష్టమునకు అతడు జవాబుదారుడు కాజాలడు.

ఒకభాగస్థుని నిమిత్తము అధిక వ్రయము.

**138.** ఎక్కువమంది బిడ్డలుండుటచేత వారి అన్న వస్త్రముల నిమిత్తమును వివాహాది కార్యముల నిమిత్తమును గాని, మరియే కారణము వల్లగాని, సమష్టి కుటుంబములో ఒక భాగస్థుని నిమిత్తము ఎక్కువ ద్రవ్యము వ్రయపడిన యెడల, విభాగ కాలమునందు అతని భాగములో తగ్గించుటకు వీలులేదు. (5 క. హై. 347, 349). కాని, కొన్ని కుటుంబములయందు ఆయా భాగస్థుల నిమిత్తము జరుపబడు అధిక వ్రయములను పద్దువ్రాసి, విభాగకాలమునందు లెక్క చూచుకొను ఏర్పాటు చేసికొనుటయు కలదు. (6 మూ. ఇ. అ. 540).

అప్పులు.

**139.** సమష్టి కుటుంబమునకు మేనేజరుగా నుండువతడు కుటుంబ రక్షణము నిమిత్తము అప్పు చేసినయెడల, వానిని తీర్చునట్టి భారమును అందరు భాగస్థులును వహింతురు. (ఇ. లా. రి.

26 మ. 28; ఇ. లా. రి. 29 క. 583). కాని, కాలదోషము (లిమిటేషను) తగిలిన అప్పుల నిమిత్తము సమష్టి కుటుంబముయొక్క మేనేజరు తక్కిన భాగస్థుల అనుమతిలేకుండ పత్రము వ్రాసియిచ్చినయెడల, దానివలన అతడు మాత్రమే బద్ధుడగును. (ఇ. లా. రి. 5 మ. 169; 17 బొం. 512). సమష్టి ఆస్తిలో ఎవరైనా ఒక భాగస్థుని వంతు మాత్రమే తాకట్టు పెట్టుటకు మేనేజరుకు అధికారములేదు. (ఇ. లా. రి. 29 అ. 176).

సమష్టి కుటుంబముయొక్క భాగస్థులు కలిసి యేదైనను వ్యాపారము చేసినప్పుడు, వారిలో మేనేజరుగాని మరియొకరుగాని సదరు వ్యాపారము నిమిత్తము అప్పులు చేసినయెడల, వానిని తీర్చుటకు అందరును బద్ధులుగా నుందురు. (ఇ. లా. రి. 6 క. 815; ఇ. లా. రి. 5 బొం. 38). మరియు, సదరు అప్పుల నిమిత్తము ఒక భాగస్థుని మీదనే డిక్రీ పొందబడినను, కుటుంబద్రవ్యము యావత్తును జప్తుచేయబడ వచ్చును. (ఇ. లా. రి. 20 క. 453). సమష్టి కుటుంబము మేనేజరుగా నుండు నతడు కుటుంబము తరఫున యిచ్చే ఋణముల చెల్లుచీటీవల్ల అందరు భాగస్థులును బద్ధులగుదురు. (ఇ. లా. రి. 25 మ. 26). అతడు సమ్మతించే పంచాయతీ తీర్పువల్లకూడా మైనరు భాగస్థులు బద్ధులగుదురు. (ఇ. లా. రి. 27 బొం. 287).

**140.** సమష్టి కుటుంబముయొక్క మేనేజరు చేయునట్టి ఖర్చులకు లెక్క చెప్పుమని కోరుటకు తక్కిన భాగస్థులకు హక్కుకలదా లేదా, యను అంశము చిరకాలము సందేహాస్పదముగా నుండెను. విభాగము నిమిత్తము దావా తెచ్చినయెడల లెక్క చెప్పుమని కోరుటకు ఏ యభ్యంతరమును ఉండనప్పుడు, విభాగము చేసికొనుట ఆవశ్యకమో కాదో-అను విషయమును నిర్ణయించుకొనుటకై లెక్కకోరుట న్యాయముగానే యుండు లెక్క కోరుట.

ను. ఇట్లుండియు, విభాగము నిమిత్తము దావా తెచ్చినప్పుడు మాత్రమే మేనేజరును లెక్క చెప్పుమని కోరవచ్చునుగాని ఇతర సందర్భములయందు కోరగూడదని తీర్పులు చేయబడెను. (6 మూ. ఇ. అ. 540; 9 స. 483; 3 క. హై. 1). కాని, యిటీవల, ఈ తీర్పులను త్రిప్పివేసి, సమష్టి కుటుంబములో ఏ భాగస్థుడైనను సమష్టి ద్రవ్యముయొక్క ఖర్చు లెక్క చెప్పుమని కోరినయెడల చెప్పుటకు మేనేజరు బద్ధుడనియు, విభాగము నిమిత్తము దావా తీసికొనిరాకయే యిట్లు లెక్క కోరవచ్చుననియు, కలకత్తా హైకోర్టు ఫుల్ బెంచి వారు తీర్మానించిరి. (5 క. హై. 354; ఇ. లా. రి. 17 బొం. 271).

దావాలో అందరు భాగస్థులును చేరవలెను.

**141.** సమష్టి కుటుంబముయొక్క సొత్తు విషయమైగాని సమష్టి కుటుంబమునకు చేరవలయు సొమ్ము విషయమైగాని దావా తేబడినప్పుడు, సదరు కుటుంబముయొక్క భాగస్థులందరును వాదులుగానైనను ప్రతివాదులుగానైనను చేరి, లేక, చేర్చబడి యుండవలెను. లేని యెడల, ఆ దావా చెల్ల నేరదు. (ఇ. లా. రి. 3 మ. 234; ఇ. లా. రి. 11 క. 338, 615; ఇ. లా. రి. 17 క. 160; ఇ. లా. రి. 14 మ. 489; ఇ. లా. రి. 24 మ. 296; ఇ. లా. రి. 7 బొం. 217; 12 బొం. హై. 85; 2 అ. హై. 160; ఇ. లా. రి. 3 బొం. 23; ఇ. లా. రి. 7 క. 470, 751; 12 క. హై. 289; ఇ. లా. రి. 29 అ. 311; చూడు - ఇ. లా. రి. 28 బొం. 11).

సమష్టి కుటుంబపు భాగస్థులు - మితాక్షరము ప్రకారము మూడుతరముల వరకు హక్కు.

**142.** సమష్టి కుటుంబమునందలి పురుషులలో అందరును సమష్టి ఆస్తికి భాగస్థులు కాజాలరని మీద చెప్పితిమి. తండ్రియొక్కగాని మరియొకరి యొక్కగాని స్వార్జితపు సొత్తునకు సొత్తుదారుడు మాత్రమే హక్కు కలిగియుండును. మితాక్షరము ప్రకారము పిత్రార్జితములో తండ్రికిని కుమాళ్లకును అన్నదమ్ములకును సమానమైన హక్కు కలదు. పుత్రుడు జన్మించిన తక్షణమే అత

నికి తండ్రియొక్క పిత్రార్జితములో హక్కు ఏర్పడుచున్నదని మితాక్షర ధర్మశాస్త్రము వక్కాణించుచున్నది. పిత్రార్జితపు సొత్తునకు భాగస్థుడుగా నేర్పడిన మూల పురుషుని క్రింద మూడు తరములవరకు ఈ హక్కు వ్యాపించును. మూడు తరములు దాటిన వారికి వ్యాపించదు. అనగా, అపరక్రియలు జరిపి పిండప్రదానము చేయగల వారగు కొడుకు, మనుమడు, మునిమనుమడు—ఈ మూడుతరముల వారికే పితార్జితమునందు హక్కు కలుగునుగాని, మునిమనుమని కొడుకునకు కలుగనేరదు. ఇట్టి హక్కు కలిగినవారు ఆ సమష్టి కుటుంబపు భాగస్థులని చెప్పబడుదురు.

సమష్టి కుటుంబమునందలి భాగస్థులు యావదాస్తికిని మొత్తముగా బాధ్యత గలవారై అనుభవించునట్టి హక్కు కలిగి యుందురు. ఇంతేకాని ప్రత్యేక భాగములకు హక్కు కలిగి యుండరు. విభాగమునకు పూర్వము వారివారిది యీ భాగమనిగాని యింత భాగమనిగాని నిశ్చయముగా చెప్పుటకు వీలు లేదు. విభాగమునకు పూర్వము భాగస్థులలో నెవరైనను పుత్రహీనుడుగా మృతిచెందిన యెడల, అతని హక్కు అతని భార్యకు చెందక తక్కిన భాగస్థులకే చేరుటవల్ల, వీరి భాగములు హెచ్చును. క్రొత్త భాగస్థులు జన్మించిన చో సదరు భాగములు తగ్గును. (1849 సం॥ మ. తీ. 27; 1856 సం॥ మ. తీ. 5; ఇ. లా. రి. 5 మ. 362). ప్రత్యేక భాగ హక్కు లేదు.

**143.** ఈ అంశములు క్రింది యుదాహరణము వలన స్పష్టము కాగలవు. తర్వాతి పేజీలో కనుపరచబడిన కుటుంబమునందు, రామయ్య, సుబ్బయ్య, వెంకయ్య అను ముగ్గురు మాత్రమే యుండునెడల, పిత్రార్జితమునందు వీరికి సమానమగు హక్కులు కలిగియున్నందున, విభాగము చేసికొన్న యెడల ఒక్కొకరికి మూడింట ఒకపాలు వచ్చును. విభాగమునకు పూర్వము నరసయ్య అనువాడు జన్మించిన యెడల, అతనికిగూడ పిత్రార్జి ఉదాహరణము.




త్రమునందు హక్కు కలుగును. కాబట్టి, ఒక్కొకనికి నాల్గింటిలో ఒకపాలు మాత్రమే వచ్చును. రామయ్య మృతిచెందిన పిమ్మట, అతని కుమారులు విభాగము చేసికొన్న యెడల ఒక్కొకనికి మూడింట ఒకపాలు వచ్చును. సుబ్బయ్యకూడ మృతిచెందిన పిమ్మట విభాగము చేసికొన్న యెడల, వెంకయ్య నరసయ్యలకు చెరిసగమును ఆస్తి వచ్చును. విభాగము చేసికొనక కుటుంబము సమష్టిగానే జరుగుచుండిన యెడల, మల్లయ్య, రంగయ్య, శేషయ్య యనువారు జన్మించి పిత్రార్జితమునందు హక్కు కలవారగుదురు. రామయ్య, సుబ్బయ్య, వెంకయ్యలు ముగ్గురును మృతిచెందిన పిమ్మట, మల్లయ్య రంగయ్యలు విభాగము కోరవచ్చును. అప్పుడు వారికి తమ తండ్రివంతులో చెరిసగము, అనగా మొత్తము ఆస్తిలో నాల్గింట ఒక్కొకపాలు, వచ్చును.

పైన ఉదహరించిన కుటుంబములో అందరును జీవించియున్న యెడల, రామయ్యయను మూల పురుషుని పిత్రార్జితమునం

దలి హక్కు, అతని కుమారులగు సుబ్బయ్య వెంకయ్య నరస య్యలకును, మనుమలగు మల్లయ్య రంగయ్య శేషయ్యలకును, మునిమనుమలగు సూరయ్య చంద్రయ్యలకును వ్యాపించును. కాని, మూలపురుషుని క్రింద మూడు తరములు దాటిన నాగ య్యకు హక్కు వ్యాపింపదు. అందరికంటె ముందుగా రామ య్య మృతిచెందిన యెడల, సుబ్బయ్య వెంకయ్య నరసయ్యలు పిత్రార్జితపు సొత్తునకు మూల పురుషులగుదురు. అప్పుడు నర సయ్యయొక్క భాగమునందలి హక్కు నాగయ్య వరకును వ్యా పించును.

రామయ్య యనువాడు జీవించియుండగా, పిత్రార్జితములో భాగము కోరుటకు సుబ్బయ్య వెంకయ్య నరసయ్యలకు ముగ్గు రికి మాత్రమే హక్కు కలదు. వెంకయ్య భాగములో మల్లయ్య రంగయ్య యనువారిద్దరును చెరిసగమునకు హక్కుదార్లగుదు రు. రామయ్య బ్రదికియుండగా వెంకయ్య నరసయ్యలు మృతి చెందిన యెడల, సుబ్బయ్యగాని మల్లయ్య రంగయ్య శేషయ్య లలో ఎవరైనను గాని పిత్రార్జితములో భాగమును కోరవచ్చు ను. అప్పుడు ఆస్తి నాల్గు భాగములుగా చేయబడి, రామయ్య సుబ్బయ్యలకు చెరియొక భాగమును, మల్లయ్య రంగయ్యల కిద్ద రికి తమ తండ్రివంతు భాగమును, శేషయ్యకు ఒక భాగమును చెందును.

రామయ్య, సుబ్బయ్య, సూరయ్య, నాగయ్య, వీరు మాత్ర ము జీవించియుండి తక్కినవారందరును మృతిచెందినయెడల, రా మయ్య సుబ్బయ్య సూరయ్యలు, ముగ్గురు మాత్రమే పిత్రార్జి తమునందు భాగస్థులగుదురు. రామయ్య అను మూలపురుషుని క్రింద మూడు తరములు దాటినవాడు గావున, నాగయ్య భాగ స్థుడు కాజాలడు. పిమ్మట, రామయ్య మృతిచెందినను గూడ, షి

ప్రిత్రార్జితపు సొత్తంతయు సుబ్బయ్య సూరయ్యలకే చేరునుగాని నాగయ్యకు చేరజాలదు.

ఆది పురుషుని వద్దినుండి మూడుతరములు కాదు.

**144.** పిత్రార్జితపు సొత్తునందు భాగస్థుడుగా నేర్పడిన మూలపురుషుని క్రింద మూడు తరముల వరకును హక్కు వ్యాపించుననిమీాద చెప్పియుంటిమి. ఇట్లు మూడుతరములు లెక్క చూచుటలో ఆది పురుషుని వద్దినుండి లెక్కింపగూడదు. ఆది పురుషునకు ఎన్నితరములు క్రిందుగా నున్నను, మధ్యను పిత్రార్జితపు సొత్తునందు ప్రధాన భాగస్థుడుగా నేర్పడిన వానికి మూడు తరములు దాటకయున్న యెడల, హక్కు వ్యాపించును. (10 బొం. హై. 449, 463; 6 మ. హై. 94, 106). ఇది యెట్లనగా—




ప్రక్కగనుపఱచియుండు కుటుంబములో అందరును జీవించియున్న యెడల, కృష్ణయ్య శివయ్య పాపయ్య బ్రహ్మయ్య వీరయ్యలు మాత్రమే పిత్రార్జితము నందు హక్కుదారు లగుదురుగాని, కృష్ణయ్యయొక్క జీవితకాలములో కనకయ్య అప్పయ్య కన్నయ్యలు ఎన్నడును హక్కుదార్లు కాజాలరు. కృష్ణయ్య మృతిచెందిన పిమ్మట, శివయ్య మూల పురుషుడగును గావున, అతని క్రింద మూడుతరములలో చేరిన కనకయ్య అప్పయ్యలుకూడ హక్కుదార్లగుదురు. అప్పుడు గూడ కన్నయ్య హక్కుదారుడు కాజాలడు. కృష్ణయ్య జీవించియుండగా, శివయ్య పాపయ్యలు మృతిచెందిన

యెడల, కృష్ణయ్య బ్రహ్మయ్య వీరయ్యలు మాత్రమే ప్రధాన భాగస్థులగుదురు. అటుపిమ్మట కృష్ణయ్య మృతిచెందినయెడల, బ్రహ్మయ్య భాగములో, కనకయ్య అప్పయ్య కన్నయ్యలు హక్కుగల వారగుదురు. కృష్ణయ్య జీవించియుండగా, శివయ్య పాపయ్య బ్రహ్మయ్యలు మృతిచెందినయెడల, కనకయ్య అప్పయ్య కన్నయ్యలకు హక్కు తప్పిపోయి యావదాస్తికిని కృష్ణయ్య వీరయ్యలు మాత్రమే హక్కుదార్లగుదురు. పిమ్మట కృష్ణయ్య మృతిచెందిన యెడల, యావదాస్తియును వీరయ్యకు చేరును. కాబట్టి, మూలపురుషుని క్రింద ఏకాలమునందైనను మూడు తరములు పూర్తిగా తెంపు కలిగినయెడల, పిత్రార్జితము నందలి హక్కు ఆ క్రిందివారికి తప్పిపోవునని తెలిసికొనవలయును.

**145**. పిత్రార్జితమునందలి హక్కు విషయమై మీాద చెప్పబడినదంతయు మితాక్షర సంప్రదాయము వారికే చెల్లును గాని దాయభాగ సంప్రదాయము వారికి చెల్లదు. దాయభాగము ప్రకారము తండ్రియొక్క పిత్రార్జితపు సొత్తునందు కుమారులకు జీవనాంశపు హక్కు మాత్రమే కలదుగాని, భాగము కోరునట్టి హక్కుగాని సదరుసొత్తు అక్రమముగా వ్యయపరచకుండ ఆపునట్టి హక్కుగాని లేదు. ఒకతూరి తండ్రియొక్క సొత్తు కుమారులకు చేరినయెడల, వీరు సమష్టిగా జీవించు చుండినను ప్రత్యేకముగా హక్కు కలిగి యుండునట్లే భావింపబడుదురు. కాబట్టి, వీరిలో ఒకడు పుత్రహీనుడుగా మృతిచెందిన యెడల, మితాక్షరమునందువలె వాని భాగము తక్కిన భాగస్థులకు చెందక, అతని భార్యకుగాని యితర వారసులకుగాని చేరును. (6 మూ. ఇ. అ. 553). దాయభాగ సంప్రదాయము.

**146**. ఈ ప్రకరణమునందింతవరకు పిత్రార్జితము స్వార్జితము అను పదములు పలుమారు ఉపయోగింపబడినవి. ఈ పద

ములయొక్క అర్థ విస్తృతి చక్కగా తెలిసికొనుట మిక్కిలి ఆవశ్యకము.

పిత్రార్జితము, స్వార్జితము.

తండ్రి, తాత (తండ్రి తండ్రి), ముత్తాత - వీరివద్దనుండి వారసు హక్కువలన గాని, ఉయిలువలన గాని, దాన రూపకముగా గాని, వచ్చినసొత్తు పిత్రార్జితము. అట్టి సొత్తునందు మితాక్షరము ప్రకారము మూడుతరముల వరకు గల పుత్రసంతతి వారికి హక్కు వ్యాపించును. పితృద్రవ్యమును గాని కుటుంబద్రవ్యమునుగాని ఉపయోగించక స్వశక్తివలన సంపాదించిన ఆస్తియు - తల్లి, తల్లితల్లి, తల్లితండ్రి, అన్నదమ్ములు, పినతండ్రి పెత్తండ్రులు, పినతండ్రి పెత్తండ్రుల కొడుకులు, ఈ మొదలగువారి వద్ద నుండివచ్చిన ఆస్తియు-స్వార్జితము. దీనియందు పుత్రసంతతివారి కెట్టి హక్కును లేదు. (ఇ. లా. రి. 8 క. 134; ఇ. లా. రి. 17 క. 38; ఇ. లా. రి. 12 బొం. 133; ఇ. లా. రి. 9 బొం. 445; ఇ. లా. రి. 27 మ. 310).

తండ్రి స్వార్జితము కుమారుల పిత్రార్జితము.

**147.** తండ్రియొక్క స్వార్జితము కుమారులకు వచ్చినతోడనే అది వీరియొక్క పిత్రార్జితమై దానియందు వీరి పుత్రసంతతి వారికి హక్కు కలుగుచున్నది. కాని, ఆసొత్తు కుమారులకు చేరుటకు పూర్వము, వారిలో నెవరైనను మృతిచెందిన యెడల, అట్లు మృతిచెందినవాని భార్యకుగాని కుమారులకుగాని ఏ హక్కును కలుగదు. అలహాబాదులో ఒకనికి అధికమగు స్వార్జితపు సొత్తుండి యిద్దరు కుమారులుండిరి. తండ్రి జీవితకాలములోనే ఒక కుమారుడు మృతిచెందిన కారణమువల్ల సదరు స్వార్జితపుసొత్తు యావత్తును రెండవ కుమారునకు చెందెను. అటుపిమ్మట, మృతిచెందినవాని వితంతువు మరదిమీద మనోవర్తి నిమిత్తము దావా తెచ్చెను. స్వార్జితపు సొత్తు పిత్రార్జితము కాకమునుపే ఆ పెభర్త మృతిచెందినందున, దానియందు వితంతువునకు ఎట్టి

హక్కు లేదని హైకోర్టువారు తీర్మానించిరి. (ఇ. లా. రి. II అ. 194).

**148.** తండ్రియొక్క సొత్తు కుమారులకు వారసుహక్కువలనరాక దానరూపకముగా వచ్చినంత మాత్రముచేత, అది పిత్రార్జితము కాకపోదు. ఒక కుటుంబములో తండ్రి తన స్వార్జితపు సొత్తును ఇచ్చువచ్చినట్లు కుమారులకు దానరూపకముగా పంచిపెట్టెను. అట్లు పంచిపెట్టబడినను, కుమారులకు వచ్చిన భాగములు వారి పిత్రార్జితములుగా భావింపబడుననియు ఆ భాగములలో వారి కుమారులకు హక్కు కలదనియు తీర్మానింపబడెను. (6 స. 71, 73).

*దానరూపకముగా వచ్చిన తండ్రి ఆస్తి.*

అలాగుననే తండ్రి మొదలగు వారివద్దనుండి ఉయిలువల్ల వచ్చిన ఆస్తి పిత్రార్జితముగానే భావింపబడును. (3 మ. హై. 50, 55; ఇ. లా. రి. 24 మ. 429; ఇ. లా. రి. 12 బొం. 133; ఇ. లా. రి. 23 క. 262). కాని, కుమారులకు సంపూర్ణమగు స్వాతంత్ర్యమును గలిగించి వారికి స్వార్జితముగా చేరవలెనను ఉద్దేశముతో తండ్రి తన స్వార్జితపు సొత్తును ఉయిలువలన యిచ్చిపోయిన యెడల, అది ఆ కుమారుల స్వార్జితముగానే ఎంచబడును. (ఇ. లా. రి. 10 బొం. 528; ఇ. లా. రి. 24 మ. 429). కావున మనుమలకు దానియందు హక్కు కలుగదు.

*ఉయిలురూపకముగా వచ్చిన తండ్రి ఆస్తి.*

ఒక వితంతువుయొక్క మనోవర్తి నిమిత్తము ప్రత్యేకముగా నుంచబడిన పిత్రార్జితపు సొత్తు ఆపె యనంతరము పిత్రార్జితపు సొత్తుగానే భావింపబడును. (ఇ. లా. రి. 18 మ. 83).

*మనోవర్తికై ఇచ్చిన పిత్రార్జితము*

సమష్టి కుటుంబములో నొక భాగస్థుడు తన భాగమును స్వంత అప్పుల నిమిత్తము పూచీ పరచినయెడల, సదరు అప్పులు తీరగా మిగిలే సొత్తు పిత్రార్జితపు సొత్తుగానే భావింపబడును. (ఇ. లా. రి. 18 మ. 83).

*ఒకభాగస్థుని అప్పులు తీర్చగా మిగిలే పిత్రార్జితము.*

తాకట్టు విడిపించబడిన పిత్రార్జితము.

**149.** ఒకనికి విభాగమువలన కొంత పిత్రార్జితపు సొత్తు వచ్చెను. కాని, అది రమారమి దాని కిమ్మతు వరకును తాకట్టునకు లోబడియుండెను. పిమ్మట అతడు తన స్వార్జితపు ధనముతో సదరు తాకట్టును విడిపించెను. అట్లు తాకట్టు విడిపించబడిన పిత్రార్జితమునందు అతని కుమారులకు హక్కు కలదని మదరాసుహైకోర్టువారు తీరుమానించిరి. (5 మ. హై. 150; ఇ. లా. రి. 18 మ. 83).

పిత్రార్జితముయొక్క వృద్ధి.

**150.** పిత్రార్జితమువలన కలిగినవృద్ధి, అనగా, వడ్డీ మొదలగు ఆదాయము, సదరు ఆదాయమును కూడబెట్టి సంపాదించిన సొత్తు, పిత్రార్జితముతో వ్యాపారము చేసి సంపాదించిన లాభము - ఇవి పిత్రార్జితముగానే భావింపబడును. (8 మ. హై. 25; ఇ. లా. రి. 8 క. 131; ఇ. లా. రి. 11 మ. 246; ఇ. లా. రి. 7 అ. 402; ఇ. లా. రి. 3 క. 508).

అవిభక్త జమీందారీ యొక్క ఆదాయము.

**151.** ఒక అవిభాజ్యమగు జమీందారీ మితాక్షర ధర్మశాస్త్రము ప్రకారము సమష్టి సొత్తుగా నుండవచ్చును. అనగా, కుటుంబములో పెద్దకుమారుడు మాత్రమే రాజ్యాధికారమునకు హక్కుకలవాడై తక్కినవారు జీవనాంశమునకు మాత్రము బాధ్యత కలవారయ్యెను, పెద్దవాడు పుత్రసంతతి లేక మృతిచెందిన యెడల సదరు జమీందారీ ఆస్తి అతని భార్యకు చెందక తమ్ములలో జ్యేష్ఠునికి చెందును. (9 మూ. ఇ. అ. 539, 589, 610; 13 మూ. ఇ. అ. 333, 336; 6 మ. హై. 93, 103). కాని, రాజ్యము చేయునట్టి జమీందారుడు అతని కాలములో జమీందారీ సొత్తునుండి చేయు ఆదాయము అతని స్వార్జితమగుననియు, దానిని అతనిఇచ్ఛవచ్చినట్లు ఖర్చుపెట్టవచ్చుననియు, అతడు పుత్రహీనుడుగా మృతిచెందిన యెడల సదరు ఆదాయమును దానితో సంపాదించిన ఆస్తియును అతని భార్య మొదలగు వారసులకు

చేరునుగాని సోదరులకు చేరదనియు తీరుమానింపబడియున్నది. (5 మ. హై. 31, 41 ; 12 మూ. ఇ. అ. 540). ఒక కేసులో ఒక పాళయందారు అతని పాళయమునకు సంబంధించని కొన్ని స్వాంతఅప్పులును, పాళయము ఆదాయములో సంపాదించిన కొంత ఆస్తియును ఉంచి మృతిచెందెను. ఈ ఆస్తి అతని స్వార్జితము గావున సదరు అప్పులను తీర్చునట్టి భారమును వహించునని తీరుమానింపబడెను. (ఇ. లా. రి. 3 మ. 145 ; ఇ. లా. రి. 29 క. 433). ఒక జమీందారుడు అతని కాలములో చేయునట్టి ఆదాయము అతనివలన ఖర్చు పెట్టబడక, తర్వాత జమీందారునికి చేరినయెడల, అది సమష్టి ద్రవ్యముగానే యెంచబడును.

**152.** సమష్టి కుటుంబములోని భాగస్థుడు తాను స్వాంతముగా సంపాదించిన స్వార్జితమునందు తన హక్కును స్వష్టముగా వదిలివేసి దానిని కుటుంబ ద్రవ్యములో కలిపిన యెడల, అది పిత్రార్జితముగానే యెంచబడును. (ఇ. లా. రి. 16 క. 397 ; 10 మూ. ఇ. అ. 506 ; ఇ. లా. 7 మ. 458 ; ఇ. లా. రి. 10 క. 392, 398, 401; ఇ. లా. రి. 15 బొం. 509; ఇ. లా. రి. 21 బొం. 349; 18 క. 341).

[illegible]

**153.** పితృద్రవ్యము గాని కుటుంబ ద్రవ్యము గాని ఉపయోగింపక స్వశక్తివలన సంపాదించిన ఆస్తియును, తల్లి, తండ్రి, తల్లి, తల్లితండ్రి, అన్నదమ్ములు, పినతండ్రి పెదతండ్రులు, సహోదరులు, ఈ మొదలగు వారినుండి వచ్చిన ఆస్తియును స్వార్జితముగా ఎంచబడునని మీాద చెప్పితిమి. ఈ విషయములో యాజ్ఞవల్క్యస్మృతిలో చెప్పబడి యుండునది యేమనగా:— "పితృద్రవ్యమునకు నష్టములేకుండ ఒక భాగస్థుడు స్వాంతముగా సంపాదించిన సొత్తులు - అనగా, స్నేహితులవలన ఇయ్యబడు బహుమానములు, వివాహకాలమునందు అత్తమామలు మొదలగు

[illegible]

వారివలన ఇయ్యబడు సొత్తులు - వీనిలో తక్కిన భాగస్థులకు హక్కు లేదు. పోయిన పిత్రార్జితమును ఒక భాగస్థుడు మరల సంపాదించిన యెడల దానిని ఇతర భాగస్థుల కియ్యనక్కర లేదు. విద్యవలన సంపాదించిన ధనమును గూడ ఇయ్యనక్కర లేదు." ఈ చెప్పబడిన స్వార్జితపు హక్కులు మిక్కిలి తక్కువయగునట్లు పైని వాక్యమునకు విజ్ఞానేశ్వరుడు మితాక్షర ధర్మశాస్త్రమునందు అర్థము చేసియున్నాడు. ఎట్టి స్వార్జితమునకుగాని పితృద్రవ్య సంబంధ మెంతమాత్రమును ఉండగూడదనియు - పితృద్రవ్యముయొక్క ఖర్చువలన కలిగిన బహుమానములు, పిల్ల నిమిత్తము సొమ్మిచ్చునట్టి ఆసుర వివాహములయందు అల్లునికియ్యబడు బహుమానములు, పితృద్రవ్యసహాయమువలన మరల సంపాదింపబడిన నష్టపైతృకము, పితృద్రవ్యమును ఖర్చుపెట్టి నేర్చికొన్న విద్యవలన సంపాదింపబడిన ధనము - వీనిని సమష్టి సొత్తులుగానే ఎంచవలయునని మితాక్షరము చెప్పుచున్నది. ఇంతేకాక, పితృద్రవ్యము అను పదమువలన మాతృద్రవ్యము కూడ సూచింపబడు చున్నదని మితాక్షరము చెప్పుచున్నది. ఈ అర్థమును అనుసరించి ఒక కేసులో మదరాసు హైకోర్టువారు మాతామహుని (తల్లితండ్రి) వద్దనుండివచ్చిన ఆస్తి స్వార్జితము కాదని తీరుమానించిరి. ప్రివీకౌన్సిలువారు గూడ ఆ తీరుమానమును ఒప్పుకొనిరి. (ఇ. లా. రి. 3 మ. 370). సాధ్యమయినంతవరకు స్వార్జితపు హక్కును తగ్గించునట్లు పూర్వకాలమున మదరాసుహైకోర్టువారు తీరుమానించుచుండిరి. కాని యిటీవల వారి దారి కొంతమారి స్వార్జితమునకు సహకారిగా నేర్పడినది. విద్యవలన సంపాదింపబడు ద్రవ్యము స్వార్జితమా, కాదా, యను విషయముయొక్క చర్చలో ఈ సంగతి తేటపడగలదు.

మితాక్షరము.

**154.** పితృద్రవ్య సహాయ మేమాత్రమును పొందక, కుటుంబమును వదలి యితరుల యింటనుండి యితరుల సహాయము వల్లనే విద్యనేర్చిన యెడల, అట్టి విద్యవలన సంపాదింపబడు ద్రవ్యము స్వార్జితమగుననియు- ఏమాత్రమైనను పితృద్రవ్య సహాయమును పొందిగాని, కుటుంబములో వారి ఉపాధ్యాయత్వము వల్లగాని నేర్చిన విద్యవలన సంపాదింపబడు ద్రవ్యము స్వార్జితముకాదనియు, దీనియందు అందరు భాగస్థులకును హక్కుకలదనియు - నారద కాత్యాయన బృహస్పతి వ్యాసాది మహాత్ములు రచియించిన స్మృతులు వక్కాణించుచున్నవి. వీరిలో కొందరు స్మృతికర్తలు మాత్రము అట్లు పిత్రార్జిత సహాయమువలన విద్యనేర్చి ధనము సంపాదించినవానికి రెట్టింపు పాలు కలదని చెప్పుచున్నారు. యాజ్ఞవల్క్యస్మృతి వాక్యమునుబట్టి సమష్టి కుటుంబములో భోజనాదులు జరిగినను విద్యాధనము స్వార్జితమేయని చెప్పవచ్చును. కాని, ఆ వాక్యమునకు మితాక్షరమునందు చేయబడిన అర్థమును పరికింపగా - సమష్టి కుటుంబములో ఎవని ఉపాధ్యాయత్వము వల్లనైనను విద్య నేర్చుకొనబడిన యెడల, అట్టి విద్యవలన సంపాదింపబడు ద్రవ్యము స్వార్జితము కాజాలదని యేర్పడుచున్నది. ఈ విషయమందు, వీరమిత్రోదయము, స్మృతిచంద్రిక, వివాదచింతామణి, వ్యవహార మయూఖము, ఈ ధర్మశాస్త్రములు కూడ మితాక్షరమును అనుసరించియున్నవి.

విద్యాధనము. మితాక్షరము.

జీమూతవాహనుడు రచియించిన దాయభాగ గ్రంథముమాత్రము భిన్నాభిప్రాయమును కలిగియున్నది. విద్య నేర్చుకొను కాలమునందు అన్నవస్త్రాదుల నిమిత్తము సమష్టిద్రవ్యము అనుభవింపబడినంత మాత్రముచేత ఆ విద్యవలన సంపాదింపబడు ద్రవ్యము సమష్టి ద్రవ్యము కాజాలదనియు, అన్నవస్త్రాదుల నిమిత్తమైన అనుభవము ప్రాణరక్షణార్థమైనది గావున మాతృ స్తన్య

దా. భా. గ్రం.

హానముతో సమానముగా నెంచదగినదనియు, జీమూతవాహ నుడు చెప్పుచున్నాడు. ఈతని యభిప్రాయము ప్రకారము, పిత్రు ద్రవ్యమును ఖర్చుపెట్టి విద్యనేర్పించినను అదిసామాన్య విద్యయైన యెడల దానివలన సంపాదింపబడు ద్రవ్యము స్వార్జితమగుచున్నది. అది విశేష విద్యయైన యెడల దానివలన కుటుంబమునకు లాభము కలిగింపవలెనను ఉద్దేశముతో పిత్రుద్రవ్యము ఖర్చు పెట్టబడెనని ఊహింపవచ్చును గావున అట్టి విశేష విద్యవలన సంపాదింపబడు ద్రవ్యము సమష్టి ద్రవ్యమగుచున్నది. ఆలోచించి చూడగా, ఇది మిక్కిలి న్యాయముగా నున్నది. పిత్రార్జితము వలన నలుగురితోపాటు సామాన్య విద్యాభ్యాసము మాత్రమే పొంది, పిదప ఏదైనను విశేషవిద్యను స్వయముగా నేర్చుకొని గాని ఉద్యోగ ప్రావీణ్యమువలన గాని సంపాదించిన సొత్తు స్వార్జితమగుట క్రమమే. కుటుంబద్రవ్యమును వేలకొలది వెచ్చపెట్టి ఒకనిని ఇగ్లాండు దేశమునకు పంపి కలెక్టరు పరీక్షకో బారిస్టరు పరీక్షకో తయారు చేయించినప్పుడు, అతడు సంపాదించు ద్రవ్యము కుటుంబమునకు సమష్టిగా చేరవలెననుటయు క్రమముగానే యున్నది.

విద్యాధనము – తీర్పులు.

**155**. నాట్యాభినయాది విద్యలవలన ఒక వేశ్య సంపాదించిన సొత్తు, ఆ వేశ్యకును సొమ్ము ఖర్చుపెట్టి సదరు విద్యలు నేర్పించిన తల్లికిని సమష్టిగా భావింపబడునని ఒక కేసులో 1864 సం॥లో మదరాసు హైకోర్టువారు తీరుమానించిరి. (2 మ. హై. 56). పిమ్మట మరియొక కేసులో, ఒక వకీలు సంపాదించిన సొత్తు సమష్టి సొత్తని 1874 సం॥లో మదరాసు హైకోర్టువారు తీరుమానించిరి. కుటుంబ ద్రవ్యమును ఖర్చుపెట్టి ఆ వకీలునకు విశేషవిద్య యేమియును నేర్పించనియట్లు కనుపడినను, సామాన్య విద్యాభ్యాసము నిమిత్తము కుటుంబద్రవ్యము వ్రయపడె

నను హేతువుచేత ఆలాగున తీరుమానింపబడెను. (7 మ. హై. 47). 1868 సం॥లో కలకత్తా హైకోర్టువారి యెదుట నొక కేసులో కుటుంబద్రవ్యమువలన సామాన్య విద్యాభ్యాసమును మాత్రము పొంది పిమ్మట గొప్ప యుద్యోగముచేసి ఒకడు సంపాదించిన ద్రవ్యము సమష్టి సొత్తగునని వాదింపబడెను. కాని, కోర్టువారు ఆ వాదమును అంగీకరింపక సదరు సొత్తును స్వార్జితముగా తీరుమానించిరి. (11 క. హై. 201). 1877 సం॥లో ఒక సీమ అప్పీలులో - సమష్టి కుటుంబములోని భాగస్థుడు స్వప్రయోజకత్వమువలన సంపాదించు ద్రవ్యము సమష్టి ద్రవ్యమగుటకు, కుటుంబ ద్రవ్యముయొక్క సహాయముతో అతడు ఏదో కొంచెము సామాన్య విద్యాభ్యాసమును పొందియుండుట చాలదనియు, కుటుంబ ద్రవ్యమును వ్యయపెట్టి వృత్తికైనను విశేషవిద్య నభ్యసించి దానివలన అతడు సొత్తు సంపాదించినట్లు ఏర్పడవలెననియు, 1864 సం॥లో మదరాసు హైకోర్టువారు వేశ్య దావాలో ఇచ్చినట్టి తీరుమానము సదరు వేశ్యకు విశేషవిద్య నేర్పింపబడెనను హేతువు ననుసరించెననియు, విద్యాధనము విషయమై మదరాసు హైకోర్టువారి యభిప్రాయములకంటె కలకత్తా హైకోర్టువారి యభిప్రాయములే తమ కెక్కువ సమ్మతముగా నుండెననియు, ప్రివీకౌన్సిలువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 1 మ. 152). ఇటీవల 1881 సం॥లో మదరాసు హైకోర్టువారి యెదుట వాదింపబడిన ఒక అప్పీలులో, తన తల్లివలన సామాన్య గాన విద్యను మాత్రము నేర్చుకొనిన ఒక వేశ్య స్త్రీ లంజరికమువలన సంపాదించిన సొత్తు సమష్టిసొత్తు కాదని తీరుమానింపబడెను. (ఇ. లా. రి. 4 మ. 330). 1882 సం॥లో హైకోర్టువారు, విద్యాధనము విషయమైన స్మృతులను తీర్పులను సాకల్యముగా పరిశీలించి, ఒకడు కుటుంబద్రవ్య సహాయముతో సామాన్య

విద్యాభ్యాసమును మాత్రముపొంది పిమ్మట స్వప్రయోజకత్వ మువల్ల లా పరీక్షలిచ్చి సబ్ జడ్జి యుద్యోగముచేసి సంపాదించిన సొత్తు సమష్టి సొత్తు కాజాలదనియు, సమష్టి ద్రవ్య వ్రయమువలన ఏదో ఒక విశేష విద్య నేర్పింపబడి, అట్టి విశేషవిద్యయే ప్రధాన మూలముగా సంపాంపబడిన సొత్తు మాత్రమే సమష్టి సొత్తగుననియు తీరుమానించిరి. (ఇ. లా. రి. 6 బొం. 225). 1891 సం||లో మరియొక కేసులో ఈ తీరుమానము అనుసరింపబడెను. (ఇ. లా. రి. 15 బొం. 32; ఇ. లా. రి. 20 అ. 435).

ఈ తీర్పులనుబట్టి, విద్యాధనము సామాన్యముగా స్వార్జితమేయనియు, కుటుంబ ద్రవ్యమును ఖర్చుపెట్టి సమష్టి లాభము నిమిత్తము ఒకనికి ఏదో గొప్ప విశేషవిద్య నేర్పింపబడి అట్టివిద్య ప్రధానమూలముగా సంపాదింపబడిన ధనము మాత్రమే సమష్టి ధనమగుననియు, ఏర్పడుచున్నది.

సమష్టి ద్రవ్య సహాయము వలన సంపాదించిన సొత్తు.

**156**. సమష్టి ద్రవ్యమును అల్పముగా ఉపయోగించి సమష్టి భాగస్థులలో నొకడు స్వప్రయోజనకత్వము వలన ప్రత్యేకమగు ఆస్తిని సంపాదించిన యెడల, దానిలో అతనికి రెట్టింపుభాగము కలదని కొందరు స్మృతికర్తలు చెప్పుచున్నారు. మితాక్షరమునుబట్టి, యిట్టి రెట్టింపు భాగము లేదు. కాని బంగాళాదేశమునందు కలదని కొన్ని కేసులలో తీరుమానింపబడెను. (1 బం. స. తీ. 6, 336; 3 బం. స. తీ. 98; 5 బం. స. తీ. 335).

పోయిన పిత్రార్జితము.

**157**. పెద్దలవలన పోగొట్టుకొనబడి సమష్టి కుటుంబను వారు తెచ్చుకొనజాలక బొత్తిగా హక్కు వదులుకొన్న పిత్రార్జితపు సొత్తును దేనినైనను, సమష్టి కుటుంబములో ఒకభాగస్థుడు పితృ ద్రవ్య సహాయమునుగాని ఇతర భాగస్థుల సహాయమునుగాని ఎంతమాత్రమును పొందక స్వప్రయాసమువలన ఇతరుల స్వాధీనములోనుండి తప్పించి తన స్వాధీనము చేసికొన్న యెడల,

అట్టి సొత్తు సదరు భాగస్థుని స్వార్జితముగా ఎంచబడునని మితాక్షరమునందు చెప్పబడియున్నది. (చూడు 5 ను. సైూ. 150; ఇ. లా. రి. 10 బొం. 528; ఇ. లా. రి. 3 మ. 300; ఇ. లా. రి. 4 మ. 259). కాని, అట్లు సంపాదింపబడిన సొత్తు స్థిరాస్తిగా నుండినచో, సంపాదించిన వానికి ప్రత్యేకముగా దానిలో నాల్గవ భాగమిచ్చి, మిగిలినదానిని అందరు భాగస్థులును సమానముగా పంచుకొనవలసినదని మితాక్షరమునందే మరియొకచోట చెప్పబడియున్నది. సంపాదించినవాడు తండ్రిగానుండునపుడు మాత్రమే పైచెప్పబడిన మొదటిపద్ధతి చెల్లుననియు, అన్నదమ్ములు మొదలగువారిలో నెవరైనను సంపాదించినప్పుడు రెండవ పద్ధతి చెల్లుననియు, మెయర్ దొరవారు అన్వయించిరి. బంగాళా సంప్రదాయమువారు తండ్రియనియు ఇతరభాగస్థులనియు భేదమును పరికింపక భూస్థితి విషయములో రెండవ పద్ధతినే అనుసరించుచున్నారు.

**153.** సర్కారువారివలన బహుమానముగా నియ్యబడిన ఎస్టేట్లును, కుటుంబములో ఒకని యపరాధముక్రింద సర్కారువారివలన దండుగుగా తీసికొనబడి పిదప మరియొకని కియ్యబడిన ఎస్టేట్లును, స్వార్జితములుగా నెంచబడును. (9 మూ. ఇ. అ. 606; 12 మూ. ఇ. అ. 1; ఇ. లా. రి. 15 మ. 284; ఇ. లా. రి. 3 క. 615; ఇ. లా. రి. 4 క. 839, 727; ఇ. లా. రి. [illegible] 769; ఇ. లా. రి. 3 బొం. 186). కాని అపరాధముక్రింద దండుగుగా సర్కారువారివలన తీసికొనబడిన ఆస్తి పిమ్మట అట్లు దండుగుగా తీసికొనుట అక్రమమని పిమ్మట తీరుమానింపబడి సదరు ఆస్తి యెవరికిని ఇయ్యబడక యుండునపుడు, అది మనుగడ హక్కు వెంబడి సమష్టి సొత్తుగానే భావింపబడును. (ఇ. లా. రి. 12 క. 1). ఆలాగుననే శిస్తు నిమిత్తము మొత్తముగా సొమ్ము

సర్కారువారి బహుమానములు.

పుచ్చుకొని, ఒకని యెస్టేటు విషయమై సర్కారువారు క్రొత్త గా పట్టాయిచ్చినయెడల, అట్టి పట్టావలన సదరు ఎస్టేటు స్వార్జితము కాజాలదు. (ఇ. లా. రి. 10 మ. 1).

రుజువుభారము. **159.** సాధారణముగా హిందూ కుటుంబములు సమష్టి కుటుంబములుగా భావింపబడును. మరియు సమష్టి కుటుంబములో ఒక భాగస్థుని వద్దనే యున్నను సొత్తు సమష్టిసొత్తుగానే భావింపబడును. కాబట్టి విభాగము జరిగినదని వాదించువారే ఆ విషయమును తగిన ఋజువు వలన స్థాపించవలసి యుండును. అలాగుననే యేదైనను సొత్తు తన స్వార్జితమని సమష్టి కుటుంబములో ఒక భాగస్థుడు వాదించిన యెడల, ఆ విషయమును అతడు రుజువుచేయవలయును. (ఇ. లా. రి. 6 బొం. 225; ఇ. లా. రి. 8 బొం. 154; ఇ. లా. రి. 8 క. 517; ఇ. లా. రి. 2 మ. 19; ఇ. లా. రి. 22 క. 85; ఇ. లా. రి. 18 అ. 90). సర్కారులెక్కలు వగైరాలలోసొత్తు ఒక భాగస్థుని పేరటనే ఉన్నంత మాత్రముచే అది అతని స్వార్జితమని యెంచగూడదు. (11 మూ. ఇ. అ. 639). కాని, ఆయాసంగతి సందర్భములను బట్టి రుజువుభారము మారవచ్చును. ఇది యేలాగంటే—

(1.) సమష్టి ఆస్తి యెంతమాత్రమును లేదు. లేక, ప్రతివాది స్వాధీనమందు సమష్టి ఆస్తి యెన్నడును ఉండలేదు. ప్రతివాదియొక్క ఆస్తి సమష్టి సొత్తుయొక్క సహాయమువలన సంపాదింపబడెనని వాది చెప్పిన యెడల, అతడే ఆ విషయమును రుజువు చేయవలయును.

(2.) సమష్టి కుటుంబములో ఒక భాగస్థుని భార్య పేరట కొంత ఆస్తిగాని ఒక పత్రముగాని ఉన్నది. అది సమష్టి సొత్తని వాదించువారే రుజువు భారమును వహింతురు. (ఇ. లా. రి. 2 మ. 214).

# ప్రకరణము 6.

——:o:——

## ఋణములు.

**160.** ఋణగ్రస్తుఁడుగా మృతిచెందినవాఁడు మఱియొక జన్మ
మునందు అప్పులవాని యింట దాసినగాగాని సేవకుఁడుగా గాని
చతుష్పాదజంతువుగా గాని జన్మించుననియు, సన్యాసిగానివాఁడు
ఋణగ్రస్తుఁడుగా మృతిచెందినయెడల అతఁడు చేసిన పుణ్యమంతి
యు అప్పులవానికి చెందుననియు, అందువలన తండ్రిగాని తాత
గాని ఋణగ్రస్తుఁడుగా మృతిచెందిన యెడల, వారి వద్దినుండి యే
దైనను ఆస్తి పొందియున్ననుసరే పొందకయున్ననుసరే ఋణ
ములనుతీర్చి వారిని పాపవిముక్తులను చేయుట కుమారునియొ
క్కయు మనుమనియొక్కయు విధియనియు - హిందూధర్మశా
స్త్రములు చెప్పుచున్నవి. తండ్రియొక్క ఋణములను వడ్డీతో
కూడ తీర్చుటకు కుమారుడు బద్ధుడనియు, తాతయొక్క ఋణ
ములను వడ్డీలేకుండ తీర్చుటకు మనుమఁడు బద్ధుడనియు బృహ
స్పతులవారు చెప్పియున్నారు.

అప్పు తీర్చని ఋణములు - శాస్త్రములు.

**161.** ధర్మశాస్త్రములలో చెప్పబడిన ప్రకారమే - అన
గా, తండ్రితాతల వద్దినుండి యేమాత్రముగాని ఆస్తిరాకున్నను
వారి అప్పులను తమ స్వార్జితములోనైనను తీర్చుటకు కుమారు
లును మనుమలును బద్ధులని - పూర్వకాలమునందు కొన్ని తీర్పు
లు చేయబడెను. (2 బొం. హై. 64). కాని, తండ్రితాతల వద్ది
నుండి యెంత పిత్రార్జితపు సొత్తు వచ్చుచున్నదో దాని మొత్త
మువరకే వారి అప్పులను తీర్చుటకు కుమారుఁడును మనుమఁడు
ను బద్ధులని యిప్పుడు స్థిరపడి యున్నది. (2 మ. హై. 330; 4
మ. హై. 1; ఇ. లా. ర. 4 మ. 45; 15 మై. 196; ఇ. లా. ర.

తీర్పులు.

19 అ. 26. 1866 సం॥ 7 నెం॥ బొంబయి గవర్నమెంటువారి చట్టమును కూడ చూడవలసినది. 10 బొం. హై. 361; 11 బొం. హై. 76; ఇ. లా. రి. 13 బొం. 653). తండ్రియొక్క లేక తాతయొక్క ఆస్తి కుమారునికిగాని మనుమనికిగాని చేరిన పిదప, అది నష్టమై పోయినను, లేక దానిని అతడు ఖర్చుచేసినను, సదరు తండ్రియొక్క లేక తాతయొక్క అప్పులను తీర్చునట్టి బాధ్యత తప్పిపోదు. (ఇ. లా. రి. 8 బొం. 220, 309).

అయోగ్య ఋణములు.

**162.** జూదము, పానము, వ్యభిచారము మొదలగు అయోగ్య కార్యముల నిమిత్తము చేయబడిన తండ్రియొక్క అప్పులు తీర్చుటకును, ప్రతి ఫలములేని వాగ్దానములవలనగాని కన్యాశుల్కము నిమిత్తముగాని జుల్మానా నిమిత్తముగాని తండ్రి బాకీ పడియున్న యెడల అట్టి బాకీలు తీర్చుటకును, కుమారుడు బద్ధుడు కాడని - ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. తండ్రి యెవరికైనను జామీనుగా నిలుచుటవలన ఏర్పడిన బాకీలను కుమారుడు తీర్చ నక్కర లేదనియు కొన్ని స్మృతులయందు చెప్పబడియున్నది. కాని, జామీను బాకీలను తీర్చుటకు కుమారుడు బద్ధుడేయని తీర్పులు చేయబడియున్నవి. (ఇ. లా. రి. 11 మ. 83; ఇ. లా. రి. 28 మ. 377; ఇ. లా. రి. 23 బొం. 454; ఇ. లా. రి. 26 అ. 611. చూడుము ఇ. లా. రి. 28 బొం. 408). తండ్రికి విధింపబడిన జుల్మానాగాని, అపహరింపబడిన ద్రవ్యము నిమిత్తము తండ్రిమీద పొందబడిన డిక్రీగాని, కుమారులను బాధింపదని తీర్పులు చేయబడి యున్నవి. (ఇ. లా. రి. 6 అ. 234; ఇ. లా. రి. 27 మ. 71). తండ్రివద్దనుండి కుమారులకు ఎంత పిత్రార్జితపు సొత్తు వచ్చియున్నను మీద చెప్పబడిన అయోగ్య ఋణములను తీర్చుటకు వారు బద్ధులుకారు. తండ్రియొక్క స్వార్జితపు సొత్తుమాత్రము అట్టి అయోగ్య ఋణము

లకు లోబడి యుండును. (ఇ. లా. రి. 2 క. 213; ఇ. లా. రి. 5 క. 148; ఇ. లా. రి. 8 అ. 231; ఇ. లా. రి. 24 క. 672; ఇ. లా. రి. 16 మ. 99; ఇ. లా. రి. 26 బొం. 334).

తండ్రియొక్క ఋణములు అయోగ్య కార్యముల నిమిత్తము చేయబడెనను కారణమువలన తమకు చెందిన పిత్రార్జితపు సొత్తును అవి భాధింప జాలవని కుమారులు వాదించినయెడల, సదరు ఋణముల విషయమై ఆ అంశమును స్పష్టమైన రుజువుతో వారు స్థాపించవలెను. (ఇ. లా. రి. 12 అ. 99; 13 అ. 216; 14 అ. 179; 30 అ. 156). తన తండ్రి పోకిరివాడుగాని జూదరిగాగాని దుబారా ఖర్చుదారుడుగా గాని యుండెనని మాత్రము రుజువు చాలదు. (ఇ. లా. రి. 15 క. 717; ఇ. లా. రి. 14 బొం. 320; ఇ. లా. రి. 8 మ. 75; ఇ. లా. రి. 21 అ. 238). అయోగ్య కార్యము.

**163.** పైపేరాలో చెప్పిన ప్రకారము తండ్రియొక్క ఋణములు అయోగ్యమగు ఋణములుగా నుండినగాని వానిని తీర్చునట్టి బాధ్యత కుమారులకు తప్పిపోవునుగాని మరియే కారణమువల్లను తప్పజాలదు. అయోగ్య ఋణములు కానియెడల, అవి కుటుంబమునకు అనావశ్యకమైనవిగాను బేజరూరు ఖర్చుల నిమిత్తము చేయబడినవిగాను ఉన్నను వానిని తీర్చునట్టి బాధ్యత కుమారులకు తప్పదు. (6 మూ. ఇ. అ 421). అనగా, అట్టి ఋణములను తీర్చునట్టి విషయములో తండ్రి వద్ది నుంచి కుమారులకు వచ్చిన యావదాస్తియు లోబడియుండును. (14 క. వీ. 187; ఇ. లా. రి. 5 క. 148; ఇ. లా. రి. 9 క. 389; ఇ. లా. రి. 4 మ. 1; ఇ. లా. రి. 3 మ. 370; ఇ. లా. రి. 6 మ. 293; ఇ. లా. రి. 15 క. 717; ఇ. లా. రి. 16 అ. 449; ఇ. లా. రి. 13 మ. 205; ఇ. లా. రి. 16 మ. 99; ఇ. లా. రి. 7 మ. 339). తండ్రియొక్క పిత్రార్జితపు సొత్తులో అతను జీవించియుండగానే కుమారులకు

19 అ. 26. 1866 సం॥ 7 నెం॥ బొంబయి గవర్నమెంటువారి చట్టమును కూడ చూడవలసినది. 10 బొం. హై. 361; 11 బొం. హై. 76; ఇ. లా. రి. 13 బొం. 653). తండ్రియొక్క లేక తాతయొక్క ఆస్తి కుమారునికిగాని మనుమనికిగాని చేరిన పిదప, అది నష్టమై పోయినను, లేక దానిని అతడు ఖర్చుచేసినను, సదరు తండ్రియొక్క లేక తాతయొక్క అప్పులను తీర్చునట్టి బాధ్యత తప్పిపోదు. (ఇ. లా. రి. 8 బొం. 220, 309).

అయోగ్య ఋణములు.

**162.** జూదము, పానము, వ్యభిచారము మొదలగు అయోగ్య కార్యముల నిమిత్తము చేయబడిన తండ్రియొక్క అప్పులు తీర్చుటకును, ప్రతి ఫలములేని వాగ్దానములవలనగాని కన్యాశుల్కము నిమిత్తముగాని జుల్మానా నిమిత్తముగాని తండ్రి బాకీ పడియున్న యెడల అట్టి బాకీలు తీర్చుటకును, కుమారుడు బద్ధుడు కాడని - ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. తండ్రి యెవరికైనను జామీనుగా నిలుచుటవలన ఏర్పడిన బాకీలను కుమారుడు తీర్చ నక్కర లేదనియు కొన్ని స్మృతులయందు చెప్పబడియున్నది. కాని, జామీను బాకీలను తీర్చుటకు కుమారుడు బద్ధుడేయని తీర్పులు చేయబడియున్నవి. (ఇ. లా. రి. 11 మ. 83; ఇ. లా. రి. 28 మ. 377; ఇ. లా. రి. 23 బొం. 454; ఇ. లా. రి. 26 అ. 611. చూడు ఇ. లా. రి. 28 బొం. 408). తండ్రికి విధింపబడిన జుల్మానాగాని, అపహరింపబడిన ద్రవ్యము నిమిత్తము తండ్రిమీద పొందబడిన డిక్రీగాని, కుమారులను బాధింపదని తీర్పులు చేయబడి యున్నవి. (ఇ. లా. రి. 6 అ. 234; ఇ. లా. రి. 27 మ. 71). తండ్రివద్దనుండి కుమారులకు ఎంత పిత్రార్జితపు సొత్తు వచ్చియున్నను మీద చెప్పబడిన అయోగ్య ఋణములను తీర్చుటకు వారు బద్ధులుకారు. తండ్రియొక్క స్వార్జితపు సొత్తుమాత్రము అట్టి అయోగ్య ఋణము

లకు లోబడి యుండును. (ఇ. లా. రి. 2 క. 213; ఇ. లా. రి. 5 క. 148; ఇ. లా. రి. 8 అ. 231; ఇ. లా. రి. 24 క. 672; ఇ. లా. రి. 16 మ. 99; ఇ. లా. రి. 26 బొం. 334).

తండ్రియొక్క ఋణములు అయోగ్య కార్యముల నిమిత్తము చేయబడెనను కారణమువలన తమకు చెందిన పిత్రార్జితపు సొత్తును అవి బాధింప జాలవని కుమారులు వాదించినయెడల, సదరు ఋణముల విషయమై ఆ అంశమును స్పష్టముగా ఋజువుచేసి వారు స్థాపించవలెను. (ఇ. లా. రి. 12 అ. 99; 13 అ. 216; 14 అ. 179; 30 అ. 156). తమ తండ్రి పోకిరీగాగాని జూదరిగాగాని దుబారా ఖర్చుదారుడుగా గాని యుండెనని మాత్రము ఋజువు చాలదు. (ఇ. లా. రి. 15 క. 717; ఇ. లా. రి. 14 అల. 320; ఇ. లా. రి. 8 మ. 75; ఇ. లా. రి. 21 అ. 238).

**163.** పై పేరాలో చెప్పిన ప్రకారము తండ్రియొక్క ఋణములు అయోగ్యముగు ఋణములుగానుండినచో వానిని తీర్చునట్టి బాధ్యత కుమారులకు తప్పిపోవునుగాని మరియే కారణము వల్లను తప్పజాలదు. అయోగ్య ఋణములు కానియెడల, అవి కుటుంబమునకు అనావశ్యకమైనవిగాను బేజరూరుఖర్చుల నిమిత్తము చేయబడినవిగాను ఉన్నను వానిని తీర్చునట్టి బాధ్యత కుమారులకు తప్పదు. (6 మూ. ఇ. అ 421). అనగా, అట్టి ఋణములను తీర్చునట్టి విషయములో తండ్రివద్దనుంచి కుమారులకు వచ్చిన యావదాస్తియు లోబడియుండును. (14 క. వీ. 187; ఇ. లా. రి. 5 క. 148; ఇ. లా. రి. 9 క. 389; ఇ. లా. రి. 4 మ. 1; ఇ. లా. రి. 3 మ. 370; ఇ. లా. రి. 6 మ. 293; ఇ. లా. రి. 15 క. 717; ఇ. లా. రి. 16 అ. 449; ఇ. లా. రి. 13 మ. 205; ఇ. లా. రి. 16 మ. 99; ఇ. లా. రి. 7 మ. 339). తండ్రియొక్క పిత్రార్జితపు సొత్తులో అతను జీవించియుండగానే కుమారులకు

తండ్రి ఋణములు.

తండ్రియొక్క అయోగ్యముగాని ఋణములు

సమానహక్కు కలిగియుండుసను కారణముచేత వీరి భాగములను ముట్టగూడదని చెప్పుటకు వీలులేదు. పిత్రార్జితపు సొత్తు నందలి తమ భాగము యావత్తును వదులుకొని యైనను తండ్రిని ఋణపాతకవిముక్తునిగా చేయుట కుమారుల విధియని ధర్మశాస్త్రములు వక్కాణించుచున్నవి. (ఇ. లా. రి. 28బాం. 383; ఇ. లా. రి. 27 అ. 16).

తండ్రి జీవించి యుండగా కుమారులపైని దావా.

**164.** తండ్రి మృతి చెంది అతని ఆస్తితమ స్వాధీనమైయుండునప్పుడును - సన్యాసాశ్రమము నవలంబించుట వల్లగాని యిరువది సంవత్సరముల కాలము దేశాంతరగతుడై యుండుటవల్లగాని అనివార్యమగు వ్యాధివలన పీడితుడై యుండుటవల్లగాని తండ్రి మృతప్రాయుడై అతని ఆస్తితమస్వాధీనములోనికి వచ్చియుండునప్పుడును - ఈ సందర్భములందు మాత్రమే తండ్రి ఋణముల విషయమై కుమారులు జవాబు దారులగుదురు గాని, ఆస్తిచెందకమునువు జవాబుదారులు కాజాలరు. ఈ చెప్పబడిన సందర్భములయందు తప్ప మరియెన్నడును తండ్రి జీవించియుండగా అతని అప్పుల నిమిత్తము కుమారులమీద దావా నిల్వనేరదు. (1851 సం॥ మ. తీ. 33).

కుటుంబముయొక్క ఆస్తిని, తన అప్పుల నిమిత్తము తండ్రి తాకట్టు పెట్టవచ్చును, విక్రయించవచ్చును.

**165.** కుటుంబముయొక్క యావదాస్తిని తండ్రి తన అప్పులనిమిత్తము తాకట్టు పెట్టవచ్చును, అమ్మవచ్చును. సదరు ఋణములు కుటుంబమునకు అనావశ్యకమైనవిగా నుండినను భాధకములేదు. కాని, అయోగ్యమైన ఋణముల విషయమై తండ్రి తన స్వార్జితమును పిత్రార్జితములో తనవంతు భాగమును మాత్రమే అమ్మవచ్చును, లేక, తాకట్టు పెట్టవచ్చును. కుమారుల యొక్క భాగము మీద అతనికి స్వాతంత్ర్యము లేదు. (14 క. హై. 187; 15 క. హై. 264; ఇ. లా. రి. 3 క. 1; ఇ. లా. రి. 5 క. 148; ఇ. లా. రి. 4 మ. 1, 73; ఇ. లా. రి. 1 బాం. 262;

ఇ. లా. రి. 2 బొం. 498; ఇ. లా. రి. 5 బొం. 622; ఇ. లా. రి. 3 అ. 625, 125; ఇ. లా. రి. 6 బొం. 520; ఇ. లా. రి. 8 క. 517; ఇ. లా. రి. 5 మ. 61; ఇ. లా. రి. 7 బొం. 438; ఇ. లా. రి. 8 బొం. 481; ఇ. లా. రి. 24 బొం. 343; ఇ. లా. రి. 9 మ. 343; ఇ. లా. రి. 27 మ. 326; ఇ. లా. రి. 11 క. 396; 34 క. 735). ఇట్లు ప్రివీకౌన్సిలువారు తీరుమానించి యుండియు, 1893 సం॥ లో, మైసూరు చీఫ్‌కోర్టువారు, కుటుంబమునకు అనావశ్యక మైనట్టియు నిరుపయోగమైనట్టియు తన ఋణముల కై యావత్తు పిత్రార్జితపు సొత్తును తాకట్టు పెట్టుటకు, లేక విక్రయించుటకు, స్వాతంత్ర్యము తండ్రికి లేదని స్థిరపరచిరి. (5 మై. 300).

మీఁద చెప్పిన ప్రకారము తండ్రి తన అప్పులకొరకు తమ కుటుంబపు ఆస్తిని తాకట్టు పెట్టినప్పుడును విక్రయించినప్పుడును, కుమారులు మైనర్లుగా నుండిననే సదరు తాకట్టు, లేక, క్రయము చెల్లునుగాని, కుమారులు యుక్తవయస్కులుగా నుండునప్పుడు వారి యనుమతి లేక అది చెల్లజాలదని కలకత్తా హైకోర్టువారు కొన్ని కేసులలో తీరుమానించిరి. (ఇ. లా. రి. 6 క. 749, 753. దీనికి వ్యతిరేకము, ఇ. లా. రి. 4 అ. 309). ఇట్లు తీరుమానించి నను, సదరు తాకట్టుగాని క్రయముగాని చెల్లనప్పుడు, దాని నిమిత్త మియ్యబడిన సొమ్ము ఒక ఋణముగా ఏర్పడును గావున అట్టి ఋణమును తీర్చునట్టి భారమును యావదాస్తియును వహించును - అని వారే తీరుమానించిరి. కాబట్టి కుమారులయొక్క యుక్తవయస్సు సంబంధమైన వివక్షతవలన విశేషము ప్రయోజనము కనుపడదు. (ఇ. లా. రి. 6 క. 135, 138; ఇ. లా. రి. 9 క. 495).

అదివరకే యేర్పడియుండు ఋణములకొరకు తమ మీఁద చెప్పిన ప్రకారము కుటుంబపు ఆస్తిని తండ్రి తాకట్టు పెట్టవచ్చు

ను, లేక విక్రయించవచ్చును. (ఇ. లా. రి. 6 క. 138; ఇ. లా. రి. 10 క. 528; ఇ. లా. రి. 8 అ. 279; ఇ. లా. రి. 7 మ. 39; ఇ. లా. రి. 33 బొం. 264). ఆదివరకే ఋణము లేనప్పుడు కుటుంబపు ఆస్తిని తండ్రి తాకట్టు పెట్టినయెడల, లేక, విక్రయించిన యెడల, సదరు తాకట్టుగాని విక్రయముగాని చెల్లకున్నను (ఇ. లా. రి. 28 అ. 328; 31 అ. 50; 29 మ. 205. చూడు 34 క. 184), తాకట్టు నిమిత్తము, లేక, క్రయము నిమిత్తము తండ్రివల్ల పొందబడ్డ సొమ్ము ఒక ఋణముగా ఏర్పడును గావున, ఆ ఋణము నిమిత్తము దావా తెచ్చి, సదరు తాకట్టు పెట్టబడిన లేక విక్రయింపబడిన ఆస్తివలన తీర్చుకొనునట్లు డిక్రీ పొందవచ్చును - ఇట్లని కలకత్తా హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 5 క. 855; ఇ. లా. రి. 8 క. 131; ఇ. లా. రి. 20 క. 238; ఇ. లా. రి. 27 క. 762; వ్యతిరేకము, ఇ. లా. రి. 9 అ. 493; ఇ. లా. రి. 15 అ. 75; ఇ. లా. రి. 21 మ. 28).

తండ్రిమీద మాత్రమే దావా, లేక, డిక్రీ అమలు.

**166**. తండ్రియొక్క అయోగ్యముకాని అప్పులనిమిత్తము కుటుంబపు ఆస్తి తాకట్టు పెట్టబడినప్పుడు, సదరు తాకట్టుదారు తండ్రిమీద మాత్రమే దావా తెచ్చి డిక్రీపొందినను, డిక్రీ అమలుజరిగించుటలో కుమారులయొక్క భాగములు సహా యావత్తు పిత్రార్జితపు సొత్తును జప్తుచేసి వేలము వేయించవచ్చును. (ఇ. లా. రి. 5 క. 148; ఇ. లా. రి. 4 మ. 1; ఇ. లా. రి. 6 మ. 343; ఇ. లా. రి. 5 మ. 251; ఇ. లా. రి. 8 క. 517; ఇ. లా. రి. 8 మ. 388; ఇ. లా. రి. 6 బొం. 520; ఇ. లా. రి. 10 క. 626; ఇ. లా. రి. 8 అ. 205; ఇ. లా. రి. 25 అ. 57; ఇ. లా. రి. 4 మ. 111; ఇ. లా. రి. 33 క. 676). కాని, అట్టి సందర్భమునందు, సదరు తాకట్టు విడిపించుట నిమిత్తము కుమారులకు అవకాశమియ్యక, ఆ స్తిని ఏలము వేయించగూడదు. (ఇ.

లా. రి. 4 మ. 1, 69; ఇ. లా. రి. 8 క. 525; ఇ. లా. రి. 8 బొం. 481. చూడుడు ఇ. లా. రి. 24 అ. 211; ఇ. లా. రి. 28 క. 517. కాని, 1882 సం॥ 4 నెం॥ ట్రాన్స్‌ఫర్ ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు 85, 88 సెక్షనులు చూడుడు. మఱియు, ఇ. లా. రి. 17 అ. 537; ఇ. లా. రి. 21 అ. 301; ఇ. లా. రి. 21 మ. 222; ఇ. లా. రి. 22 మ. 207; ఇ. లా. రి. 28 అ. 82).

ఆలాగుననే, తాకట్టుమీదగాక రొక్కపు బాకీ నిమిత్తము తండ్రిమీద డిక్రీ పొందబడినప్పుడు, డిక్రీ అమలులో కుమారులను పార్టీలనుగా చేర్చకయే కుటుంబపు ఆస్తి వేలము వెయ్యబడిన యెడల, దానివలన కుమారులు బద్ధులగుదురని తీర్మానింపబడి యున్నది. (14 క. హై. 187; ఇ. లా. రి. 5 క. 148; ఇ. లా. రి. 15 క. 717; ఇ. లా. రి. 12 మ. 142; ఇ. లా. రి. 28 అ. 288.)

కోర్టువారు వేయునట్టి యేలములో "బాకీదారుని యావత్తు హక్కును బాధ్యతయును విక్రయింపబడును" అని ప్రకటింపబడు చున్నది. దీనినిబట్టి, తండ్రివంతు హక్కు మాత్రమే విక్రయింపబడునట్లు ఊహింపగూడదు. తన అప్పుల నిమిత్తము కుటుంబపు ఆస్తిని వినియోగ పరచుటకు తండ్రికి ఎంత హక్కు కలదో ఆ హక్కు యావత్తును విక్రయింపబడునట్లు ఎంచవలసినది. (ఇ. లా. రి. 13 క. 21; ఇ. లా. రి. 8 బొం. 486; ఇ. లా రి. 4 మ. 65; ఇ. లా. రి. 15 క. 70, ఇ. లా. రి. 17 క. 584; ఇ. లా. రి. 20 బొం. 385; ఇ. లా. రి. 22 మ. 110; ఇ. లా. రి. 17 బొం. 718; ఇ. లా. రి. 9 మ. 425). కాని, దావా అర్జీవల్లగాని, డిక్రీ అమలు నడవడికలవల్లగాని, యేలపు సర్టిఫికట్టువల్లగాని, యేలమువల్ల వచ్చిన ద్రవ్యపు మొత్తమువల్లగాని, బాకీదారుని వంతు హక్కుమాత్రమే, అనగా, తండ్రివంతు హక్కు

ను, లేక విక్రయించవచ్చును. (ఇ. లా. రి. 6 క. 138; ఇ. లా. రి. 10 క. 528; ఇ. లా. రి. 8 అ. 279; ఇ. లా. రి. 7 మ. 39; ఇ. లా. రి. 33 బొం. 264). ఆదివరకే ఋణము లేనప్పుడు కుటుంబపు ఆస్తిని తండ్రి తాకట్టు పెట్టినయెడల, లేక, విక్రయించిన యెడల, సదరు తాకట్టుగాని విక్రయముగాని చెల్లకున్నను (ఇ. లా. రి. 28 అ. 328; 31 అ. 50; 29 మ. 205. చూడు 34 క. 184), తాకట్టు నిమిత్తము, లేక, క్రయము నిమిత్తము తండ్రివల్ల పొందబడ్డ సొమ్ము ఒక ఋణముగా ఏర్పడును గావున, ఆ ఋణము నిమిత్తము దావా తెచ్చి, సదరు తాకట్టు పెట్టబడిన లేక విక్రయింపబడిన ఆస్తివలన తీర్చుకొనునట్లు డిక్రీ పొందవచ్చును - ఇట్లని కలకత్తా హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 5 క. 855; ఇ. లా. రి. 8 క. 131; ఇ. లా. రి. 20 క. 238; ఇ. లా. రి. 27 క. 762; వ్యతిరేకము, ఇ. లా. రి. 9 అ. 493; ఇ. లా. రి. 15 అ. 75; ఇ. లా. రి. 21 మ. 28).

తండ్రిమీద మాత్రమే దావా, లేక, డిక్రీ అమలు.

**166.** తండ్రియొక్క అయోగ్యముకాని అప్పులనిమిత్తము కుటుంబపు ఆస్తి తాకట్టు పెట్టబడినప్పుడు, సదరు తాకట్టుదారు తండ్రిమీద మాత్రమే దావా తెచ్చి డిక్రీపొందినను, డిక్రీ అమలుజరిగించుటలో కుమారులయొక్క భాగములు సహా యావత్తు పిత్రార్జితపు సొత్తును జప్తుచేసి వేలము వేయించవచ్చును. (ఇ. లా. రి. 5 క. 148; ఇ. లా. రి. 4 మ. 1; ఇ. లా. రి. 6 మ. 343; ఇ. లా. రి. 5 మ. 251; ఇ. లా. రి. 8 క. 517; ఇ. లా. రి. 8 మ. 388; ఇ. లా. రి. 6 బొం. 520; ఇ. లా. రి. 10 క. 626; ఇ. లా. రి. 8 అ. 205; ఇ. లా. రి. 25 అ. 57; ఇ. లా. రి. 4 మ. 111; ఇ. లా. రి. 33 క. 676). కాని, అట్టిసందర్భమునందు, సదరు తాకట్టు విడిపించుట నిమిత్తము కుమారులకు అవకాశమియ్యక, ఆ స్తిని ఏలము వేయించగూడదు. (ఇ.

లా. రి. 4 మ. 1, 69; ఇ. లా. రి. 8 క. 525; ఇ. లా. రి. 8 బొం. 481. చూడుము ఇ. లా. రి. 24 అ. 211; ఇ. లా. రి. 28 క. 517. కాని, 1882 సం॥ 4 నెం॥ ట్రాన్సఫర్ ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు 85, 88 సెక్షనులు చూడుము. మఱియు, ఇ. లా. రి. 17 అ. 537; ఇ. లా. రి. 21 అ. 301; ఇ. లా. రి. 21 మ. 222; ఇ. లా. రి. 22 మ. 207; ఇ. లా. రి. 28 అ. 82).

ఆలాగుననే, తాకట్టుమీదగాక రొక్కపు బాకీ నిమిత్తము తండ్రిమీద డిక్రీ పొందబడినప్పుడు, డిక్రీ అమలులో కుమారులను పార్టీలనుగా చేర్చకయే కుటుంబపు ఆస్తి వేలము వెయ్యబడిన యెడల, దానివలన కుమారులు బద్ధులగుదురని తీర్మానింపబడియున్నది. (14 క. హై. 187; ఇ. లా. రి. 5 క. 148; ఇ. లా. రి. 15 క. 717; ఇ. లా. రి. 12 మ. 142; ఇ. లా. రి. 28 అ. 288.)

కోర్టువారు వేయునట్టి వేలములో "బాకీదారుని యావత్తు హక్కును బాధ్యతయును విక్రయింపబడును" అని ప్రకటింపబడు చున్నది. దీనినిబట్టి, తండ్రివంతు హక్కు మాత్రమే విక్రయింపబడునట్లు ఊహింపగూడదు. తన అప్పుల నిమిత్తము కుటుంబపు ఆస్తిని వినియోగ పరచుటకు తండ్రికి ఎంత హక్కు కలదో ఆ హక్కు యావత్తును విక్రయింపబడునట్లు ఎంచవలసినది. (ఇ. లా. రి. 13 క. 21; ఇ. లా. రి. 8 బొం. 486; ఇ. లా. రి. 4 మ. 65; ఇ. లా. రి. 15 క. 70, ఇ. లా. రి. 17 క. 584; ఇ. లా. రి. 20 బొం. 385; ఇ. లా. రి. 22 మ. 110; ఇ. లా. రి. 17 బొం. 718; ఇ. లా. రి. 9 మ. 425). కాని, దావా అర్జీవల్లగాని, డిక్రీ అమలు నడవడికలవల్లగాని, వేలపు సర్టిఫికెట్టువల్లగాని, వేలమువల్ల వచ్చిన ద్రవ్యపు మొత్తమువల్లగాని, బాకీదారుని వంతు హక్కుమాత్రమే, అనగా, తండ్రివంతు హక్కు

మాత్రమే యేలమునకు తేబడినట్టు స్పష్టముగా కనుపడిన యెడల, అట్టి సందర్భమున కుమారుల హక్కునకు బాధకము కలుగనేరదు. (ఇ. లా. రి. 14 క. 572; ఇ. లా. రి. 11 బొం. 42; ఇ. లా. రి. 10 మ. 241; ఇ. లా. రి. 27 మ. 131; ఇ. లా. రి. 3 క. 198; ఇ. లా. రి. 10 క. 626; ఇ. లా. రి. 26 క. 285; ఇ. లా. రి. 6 బొం. 564). అందరి హక్కులును విక్రయమునకు తేబడినట్లు జడ్జిమెంటువలన యేర్పడిన యెడల, డిక్రీ అమలులో ఏవైనను స్వల్పలోపములు కనుపడినంత మాత్రము చేత కోర్టువారు క్రయమును రద్దుపరచజాలరు. (14 మూ. ఇ. అ. 605; ఇ. లా. రి. 10 క. 985; ఇ. లా. రి. 11 బొం. 361; ఇ. లా. రి. 18 బొం. 147; ఇ. లా. రి. 14 క. 401; ఇ. లా. రి. 16 క. 40; ఇ. లా. రి. 20 క. 453; ఇ. లా. రి. 23 క. 302; ఇ. లా. రి. 12 మ. 147; ఇ. లా. రి. 15 క. 717; ఇ. లా. 12 బొం. 691; ఇ. లా. రి. 24 బొం. 135).

కుమారులవల్ల తకరారు అర్జీ.

**167.** తండ్రిమీద మాత్రమే డిక్రీ పొందబడి కుటుంబము యొక్క యావదాస్తియును ఏలము వేయించబడినప్పుడు, సదరు డిక్రీకి సంబంధించిన అప్పులు 162 - వ పేరాలో చెప్పబడిన ప్రకారము అయోగ్య కార్యముల నిమిత్తము చేయబడినవై యుండిన యెడల ఆ విషయమును కుమారులు స్పష్టముగా రుజువు పరచి పిత్రార్జితపు సొత్తులో తమవంతు భాగములను కాపాడుకొనవచ్చును. సదరు ఏలపు ఆస్తిని వాదియే కొనినయెడల, అతనిమీద వ్యవహారము జరిపి కుమారులు తమ భాగములను తీసికొనవచ్చును. (ఇ. లా. రి. 5 క. 855; ఇ. లా. రి. 8 క. 522; ఇ. లా. రి. 23 క. 262. వాది కుమారుడు కొన్నప్పుడు ఇ. లా. రి. 8 బొం. 481). కాని, వాదిగాక మరి యెవరైనను ఏలపు ఆస్తిని కొనియున్న యెడల, డిక్రీకి సంబంధించిన అప్పులు అయోగ్యమైనవని

రుజువు చేయుటయేగాక, యీ విషయమును క్రయమునకు పూర్వమే క్రయదారుడు ఎరిగియుండినట్లు కుమారులు స్పష్టముగా రుజువు చేయవలెను. అట్లు రుజువుచేయని యెడల, కుమారుల వంతు భాగములు వారికి రానేరవు. ఇట్లు కొన్ని కేసులలో ప్రివీ కౌన్సిలువారు తీరుమానించిరి. (14 క. మై. 187; 22 న. 56; ఇ. లా. రి. 5 క. 148; ఇ. లా. రి. 12 బొం. 625; ఇ. లా. రి. 8 బొం. 481; ఇ. లా. రి. 16 మ. 99; ఇ. లా. రి. 27 మ. 243; చూడు ఇ. లా. రి. 21 మ. 222). డిక్రీ అప్పులు తండ్రివలన అయోగ్యమైన కార్యముల నిమిత్తము చేయబడినట్లు దావా అర్జీలో కనుపడునప్పుడు, సదరు డిక్రీని బట్టి జరిగింపబడిన వేలములో ఆస్తిని కొన్నవాడు, అట్టి అయోగ్య విషయమును ఎరిగియుండి కొనినట్లే భావింపబడును. కాబట్టి అట్టి సందర్భమున ఏ రుజువుతోగాని నిమిత్తము లేకయే కుమారులు తమ భాగములను తీసికొనవచ్చును. (ఇ. లా. రి. 6 అ. 234). మరికొన్ని కేసులలో - డిక్రినిబట్టి జరుపబడిన వేలపు క్రయదారుడు డిక్రీ అప్పులు అయోగ్యమైనవని బాత్తిగా యెరుగక ఆస్తిని కొనియున్నను, అతనిమీద దావా తెచ్చి కుమారులు తమవంతు భాగములను అసికొనవచ్చును - అని ప్రివీకౌన్సిలువారు అభిప్రాయము కలిగియుండునట్లు కనుపడుచున్నది. (ఇ. లా. రి. 13 క. 21; ఇ. లా. రి. 15 క. 717; ఇ. లా. రి. 12 మ. 142; ఇ. లా. రి. 17 క. 584). ఈ విషయము మొత్తముమీద సందిగ్ధముగానే యున్నది. కాబట్టి, తండ్రిమీద పొందబడిన డిక్రికి సంబంధించిన అప్పులు అయోగ్యముగా నుండునప్పుడు పిత్రార్జితపు సొత్తులో తమవంతు భాగములను కాపాడుకొన వలెనని కుమారులు కోరిన యెడల, ఆ డిక్రీ అమలులో జప్తు ఇస్తిహారు గాని వేలపు ఇస్తిహారు గాని పుట్టి యుండునప్పుడే, అనగా వేలమునకు ముందే, తమ వాక్కు-

విషయమై సివిల్ ప్రొసీడర్ కోడ్డు 278 సె॥ ప్రకారము కోర్టు లో తకరారు అర్జీ దాఖలు చేయుట మిక్కిలి ఆవశ్యకము. ఇంతేకాక, ఏలములో ఆ స్తిని కొన దలచుకొన్న వారి కందరికిని కుమారులు తమ హక్కు విషయమై నోటీసు జారీచేయవలయును. (ఇ. లా. రి. 8 మ. 376).

డిక్రీ అమలు జరుగకమునుపు తండ్రి మృతిచెందుట.

**168**. అప్పుల నిమిత్తము తండ్రిమీద మాత్రమే డిక్రీ పొందబడి, అమలు జరిపి సొత్తును జప్తుచేయుటకు పూర్వము తండ్రి మృతిచెందిన యెడల, కుమారుల స్వాధీనములోనికి చేరిన పిత్రార్జితపు సొత్తుమీద సదరు డిక్రీనిబట్టి అమలు జరిగించుటకు వీలు లేదు. తండ్రియొక్క స్వార్జితపుసొత్తుమీద మాత్రము అమలు జరిగించవచ్చును. పిత్రార్జితపు సొత్తును లోబరుపవలెనని కోరినయెడల, తండ్రి మృతిచెందిన 6 సం॥ల లోగా పునః కుమారుల మీద దావా తేవలెను. (ఇ. లా. రి. 13 మ. 265; ఇ. లా. రి. 3 మ. 42; ఇ. లా. రి. 5 మ. 232; ఇ. లా. రి. 16 మ. 99; ఇ. లా. రి. 16 అ. 449). సదరు డిక్రీకి సంబంధించిన అప్పులు అయోగ్యమైనవిగా నుండిన యెడల, కుమారులకు చేరియున్న పిత్రార్జితములో తండ్రివంతు భాగము కూడ అప్పులవారికి దక్కనేరదు. తండ్రి జీవితకాలములోనే డిక్రీ అమలు జరిగించి అతని భాగమును జప్తు చేయించిన యెడల దక్కును. (ఇ. లా. రి. 5 క. 148).

తండ్రియొక్క ఆస్తిని అప్పులను కుమారులు విభాగించు కొనుట.

**169**. తండ్రి మృతి చెందిన పిమ్మట ఆ స్తిని విభాగించుకొన్న యెడల, తండ్రి చేసిన అప్పులను తీర్చుటకు తగిన యేర్పాటుచేసి మిగిలిన ఆ స్తిని మాత్రమే వారు విభాగించుకొన వలయును. (3 మ. హై. 177, 181). అట్లు ఏర్పాటుచేయక ఆ స్తిని అప్పులను చేర్చి కుమారులందరును విభాగించుకొన్న యెడల, అట్టి విభాగమునకు అప్పులవారు సమ్మతించిననే తప్ప, లేనియెడల అందరి

భాగములును మొత్తము అప్పులకు జవాబుదారీ వహించియుం డును.

**170.** తండ్రియును కుమారులును ఆ స్తిని విభజించుకొని వేరుపడిన వెనుక తండ్రి అప్పులు చేసినయెడల, అవి అతని స్వాధీనములోనుండు ఆ స్తివల్లనే తీరవలెనుగాని కుమారుల అనుభవములో నుండు ఆ స్తిని బాధింపజాలవు. విభాగానంతరము తండ్రికి మరియొక కుమారుడు జన్మించినయెడల, అతనికి చెందునట్టి ఆ స్తిమాత్రమే యీ చెప్పబడిన అప్పులకు లోబడియుండును. వీనిని తీర్చుటకు సదరు ఆ స్తి చాలనియెడల, విభాగించుకొనియుండు కుమారులు తమ అనుభవములోని ఆ స్తివలన తీర్చవలసినదని జీమూతవాహనుడు చెప్పుచున్నాడు. కాని, యీ కాలమునందు కోర్టువారు ఈ అభిప్రాయము నంగీకరింపరు. (ఇ. లా. రి. 22 మ. 519; ఇ. లా. రి. 24 మ. 555)

తండ్రియొక్క ఋణముల నిమిత్తము కుమారులు తమస్వార్జితము నిచ్చుటకు బద్ధులుకారు.

తండ్రియు కుమారులు విభాగించుకొన్న పిదప, తండ్రిచేసిన అప్పులు.

**171.** తండ్రిచేసిన అప్పులను కుమారుడు తీర్చుట విషయమై మీద తెలుపబడిన విధులన్నియు, తాత అప్పుల విషయమై మనుమనికి, ముత్తాత అప్పుల విషయమై మునిమనుమనికి, అన్వయించుచున్నవి. కుమారుడు, మనుమడు, మునిమనుమడు. ఈ ముగ్గురుతప్ప సమష్టి కుటుంబములో యే భాగస్థుడును మరియొక భాగస్థుడు చేసిన అప్పులను తీర్చుటకు బద్ధుడుకాడు.

కుమారుడు, మనుమడు, మునిమనుమడు.

ఇతర భాగస్థులు.

**172.** సమష్టి కుటుంబములో తండ్రిగాక మరియే భాగస్థులైనను, అనగా కుమారుడు, అన్న, తమ్ముడు మొదలయినవారు అప్పులు చేసియున్నయెడల, అట్టి అప్పుల నిమిత్తమువారు సమష్టి ఆ స్తిలో తమవంతు హక్కును తాకట్టు పెట్టవచ్చును, లేక అమ్మవచ్చును. ఇంతేకాక, సమష్టి కుటుంబములోని భాగస్థు

సమష్టి కుటుంబములో తండ్రిగాక ఇతర భాగస్థుల అప్పులు.

స్థుడు తనవంతు హక్కును తాకట్టు పెట్టిగాని విక్రయపరచిగాని సొమ్ము తెచ్చికొనవచ్చును. సమష్టి కుటుంబములో ఒక భాగస్థుడు మృతిచెందునపుడు అతని హక్కు యావత్తును తక్కిన భాగస్థుల హక్కులో కలిసిపోవును. కాబట్టి, మృతిచెందిన భాగస్థునిమీద అతని అప్పులవాండ్రు డిక్రీ పొందియున్నను ప్రయోజనములేదు. అతని జీవితకాలములో అతనివంతు భాగమును జప్తుచేసియున్ననే వినియోగించును. (11 బొం. హై. 76; ఇ. లా. రి. 2 బొం. 479; ఇ. లా. రి. 8 అ. 495; ఇ. లా. రి. 11 అ. 302; 3 క. హై. 34-37; ఇ. లా. రి. 7 క. 52, 54; 1 మదరాసు లారిపోర్టర్ 63; 4 అ. హై. 137; ఇ. లా. రి. 3 క. 198; ఇ. లా. రి. 5 క. 148; ఇ. లా. రి. 7 అ. 731; ఇ. లా. రి. 4 మ. 302). దావా తీర్పు కాక పూర్వము చేయించబడిన జప్తువల్ల ప్రయోజనము గలుగదు. (ఇ. లా. రి. 17 మ. 144). మృతిచెందినవాని స్వార్జితము మీద నిరభ్యంతరముగా డిక్రీని నెరవేర్చవచ్చును.

ఒక అవిభాజ్యపు జమీందారీ పరిపాలకుడు పుత్రహీనుడుగా మృతిచెంది తమ్ముడు రాజ్యాధిపత్యమును పొందినప్పుడు, కుటుంబము నిమిత్తము గాక స్వంత ఖర్చులకై అన్నగారు తన పరిపాలనకాలములో చేసియుండు అప్పులను తీర్చునట్టి విషయములో, తమ్ముని స్వాధీనములోనికి వచ్చిన సదరు జమీను ఆస్తి బాధ్యత వహింపదు. (ఇ. లా. రి. 29 మ. 453).

ఆస్తిని పొందిన వారసుదారుల జవాబుదారీ.

**173.** ఒక ఆస్తిదారుని అప్పులను తీర్చునట్టి విషయమై మీద తెలిపిన ప్రకారము అతని కుమారుడు, మనుమడు, మునిమనుమడు - వీరు మాత్రమే బద్ధులుకాని, అతని భార్య, తల్లి, తండ్రి, అన్న, తమ్ముడు, పినతండ్రి, పెత్తండ్రి మొదలయినవారు బద్ధులుకారు. (ఇ. లా. రి. 1 మ. 354; ఇ. లా. రి. 10 మ. 316;

1855 సం॥ మ. తీ. 183). కాని, వీరిలో ఎవరైనను సదరు ఆ స్తిదారునికి వారసులై అతని ఆస్తిని పొందియున్న యెడల, ఆ యాస్తి చాలినంతవరకు అతని అప్పులు తీర్చుటకు బద్ధులుగా నుందురు. (ఇ. లా. రి. 3 మ. 359 ; 7 మ. 586). వారసుదారులుగా నుండియు మృతిచెందినవాని ఆస్తి యేమాత్రమును పొందియుండని యెడల, అతని అప్పులవిషయమై యెంతమాత్రమును జవాబుదారీయుండదు. మరియు, మృతిచెందినవాని ఆ స్తిని ఇతరుల స్వాధీనములోనికి పోనియ్యక తగిన శ్రద్ధతో దానిని తమ స్వాధీనములోనికి తెచ్చుకొని అప్పులవాండ్రకు నష్టము రాకుండ చేయుటకు వారసుదారులైన వారు బద్ధులుకారు. ఒక కేసులో, ఒక వితంతువుయొక్క అశ్రద్ధవలన ఆమె భర్త యొక్క ఆస్తిని ఆమె సహోదరుడును తండ్రియును అపహరించిరి. ఆమె భర్తయొక్క అప్పులవాండ్రకు వీగే జవాబుదారులుగాని వితంతువు కాదని తీరుమానింపబడెను. (2 డబ్లియు మెక్నాటన్, 286)

వారసుదారులు కానివారు మృతిచెందినవాని ఆస్తిని అక్రమముగా స్వాధీనపరచుకొని యున్న యెడల, సదరు ఆస్తియొక్క మొత్తము వరకు వారు అప్పులవాండ్రకు జవాబుదార్లుగా నుందురు. వారి మీద మృతిచెందిన వాని అప్పులవాండ్రు దావా తెచ్చినప్పుడు, తమ కేమాత్రమును ఆస్తి చేర లేదనిగాని, చేరిన ఆస్తియంతయు ఆవశ్యకమగు ఖర్చులనిమిత్తము - అనగా మృతిచెందినవాని శ్రాద్ధాదికర్మల క్రింద, లేక అతని యితర ఋణముల క్రింద వ్రయపడెననిగాని, రుజువుచేసిన యెడల, వారి జవాబుదారీ తప్పిపోవును. కాని, సదరు ఆస్తిని వారి స్వంతఖర్చుల క్రింద వినియోగించుకొన్న యెడల, జవాబుదారీ తప్ప నేరదు.

పరాధీనములు.

**174.** అప్పులవాండ్రకు చెందకుండ చేయవలెనను దురుద్దేశముతో ఎవరైనను తమ ఆస్తిని లాలోచీగా మిక్కిలి తక్కువ ప్రతిఫలమునకుగాని ప్రతిఫలము లేకుండ గాని పరాధీనముచేసిన యెడల, అట్టి పరాధీనము చెల్ల నేరదు. సదరు ఆస్తిమీద అప్పుల వాండ్రు తమ డిక్రీలను నెరవేర్చుకొనవచ్చును. కాని, మోసపు తలంపు లేశమైనను లేక, సరియైన ప్రతిఫలమును పొంది గాని, ప్రతిఫలము పొందకున్నను క్రమమైన సందర్భమున దానరూపక ముగా గాని ఉయిలు రూపకముగా గాని, చేయబడిన పరాధీన ములు చెల్లక తప్పవు. (4 మ. హై. 84; ఇ. లా. రి. 6 అ. 560; 21 స. 155. చూడు 1882 సం॥ 4 నెం॥ ట్రాంస్ఫర్ ఆఫ్ ప్రాపర్టి ఆక్టు, 128 సె.).

ఒక ఆస్తిదారుని వారసుదారుడు, లాలోచీగా గాక తగిన ప్రతిఫలమును పొంది అతని ఆస్తిని విక్రయించిన యెడల, లేక యితరమైన న్యాయ మార్గములలో పరాధీనము చేసినయెడల, మృతిచెందిన ఆస్తిదారుని అప్పుల వాండ్రకు సదరు ఆస్తిమీద హక్కు ఉండదు. (2 స. 296; 9 బొం. హై. 116; 12 బొం. హై. 78; ఇ. లా. రి. 26 మ. 792. చూడు ఇ. లా. రి. 4 క. 897). అట్లు పరాధీనము చేసిన వారసుదారుడు సదరు ఆస్తి మొత్తము వరకు స్వతః జవాబుదారుడుగా నుండును.

భార్య, సేవకుడు, శిష్యుడు మొదల గువారు చేసిన అ ప్పులు.

**175.** ఇంతవరకీ ప్రకరణములో ఋణస్థుని ఆస్తిని పొందినట్టి వారికి అతని అప్పులను తీర్చునట్టి విషయమై కలిగియుండు బాధ్యత తెలిపియుంటిమి. కొన్ని సందర్భములలో ఆస్తి పొందుటతో నిమిత్తము లేకయే ఒకరు చేసిన అప్పులను మరియొకరు తీర్చుటకు బద్ధులుగా నుందురు. అది యెట్లనగా:—

(I.) సమష్టి కుటుంబములో కుటుంబపు ఖర్చుల నిమిత్తము మేనేజింగు మెంబరు చేసిన అప్పులకు కుటుంబపు సొత్తు యావ

త్తును జవాబుదారీగా నుండును. మరియు, కుటుంబములో భాగస్థులందరును జావాబుదార్లుగా నుందురు. (ఇ. లా. రి. 26 అ. 407 ; ఇ. లా. రి. 14 బొం. 597 ; ఇ. లా. రి. 23 బొం. 372 ; ఇ. లా. రి. 29 క. 583 ; ఇ. లా. రి. 20 క. 18).

(2.) ఆవశ్యకమైన గృహ కృత్యముల నిమిత్తము భార్య చేసిన అప్పులను భర్త తీర్చవలయును. (1 డబ్లియు మెక్ నాటన్ 286 ; ఇ. లా. రి. 29 క. 797).

(3.) శిష్యుడు సేవకుడు మొదలయిన వారు గృహ కృత్యముల నిమిత్తము అప్పుచేసిన యెడల, తీర్చుటకు యజమానుడు బద్ధుడుగా నుండును. (ఇ. లా. రి. 29 క. 797).

(4.) అధికారమును అతిక్రమించకుండ ఏజెంటు చేసిన న్యాయమైన అప్పులను తీర్చుటకు యజమానుడు బద్ధుడుగా నుండును. (ఇ. లా. రి. 29 క. 797).

(5.) సమష్టి కుటుంబమువారు జాయింటుగా వ్యాపారము చేసినయెడల, సదరు వ్యాపారము నిమిత్తము వారిలో ఒక్కడు మాత్రమే అప్పులు చేసినను, తీర్చుటకు అందరును బద్ధులుగా నుందురు. (ఇ. లా. రి. 1 క. 475 ; ఇ. లా. రి. 20 క. 453). సమష్టి కుటుంబముయొక్క మేనేజరుగా నుండువాడు సమష్టి కుటుంబపు జాయింటు వ్యాపారము నిమిత్తము కుటుంబపు ఆస్తిని తాకట్టుపెట్టియుండి ఆ తాకట్టునుబట్టి అతనిమీద మాత్రమే దావా తేబడి ఆస్తి యేలము వేయించబడిన యెడల, తక్కిన భాగస్థులు ప్రతివాదులుగా చేర్చబడలేదను హేతువుచేత క్రయము రద్దుపరచబడ నేరదు. (ఇ. లా. రి. 15 క. 70). తాకట్టు మీదగాక రొక్కపు బాకీ నిమిత్తము సమష్టి కుటుంబముయొక్క మేనేజరు మీదమాత్రమే దావా తెచ్చి డిక్రీపొందబడిన యెడల, సదరు బాకీ కుటుంబమునిమిత్తము చేయబడినదైనను,

కుటుంబపు సొత్తులో మేనేజరుయొక్క భాగమును మాత్రమే ఆ డిక్రీ బాధించునుగాని తక్కిన భాగములను బాధింపజాలదు - ఇట్లని బొంబయి హైకోర్టువారు తీరుమానించి యున్నారు. (ఇ. లా. రి. 6 బొం. 564 ; ఇ. లా. రి. II బొం. 700).

# ప్రకరణము 7.

—:o:—

## ఆస్తిపరాధీనములు, దానములు.

**176.** ఈ ప్రకరణములో - తాకట్టు, క్రయము, దానము, మొదలగు విధములయందు ఆస్తిని పరాధీనము చేయుటకు, సమష్టి కుటుంబపు తండ్రికిని, ఇతర భాగస్థులకును గల స్వాతంత్ర్యము వివరింపబడును. ఈ స్వాతంత్ర్యము మితాక్షర దాయభాగ ధర్మశాస్త్రముల ప్రకారము భేదముగా నున్నందున, ముందు మితాక్షర న్యాయము వివరించి పిమ్మట దాయభాగమునందలి భేదము తెలుపంబడును. పరాధీనములు.

**177.** పుత్రసంతతి - అనగా పుత్ర, పౌత్ర, ప్రపౌత్ర సంతతి - లేని ఆస్తిదారుడు, అన్నదమ్ములు వగైరాలకు జాయింటు కాని తన యావదాస్తిని, అది చరాస్తియైనను స్థిరాస్తియైనను సరే స్వార్జితమైనను పిత్రార్జితమైనను సరే, అతని యిచ్చవచ్చినట్లు నిరాటంకముగా పరాధినము చేయవచ్చును. (2 మూ. ఇ. అ. 54; 6 మూ. ఇ. అ. 309; 3 బొం. హై. 6; 4 అ. హై. 31; 1 మ. హై. 51). పుత్రసంతతి లేని ఆస్తిదారుడు.

**178.** పుత్రసంతతి కలిగియుండు ఆస్తిదారుడు తన స్వార్జితపు సొత్తుమాత్రమే పరాధీనము చేయవచ్చును. స్వార్జితమైనను గూడ స్థిరాస్తిని పరాధీనము చేయుటకు తండ్రికి సంపూర్ణ స్వాతంత్ర్యము లేదని పూర్వకాలమునందు కొన్ని కేసులలో తీర్పు లియ్యబడెను. (1860 సం॥ మ. త. 227; 1862 సం॥ మ. త. 41; 1853 సం॥ మ. తీ. 61; 3 మ. హై. 55; 1 అ. హై. 153; 12 మూ. ఇ. అ. 38). కాని, యిప్పుడు చరమైనను సరే స్థిరమైనను సరే స్వార్జితపు సొత్తును కుమారుల యిష్టముతో నిమిత్తము లే తండ్రియొక్క స్వార్జితపు సొత్తుమీద అతని స్వాతంత్ర్యము.

కయే తన యిచ్ఛ వెంబడి పరాధీనము చేయుటకు తండ్రికి సంపూర్ణ స్వాతంత్ర్యము కలదని అన్ని హైకోర్టుల వారును ప్రీవీ కౌన్సిలు వారును గూడ తీరుమానించియున్నారు. (12 క. హై. 430; 10 స. 287; 9 మూ. ఇ. అ. 96, 121; 2 బొం. హై. 318; ఇ. లా. రి. 1 అ. 394; ఇ. లా. రి. 10 మ. 251; ఇ. లా. రి. 10 బొం. 528; 6 మూ. ఇ. అ. 77; 4 మూ. ఇ. అ. 103; 6 స. 71, 77; 7 స. 57; 8 స. 15; 11 స. 436; ఇ. లా. రి. 20 అ. 267).

విభాగానంతరము తండ్రి సొత్తుమీద అతని స్వాతంత్ర్యము.

**179.** తండ్రియును కుమారులును విభాగించుకొని వేరుగా నుండునపుడు, తండ్రివంతు ఆస్తియును విభాగానంతరము అతడు సంపాదించిన ఆస్తియును అతని యిష్టప్రకారము పరాధీనము చేయవచ్చును. (1862 సం॥ మ. తీ. 1).

పిత్రార్జితముమీద తండ్రికి స్వాతంత్ర్యము లేదు.

**180.** సమష్టి కుటుంబముయొక్క పిత్రార్జితపు సొత్తును తన యిష్టము వచ్చినట్లు పరాధీనము చేయుటకు తండ్రికి స్వాతంత్ర్యము లేదు. చరరూపకమైన పిత్రార్జితపు సొత్తుమీద మాత్రము తండ్రికి సంపూర్ణ స్వాతంత్ర్యము కలదనియు దాని విషయమై తండ్రి జరిగించిన పరాధీనములను ఆక్షేపించుటకు కుమారులకు హక్కు లేదనియు, కొందరు వక్కాణించిరి. ముందటి కాలమున కొన్ని తీర్పులలో గూడ ఈ యభిప్రాయమే తెలుపబడెను. (3 మ. హై. 455; ఇ. లా. రి. 4 మ. 47; 4 మ. హై. 60; 4 అ. హై. 63; 12 మూ. ఇ. అ. 38; ఇ. లా. రి. 1 మ. 252). కుటుంబ వ్రయములు, విధ్యుక్తములగు ప్రీతి పూర్వక దానములు, మరికొన్ని విధాయకములగు కార్యములు - వీని నిమిత్తము మాత్రమే చరరూపకమైన పిత్రార్జితముమీద తండ్రికి స్వాతంత్ర్యము కలదని మితాక్షరమువలన కనబడుచున్నది. దరిమిలా తీర్పులును ఈ యభిప్రాయమునే అనుసరించియున్నవి. అనగా, మీద ఉదహరింపబడిన కార్యముల నిమిత్తము తప్ప

విధ్యుక్త కార్యము నిమిత్తము చరరూపక పిత్రార్జితముమీద స్వాతంత్ర్యము.

యితర సందర్భములందు చరరూపక పిత్రార్జితము మీదగూడ తండ్రికి అధికారము లేదు. కాబట్టి, దానిని తన యిష్టము వెంబడి పరాధీనము చేయుటకుగాని, కుమారులు కూతులు అల్లుళ్లు మొదలగు వారికి తనయిచ్ఛవచ్చినట్లు పంచిపెట్టుటకుగాని, దానముచేయుటకుగాని, అతడు స్వతంత్రుడు కాడు. (ఇ. లా. రి. 1 బొం. 561; ఇ. లా. రి. 10 బొం. 545; ఇ. లా. రి. 7 మ. 357; 16 మ. 353; 29 బొం. 51; 30 మ. 452; 31 అ. 359).

**181**. మీద చెప్పబడిన విధ్యుక్త కార్యముల నిమిత్తము చరరూపక పిత్రార్జితము మీదను, తానుగాని తన తండ్రి, తాత, ముత్తాతలుగాని చేసియుండు ఋణముల నిమిత్తము సర్వ పిత్రార్జితము మీదను, తప్ప తక్కిన విషయములలో పిత్రార్జితపు సొత్తుమీద కుమారులకంటె తండ్రికి ఎక్కువ స్వాతంత్ర్యము లేదు. సమష్టి కుటుంబములో తండ్రియును కుమారులును సమానభాగస్థులు గావున, తండ్రి మేనేజరుగా మాత్రమే భావింపబడును. (2 మ. హై. 417; 4 మ. హై. 61; 6 స. 256; 7 అ. హై. 279; 1 అ. 77). కాబట్టి, అగత్యమైన విధ్యుక్తకార్యములు లేనప్పుడు సాధారణముగా అతడు పిత్రార్జితపు సొత్తును కుమారులయొక్క అనుమతి లేక పరాధీనము చేయగూడదు. తండ్రి చేసియుండు పిత్రార్జితపు పరాధీనములను కుమారులు ఆక్షేపించిన యెడల, రుజువు భారము సామాన్యముగా ఎదుటికక్షివారే వహింతురు. అనగా, సదరు పరాధీనములు అగత్యమైన కార్యముల నిమిత్తము చేయబడినట్లు వీరు స్థాపించవలయును. (ఇ. లా. రి. 5 మ. 337; ఇ. లా. రి. 8 మ. 75; ఇ. లా. రి. 13 మ. 51; 2 బం. స. తీ. 75; 6 బం. స. తీ. 71; 8 స. 15; ఇ. లా. రి. 2 అ. 635; ఇ. లా. రి. 22 బొం. 825; ఇ. లా. రి. 16 మ. 84; 3 క. హై. 21; 11 స. 343; 1860 సం॥ మ. తీ. 227).

తక్కిన సందర్భములలో తండ్రికిని కుమారులకును పిత్రార్జితమునందలి హక్కు సమానము.

తండ్రిచేసిన పరాధీనములకు కుమారులసమ్మతి - ఆక్షేపణ హక్కు.

**182.** తండ్రివలన అక్రమముగా చేయబడిన పిత్రార్జితపు పరాధీనములను కుమారులు ఆక్షేపించి రద్దుపరచగల హక్కు, అట్టి పరాధీనములు చేయబడినప్పుడు జన్మించి యుండునట్టి, లేక, గర్భగతులై యుండునట్టి, కుమారులకు మాత్రమే కలదు. కాబట్టి, పరాధీనములు చేయబడిన కాలమునందు పుత్రసంతతి లేనప్పుడును, ఉన్నవారు సదరు పరాధీనములకు అనుమతించి యుండునప్పుడును, అటు పిమ్మట గర్భగతులై జన్మించిన కుమారులు సదరు పరాధీనములను ఆక్షేపించుటకు హక్కు కలిగియుండరు. (5 అ. హై. 113; 8 స. 16, 21; 15 క. హై. 187). పరాధీనములు చేయబడిన కాలమునందు కుమారుల సమ్మతి లేకున్నను, పిదప వారు సమ్మతించిన యెడల చాలును. కాని, యీ లోపల మఱియొక కుమారుడు జన్మించినయెడల, సదరు సమ్మతి వలన అతడు బద్ధుడు కాజాలడు. అనగా, మొట్టమొదట కుమారుల సమ్మతిలేక తండ్రివలన అనగత్యముగను అక్రమముగను చేయబడిన పిత్రార్జితపు పరాధీనములను, సదరు కుమారులు సమ్మతించు లోపల జన్మించిన నూతన పుత్రుడు ఆక్షేపించి రద్దుపరచవచ్చును. (11 స. 480). పిత్రార్జితపు సొత్తు విక్రయించునట్లు తండ్రివల్ల ఒడంబడిక చేసికొనబడి, సదరు విక్రయము పూర్తియై ఆస్తి క్రయదారుని స్వాధీనముకాక పూర్వము కుమారుడు జన్మించినయెడల, అట్టి ఒడంబడికవల్లగాని విక్రయమువల్లగాని యితడు బద్ధుడు కాజాలడు. (ఇ. లా. రి. 20 మ. 354).

పుట్టియుండునట్టియు పుట్టబోవునట్టియు పుత్రులయొక్క సంరక్షణ నిమిత్తము కావలసియుండును గావున పిత్రార్జితమును యెవరికిని తండ్రి దానముచేయ గూడదనియు విక్రయించ గూడదనియు మితాక్షరమునం దొకచోట చెప్పబడియున్నది. దీనినిబట్టి, పుత్రసంతతి కలుగుట సాధ్యముగా నుండువరకును పిత్రార్జితపు

సొత్తును తండ్రి పరాధీనము చేయగూడదనియు, అట్లు పరాధీనము చేయుటవలన తమ సంరక్షణకు లోపము కలిగినయెడల పిమ్మట గర్భగతులై జన్మించిన కుమారులుగూడ సదరుపరాధీనములను ఆక్షేపించి రద్దుపరచ వచ్చునని యు, ఒక కేసులో మదరాసు సదరు కోర్టువారికి కోర్టు పండితులు అభిప్రాయ మిచ్చిరి. (1851 సం॥ మ. తీ. 3). కాని, మీద తెలుపబడిన మితాక్షరవాక్యము నీతిమార్గ సూచకమాత్రముగా భావించి, తండ్రి చేసిన పిత్రార్జితపు పరాధీనములను ఆక్షేపించి రద్దు పరచునట్టి హక్కు కుమారునికి కలిగియుండుటకై, సదరు పరాధీనములు జరిగింపబడినప్పుడు ఆతడు జన్మించి అథవా గర్భగతుడై యుండవలెనని యు, పిమ్మట గర్భగతుడై జన్మించిన పుత్రునకు ఆక్షేపణాహక్కు లేదనియు మదరాసుహైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 4 మ. హై. 307. మరియు, ఇ. లా. రి. 8 మ. 89; 16 మ. 76. చూడు 20 అ. 285).

తండ్రివలన జరిగింపబడిన పిత్రార్జితపు పరాధీనముల విషయమై కుమారున కెంత హక్కు కలదో, కుమారుడు లేనప్పుడు మనుమనికిని, మనుమడు లేనప్పుడు మునిమనుమనికిని, అంతే హక్కు కలదు.

**183**. తండ్రిచేసిన పిత్రార్జితపు పరాధీనములను ఆక్షేపించి రద్దుపరచునట్టి విషయమున, ఔరస పుత్రునకు (కన్నకొడుకునకు) ఎట్టిహక్కు కలదో దత్తపుత్రునకును అదే హక్కు కలదు. స్వీకారాధికార మియ్యబడిన భార్య గర్భిణితో సమానురాలనియు, భార్యకు స్వీకారాధికార మిచ్చియుండి స్వీకారము జరిగింపబడు లోపల తండ్రిచేసిన పరాధీనములను స్వీకారపుత్రుడు ఆక్షేపించ వచ్చుననియు, పూర్వము కొన్ని కేసులలో అభిప్రాయములు తెలుపంబడెను. (3 బం. స. తీ. 367; 6 మూ. ఇ.

స్వీకార పుత్రుని కుండు ఆక్షేపణ హక్కు.

అ. 320; 1852 సం॥ మ. తీ. 117). కాని, యిప్పుడా యభిప్రాయములకు భిన్నముగా, అనగా, స్వీకారమునకు పిమ్మట జరిగింపబడిన పిత్రార్జిత పరాధీనముల విషయమై మాత్రమే స్వీకార పుత్రునకు ఆక్షేపణ హక్కు కలదనియు, స్వీకారమునకు పూర్వము జరిగింపబడిన పరాధీనములను ఆక్షేపించుటకు అతనికి హక్కు లేదనియు, తీరుమానింపబడి యున్నది. (II స. 436; ఇ. లా. రి. 5 బొం. 630).

అంగీకారము.

**184**. పిత్రార్జితమును పరాధీనము చేయునట్టి విషయమై తండ్రికి సంపూర్ణ స్వాతంత్ర్యము లేకున్నను, తత్కాలమునందుగాని పిమ్మటగాని కుమారులు అంగీకరించిన యెడల, తండ్రిచేసిన పరాధీనములు చెల్లుచున్నవి. (1860 సం॥ మ. తీ. 258; 1861 సం॥ మ. తీ. 37, 146; ఇ. లా. రి. 12 క. 389). సమష్టి ఆస్తి వ్యాపారమునందు ఉపయోగపరచబడి యుండునపుడు, మేనేజరుగా నుండువానికి సదరు ఆస్తిని వినియోగపరచు విషయములో స్వాతంత్ర్యము కలదు. కాబట్టి, అతడు చేసిన పరాధీనములకు తక్కిన భాగస్థుల అంగీకార ముండునట్లే భావింపవలయును. (ఇ. లా. రి. 5 క. 792; ఇ. లా. రి. 5 బొం. 38; (ఇ. లా. రి. 14 బొం. 194). ఎట్టి పరాధీనములు గాని పిదప అంగీకారమును పొందినయెడల, చెల్లకతప్పవు. పిత్రార్జితపు సొత్తును విక్రయించి విక్రయధనముతో అతడు మరియొక ఆస్తి కొనియుండునప్పుడు, సదరు ఆస్తిని కుమారులు స్వాధీనపరచుకొని యున్నయెడల, తండ్రి చేసిన పిత్రార్జితపు పరాధీనమును వారంగీకరించినట్లెంచబడును. (2 బొం. హై. 318; 9 స. 511). పరాధీనములకు అంగీకార మిచ్చునట్టి విషయములో, సొత్తునందు హక్కుగల భాగస్థులందరును చేరవలయును. కొందరు మాత్రమే అంగీకరించిన యెడల, వారి భాగములవరకే అంగీకారము చెల్లును.

కుమారునియొక్క అనుమతిలేనిదే పిత్రార్జితపు సొత్తును తండ్రి పరాధీనము చేసిన యెడల, సదరు పరాధీనమునకు పిమ్మట జన్మించిన మనుమడు దానివలన బద్ధుడగును. కాని, పరాధీన కాలమునందే జన్మించియుండి హక్కుదారుడుగా నేర్పడిన మనుమడు బద్ధుడు కాజాలడు. (9 స. 337).

**185.** సమష్టి కుటుంబమునకు మేనేజరుగా నుండునట్టి తండ్రి, విధ్యుక్తములై ఆవశ్యకములగు కార్యముల నిమిత్తము పిత్రార్జితపు సొత్తును పరాధీనము చేయుటకు అధికారము కలిగియుండునని మీద చెప్పితిమి. కుమారులందరును మైనర్లుగా నుండి అంగీకార మిచ్చునట్టి స్థితిలో లేనప్పుడు మాత్రమే యిట్లు చెప్పబడిన అధికారము కలదని మితాక్షరము అభిప్రాయపడు చున్నది. కుమారులు యుక్తవయస్కులుగా నుండునప్పుడు వారి అంగీకారమును పొందుట ముఖ్యమని ఒక కేసులో కలకత్తా హైకోర్టువారు తీరుమానించిరి. (13 స. 30). కాని, మరి కొన్ని కేసులు వ్యతిరేకాభిప్రాయమును స్థాపించియున్నవి. (14 స. 80; 1 స. 96; ఇ. లా. ర. 4 మ. 18). కుటుంబమునకు మేనేజరు (కార్యకర్త) గానుండునతడు యుక్తవయస్కులుగానుండు భాగస్థుల అంగీకారమును పొందియే సాధారణముగా పిత్రార్జితపు పరాధీనములు చేయుట వాడుకగా నున్నది. ఇట్లున్నను, అతడు స్వతంత్రించి ఆవశ్యకమైన కార్యముల నిమిత్తము పరాధీనములు చేసినయెడల, అవి తప్పక చెల్లును. కుటుంబములో యుక్తవయస్కులుగా నుండు భాగస్థులు తమ యంగీకారము నియ్యక యున్నంత మాత్రముచేత, మేనేజరుయొక్క స్వాతంత్ర్యము తప్పిపోజాలదు. (6 మూ. ఇ. అ. 393; ఇ. లా. ర. 24 క. 77; 1859 సం॥ బం. స. తీ. 1643; 1 మ. హై. 398;

కర్తకుగల హక్కులు.

21 స. 196; ఇ. లా. రి. 14 అ. 420; ఇ. లా. రి. 23 క. 766; ఇ. లా. రి. 11 బొం. 605).

మేనేజరుకుగల స్వాతంత్ర్యము.

**186.** జాగరూకత గల ఆస్తిదారుడు తన స్వంత ఆస్తిని ఏరీతిన వినియోగ పరచుటకు స్వాతంత్ర్యము కలిగియుండునో ఆలాగుననే కుటుంబ ద్రవ్యమును అగత్యమైన కార్యముల నిమిత్తము వినియోగపరచుటకు మేనేజరు స్వాతంత్ర్యము కలిగియుండును. (6 మూ. ఇ. అ. 393). మేనేజరువలన చేయబడియుండు కుటుంబద్రవ్య పరాధీనము కుటుంబమునకు ఆవశ్యకమో అనావశ్యకమో, లాభకరమో కాదో – ఈ విషయమును ఆయాసంగతి సందర్భములనుబట్టి నిర్ణయింప వలయును.

కుటుంబపు ఆస్తిని తాకట్టు పెట్టుటకును విక్రయించుటకును గూడ మేనేజరునకు స్వాతంత్ర్యమున్నను సాధ్యమైన యెడల ఆస్తిని విక్రయించక తాకట్టుపెట్టియే అగత్యమును తీర్పవలయును. కాని, అధికమగు వడ్డీ మొదలగు సందర్భములయందు తాకట్టు కంటె విక్రయమే మేలుగా నుండును. (3 క. హై. 423; 12 స. 337; 13 స. 30; 18 క. 311). కాబట్టి, తాకట్టుయొక్క గాని క్రయముయొక్కగాని అగత్యమును ఆయా సందర్భములనుబట్టి చూడవలసి యుండును. (1 స. 96; 6 మ. హై. 371; ఇ. లా. రి. 2 బొం. 666; 8 మై. 71; 2 మై. 62; ఇ. లా. రి. 18 బొం. 177; 3 అ. హై. 4; 11 స. 446, 14 స. 72). అప్పులు తీర్చుటకును కుటుంబమునకు ఆవశ్యకమైన ఖర్చులు జరుపుటకును వేరుమార్గము లుండునపుడు ఊరక అనగత్యముగా చేయబడిన పిత్రార్జితపు పరాధీనము చెల్లజాలదు. (1858 సం॥ బం. స. తీ. 802).

అప్పిచ్చువాడు విచారింప వలసిన అంశములు.

**187.** పరాధీనమునుగూర్చి పిమ్మట తకరారు కలిగినప్పుడు సదరు పరాధీనము చేయుటకు తగిన అగత్యముండెనని సొత్తును తీసికొన్నవాడు రుజువు చేయవలెను. లేనియెడల, పరాధీనము

చెల్లజాలదు. సదరు అగత్యము మేనేజరుయొక్క దుర్వ్యయము వలన కలిగియుండినను బాధకము లేదు. కాని, స్వామిచ్చిన వాని దుష్ప్రవర్తనము వలన లేక ప్రోత్సాహమునలన కలిగియుండ గూడదు. మేనేజరు, వద్దినుండి కుటుంబపు సొత్తును కొనునట్టి, లేక తాకట్టు పెట్టుకొనునట్టి, లేక గుత్తకు తీసుకొనునట్టి వాడు ఆ విధమున ఆస్తిని పరాధీన పరచుటకు ఎట్టి అగత్యము కలదో చక్కగా విచారించి సదరు పరాధీనము కుటుంబముయొక్క ... భము నిమిత్తము చేయబడునట్లు నిశ్చయపరచుకొన వలెను. (6 స. 193; ఇ. లా. రి. 14 అ. 420; 1859 స... బం. స. ... 1643). అట్టి అగత్యమును కలిగించిన కారణములకు ... నిమి త్తము లేదు. (16 స. 221; 8 క. ప్రి. 38; 14 క. 72. కానీ, చూడు 4 అ. హై. 110; 1858 స౦॥ బం. స. ... 802). మేనే జరుమీద డిక్రీ పొందబడి యుండునప్పుడు, సదరు డిక్రీ సొమ్ము చెల్లించుటకై స్వామిచ్చి ఆస్తి స్వాధీనపరచుకొను వాడు, ఆ డిక్రీ యెట్టి అప్పుల నిమిత్తము పొందబడెనో, అవి క్రమమైన అప్పు లగునో కావో - యీ విషయమును విచారింపకున్నను రక్షింప బడును. కాని, ఆ డిక్రీవల్ల, లేక దానికి సంబంధించిన అమలు చర్యలవల్ల, సదరు అప్పులు అయోగ్యమైనవిగా గాని అందరి భాగస్థులకును సంబంధించనివిగా గాని కనుపడిన యెడల, యీ చెప్పబడిన రక్షణ యుండనేరదు. (14 క. ప్రి. 187; ఇ. లా. రి. 15. క. 317; 5 అ. హై. 89; 23 స. 200; 24 స. 231, 281, 364; 25 స. 148, 185, 311; ఇ. లా. రి. 2 క. 213; ఇ. లా. రి. 4 మ. 96).

తగిన జాగ్రతతో విచారించినమీద అగత్యమున్నట్టు నమ్మ యెట్టి దురుద్దేశముగాని లేక, స్వామిచ్చి ఆస్తిని స్వాధీనపరచుకొ న్నవాడు, రక్షింపబడును. (21 స. 190; ఇ. లా. రి. 2 మ.

339). మఱియు, ఆసొమ్ము క్రమముగా వినియోగపడునట్లు భద్రపెట్టుటకు అతడు బద్ధుడుకాడు. (1861 సం॥ మ. తీ. 1).

రుజువు భారము. **188**. పిత్రార్జితపు పరాధీనములను రద్దుచేయవలెనని యత్నింపబడినపుడు, సదరు పరాధీనము క్రమమని, లేక, అక్రమమని రుజువు చేయు భారము, ఆయా సందర్భములనుబట్టి సొత్తు తీసికొన్నవాని మీదగాని, రద్దుచేయవలెనని కోరువాని మీదగాని, నిలిచియుండును. (6 మూ. ఇ. అ. 418 - 420; 1 మ. హై. 398; ఇ. లా. రి. 2 మ. 407; 6 మ. హై. 371; 10 మూ. ఇ. అ. 454; 3 అ. హై. 8; 18 స. 77; ఇ. లా. రి. 5 క. 363; ఇ. లా. రి. 6 అ. 417; ఇ. లా. రి. 8 అ. 279; ఇ. లా. రి. 5 మ. 337; ఇ. లా. రి. 8 మ. 75; ఇ. లా. రి. 18 బొం. 520; 21 బొం. 808; 23 క. 766). 1882 సం॥ 4 నెం॥ ట్రాన్సఫరు ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు 38 సెక్షను చూడవలసినది.

పిత్రార్జిత ఋణముల నిమిత్తమును తాను అది వరకు చేసియుండు అయోగ్యము కాని ఋణముల నిమిత్తమునుగాక, సొక్కము పుచ్చుకొని పిత్రార్జితపు సొత్తును తండ్రి పరాధీనపరచిన యెడల, సదరు పరాధీనమునకు తగిన అగత్యముండెననియు, సదరు సొమ్ము కుటుంబముయొక్క ఉపయోగము నిమిత్తము ఆవశ్యకముగా నుండెననియు, సొత్తు తీసికొన్నవాడు తకరారు కలిగినపుడు రుజువు చేయవలయును. (ఇ. లా. రి. 16 మ. 76). తండ్రిగాక యితర భాగస్థుడు తాను చేసియుండు ఋణముల నిమిత్తము కుటుంబపు ఆస్తిలో తన భాగమును మాత్రమేగాక యితర భాగములనుగూడ చేర్చి విక్రయించిన యెడల, లేక, అతనిమీద పొందబడిన డిక్రీక్రింద కుటుంబపు ఆస్తి యావత్తును వేలము వేయించబడినయెడల, సొత్తును పొందినవారు సదరు అప్పులు కుటుంబమునకు ఆవశ్యకమగు ఖర్చులనిమిత్తము చేయబడినట్లు రుజువుచేయ

వలయును. (6 మ. హై. 371; 8 మ. హై. 157; 2 అ. హై. 50; ఇ. లా. రి. 1 మ. 354, 358; ఇ. లా. రి. 5 క. 144; ఇ. లా. రి. 4 మ. 73; ఇ. లా. రి. 26 మ. 28).

**189**. తండ్రిగాక యితర భాగస్థుడు చేసియుండు అప్పులకు అవి కుటుంబము నిమిత్తము చేయబడెనను కారణమువలన కుటుంబపు యావదాస్తిని లోబరుపవలెనని కోరినయెడల, అందరు భాగస్థులను ప్రతివాదులుగా చేర్చి దావా తేవలయును. అట్లు చేర్చక ఒక్కని మీద నే దావా తెచ్చిన యెడల, తక్కిన వారి భాగములమీద డిక్రీఅమలు చెల్లదు. (ఇ. లా. రి. 3 క. 198; ఇ. లా. రి. 5 మ. 12, 125; ఇ. లా. రి. 7 మ. 136; ఇ. లా. రి. 8 మ. 208; ఇ. లా. రి. 10 మ. 316; ఇ. లా. రి. 11 క. 293; ఇ. లా. రి. 6 బొం, 564; ఇ. లా. రి. 7 బొం. 91; కాని, చూడు ఇ. లా. రి. 14 బొం. 597; 2 అ. 746; 3 అ. 72, 118, 191, 443; 16 క. 40; 20 క. 11; 23 క. 374). సమష్టిఆస్తి కుటుంబముయొక్క మేనేజరు పేరిట మాత్రమే యుండి అతని ఒక్కని మీదనే డిక్రీపొందబడి యేలము వేయించబడిన యెడల, సదరు ఆస్తిలో అందరు భాగస్థుల హక్కులును ఏలము వేయబడినట్లు ఎంచబడును. (ఇ. లా. రి. 10 క. 996, 1001; ఇ. లా. రి. 5 మ. 201, 205).

అందరు భాగస్థుల ను ప్రతివాదులుగా చేర్చవలెను.

**190**. పిత్రార్జితపు సొత్తును తండ్రి పాడుచేయకుండునట్లు మీద చెప్పబడిన తీరున ధర్మశాస్త్రములయందు కట్టుదిట్టము లేర్పరుపబడి యున్నను, ఈ ధర్మశాస్త్రము లే విధించునట్టి మరియొక న్యాయమువల్లను, దానికి ఈ కాలమునందు కోర్టువారు కలిగించియుండు వ్యాప్తివల్లను, సదరు కట్టుబాట్లన్నియు కొంచెము ఎచ్చుతగ్గుగా నిష్ప్రయోజనము లగుచున్నవి. అది యెట్లనగా — పిత్రార్జితపు సొత్తుమీద తండ్రికి అధికమయిన స్వా

పిత కట్టుబాట్లు యొక్క నిజమైన యోగము.

తంత్ర్యము లేదు. దానిని అతడు అనగత్యముగా విక్రయించగూడదు, తాకట్టు పెట్టను గూడదు. కాని, తండ్రి చేసియుండు ఋణములను యావత్తు పిత్రార్జితముయొక్క మొత్తమువరకు తీర్చుటకు కుమారులు బద్ధులుగా నుండుటవలన, తండ్రి యిచ్చవచ్చినట్లు అనగత్యముగా అప్పులుచేసి మృతిచెందిన యెడల కుమారులకు చేరునట్టి పిత్రార్జిత మంతయు సదరు అప్పుల క్రిందనే పోవచ్చును. ఒక్క సందర్భమునందు మాత్రమే, అనగా తండ్రి అప్పులు అయోగ్య కార్యముల నిమిత్తము చేయబడియుండిననే కుమారులకు పిత్రార్జితము దక్కగలదు. తండ్రియొక్క అప్పులు అయోగ్యకార్యముల నిమిత్తము చేయబడియుండక, అవి అనగత్యమయిన దుబారా ఖర్చుల నిమిత్తము చేయబడియుండినను వాని నిమిత్తము పిత్రార్జితము నియ్యకతప్పదు. [పేరా 163]. ఇంతేకాక, దుబారాఖర్చుల నిమిత్తము తండ్రి ముందుగా ఇచ్చవచ్చినట్లు అప్పులుచేసి, అటుపిమ్మట సదరు అప్పుల నిమిత్తము యావత్తు పిత్రార్జితమును అతడే పరాధీనము చేయవచ్చును. [పేరా 165].

తండ్రిగాక యితర భాగస్థుల పరాధీన స్వాతంత్ర్యము.

**191.** సమష్టి కుటుంబమునందు తండ్రిగాక యితర భాగస్థుడు సమష్టి ఆస్తిలో తన హక్కును పరాధీనము చేయవచ్చునా కూడదా - అను విషయము చాలకాలము సందిగ్ధముగా నుండి యిప్పుడు కొంతవరకు సిద్ధాంతపడి యున్నది. మితాక్షర ధర్మశాస్త్రమును బట్టి న్యాయముగా చూచినయెడల, యిట్టి పరాధీనపరచు స్వాతంత్ర్యము లేనట్లే కానంబడుచున్నది. ఇట్లున్నను సమష్టి కుటుంబపు భాగస్థుడు చేసియుండు స్వంత అప్పులకై సమష్టి ఆస్తిలో అతని హక్కును అప్పులవాండ్రు అతని జీవితకాలములో జప్తుచేయించి అమ్మించ వచ్చునని ముమ్ముందు న్యాయస్థానములయందు తీరుమానింపబడుటచేత, సదరు పరా

ధీన పరచునట్టి స్వాతంత్ర్యము క్రమముగా పెరిగి స్థిరపడినది. (1855 సం॥ మ. తీ. 234; 1860 సం॥ మ. తీ. 247; 1 మ. హై. 471; 10 బొం. హై. 139; 11 బొం. హై. 72, 76; 4 అ. హై. 137; ఇ. లా. రి. 3 క. 198; ఇ. లా. రి. 1 మ. 358; ఇ. లా. రి. 5 క. 148; ఇ. లా. రి. 4 క. 723, 809; ఇ. లా. రి. 1 అ. 429; ఇ. లా. రి. 2 అ. 898). వెనుక 172-వ పేరా చూడవలసినది.

మదరాసు బొంబాయి హైకోర్టుల వారి తీర్పులవలన ఇప్పుడు స్థిరపడియుండు ప్రకారము, సమష్టి కుటుంబములో తండ్రి గాక యితర భాగస్థుడు సమష్టి ఆస్తిలో తనకు కలిగియుండు హక్కును నిరాటంకముగా విక్రయించవచ్చును, తాకట్టుపెట్టవచ్చును, మరి యే విధముగానైనను ప్రతిఫలయుక్తమైన పరాధీనము చేయవచ్చును. (1 మ. హై. 471; 2 మ. హై. 270, 416; 4 మ. హై. 60; ఇ. లా. రి. 11 మ. 406; 5 మ. హై. 166; 10 బొం. హై. 139, 162; ఇ. లా. రి. 15 బొం. 673). కాని, దాన రూపకముగా, లేక ఉయిలు మూలకముగా పరాధీనము చేయునట్టి స్వాతంత్ర్యము లేదు. (8 మ. హై. 6; ఇ. లా. రి. 7 మ. 357; ఇ లా. రి. 9 మ. 273; ఇ. లా. రి. 11 మ. 246; ఇ. లా. రి. 27 మ. 162; 3 బొం. హై 66; 6 బొం. హై. 249; 11 బొం. హై. 76; 12 బొం. హై. 229; ఇ. లా. రి. 19 బొం. 803; ఇ. లా. రి. 5 బొం. 48). సమష్టి కుటుంబపు భాగస్థుని జీవిత కాలములో దావా తెచ్చినను అతడు మృతిచెందిన పిమ్మట దావా తెచ్చినను సరే ప్రతిఫలయుక్తమగు పరాధీనము నిరాటంకముగా చెల్లుచున్నది. (ఇ. లా. రి. 7 మ. 590; 14 మ. 408; 25 మ. 690; 21 బొం. 806).

మదరాసు తీరు, బొంబాయి తీర్పులు.

ౖతాంసుఫరు దారునికి కలుగు హక్కు

**192.** సమష్టి కుటుంబపు భాగస్థుని కెట్టి స్వాతంత్ర్యము కలదో అది యావత్తును, అతని హక్కును కోర్టు వేలములో కొన్నవానికిని అతనివల్లనే తాకట్టుగా లేక విక్రయముగా ౖతాంసుఫరు పొందినవానికిని, కలుగును. (1 మ. హై. 471). అనగా, సదరు క్రయదారుడు, లేక ౖతాంసుఫరు దారుడు సమష్టి ఆస్తి యొక్క విభాగమును కోరవచ్చును. (2 మ. హై. 417). కాబట్టి, అతడు కుటుంబపు భాగస్థుల నందరిని చేర్చి విభాగము నిమిత్తము దావా తేవలెను. (11 బొం. హై. 72 ; 76 ; ఇ. లా. రి. 28 బొం. 201 ; 22 స. 116 ; ఇ. లా. రి. 4 క. 723; ఇ. లా. రి. 6 బొం 564 ; ఇ. లా. రి. 13 మ. 275 ; 20 మ. 243 ; 23 బొం. 184). సమష్టి ఆస్తిలో ఏ భాగస్థునికిని ప్రత్యేకపు హక్కు లేనందున, విభాగమునకు పూర్వము సదరు ఆస్తిలో ఫలానా భాగము తన అనుభవముక్రింద నుండవలెనని క్రయదారుడు, లేక ౖతాంసుఫరుదారుడు కోరుటకు వీలులేదు. (22 స. 214 ; ఇ. లా. రి. 2 బొం. 676 ; 14 మూ. ఇ. అ. 50 ; 5 మ. హై. 166 ; 10 బొం. హై. 156). కాని, సమష్టి ఆస్తిలో కొంతభాగము ఒక భాగస్థుని ప్రత్యేక కానుభవములో నుండగా దానిని ఎవరైనను ౖతాంసుఫరుపొంది అనుభవించుచున్న యెడల, అట్టి ౖతాంసురుఫరుదారుని అనుభవమును ఇతర భాగస్థులు తొలగింపజాలరు. అతడు ఆ ప్రకారము అనుభవించుట వీరికి ఇష్టము లేనియెడల, యావదాస్తిని కలిపి విభాగించుకొను నిమిత్తము వీరు దావా తేవలెను. (12 బొం. హై. 138 ; ఇ. లా. రి. 1 బొం. 95 ; ఇ. లా. రి. 2 బొం. 676 ; ఇ. లా. రి. 10 బొం. 673). 1882 సం॥ 4 నెం॥ ౖతాంసుఫర్ ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు 44 సె॥ ప్రకారము సమష్టి గృహమునందు ఒక భాగస్థుని యొక్క హక్కును ౖతాంసుఫరు పొందినవాడు సదరు గృహము

ను తక్కిన భాగస్థులతో గూడ అనుభవించునట్టి హక్కును కలి గియుండను.

సమష్టి భాగస్థుని హక్కును ట్రాంసుఫరు పొందిన వానికి చేరగల భాగము, అతను విభాగము నిమిత్తము దావా తెచ్చిన కాలమును బట్టి లెక్కింపవలెనుగాని ట్రాంసుఫరు కాలమును బట్టి లెక్కింపగూడదని ఒక కేసులో మదరాసు హైకోర్టువారు తీర్మానించిరి. ఇది యెట్లనగా—ఒక సమష్టి కుటుంబము నందు తండ్రియును ఇద్దరు కుమారులును ఉండిరి. ఒక కుమారుడు తన హక్కును ట్రాంసుఫరు చేసెను. ట్రాంసుఫరు దారుడు విభాగము నిమిత్తము దావా తెచ్చులోపల మరి యొగ్గురు కుమారులు జన్మించి తండ్రి మృతిచుందెను. ఈ సందర్భమున ట్రాంసుఫరుదారునికి 5-దింట ఒకపాలు మాత్రమే వచ్చునుగాని, ట్రాంసుఫరు కాలమునందువలె 3-డింట ఒకపాలు రానేరదు. (ఇ. లా. రి. 14 మ. 408). దరిమిలాను మరియొక కేసులో జడ్జి సర్ భాష్యం అయ్యంగారు దీనికి వ్యతిరేకముగా అభిప్రాయమును తెలిపిరి—అనగా—సమష్టి భాగస్థుని హక్కును ట్రాంసుఫరు పొందినవానికి చేరగల భాగము సదరు ట్రాంసుఫరు కాలమునుబట్టి లెక్కింపవలెనుగాని దావా కాలమునుబట్టి లెక్కింపగూడదనియు, ట్రాంసుఫరు కాలమునకు పిమ్మట సమష్టి కుటుంబములో సంభవించు మార్పులనుబట్టి ట్రాంసుఫరుదారుని హక్కు తగ్గుట హెచ్చుట యుండజాలదనియు, అభిప్రాయపడిరి. (ఇ. లా. రి. 25 మ. 716).

**193.** సమష్టి కుటుంబపు భాగస్థుని పరాధీన స్వాతంత్ర్యమునుగూర్చి అలహాబాదు హైకోర్టువారును, మితాక్షర ధర్మశాస్త్రము ననుసరించువారి మధ్య కలిగిన కేసులలో కలకత్తా హైకోర్టువారును, మదరాసు బొంబయి తీర్పులకు వ్యతి

అలహాబాదు కలకత్తా హైకోర్టుల తీర్పులు.

రేకముగా తీరుమానించి యున్నారు. వారి తీర్పుల ప్రకారము సమష్టి కుటుంబపు భాగస్థుడు అతనికి సమష్టి సొత్తునందుగల హక్కును, తన స్వప్రయోజనము నిమిత్తము ప్రతిఫలమును పొంది క్రయము తాకట్టు వగైరా విధములగాని, దానరూపకముగాగాని, ఉయిలు మూలకముగాగాని, పరాధీనము చేయుటకు స్వతంత్రుడు కాడనియు, అట్టి పరాధీనములను తక్కిన భాగస్థులు దావా తెచ్చి రద్దుపరచ వచ్చుననియు, స్థిరపడియున్నది. (3 బం. స. అ. 232; 6 బం. స. తీ. 176; 7 బం. స. తీ. 105; 5 బం. స. తీ. 163; 4 బం. స. తీ. 158; 3 స. 210; 7 అ. హై. 277; ఇ. లా. రి. 2 అ. 267; ఇ. లా. రి. 5 అ. 384; 3 క. హై. 31; 4 క. హై. 15; 8 క. హై. 358; ఇ. లా. రి. 1 క. 226; 22 స. 552; ఇ. లా. రి. 16 క. 137; ఇ. లా. రి. 18 క. 157; 15 అ. 339; 20 అ. 325; — చూడు 16 అ. 369). కాని, ట్రాంసుఫరుదారుడు ట్రాంసుఫరు చేసిన భాగస్థుని జీవిత కాలములోనే దావా తెచ్చినయెడల, ఇతనికిగల విభాగపు హక్కును కోర్టువారు ఉపయోగపరపించి యితని వంతు భాగము ట్రాంసుఫరు దారునికి చెందునట్లు తీరుమానింతురు. (12 క. హై. 90; ఇ. లా. రి. 19 క. 401; ఇ. లా. రి. 3 క. 198; ఇ. లా. రి. 18 క. 157. చూడు, ఇ. లా. రి. 8 క. 149, 919; ఇ. లా. రి. 4 అ. 235).

...రాధీనమును రద్దు ...రచునపుడు, ...ాంసుఫరు దారు ... పొమ్మిప్పించి ...యుట.

**194**. సమష్టి కుటుంబపు భాగస్థుడు చేసియుండు అక్రమపు పరాధీనమును రద్దుపరచ గోరువారు, అట్టి పరాధీనమువలన పొందబడిన సొమ్ములో కొంత మొత్తము కుటుంబమునకు ఆవశ్యకమైన కార్యముల నిమిత్తము ఉపయోగపరచబడిన యెడల ఈ మొత్తము ట్రాంసుఫరుదారుని కిచ్చుటకు సిద్ధముగా నుండవలెను. ఇంకను కొంతకాలము ఆగి తీర్చదగిన కుటుంబ ఋణ

ముల నిమిత్తము ఉపయోగింపబడినను, అట్లుపయోగింపబడిన మొత్తమును ఇచ్చివేయ వలెను. సదరు పరాధీనపు సొమ్ములో ఏ మాత్రముగాని కుటుంబము నిమిత్తము ఉపయోగింపబడని యెడల, క్రాంసుఫరుదారునికి సొమ్మియ్యక యే పరాధీనమును రద్దుపరచుకొనవచ్చును. (క. హై. సప్లిమెంటల్ వాల్యూం, 1018; 8 క. హై. 358; ఇ. లా. రి. 6 అ. 417; 25 అ. 59; 2 బొం. హై. 318; కాని, చూడు ఇ. లా. రి. 23 మ. 89). పరాధీనపు సొమ్ములో కొంత మొత్తము కుటుంబము నిమిత్తము ఉపయోగింపబడిన సందర్భమున, సదరు మొత్తమును వాదులు ప్రతివాది కిచ్చునట్టి షరతుమీద పరాధీనము రద్దుపరచబడి డిక్రీ యియ్యబడును. (4 క. హై. 118-125; 15 క. హై. 350).

పరాధీనము బాబతు సొమ్ము కుటుంబము నిమిత్తము ఉపయోగపడెనని రుజువు చేయునట్టి భారము క్రాంసుఫరుదారునిదై యున్నది. (క. హై. సప్లిమెంటల్ వాల్యూం, 1018; 2 బొం. హై. 318).

సమష్టి కుటుంబపు భాగస్థుడు సమష్టి ఆస్తిని పరాధీనపరచి సదరు పరాధీనపు సొమ్మును తన స్వంత అప్పులను తీర్చుటకొరకు, లేక స్వంత ఖర్చుల నిమిత్తము, వినియోగించుకొన్న యెడల, అట్టి పరాధీనమును రద్దుపరచ గోరు తక్కిన భాగస్థులు సదరు సొమ్ము నిచ్చుటకు బద్ధులుకారు. (4 క. హై. 15; ఇ. లా. రి. 22 మ. 342). కాని, వీరు చాలకాలమువరకు సదరు పరాధీనమును ఆక్షేపించక ఊరకుండిన యెడల, క్రాంసుఫరు దారునికి సొమ్మిప్పించక పరాధీనమును కోర్టువారు రద్దు పరచజాలరు. (11 క. హై. అప్పెండిక్సు 29).

క్రాంసుఫరు రద్దుపడులోపల సొత్తునందు క్రాంసుఫరు దారుడు మరమ్మతు, లేక వృద్ధి, కలిగించి యున్న యెడల, సదరు మర

క్రాంసుఫరు సొత్తునందు చేయబడిన వృద్ధి, మరమ్మతు.

స్మతు, లేక వృద్ధి యొక్క కిస్మతు అతని కిప్పించబడును. కాని, అక్రమమనియు చెల్లదనియు మొదటనే యెరిగియుండి క్రాంసుఫరును పొందినవానికి మరమ్మతు లేక వృద్ధియొక్క కిమ్మతు ఇప్పించబడదు. (ఇ. లా. రి. 5 బొం. 450).

అవిభాజ్య జమీందారీ పరిపాలకునికి గల పరాధీన స్వాతంత్ర్యము.

**195.** మితాక్షర ధర్మశాస్త్రము ప్రకారము ఒక అవిభాజ్యమగు జమీందారీ సమష్టి సొత్తుగా నుండవచ్చు ననియు, కుటుంబములో పెద్ద కుమారుడు మాత్రమే రాజ్యాధికారమునకు హక్కుకలవాడై తక్కినవారు జీవనాంశమునకు మాత్రము హక్కు కలవారుగా నుందురనియు, పెద్దవాడు పుత్రహీనుడుగా మృతిచెందిన యెడల, సదరు జమీందారీ ఆస్తి అతని భార్యకు చెందక తమ్ములలో జ్యేష్ఠునికి చెందుననియు, 151 వ పేరాలో చెప్పియుంటిమి. ఇట్లు చెప్పియుండుట వలన, సాధారణ సమష్టి కుటుంబముల యందలి తండ్రి, లేక మేనేజరు విషయమై చెల్లుచుండెడి పరాధీననిర్బంధములు అవిభాజ్య జమీందారీ పరిపాలకునికి గూడ చెల్లునని తలంపగూడదు. ఇట్టి జమీందారీయొక్క సొత్తును కుటుంబమునకు ఆవశ్యకమైన ఖర్చుల నిమిత్తము మాత్రమే జమీందారుడు పరాధీనము చేయవచ్చుననియు, కుటుంబమునకు ఆవశ్యకము కాని పరాధీనములు సదరు జమీందారుని జీవితకాలమువరకే చెల్లును గాని అతని యనంతరవారసుని బాధింపవనియు, కొద్దికాలము క్రిందటివరకు మదరాసు హైకోర్టువారి వల్లను అలహాబాదు హైకోర్టు వారి వల్లను అనేకములగు తీర్పులవలన సిద్ధాంత పరచబడి యుండెను. కాని, యిటీవల ఈ తీర్పులు రద్దయి సిద్ధాంతము తలక్రిందయ్యెను.

సాధారణముగా సమష్టికుటుంబములకు చెల్లుచుండెడి మితాక్షర న్యాయము అవిభాజ్యములగు జమీందారీలకు చెల్లజాలదనియు - జమీందారీ సొత్తునందు కుమారుల కందరికని తండ్రితో

గూడ సమష్టి హక్కు కలుగక పెద్దకుమారునికి మాత్రమే వారసుహక్కు కలుగునట్టి పద్ధతిని మితాక్షరన్యాయముగా భావించుటకు వీలులేదనియు - మితాక్షర న్యాయము ప్రకారము తండ్రితో గూడ కుమారులకు కలుగునట్టి సమష్టి హక్కును, తత్సంబంధమైన పరాధీనాక్షేపణ హక్కును, విభాగమును కోరగల స్వాతంత్ర్యముతో చేరియుండుననియు - విభాగ స్వాతంత్ర్యము లేనప్పుడు మితాక్షర న్యాయము ప్రకారము చెల్లుచుండెడి సమష్టి హక్కును తత్సంబంధమగు పరాధీనాక్షేపణ హక్కు ను ఉండనేరవనియు - కాబట్టి, అవిభాజ్య జమీందారీ పరిపాలకుడు కుటుంబముయొక్క ఆవశ్యకముతో నిమిత్తము లేకయే జమీందారీసొత్తును పరాధీనపరచుటకు సంపూర్ణ స్వాతంత్ర్యము కలిగియుండుననియు - అట్టి పరాధీనములను నిర్బంధించుటకుగాని ఆక్షేపించుటకుగాని అతని యనంతర వారసులు ఎంతమాత్రము ను హక్కు కలిగియుండరనియు - అవిభక్త జమీందారీ పరిపాలకుడు చేయునట్టి పరాధీనములు అతని జీవితకాలము వరకు మాత్రమే చెల్లునను వాదము నిలుచుటకై సదరు జమీందారీ సన్నదు యొక్క షరతులవల్లగాని సదరుజమీందారీ కుటుంబమునందు చిరకాలమునుండి స్థిరపడియుండు ఆచారమువల్లగాని జమీందారునికి పరాధీన స్వాతంత్ర్యము లేనట్టు స్పష్టముగా రుజువు కావలెననియు- ఇట్లు కలకత్తా హైకోర్టు వారి వల్లను ప్రివీకౌన్సిలు వారి వల్లను తీరుమానము లియ్యబడెను. (13 క. హై. 445, 458, 460; ఇ. లా. రి. 5 క. 113; 5 క. 113; 5 మూ. ఇ. అ. 82; ఇ. లా. రి. 7 క. 461; ఇ. లా. రి. 10 అ. 272).

అలహాబాదు హైకోర్టు వారి తీరుమానము మీద చేయబడిన ఒక అప్పీలులో ప్రివీకౌన్సిలు వారు, ఒక అవిభాజ్య జమీందారీ పరిపాలకుని భార్యపేరట చేసియుండు పదునేడు వంచి జ

మిర్ గ్రామముల శాశ్వత పరాధీనమును ఖాయపరచి, సదరు పరాధీనమును ఆక్షేపించిన కుమారునికి విరోధముగా తీరుమానించిరి. (ఇ. లా. రి. 10 అ. 272, ప్రివీకౌన్సిల్). ఈ ప్రీవీకౌన్సిలువారి తీరుమానమును విధిలేక ఆదరించుచు, మదరాసు హైకోర్టువారు శివగంగ జమీందారీ విషయములో అనగత్యముగను అక్రమముగను వెనుకటి జమీందారుడు 20 సంవత్సరముల కాలమునకు ఇచ్చియున్న "గనులు త్రవ్వగుత్త"ను ఖాయపరచిరి. (ఇ. లా. రి. 13 మ. 197. చూడు 20 అ. 537). పిఠాపురం కేసులోగూడ ఈ అలహాబాదు తీరుమానము అనుసరింపబడెను. (ఇ. లా. రి. 20 మ. 167; 22 మ. 383, ప్రి. కౌ.). అమ్మనాయకనూరు జమీందారీ కేసులో జమీందారీసొత్తు పరాధీనము చేయగూడదను కుటుంబాచారము రుజువు చేయబడెను. (ఇ. లా. రి. 18 మ. 288). ఇట్టియాచారము రుజువైనప్పుడు గూడ ఆవశ్యకమైన కార్యముల నిమిత్తము పరాధీనములు చేయవచ్చునని కలకత్తా హైకోర్టువారు తీరుమానించి యున్నారు. (ఇ లా. రి. 32 క. 158). మదరాసు ప్రెసిడెన్సీలో అవిభాజ్య జమీందారీల విషయములో ప్రివీకౌన్సిలువారి తీరుమానమునకు భిన్నముగా "ఇంపార్టిబిల్ ఎస్టేట్స్ ఆక్టు" అమలులోనికి తేబడియున్నది. (116 పేరా చివర చూడుము). తక్కిన ప్రెసిడెన్సీల యందు — ఇప్పుడు సిద్ధాంతమయ్యుండు ప్రకారము, అవిభాజ్య జమీందారీ పరిపాలకునికి సదరు జమీందారీ సొత్తును పరాధీనపరచునట్టి విషయములో సంపూర్ణ స్వాతంత్ర్యము కలదని ఎంచదగియున్నది.

విభాగయోగ్యమైన జమీందారీలవిషయమై సాధారణసమష్టి కుటుంబముల యందువలె పరాధీన నిర్బంధములు చెల్లుచున్నవి.

**196.** ఇంతవరకు మితాక్షర ధర్మశాస్త్రము ప్రకారము పిత్రార్జితపు సొత్తు విషయమై సమష్టి కుటుంబపు తండ్రికిని ఇతర

భాగస్థులకును గల పరాధీన స్వాతంత్ర్యము వివరింపబడినది. ఇంక దాయభాగము ప్రకార మెట్టి స్వాతంత్ర్యము కలదో విచారింతము.

దాయభాగము ప్రకారము తండ్రియొక్క పిత్రార్జితపు సొత్తునందు కుమారులకు జీవనాంశపు హక్కు మాత్రమే కలదు గాని, భాగము కోరునట్టి హక్కుగాని సదరు సొత్తు అక్రమముగా వ్రయపరచకుండ ఆపునట్టి హక్కుగాని లేదని 145-వ పేరాలో చెప్పియుంటిమి. బంగాళా సంప్రదాయము ప్రకారము, సమష్టి కుటుంబపు తండ్రి తన యావత్తు స్థిరచర స్వార్జిత పిత్రార్జితపు సొత్తును ఇచ్చవచ్చినట్లు క్రయముగా, తాకట్టుగా, దానరూపకముగా, లేక ఉయిలు మూలకముగా, పరాధీనము చేయుటకు స్వతంత్రుడనియు, అట్టి పరాధీనములు పాపకరములయ్యును చెల్లక తప్పవనియు, అనేక కేసులలో తీరుమానింపబడియున్నది. యావదాస్తిని పెద్ద కుమారునికి మాత్రమేగాని చిన్న కుమారునికి మాత్రమేగాని యిచ్చివేసినను చెల్లునని తీరుమానింపబడి యున్నది. (1 బం. స. తీ. 2; 2 స్ట్రేంజదొరవారి హిందూలా, 447; ఎఫ్. మెక్నాటన్ 356, 340; 2 బం. స. తీ. 42; ఎఫ్. మెక్నాటన్ 277, 265; 4 బం. స. తీ. 322; కలకత్తా సుప్రీంకోర్టు తీర్పులు - మార్టన్ 90; 6 బం. స. తీ. 73; 1859 సం॥ బం. స. తీ. 250; ఇ. లా. రి. 5 క. 113; ఇ. లా. రి. 7 క. 461; ఇ. లా. రి. 17 క. 886; 3 బం. స. తీ. 234, 397). ఈ చెప్పబడినతీరున బంగాళా సంప్రదాయము ప్రకారము తండ్రికి సంపూర్ణ పరాధీన స్వాతంత్ర్యమున్నను, కుమారుల కందరికిని తన ఆస్తిని ఇచ్చవచ్చినట్లు అసమాన భాగములుగా పంచిపెట్టుటకు అతడు స్వతంత్రుడు కాడనియు, అసమాన విభా

దాయభాగము-తండ్రికిగల పరాధీన స్వాతంత్ర్యము.

గము చెల్లజాలదనియు, కానవచ్చుచున్నది. (2 బం. స. తీ. 202; ఎఫ్. మెక్నాటన్ 283, 294).

కుమారులకుగల పరాధీన స్వాతంత్ర్యము.

**197**. బంగాళా దేశములో తండ్రి జీవించియుండగా కుటుంబపు సొత్తునందు కుమారునకు ఎట్టి హక్కును లేదు. కాబట్టి, అతడు చేయునట్టి పరాధీనములు చెల్లజాలవు. ఇంతేకాక, తండ్రి మృతిచెంది ఆ స్త్రియందు కుమారునికి హక్కు కలిగిన పిమ్మటగూడ అతడు వెనుక పరాధీనపరచిన సొత్తును త్రాంసుఫరుదారుని స్వాధీనము కానియ్యక, పరాధీనమును రద్దు పరచుకొన వచ్చును. త్రాంసుఫరుదారునివద్ద తీసికొన్న సొమ్ముమాత్రము ఇచ్చివేయవలెను. (2 మార్లీ డైజెస్టు 152).

ఇతర భాగస్థులకు గల స్వాతంత్ర్యము.

**198**. బంగాళా సంప్రదాయము ప్రకారము, తండ్రి మృతిచెంది కుమారులు మొదలయినవారు ఆ స్తికి భాగస్థులుగా ఏర్పడినప్పుడు, వీరు సమష్టిగా జీవించుచుండినను ప్రత్యేకపు హక్కులు కలిగియుండునట్లే భావింపబడుదురు. కావున, వీరు తమవంతు భాగములను ఇచ్చవచ్చినట్లు పరాధీనపరచుటకు స్వాతంత్ర్యమును కలిగియుందురు. తమవంతు హక్కును మించిన భాగములను పరాధీనము చేయగూడదు. (1 బం. స. తీ. 44, 45, 115; 3 బం. స. తీ. 17; 4 బం. స. తీ. 196; 5 బం. స. తీ. 338; 2 డబ్లియు మెక్నాటన్ 291, 294, 296, 306, 313; 17 స. 420; 21 స. 17).

పరాధీనము విషయమై భాగస్థులతో ఒడంబడిక.

**199**. సమష్టి కుటుంబపు భాగస్థుడు సమష్టి ఆస్తిలో తన భాగమును మఱియొక భాగస్థునికితప్ప యెవరికిని విక్రయించకుండునట్లు ఒడంబడిక చేసికొని యుండినయెడల అది చెల్లుననియు, సదరు ఒడంబడిక ప్రకారము నడచుకొనునట్లు కోర్టువారి మూలకముగా ఉత్తరువు పొందవచ్చుననియు, తద్భిన్నముగా జరిగింపబడిన పరాధీనమును రద్దు పరపించ వచ్చుననియు, అలహాబాదు

హైకోర్టువారు తీరుమానించి యున్నారు. (ఇ. లా. రి. 1 అ. 618; ఇ. లా. రి. 2 అ. 826). కాని, సమష్టి కుటుంబపు భాగస్థులు తమలో తాము చేసికొనియుండు ఒడంబడిక, దానిసంగతి యేమాత్రమును ఎరుగక సొమ్మిచ్చి పరాధీనమును పొందినవానికి విరోధకరముగా చెల్లుబడియించగలదని చెప్పుట సందేహాస్పదముగా నున్నది. (ఇ. లా. రి. 8 మ. 381; ఇ. లా. రి. 4 అ. 518; 16 బొం. 599). డిక్రీ అమలులో ఆస్తిని కొన్నవానిని అట్టియొడంబడిక బాధింపదని తీరుమానింపబడి యున్నది. (ఇ. లా. రి. 20 క. 273).

**200**. పరాధీనముల విషయమై మితాక్షర దాయభాగముల ప్రకారము తండ్రికిని ఇతర భాగస్థులకునుగల స్వాతంత్ర్యము ఇంతవరకు వివరించితిమి. ఇంక, దానములు క్రయములు తాకట్లు వగైరాలను గురించి సర్వత్ర చెల్లుచుండెడి కొన్ని అంశములు ఈ ప్రకరణమునందు తెలుపంబడును.

ఒక ఆస్తిదారుడు తన ఆస్తిని దానము చేయునప్పుడు, దానమును పొందువాడు తనను సంరక్షించ వలసినదనిగాని, తన మరణానంతరము అపరక్రియలు నెరవేర్చవలసినదనిగాని, తనవల్ల అతనికి రావలసియుండు బాకీలను వదులుకొన వలసినదనిగాని, తన వ్యాధి కుదిరి తాను జీవించినయెడల సదరు సొత్తు మరల తనకే చేరవలసినదనిగాని, ఇట్టి షరతులు ఏర్పరచ వచ్చును. (3 బం. స. తీ. 377; 1853 సం॥ బం. స. తీ. 103; ఇ. లా. రి. 14 క. 292; 9 మూ. ఇ. అ. 123, 135; 4 క. హై. 192; 6 మ. హై. 270). అట్టి షరతుల ప్రకారము జరుపనియెడల దానము చెల్లనేరదు. దానముచేయునట్టి కాలమునందే షరతులను ఏర్పరచుకొనవలెనుగాని దానము సంపూర్తియైన పిమ్మట ఏర్పరుచుటకు వీలు లేదు. (ఇ. లా. రి. 6 అ. 313). మరియు, లా'కు విరోధమైన షరతు

దానములో షరతులు.

లు - అనగా, దానపు ఆస్తిని అనుభవించక పాడుపెట్ట వలసినదని గాని, ఆదాయము ఎల్లప్పటికిని కూడబెట్టవలసినదని గాని, సదరు ఆస్తిని తాకట్టుపెట్ట గూడదనిగాని, విక్రయించ గూడదనిగాని, అప్పుల క్రింద లేక మనోవర్తిక్రింద ఇయ్య గూడదని గాని, విభాగించుకొన గూడదనిగాని - ఇట్టి షరతులు చెల్లనేరవు. అట్టి సందర్భమున, ఇతర విషయములలో క్రమమైనదిగా నున్న యెడల దానము నిలిచి షరతులు రద్దగుచున్నవి. (4 మ. హై. 345, 6 మ. హై. 356; 13 క. హై. 445, 457; ఇ. లా. రి. 4 మ. 200; ఇ. లా. రి. 14 క. 222; ఇ. లా. రి. 4 అ. 518; ఇ. లా. రి. 7 మ. 315; ఇ. లా. రి. 7 అ. 516; 2 మై. 133. చూడు 1882 సం॥ 4 నెం॥ ట్రాంసుఫరాఫ్ ప్రాపర్టి ఆక్టు 10, 12 సె. ఇ. లా. రి. 13 బొం. 463; ఇ. లా. రి. 26 బొం. 449; 4 క. హై. 103; 9 క. హై. 37; 18 స. 359). అట్టి చెల్ల గూడని షరతులే ప్రతిఫలముగా, అనగా, వానికిలోబడియే, దానము చేయబడినప్పుడు, దానము రద్దుగా భావింపబడును. (ఇ. లా. రి. 6 అ. 313; ట్రాంసుఫరు ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు, సె. 25, 18).

"ఏ" యనువాడు యావజ్జీవమును ఆస్తి అనుభవించునట్లును పిమ్మట అది "బీ" యనువానికి చెందునట్లును దానముచేయబడియుండు సందర్భమున, "ఏ" యనువానికియ్యబడిన దానము ఏ కారణము వల్లగాని చెల్లకపోయిన యెడల, తత్క్షణము యావదాస్తియు "బీ" యనువానికి చేరును. (ట్రాంసుఫర్ ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు 27 సె॥).

దానముసు పొందువాడు జన్మించి, అథవా గర్భగతుడై యుండవలెను.

**201.** దానము సంపూర్తియగుటకు ఆస్తిదారుడు తనసొత్తును మరియొకరికి ఉచితముగా ఇచ్చుటయు, ఇతడు దానిని అంగీకరించి పరిగ్రహించుటయు ముఖ్యము. కాబట్టి దానమునుపొందువాడు సదరుదానము చేయబడిన కాలమునందుగాని, ఉయిలు

(మరణశాసనము) వల్ల దానము చేయబడిన యెడల దాత యొక్క మరణ కాలమునందు గాని, జన్మించి, అథవా గర్భగతుడై, యుండవలయును. పిమ్మట గర్భగతుడగు వానికి దానము చెల్లనేరదు. (9 క. హై. 399; ఇ లా. రి. 2 క. 265; ఇ. లా. రి. 4 క. 455; ఇ. లా. రి. 15 బొం. 443; 29 క. 260). స్వీకారపుత్రుని విషయములో మాత్రము ఈవిధి చెల్లదు - అనగా, దాన కాలమునకు పిమ్మట స్వీకరింప బడినను, స్వీకార పుత్రునికి చేయబడునట్టి దానము చెల్లుచున్నది. (4 క. హై. 103; 9 క. హై. 377, 397, 400, 404).

ఏదైనను ఆస్తి అనేకమందికి జాయింటుగా దానము చేయబడినప్పుడు, వారిలో కొందరు దానము చేయబడిన కాలమున, లేక, ఆస్తిదారుని మరణకాలమున, జన్మించి యుండ లేదను కారణము వల్లగాని మరియే కారణము వల్లగాని వారి విషయమై దానము చెల్లకపోయినను, తక్కినవారి విషయమై అది రద్దు కానేరదు. అట్టి సందర్భమున, దానపు ఆస్తి యావత్తును ఈ తక్కినవారికే చెందును. దానపత్రికలో ఉదహరింపబడిన వారందరును, అనగా, జన్మించియుండువారును జన్మించియుండనివారును గూడ ఆస్తిని పొందవలెనని దాతయొక్క ప్రథమోద్దేశమనియు, అది సాధ్యము కానియెడల, వారిలో ఎవరికి క్రమముగా ఆస్తి చేరవచ్చునో వారుమాత్రమే తీసికొని అనుభవించవలెనని ద్వితీయోద్దేశమనియు భావింపదగియున్నది. (ఇ. లా. రి. 6 అ. 573; ఇ. లా. రి. 12 క. 663; 24 క. 658; 32 క. 992; 12 మ. 393; 15 బొం. 562; 18 బొం. 7; 20 బొం. 571; 22 బొం. 533; 26 బొం. 468).

అనేకమందికి జాయింటుదానము.

దాన మియ్యబడువాడు, దాతవద్దనుండి దానమును అంగీకరించి తీసికొనుట ఆవశ్యకము కాదు. అతడు ఎచ్చటనున్నను, ని

శ్చయముగా అంగీకరించునను నమ్మికతో దానము చేయబడిన యెడల, అది తప్పక చెల్లును. (4 క. హై. 291).

దానపు ఆస్తిని స్వాధీన పరచుట.

**202**. దానము సంపూర్తియై చెల్లుటకై, దానము పొందువాని స్వాధీనములోనికి దానకాలమునందు సొత్తు చేరవలయును. చరాస్తి దానము చెల్లుటకై దానిని స్వాధీనపరచవలయును. స్థిరాస్తిదానము చేయబడినపుడు దానిని ఆయా సందర్భమునందు సాధ్యమగునట్లు స్వాధీనపరచవలయును. ఇతరులవలన గుత్తకు తీసికొనబడియుండు స్థిరాస్తి దానము చేయబడినప్పుడు, దాని తాలూకు బాడుగను దానముగొన్న వానికి చేరునట్లు ఏర్పాటుచేసిన యెడల, ఆస్తి స్వాధీనపరచబడినట్లు భావింపబడును. (5 బొం. హై. 83; 6 మ. హై. 194; 4 బొం. హై. 31; ఇ. లా. రి. 4 అ. 40; ఇ. లా. రి. 9 మ. 267; ఇ. లా. రి. 21 అ. 165; ఇ. లా. రి. 7 మ. 23; ఇ. లా. రి. 12 బొం. 523; ఇ. లా. రి. 7 బొం. 452, 229; 4 మ. హై. 460; ఇ. లా. రి. 27 బొం. 31; ఇ. లా. రి. 29 బొం. 468). దానముచేయబడిన స్థిరాస్తిని దాత తన స్వాధీనమునందే ఉంచుకొని దానిని తాను గుత్తకు లేక బాడిగెకు తీసికొన్నట్టు దానము పొందిన వానికి గుత్తచీటి లేక బాడిగెచీటి వ్రాసియిచ్చినయెడల సదరు ఆస్తి స్వాధీనపరచబడినట్లు యెంచబడును. (3 బం. స. తీ. 234). మయినరునకుగాని పిచ్చివానికిగాని దానముచేసిన ఆస్తిని, అతని తరఫున దాత తనయొద్దనే ఉంచుకొనవచ్చును. (2 డబ్లియు మెక్నాటన్ 243). దానపుసొత్తును దానముపొందిన వానికి చేరనియ్యక ఇతరులు అక్రమముగా స్వాధీనపరచుకొని అడ్డిచేయుచున్న యెడల, సదరు సొత్తు స్వాధీనపరచబడినట్లే భావింపబడి దానము చెల్లుచున్నది. కాబట్టి, అట్టి సొత్తు

విషయమై దానము పొందినవారు దావా తేవచ్చును. (ఇ. లా. రి. 11 క. 121).

ముందు రాగల లేక సంపాదించగల ఆస్తిని దానము చేసిన యెడల, అట్టి దానము చెల్లనేరదు. (ట్రాన్సుఫర్ ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు సె. 122).

**203.** క్రమముగా సంపూర్తి చెందిన దానమువల్ల దాతయును అతని వారసులును మాత్రమేగాక అతని అప్పులవాండ్రు కూడ బద్ధులుగానుందురు. కాని, అప్పులవాండ్రను మోసము చేయవలెనను ఉద్దేశముతో నామకార్థము దానముచేసి ఆస్తిని మరియొకరి పేరిట భద్రపరచుకొన్న యెడల సదరు దానము చెల్లనేరదు. (1858 సం॥ మ. తీ. 61; 1 మ. హై. 393; 4 మ. హై. 84; ఇ. లా. రి. 2 అ. 891; ఇ. లా. రి. 6 అ. 560; ఇ. లా. రి. 23 క. 15; ఇ. లా. రి. 23 బొం. 131). దాతను మోసముచేసి పొందబడిన దానములు చెల్లజాలవు. (ఇ. లా. రి. 15 బొం. 549).

మోసపు దానములు.

**204.** విక్రయము తాకట్టువగైరా ప్రతిఫలయుక్తమైన ట్రాన్సుఫర్లు చెల్లుటకై, ట్రాన్సుఫరుదారునికి సొత్తు స్వాధీనపరచుట ఆవశ్యకమా, కాదా - అను విషయమునుగూర్చి మదరాసు కలకత్తా హైకోర్టులవారును బొంబయి హైకోర్టువారును కొంతవరకు భిన్నాభిప్రాయులై యున్నారు. ప్రతిఫలయుక్తమైన ట్రాన్సుఫర్ల విషయములో సొత్తును స్వాధీనపరచుట ఆవశ్యకము కాదనియు - సొత్తు స్వాధీనపరచక చేసియుండు ఒక ట్రాన్సుఫరును, పిమ్మట మరియొకరికి సొత్తు స్వాధీనముతో చేయబడిన ట్రాన్సుఫరు బాధింపజాలదనియు - అట్టి మొదటి ట్రాన్సుఫరుదారుడు రెండవ ట్రాన్సుఫరుదారుని తొలగించుటకు దావా తేవచ్చుననియు - ఇంతేకాక, సొత్తును స్వాధీనము

ప్రతిఫలయుక్తమైన ట్రాన్సుఫర్ల విషయములో ఆస్తిని స్వాధీనపరచుట.

కలకత్తా మదరాసు తీర్పులు

నందు కలిగియుండకున్నను దానికి హక్కుదారునుగా నేర్పడి యుండువాడు చేయునట్టి త్రాంసుఫరు చెల్లుననియు - ఇట్లు, కలకత్తా మదరాసు హైకోర్టుల తీర్పులవల్లను ప్రివీ కౌన్సిలువారి తీర్పులవల్లను స్థిరపడియున్నది. (1860 సం॥ మ. తీ. 277; 3 మ. హై. 38; ఇ. లా. రి. 5 మ. 6; ఇ. లా. రి. 6 మ. 404; ఇ. లా. రి. 17 మ. 146; ఇ. లా. రి. 8 క. 597, 610; 9 మూ. ఇ. అ. 303; 2 మ. హై. 108; 4 మ. హై. 434; ఇ. లా. రి. 5 క. 265; 3 మ. హై. 40, 46; 13 మూ. ఇ. అ. 113; ఇ. లా. రి. 11 క. 121; ఇ. లా. రి. 15 క. 684; 1858 సం॥ బం. స. తీ. 601; 3 క. హై. 207; 11 స. 134; 22 స. 99; 14 క. హై. 307; 23 స. 131, 163; ఇ. లా. రి. 8 క. 597, 610; ఇ. లా. రి. 13 క. 297).

బొంబయి తీర్పులు.

**205**. బొంబయి హైకోర్టువారి తీర్పులవలన స్థిరపడి యుండు ప్రకారము ఎట్టి త్రాంసుఫరుగాని ఆస్తి స్వాధీనముతో గూడి యుండనియెడల, దాని సంగతి యెంతమాత్రమును ఎరుగక పిమ్మట సదరు ఆస్తిని వెలకు తీసికొన్న వానిని లేక తాకట్టు గొన్నవానిని భాధింపజాలదు. (7 బొం. హై. 4; 10 బొం. హై 491; ఇ. లా. రి. 2 బొం. 299; 6 బొం. 165; ఇ. లా. రి. 4 బొం. 459, 461; ఇ. లా. రి. 6 బొం. 490). కాని, రెండవ త్రాంసుఫరుదారుడు మొదటి త్రాంసుఫరు సంగతి ముందే యెరిగినవాడుగా నుండునపుడును, ప్రతిఫలమునకుగాక దానరూపకనుగా ఆస్తిని పొందియుండునపుడును, రెండవ త్రాంసుఫరు జరుగక మునుపే మొదటి త్రాంసుఫరు రిజిస్టరై యుండునపుడును, రెండవ త్రాంసుఫరు కోర్టువేలమువల్ల కలిగినదై యుండునపుడును - ఈ సందర్భములయందు ఆస్తి స్వాధీనము లేకున్నను మొదటి త్రాంసుఫరే చెల్లుచున్నది. (ఇ. లా. రి. 6 బొం.

168, 515; ఇ. లా. రి. 9 బొం. 427; ఇ. లా. రి. 12 బొం. 678; ఇ. లా. రి. 17 బొం. 741; 7 బొం. హై. 69; 8 బొం. హై. 50; 11 బొం. హై. 37). రెండవ ౹్రాంసుఫరు కోర్టువారి వేలమువల్ల కలిగినదై యుండునపుడు, ప్రతివాదికిగల హక్కుమాత్రమే సదరు వేలములో విక్రయింపబడుటవలన, అదివరకు అతని వలన చేయబడియుండు అస్వాధీనపు ట్రాంసుఫరు బాధింపబడనేరదు. (9 బొం. హై. 304; ఇ. లా. రి. 6 బొం. 93). ఆ_స్తి స్వాధీనపరచ లేదను కారణమువల్ల, తాను చేసియుండు ట్రాంసుఫరు చెల్లదని వాదించుటకు ఆ_స్తి దారుడు హక్కుకలిగి యుండడు. (7 బొం. హై. 45; ఇ. లా. రి. 6 బొం. 168). కోర్టువారి వేలము లో ఆ_స్తిని కొన్నవాడు సదరు ఆ_స్తిని స్వాధీన పరచుకొనకయే విక్రయించినను అట్టి విక్రయము చెల్లుచున్నది. (ఇ. లా. రి. 6 బొం. 168).

రెండవ ట్రాంసుఫరు లేని విషయములో, ఈ వివరింపబడిన నిర్బంధములు లేవు. ఇతరులు అక్రమముగా అక్రమించుకొని యుండుటవలన ఆ_స్తిని స్వాధీనమందు కలిగియుండని ఆ_స్తిదారుడు దానిని ఎవరికైనను ట్రాంసుఫరు చేసినయెడల, ఈ ట్రాంసుఫరుదారుడు దావా తెచ్చి, సదరు ఆక్రమించుకొన్న వారిని తొలగించి ఆ_స్తిని స్వాధీనపరచుకొనవచ్చును. (9 బొం. హై. 275; ఇ. లా. రి. 9 బొం. 324).

**206.** 1877 సం॥ 3 నెం॥ రిజిస్ట్రేషను ఆక్టు ప్రకారము కొన్ని కొన్ని దస్తావేజుల విషయములో రిజిస్టరు చేయించుట విధాయకముగా లేకున్నను, ఒకటే ఆ_స్తి విషయమై ముందు సాధారణ దస్తావేజును పిమ్మట రిజిస్టరు దస్తావేజును పుట్టి యుండినయెడల, రిజిస్టరు దస్తావేజే చెల్లునని సదరు ఆక్టు 50-వ సెక్షను వల్ల కనబడుచున్నది. మొదటి దస్తావేజు సంగతి యెరిగియుండియు పి రిజిస్ట్రేషను ఆక్టు 50-సె

మ్మట రిజిస్టరు దస్తావేజు పొందినవానికిని, మొదటి సాధారణ దస్తావేజువలన ఆస్తి స్వాధీనపరచబడియుండగా పిమ్మట రిజిస్టరుదస్తావేజు పొందినవానికిని, మీాద తెలుపబడిన 50-వ సెక్షనువలని లాభము కలుగదని అన్ని కోర్టుల వారును తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 8 అ. 540; ఇ. లా. రి. 19 అ. 145; ఇ. లా. రి. 5 క. 336; ఇ. లా. రి. 10 క. 250; ఇ. లా. రి. 13 క. 70; ఇ. లా. రి. 6 బొం. 515; ఇ. లా. రి. 9 బొం. 427; ఇ. లా. రి. 10 బొం. 105; ఇ. లా. రి. 12 బొం. 569; ఇ. లా. రి. 18 బొం. 444; ఇ. లా. రి. 27 బొం. 408, 452; ఇ. లా. రి. 8 క. 597; ఇ. లా. రి. 10 క. 1073; ఇ. లా. రి. 16 క. 22; ఇ. లా. రి. 16 మ. 148).

ట్రాంసుఫర్ అఫ్ ప్రాపర్టీ ఆక్టు.

**207**. హిందూ ధర్మశాస్త్రముల ప్రకారము, దానములు తాకట్లు విక్రయములు వగైరా పరాధీనములు వ్రాతమూలకముగా జరిగింపవలసినట్లు నిర్బంధము కనబడదు. కాని, యిప్పుడు 1882 సం॥4 నెం॥ ట్రాంసుఫరాఫ్ ప్రాపర్టీ ఆక్టు ప్రకారము కొన్ని నిర్బంధములు పుట్టియున్నవి. ఈ చట్టము బొంబయి పంజాబు బర్మాదేశములయందు అమలులో లేదు. తక్కినచోట్ల, దానిలో చెప్పబడియుండు ప్రకారమే పరాధీనములు జరుగవలెను.

క్రయము, తాకట్టు, గుత్త.

ఏదైనను స్థిరాస్తి విక్రయించబడినప్పుడు సదరు ఆస్తియొక్క కిమ్మతుగాని - ఏదైనను స్థిరాస్తి తాకట్టు పెట్టబడినప్పుడు సదరు తాకట్టు సొమ్ముయొక్క మొత్తముగాని - 100 రూపాయలు, లేక, జాస్తిగా నుండినయెడల, రిజిస్టరు దస్తావేజువల్లనే సదరు విక్రయము, లేక తాకట్టు జరిగింపబడవలయును. రూ - 100 ల కిమ్మతు, లేక, మొత్తమునకు లోబడి యుండినయెడల, రిజిస్టరు దస్తావేజువల్లగాని, ఆస్తిని స్వాధీనపరచుట వల్లగాని, సదరు విక్రయము, లేక తాకట్టు జరిగింపబడవచ్చును. (సె. 54, 59).

ఒక సంవత్సరపు గడుపుమించిన, లేక, సంవత్సరమునకు ఇంత సొమ్మని ఏర్పరచుకొన్న, స్థిరాస్తి గుత్తకరారులు రిజిస్టరు దస్తావేజువల్లనే జరుగవలెను. తక్కిన విషయములలో సాధారణ దస్తావేజువల్లగాని నోటిమాటవల్లగాని గుత్తకరారులు జరుగవచ్చును. (సె. 107).

**208.** స్థిరాస్తియొక్క దానము - దాతయొక్కయు కనీసము ఇద్దరు సాక్షులయొక్కయు దస్కతులతో గూడిన రిజిస్టరు దానపత్రమువల్లనే జరుగవలెను. చరాస్తియొక్క దానము - అట్టి రిజిస్టరు దానపత్రమువల్లగాని సొత్తును స్వాధీనపరచుట వల్లగాని జరుగవచ్చును. (సె. 123). రిజిస్టరు దస్తావేజువల్ల దానము జరిగినప్పుడు స్థిరాస్తియైనను చరాస్తియైనను సరే స్వాధీనపరచుట ఆవశ్యకముకాదు. (ఇ. లా. రి. 14 క. 446). దానము.

# ప్రకరణము 8.

—○:o:○—

## ఉయిల్లు.

ఉయిలు అనగా నేమి?

**209.** ఉయిలు అనగా మరణశాసనము. అనగా ఒక ఆస్తిధారుడు తన జీవితకాలములోనే తన సొత్తును దానముచేసి స్వాధీనపరచక, తన మరణానంతరము ఫలానాఫలానావారు తన తాలూకు ఫలానాఫలానా సొత్తులను స్వాధీనపరచుకొని అనుభవించునట్లు ఇష్టమును వివరించు పత్రిక. ఆస్తి విషయమై ఉయిలు రూపకముగా ఏర్పాటు చేయునట్టి పద్ధతి హిందూ ధర్మశాస్త్రములయందు విశేషముగా కానంబడదు. అన్ని సందర్భములయందును ఆస్తికి వారసులు ఏర్పడియుండు కారణమువల్లను, సమష్టి కుటుంబమునందలి కట్టుబాట్లచేత ఇష్టముచొప్పున ఆస్తిని ఇచ్చివేయునట్టి స్వాతంత్ర్యము పూర్వకాలమునందు మిక్కిలి తక్కువగా నున్నందువల్లను, ఉయిళ్లకు అంతగా అవకాశముండదు. ఇటీవల, ఈ స్వాతంత్ర్యము హెచ్చి ఆస్తి పరాధీనములు సామాన్యమగుటచే, ఉయిల్లుగూడ ప్రబలమయ్యెను.

ఇప్పుడు అన్ని ప్రెసిడెన్సీలయందును ఉయిల్లు అంగీకరింపబడుచున్నవి.

**210.** సుమారు నూర్గు సంవత్సరముల క్రిందటనే బంగాళా ప్రెసిడెన్సీలోని కోర్టులవలన, హిందువులలో ఉయిల్లు అంగీకరింపబడుట ప్రారంభమయ్యెను. (2 మార్లీ డైజెస్ట్, 220; 1 బం. స. తీ. 2; ఎఫ్ మెక్. 357; 2 బం. స. తీ. 23). దక్షిణ హిందుస్థానమునందును బొంబయి ప్రెసిడెన్సీయందును చాల కాలమువరకు ఉయిల్లు అంగీకరింపబడవయ్యెను. (2 మ. తీ. 79; 1850 సం॥ మ. తీ. 50; 2 బొరొ. 471, 124; 1829 సం॥ 5 నెం॥ మదరాసు రిగ్యులేషనుగూడ హిందువులలో ఉయిల్లు చెల్లజాలవనియే ప్రకటించెను. కాని, యిటీవల, సదరుకోర్టు

హైకోర్టువారి తీర్పులవల్లను ప్రివీకౌన్సిలు వారి తీర్పులవల్లను గూడ, హిందువులలో ఉయిల్లు చెల్లునని స్థాపింపబడెను. (1851 సం॥ మ. తీ. 226; 6 మూ. ఇ. అ. 309, 344; 10 మూ. ఇ. అ. 308; 1 మ. హై. 326, 339; ఇ. లా. రి. 5 క. 438; 3 బొం. హై. 8). ఇప్పుడు అన్ని ప్రెసిడెన్సీలయందును హిందూ జనులలో ఉయిల్లు నిరాటంకముగా చెల్లుచున్నవి.

ఉయిలు చేయుటకు స్వాతంత్ర్యము — మితాక్షరము.

**211.** మితాక్షరము ప్రకారము ఒక ఆస్తిదారుడు తాను జీవించియుండగా దాన రూపకముగా ఇచ్చివేయుటకు ఏయే సొత్తులమీద స్వాతంత్ర్యము కలిగి యుండునో, సదరు సొత్తులను ఉయిలు మూలకముగా ఇచ్చివేయుటకు గూడ అతనికి స్వాతంత్ర్యము కలదు. (1 మ. హై. 326, 339). కాబట్టి స్వార్జితపు సొత్తునుగాని సమష్టి కుటుంబమునకు చేరని తన ప్రత్యేకపు సొత్తునుగాని, సదరు సొత్తు ఖావందు, తన యిష్టమువచ్చిన ఉయిలుమూలముగా ఇచ్చివేయ వచ్చును. మఱియు, పుత్రసంతతి - అనగా పుత్ర పౌత్ర ప్రపౌత్రి సంతతి - గాని, అన్నదమ్ములు మున్నగు సమష్టి హక్కుదారులుగాని, లేనట్టి ఆస్తిదారుడు, తాను భరింపవలసిన జీవనాంశములకు తగిన యేర్పాటుచేసి తన పిత్రార్జితపు సొత్తును గూడ ఇచ్చవచ్చినట్లు ఉయిలు మూలకముగా ఇచ్చి వేయవచ్చును. (6 మూ. ఇ. అ. 309, 344; 10 మూ. ఇ. అ. 308; 12 మూ. ఇ. అ. 38; 3 బొం. హై. 6; ఇ. లా. రి. 12 మ. 126; 22 మ. 9; 18 మై. 22). కాని, సమష్టి కుటుంబపు భాగస్థుడు పిత్రార్జితపు సొత్తులో తనవంతు భాగమును ఉయిలు మూలముగా ఇచ్చివేయుటకు స్వతంత్రుడు కాడు. జీవితకాలములో దానరూపకముగా తన భాగమును పరాధీనము చేయునట్టి స్వాతంత్ర్యము సమష్టి కుటుంబపు భాగస్థునకు కలిగి యున్నను, అతని మరణ సమయమున తక్కిన భాగస్థుల సమష్టి

హక్కు ప్రబలుట చేత, తన మరణానంతరము తనవంతు భాగము ఫలానావారికి చేరవలసినదని ఉయిలు చేయునట్టి స్వాతంత్ర్యము అతనికి తప్పిపోవుచున్నది. (8 మ. హై. 6, 13; 3 బొం. హై. 6, 66; 11 బొం. హై. 66; ఇ. లా. రి. 5 బొం. 48; ఇ. లా. రి. 12 బొం. 105; 8 హై. 219; 29 అ. 244). కాబట్టి, సమష్టి కుటుంబపు భాగస్థునివల్ల అతనివంతు భాగమును ఉయిలు మూలకముగా పొందినవాడు దానివలన ఎట్టి ప్రయోజనమును గాని చెందజాలడు.

సమష్టి కుటుంబములో భాగస్థుడు తనవంతు భాగమును ఉయిలు మూలముగా ఇచ్చివేసినయెడల, అతడు మృతిచెందక పూర్వమే విభాగము జరిగినపక్షమున, సదరు ఉయిలు చెల్లుచున్నది. (ఇ. లా. రి. 29 అ. 82).

ఒక సమష్టి కుటుంబములో తండ్రియును కుమారుడును ఉండిరి. తండ్రి ఉయిలుమూలముగా యావత్తు పిత్రార్జితపు సొత్తును ట్రస్టీల వశముచేసి తన కుమారునకు 21 సం॥ వయసు వచ్చువరకు వారు దానిని మేనేజిమెంటు చేయుచుండునట్లును పిమ్మట దానిని కుమారునకు ఒప్పగించునట్లును ఏర్పాటుచేసెను. ఈ యేర్పాటు చెల్లజాలదని బొంబాయి హైకోర్టువారు తీరుమానించిరి. ఉయిలుదారుని మరణకాలమున యావత్తు పిత్రార్జితమును శాస్త్రరీత్యా కుమారునికి చెందుటవల్ల, ట్రస్టీలకు పోగలసొత్తు ఉండదనియు, పిత్రార్జితపు సొత్తనునది తండ్రి తన యిష్టముచొప్పున కుమారులకు ట్రాంసుఫరు చేయునట్టిది కాదనియు, ఇండియన్ ట్రస్ట్సు ఆక్టుప్రకారము దాని విషయమై అతడు ట్రస్టీలను ఏర్పాటు చేయుటకు వీలులేదనియు, వారు అభిప్రాయము తెలిపిరి. (ఇ. లా. రి. 29 బొం. 351).

**212.** దాయభాగ సంప్రదాయము ప్రకారము సమష్టికుటుంబపు తండ్రి తన యావత్తు స్థిరచర పిత్రార్జితపు సొత్తును ఇచ్చవచ్చినట్లు ఉయిలు చేయవచ్చునని 196 - వ పేరాలో తెలిపియుంటిమి. మఱియు, సదరు సంప్రదాయము ప్రకారము, సమష్టికుటుంబపు భాగస్థులు యావదాస్తికిని సమష్టి హక్కు కలిగియుండక ప్రత్యేకపు హక్కులు కలిగియుండుటచేత, వారు తమ సంతు భాగములను ఉయిలు చేయునట్టి స్వాతంత్ర్యమును కలిగియుందురు. (6 మూ. ఇ. అ. 344; 4 క. హై. 159; 9 క. హై. 396). వెనుక 198 - వ పేరా చూడవలసినది. దాయభాగము.

**213.** తమకు సంపూర్ణాధికారముగల స్త్రీధనము వగైరా సొత్తును స్త్రీలు ఉయిలుమూలముగా ఇచ్చివేయవచ్చును. (ఇ. లా. రి. 2 మ. 333). కాని, పురుషులవద్దనుండి స్త్రీలకు వారసు హక్కువలన వచ్చిన సొత్తును వారు ఉయిలు చేయగూడదు. (ఇ. లా. రి. 10 బొం. 372; 3 స. 49; 1 బారో. 55, 67, 284; ఇ. లా. రి. 10 బొం. 372; 17 బొం. 690; 28 బొం. 453). ఇద్దరు ముగ్గురు వితంతువులకు సమష్టిగా వచ్చియుండు సొత్తును వారిలో నెవ్వరుగాని ఉయిలు మూలముగా ఇచ్చివేయుటకు స్వతంత్రులు కాజాలరు. (ఇ. లా. రి. 7 మ. 93). మైనర్లుగానుండు వారు తమ ఆస్తిని ఉయిలు మూలముగా పరాధీనము చేయుటకు స్వతంత్రులు కారు. (ఎఫ్. మెక్. 81; 2 మార్లీ డైజెస్టు, 198). చూడు 1870 సం॥ 21 నెం॥ హిందూ ఉయిల్ల చట్టము, 2 సె., 3 సె.; 1865 సం॥ 10 నెం॥ సక్సెషన్ ఆక్టు 46 సె.; 1881 సం॥ 5 నెం॥ ప్రోబేట్ అండ్ అడ్మినిస్ట్రేషను ఆక్టు 149 సె.) స్త్రీలు - స్త్రీ-ధ.

**214.** ఉయిలు వ్రాసినకాలమందు ఉయిలుదారుని మనస్సు జబ్బు స్థితియందుండక మంచిచెడ్డలు ఆలోచించుకొను శక్తి దేహ్యాధికారము.

అతనికి కలిగియుండెననియు, దాని విషయమై అతనియెడల ఏవిధమైన దగాగాని బలవంతము గాని జరిగింపబడలేదనియు, దానిలోని సంగతులు అతను మనస్ఫూర్తిగా సమ్మతించి వ్రాసినవేయనియు - ఈ సంగతులను రుజువుచేయునట్టి భారము సదరు ఉయిలు దాఖలు చేయువారు వహింతురు. (ఇ. లా. రి. 25 క. 824; 27 క. 521; 23 అ. 405, 472; 23 క. 1).

ఆస్తి స్వాధీనపరచుట.

**215.** ఉయిలు మూలముగా ఆస్తి యియ్యబడినప్పుడు, అది ఉయిలుదారుని మరణానంతరము వారి వారికి స్వాధీనపరచబడ వలసినదేగాని, అతని జీవిత కాలమునందే స్వాధీనపరచ వలసిన అవశ్యకము లేదు.

మైనర్లు వగైరాలకు ఉయిలు చేయుట.

మైనర్లు, పిచ్చివాండ్రు, కుష్ఠరోగులు - ఇట్టివారికి ఉయిలు వలన ఆస్తి యియ్యబడినను చెల్లుచున్నది.

అప్పులు, జీవనాంశములు - వీని నిమిత్తము ఏర్పాటు.

**216.** ఒక ఆస్తిదారుడు తాను తీర్చవలసిన అప్పుల నిమిత్తముగాని, తాను ఇయ్యవలసిన జీవనాంశముల విషయమైగాని, యేర్పాటుచేయక, తన యావదాస్తిని ఉయిలు మూలముగా ఇతరులకు ఇచ్చివేసిన యెడల వీరికి సదరు ఆస్తియందు సంపూర్ణమగు హక్కు కలుగక, సదరు అప్పులు, లేక, జీవనాంశము నిమిత్తము న్యాయముగా ఇయ్యవలసినది పోగా మిగిలినట్టి సొత్తునందు మాత్రమే హక్కు కలుగును. (3 మదరాసు లా జర్నల్, 174).

ఆస్తిదారుడు, తన అప్పుల నిమిత్తముగాని తాను భరింపవలసిన జీవనాంశముల నిమిత్తముగాని ఎట్టి యేర్పాటును చేయక ఆస్తి యావత్తును ఉయిలుచేసి, అందులో సదరు అప్పులవాండ్రకును జీవనాంశమును పొందవలసిన వారికిని కొంతసొత్తు ఇచ్చిపోయిన యెడల, వీరు ఉయిలు ప్రకారము సొత్తు తీసికొని ఊరకుండవలెను, లేనియెడల తమ అప్పులను జీవనాంశములను

రాబట్టుకొని ఉయిలువల్ల ఇయ్యబడిన దానమును వదులుకొనవలెను. (ఇ. లా. రి. 14 బొం. 438).

**217.** ఉయిలు మూలముగా ఆస్తిని దానము చేయునప్పుడు, సదరు ఆస్తిని మొట్టమొదట ఒకడు అతని జీవితకాలమునందు అనుభవించ వలసినదనియు, పిమ్మట సదరు ఆస్తి యావత్తుగాని కొంతగాని మరియొకరు అనుభవించ వలసినదనియు - ఈ లాగున ఏర్పాటు చేయవచ్చును. అట్లు ఏర్పాటు చేయబడినప్పుడు మొదటి హక్కుదారుడు సదరు సొత్తును న్యాయమైన మార్గములలో అనుభవించదగును గాని, విక్రయదానాది మార్గముల వలన పరాధీనము చేయగూడదు. చేసిన యెడల, సదరు విక్రయ దానాదులు రద్దుగా నెంచబడును. ఉయిలులో ఆస్తి విషయమైన ఏర్పాట్లు, షరతులు.

ఉయిలువలన ఇయ్యబడిన ఆస్తియందు ఒకరితర్వాత ఒకరికి హక్కులు కలిగింపబడిన యెడల, ఇట్లు హక్కులు కలిగింపబడినవారు, ఉయిలుదారుని మరణకాలమున జన్మించి, అథవా గర్భగతులై యుండవలెను. పిమ్మట గర్భగతులగు వారికి ఉయిలువలన ఏదైనను సొత్తు ఇయ్యబడినయెడల, అది చెల్లనేరదు. (8 మూ. ఇ. అ. 85; ఇ. లా. రి. 4 క. 23; ఇ. లా. రి. 10 క. 952; ఇ. లా. రి. 16 క. 71, 383; ఇ. లా. రి. 24 క. 834; ఇ. లా. రి. 6 బొం. 38; ఇ. లా. రి. 16 బొం. 492; ఇ. లా. రి. 19 బొం. 647; 4 క. హై. 188, 191, 221; 9 క. హై. 397 — "టాగోరు ఉయిలు కేసు" — 8 క. హై. 400; ఇ. లా. రి. 2 క. 262; ఇ. లా. రి. 16 క. 71 చూడు - ఇ. లా. రి. 25 క. 404).

స్వీకారపుత్రుని విషయములో మాత్రము పైపేరాలో చెప్పబడిన విధి చెల్లదు. అనగా, స్వీకారాధికార మియ్యబడియుండు స్త్రీ, గర్భిణిగా భావింపబడును గావున సదరు అధికారమును

బట్టి ఉయిలుదారుని మరణానంతరము స్వీకరింపబడు పుత్రునకు, ఉయిలువలన ఇయ్యబడియుండు దానము చెల్లుచున్నది. (4 క. హై. 103, 166; 9 క. హై. 377, 397, 405).

ఉదాహరణములు

**218.** ఈ క్రింది ఉదాహరణములను గమనించి వానిలో గల అంశములను చక్కగా తెలిసికొనవలయును.

(1.) "ఏ" యనువాడు వ్రాసిన ఉయిలులో — తన ఆస్తి యావత్తును "బీ" యనువాడు అతని జీవితకాలమునందు అనుభవించవలసినదనియు, పిమ్మట సదరు ఆస్తి "సీ" యనువానికి చేరవలసినదనియు, ఏర్పాటు చేయబడియున్నది. "ఏ" యొక్క మరణకాలమునందు, "బీ" "సీ" లు జన్మించి, లేక, గర్భగతులై యుండినయెడల, ఈ యేర్పాటునకు ఆక్షేపణ లేదు. [ఉయిలుదారుని మరణకాలమున జన్మించి, లేక, గర్భగతులై యుండుటయే ముఖ్యముగాని, ఉయిలు వ్రాసిన కాలమునందు జన్మించి, లేక, గర్భగతులై యుండుట ఆవశ్యకము కాదు.]

(2.) ఒక ఆస్తిదారుడు తన భార్యకు స్వీకారాధికారమిచ్చి, తన ఆస్తి యావత్తును తన విభక్త సోదరుడు అనుభవించవలసినదనియు, తనభార్య స్వీకారము చేసికొన్న యెడల స్వీకారపుత్రునికి సదరు ఆస్తి చేరవలసినదనియు, యేర్పాటుచేసెను. ఈ యేర్పాటు చెల్లుచున్నది.

(3.) ఒక ఆస్తిదారుడు వ్రాసిన ఉయిలులో తన యావదాస్తిని "బీ" యనువాడు అతని జీవితకాలమువరకు అనుభవించవలసినదనియు, "సీ" యను తన కుమార్తెకు పుత్రుడు కలిగిన యెడల ఆ పుత్రునికి "బీ" అనంతరము సదరు ఆస్తి చేరవలసినదనియు, ఏర్పాటు చేయబడి యున్నది. ఆస్తిదారుని మరణకాలము నందు "సీ" యను ఆపెకు కుమారుడు కలిగియుండలేదు, గర్భగతుడుగానైనను ఉండలేదు. అటుపిమ్మట "సీ" కి

పుత్రుడు జన్మించినను అతనికి సదరు ఉయిలువలన హక్కు కలుగజాలదు. (ఇ. లా. ది. 8 క. 837).

(4) ఒక ఆస్తిదారుడు తన యావదాస్తిని ఉయిలువలన "ఏ" "బీ" "సీ" "డీ" "ఈ" యను వారలకు అయిదుగురికి పంచిపెట్టి, వారిలో నెవరైనను పుత్రహీనుడుగా మృతిచెందిన యెడల, అతనివంతు భాగము తక్కిన నలుగురికి చెందవలసినదని షరతుచేసెను. "ఏ", "బీ", "సీ", "డి", "ఈ"-లు అయిదుగురును ఆస్తిదారుని మరణకాలమున జన్మించియుండిరి. పిమ్మట "ఏ" యనువాడు పుత్రహీనుడుగా మృతిచెందెను. అప్పుడు అతనివంతు భాగము తక్కిన నలుగురికి చేరును గాని, అతని భార్య, కుమార్తె, మొదలగు వారికి చేరజాలదని ప్రివీకౌన్సిలువారు తీరుమానించిరి. (6 మూ. ఇ. అ. 526; 9 మూ. ఇ అ. 123. చూడు 12 మూ. ఇ. అ. 48; ఇ. లా. రి. 23 క. 563; 24 క. 406; 19 మ. 110).

(5.) ముందు "ఏ" యనువానికి, పిమ్మట "బీ" యనువానికి, పిమ్మట "సీ" యనువానికి, అటు పిమ్మట "సీ" యనువాని జ్యేష్ఠ కుమారునకు, అటు పిమ్మట అతని జ్యేష్ఠ కుమారునకు-ఈ ప్రకారముగా ఆస్తి చేరవలసినదని ఉయిలులో ఏర్పాటు చేయబడి యున్న యెడల, అది చెల్లక, పై వారిలో ఎవరెవరు ఉయిలుదారుని మరణకాలమునందు జన్మించి, లేక, గర్భగతులై యుందురో వారికి మాత్రమే ఆస్తియందు హక్కు కలుగుచున్నది.

(6) ఒక ఆస్తిదారుడు తన ఆస్తిని "ఏ", "బీ", "సీ," "డీ" లకు ఉయిలు మూలముగా పంచిపెట్టి, వారిలో నెవరైనను పుత్రహీనుడుగా మృతిచెందిన యెడల అతనివంతు భాగము తక్కినవారికి చెందవలసినదనియు, మరియు వారి కుమారులలో

గాని మనుమలలోగాని మునిమనుమలలోగాని యెవరైనను పుత్రహీనుడుగా మృతిచెందిన యెడల అతనినంతు ఆస్తి అతనిభార్యకుగాని కుమార్తెలకుగాని చేరక తక్కిన భాగములవారికి చేరవలసినదనియు - ఈ ప్రకారము షరతులు సర్పాటు చేసినయెడల, సదరు ఆస్తిదారుని మరణ కాలమునందు జన్మించియుండు "ఏ", "బీ", "సీ", "డీ"ల విషయమై యేర్పరచిన షరతులు మాత్రమే చెల్లుచున్నవి. ధర్మశాస్త్రములయందు నియమింపబడియుండు వారసు పరంపరను సర్వకాలమును మార్చునట్టి షరతులు చెల్లజాలవు. (4 క. హై. 171, 212, 9 క. హై. 396 - "లాహోరు ఉయిలు కేసు"; ఇ. లా. రి. 6 క. 421; ఇ. లా. రి. 10 క. 952; ఇ. లా. రి. 7 క. 269; ఇ. లా. రి. 11 క. 684; ఇ. లా. రి. 16 క. 383).

(7.) పై ఉదాహరణములో తెలుపబడినవిగాక, మరియే వైనను "లా"కు విరుద్ధమయిన షరతులు ఉయిలులో ముఖ్యమయినవిగా చేర్చబడిన యెడల, అట్టి ఉయిలు చెల్లజాలదు. ఏలాగంటే—ఉయిలువల్ల ఇయ్యబడిన ఆస్తి స్త్రీలకుగాని స్వీకారపుత్రులకు గాని చెందగూడ దనియు, సదరు ఆస్తిని తాకట్టు పెట్టగూడదనియు, విక్రయించ గూడదనియు, విభాగించుకొనగూడదనియు, అప్పుల క్రిందగాని జీవనాంశముల క్రిందగాని పోనియ్యగూడదనియు, సదరు ఆస్తిని ఆదాయముతోగూడ సర్వకాలమును వృద్ధిపరచుచుండ వలసినదేగాని ఖర్చుచేయగూడదనియు, సదరు ఆస్తిని అనుభవించక పాడుపెట్టవలదనియు, ఇట్టి షరతులు చేర్చబడినయెడల ఉయిలు చెల్లనేరదు. (ఇ. లా. రి. 10 క. 952; ఇ. లా. రి. 9 మ. 499; ఇ. లా రి. 16 క. 383; ఇ. లా. రి. 17 మ. 150; ఇ. లా. రి. 19 మ. 501; 2 క. హై. 11, 25; 4 క. హై. 231, 265; ఇ. లా. రి. 7 క. 269; ఇ.

లా. రి. 11 క. 684; ఇ. లా. రి. 14 క. 222; ఇ. లా. రి. 24 క. 406; ఇ. లా. రి. 18 మ. 252; ఇ. లా. రి. 28 మ. 363; ఇ. లా. రి. 34 క. 5; 8 క. హై. 400; ఇ. లా. రి. 8 క. 378; 14 క. హై. 175; ఇ. లా. రి. 5 క. 438; ఇ. లా. రి. 16 క. 71; ఇ. లా. రి. 1 క. 104; ఇ. లా. రి. 6 క. 106; 8 సుప్రీ. ఇ. అ. 66, 76). 1882 సం॥ 4 నెం॥ ట్రాంసుఫరు ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు 10, 11 సెక్షనులుగూడ చూడవలసినది.

(8.) మైనర్లకు ఉయిలుమూలముగా ఆస్తి యిచ్చినప్పుడు, సదరు ఆస్తిని వారు ఫలానా ప్రకారముగా అనుభవించవలసినదని గాని యింతమాత్రమే ఖర్చు చేసికొనవచ్చునని గాని యేర్పాటు చేసినయెడల, అట్టి యేర్పాటు వారి మైనారిటీ గడచు వరకు మాత్రమే చెల్లునుగాని, యుక్తవయస్సు వచ్చిన వెనుక చెల్లనేరదు. (ఇ. లా. రి. 1 క. 104; 8 క. హై. 400; ఇ. లా. రి. 8 క. 378; ఇ. లా. రి. 24 క. 44; ఇ. లా. రి. 13 బొం. 463; ఇ. లా. రి. 26 బొం. 319; ఇ. లా. రి. 29 బొం. 351).

(9.) ఒక ఉయిలుదారుడు తన యావత్తు స్థిరాస్తికిని ట్రస్టీలనేర్పఱచి, దానియొక్క ఆదాయమును తనభార్యకును కుమార్తెకును కుమార్తెబిడ్డలకును వారి జీవితకాలమువరకు ఉపయోగపరచ వలసినదనియు, అటుపిమ్మట ఆ బిడ్డల వారసులకు సదరు ఆస్తి చేరవలసినదనియు, తన కుమార్తెకు బిడ్డలు లేనిపక్షమున ఆమె యొక్కయు ఆమె తల్లి (ఉయిలుదారుని భార్య) యొక్కయు జీవితకాలములకు పిమ్మట సదరు ఆస్తి యావత్తును తన కుమార్తెయొక్క ఉయిలులో ఉదహరింపబడియుండువారికి చేరవలసినదనియు - ఇట్లు ఏర్పాటుచేసెను. ఈ యేర్పాటు చెల్లదగినదేయనియు, కట్టకడను ఆస్తిని పొందగలవారిని ముందెన్నడో నియమించునట్టి అధికారమును ఉయిలు దారుడు మఱియొకరి

కిచ్చుట చెల్లుననియు బొంబాయి హైకోర్టు వారి వలన తీరుమానింపబడి ఆతీరుమానము ప్రివీకౌన్సిలు వారివలన అంగీకరింపబడియున్నది. (ఇ. లా. రి. 19 బొం. 647; 21 బొం 709, ప్రి. కౌ.; 25 క. 405; 31 క. 166).

(10.) ఒక ఉయిలు దారుడు మృతి చెందునప్పుడు అతనిభార్యయును దత్తపుత్రుడును జీవించియుండిరి. ఆ దత్తపుత్రుడు మృతిచెందిన యెడల మరియొకనిని, అతడు మృతిచెందిన యెడల ఇంకొకనిని – ఇట్లు ఒకరి తర్వాత నొకరిని మూడుసార్లు స్వీకారముగొనుటకు అతడు భార్యకు అధికారమిచ్చి, యావదాస్తియు దత్తపుత్రునికి చేరవలసినదనియు, ఆతనిమరణానంతరము పునఃస్వీకారము చేసికొనువరకు ఆయాస్తి వారసు రీత్యా చెందినట్లే భార్యకు చెందవలసిన దనియు, స్వీకారము చేసికొన్న వెంటనే తిరుగా ఆస్తి యావత్తును స్వీకారపుత్రునకు చేరవలసినదనియు – ఏర్పాటు చేసెను. ఈ సందర్భమున దత్తపుత్రునికి చెందునట్టి ఆస్తి వితంతువువలె జీవితకాలము వరకు అనుభవించగూడిన హక్కుతో మాత్రమే చేరక సంపూర్ణ స్వాతంత్ర్యముతో చేరుచు మరణకాలమున తొలగి పోవుచున్నదని తీరుమానింపబడెను. (ఇ. లా. రి. 33 క. 1306).

(11.) భావికాలమున సంభవింపగల, లేక, జరుగగల యేదైనను విషయమును అనుసరించి ఉయిలు ఆస్తి యితరులకు చేరునట్లు ఏర్పాటు చేయబడినయెడల, ఈలోపల అది వారసుల స్వాధీనములోనికి చేరును. (ఇ. లా. రి. 32 క. 561).

ఉయిలు రద్దయిన యెడల ఆస్తి వారసులకు చెందును.

**219**. ఉయిలువలన ఆస్తి యియ్యబడినవాడు ఉయిలుదారుని మరణ కాలమునందు జన్మించి లేక గర్భగతుడై యుండని కారణము వల్లగాని, ఉయిలులో అక్రమమైన షరతులు చేర్చబడి యుండుటవల్లగాని, ఉయిలుయొక్క యేర్పాటు బొత్తిగా

అర్థము కాక అమలు జరుపుటకు వీలులేక యుండుటవల్ల గాని, మరియేకారణము వల్లగాని, ఉయిలు యావత్తు లేక దానిలో కొంతభాగము రద్దయిపోయిన యెడల, సదరు ఉయిలునకు లేక దానిలో రద్దయిన భాగమునకు సంబంధించిన ఆస్తి, ఉయిలుదారుని వారసులకు చెందుచున్నది. (2 క. హై. 38; 4 క. హై. 198; 9 క. హై. 407; ఇ. లా. రి. 3 క. 553; 14 క. 222; 20 బొం. 450; 22 బొం. 774). సదరు ఆస్తి, ఉయిలుదారుని వారసులకు చేరగూడదని ఉయిలులో వ్రాయబడి యుండినను గూడ, మీద తెలుపబడిన సందర్భములయందు వారసులకు చేరక తప్పదు. (4 క. హై. 187; 9 క. హై. 402; 14 క. హై. 175; ఇ. లా. రి. 2 బొం. 488). ఉయిలువలన ఆస్తి యియ్యబడువాడు ఉయిలుదారునికంటె ముందే మృతి చెందిన యెడల, సదరు ఆస్తి ఉయిలుదారునికే చెందుచున్నది.

"సత్కార్యముల నిమిత్తము" ఉపయోగపరచవలసినదని ఉయిలు మూలముగా సొత్తు ఇయ్యబడినప్పుడు, ఫలానా కార్యములని ఊహించుటకు వీలులేనందున అది చెల్ల నేరదని తీరుమానించిరి. (ఇ. లా. రి. 22 బొం. 774). "ధర్మము నిమిత్తము" అని ఉయిలు చేయబడినప్పుడు గూడ చెల్లదనియే తీరుమానించిరి. (ఇ. లా. రి. 23 బొం. 725). కాని, యిటీవల మదరాసు హైకోర్టు జడ్జి సర్ యస్ సుబ్రహ్మణ్యయ్యరు గారు భిన్నాభిప్రాయులై "ధర్మము" అను పదమువలన శాస్త్రోక్తములగు పుణ్యకార్యములు సూచింపబడునట్లు అర్థము చేసి, అట్టి సందర్భమున ఉయిలు చెల్లుటకు అభ్యంతరము లేదని తీరుమానించిరి. (ఇ. లా. రి. 30 మ. 340). "బీదబంధువులు, ఆశ్రితులు, నౌకర్లు," వీరికి కొంతసొత్తు ఉయిలు మూలకముగా ఇయ్యబడినప్పుడు ఫలానా

వారని స్పష్టముగా వివరించలేదను ఆక్షేపణయుండదు. (ఇ.లా. రి. 31 క. 166).

ఉయిలు వ్రాతమూలముగా నుండుట ఆవశ్యకముకాదు

**220**. ఉయిలు నోటిమాట మూలకముగానైనను వ్రాత మూలకముగానైనను ఉండవచ్చును. వ్రాతమూలకముగానుండినయెడల, తగాదా కలిగినప్పుడు రుజువు చేయుటకు సులభముగానుండును. (12 మూ. ఇ. అ. 2; ఇ లా. రి. 11 బొం. 89). వ్రాతమూలకముగా నుండునప్పుడు ఈ ప్రకారముగా వ్రాయవలెననిగాని స్టాంపు కాగితముమీద వ్రాయవలెననిగాని రిజిష్టరు చేయించవలెననిగాని సాక్షి దస్కతు లుండవలెననిగాని నిర్బంధము లేదు. సాక్షి దస్కతులు, రిజిస్ట్రేషను, మొదలగునవి రుజువు విషయములో ఉపయోగించును గాని ఉయిలు చెల్లుటకు అనావశ్యకము. ఒకడు తన ఆస్తి విషయమై ఫలానా విధముగా జరిగించవలసినదని తన అవసానకాలమునందు నోటిమాటమాత్రమే చెప్పి మృతిచెందినను, అట్టిమాటయే ఉయిలుగా భావింపబడును. జరిగించవలసిన పద్ధతులన్నియు చెప్పి వ్రాయించి, అట్లు వ్రాయించిన కాగితము మీద దస్కతు చేయక మునుపే ఆస్తిదారుడు మృతిచెందిన యెడల, ఆ కాగితమే ఉయిలుగా భావింపబడును. (3 స. 138; ఇ. లా. రి. 3 బొం. 7). అట్టి ఉయిలును కోర్టువారు నమ్ముదురా, లేదా - యను విషయము సాక్ష్యమునుబట్టి యుండును. తన మరణానంతరము తన ఆస్తి విషయమై జరుపవలసిన పద్ధతులను సర్కారువారికి అర్జీమూలముగా తెలియపరచి మృతిచెందిన ఒక ఆస్తిదారుని సొత్తు విషయములో, సదరు అర్జీయే అతని ఉయిలుగా భావింపవలసినదని తీరుమానింపబడెను. (14 క. హై. 226; 26 స. 55; ఇ. లా. రి. 7 అ. 163; ఇ. లా. రి. 18 క. 1; 26 ఇండియన్ అప్పీల్లు 194).

**221.** మదరాసు, బొంబయి - యీ రెండు పట్టణముల యందును బంగాళా రాజ్యమునందును ఉండు హిందువులలో ఏర్పడునట్టి ఉయిళ్లును, మఱియు సదరు ప్రదేశములయందలి స్థిరాస్తికి సంబంధించిన ఉయిళ్లును, వ్రాత మూలకముగా నుండి సాక్షి దస్కతులతో గూడియుండ వలయునని 1871 సం॥ 21 నెం॥ హిందూ ఉయిళ్ల శాసనమునందు చెప్పబడి యున్నది. (1881 సం॥ 5 నెం॥ ప్రొబేట్ అండ్ అడ్మినిస్ట్రేషన్ ఆక్టును, 1865 సం॥ 10 నెం॥ ఇండియన్ సక్సెషను ఆక్టునుగూడ చూడ వలసినది.) హిందూ ఉయిళ్ల చట్టము.

**222.** ఉయిలుదారుడు తన మరణకాలమువరకు తన ఉయిలులోని సంగతులు ఇతరులకు తెలియగూడదనియు సదరు ఉయిలును ఎవరును మార్చకుండ కాపాడవలెననియు కోరినయెడల, 1877 సం॥ 3 నెం॥ రిజిస్ట్రేషను ఆక్టు 42 సె॥ ప్రకారము, ఉయిలును ఒక కవరులో పెట్టి లకోటాచేసి రిజిస్ట్రారుగారి ఆఫీసులో అనామతుగా నుంచవచ్చును. వారు దానిని ఇనుపపెట్టెలో పెట్టి భద్రముగా కాపాడి ఉయిలుదారుడు మృతిచెందిన పిమ్మట తమ బుక్కులలో నమూదుచేసికొని, దరఖాస్తుదార్లకు నకలు ఇప్పింతురు. ఈ చెప్పబడిన తీరున అనామతుగా నుంచబడిన ఉయిలును, ఉయిలుదారుడు తన యిష్టము వచ్చినప్పుడు వాపసు తీసికొనవచ్చును. (సె. 44). రిజిస్ట్రేషను ఆక్టు, సె. 42, 44.

**223.** ఒకడే ఆస్తిదారునివలన రెండుమూడు ఉయిళ్లు వ్రాయబడియుండి వానికి పరస్పర భేదము కలిగియున్న పక్షమున, చిట్ట చివర వ్రాయబడిన ఉయిలు ప్రకారము అమలు జరిగింపబడును. ఉయిలు వ్రాసిన పిమ్మట, దానిని ఉయిలు దారుడు తన యిష్టమువచ్చినప్పుడు మార్చవచ్చును, రద్దుచేయవచ్చును. (ఇ. లా. రి. 3 క. 426; 25 మ. 678). వ్రాత మూలముగా రద్దు ఉయిలును మార్చుట - రద్దుపరచుట.

చేయవలెననిగాని, ఫలానా ప్రకారముగా రద్దు చేయవలెనని గాని, నిర్బంధములేదు. క్రమముగా వ్రాసి రిజిస్టరు చేయించిన ఉయిలునుగూడ నోటిమాటవల్ల రద్దుచేయవచ్చును. కాని, అట్టి సందర్భమునందు నోటిమాటల సాక్ష్యమును కోర్టువారు సులభముగా నమ్మజాలరు.

స్పష్టముగా రద్దుచేయక పోయినను, ఆయాసంగతి సందర్భములనుబట్టి ఉయిలు రద్దుచేయబడినట్లు ఊహించవచ్చును. (3 మదరాసు లాజర్నల్, 174). ఏలాగంటే — ఒకడు తన యావదాస్తియు మరియొకనికి చెందునట్లు ఉయిలువ్రాసి, కొంతకాలమునకు పిమ్మట దత్తు చేసికొనును, లేక, సదరు ఆస్తిని విక్రయించును. ఈ సందర్భముల యందు ఉయిలు రద్దు పరచబడినట్లు ఊహించవలయును.

ఉయిలుదారుని మరణానంతరము అతనికి పుత్రుడు కలిగినను కారణమువల్ల ఉయిలు రద్దుకాజాలదు. హిందువులఉయిల్లు, హిందూ ఉయిల్ల శాసనము 3 సె॥ కు లోబడి ఇండియన్ సక్సెషన్ అక్టు 57 సె॥ లో వివరింపబడిన విధమున మాత్రమే రద్దు చేయబడవలయును. (ఇ. లా. రి. 30 మ. 369. ఫుల్ బెంచ్).

ఉయిలునుదిద్దుట.

**224**. ఉయిలును తన స్వాధీనమునందుగలవాడు దానిలో ఏదైన విషయమును దిద్దినను, లేక, క్రొత్తసాక్షులను చేర్చినను, సదరు ఉయిలు పూర్తిగా రద్దుకాజాలదు. అట్లు దిద్దినవాడుమాత్రము దానివలన ఫలమును పొందజాలడు. (8 ఇండియన్ జూరిస్ట్, 190).

## ప్రకరణము 9.

—○:0:○—

### ధర్మకార్యములు.

**225** ధర్మకార్యములు, మతసంబంధమైన కార్యములు, భగవత్సంబంధమైన కార్యములు, దేవతావిగ్రహములు - వీని నిమిత్తము ఇయ్యబడుదానములు తప్పక చెల్లుననియు, అట్టిదానముల నిమిత్తము పిత్రార్జితపు సొత్తు నిచ్చినను ఆక్షేపణ లేదనియు, వాని విషయములో దానకాలముననే సొత్తును స్వాధీనపరచవలెనను నిర్బంధము లేనందున వానిని నెరవేర్చుటకు వారసులు బద్ధులుగా నుందురనియు, హిందూ ధర్మశాస్త్రములయందు చెప్పబడి యున్నది. తీర్పులుగూడ ఆ ప్రకారమే యేర్పడియున్నవి. (5 బం. స. తీ. 24; ఇ. లా. రి. 8 అ. 76; 1 బాఠో. 394, 405; 3 బాఠో. 314, 510). హిందువులలో ఉయిల్లు ప్రబలినపిమ్మట, ధర్మకార్యములు వగైరాల నిమిత్తము ఉయిలుమూలముగా సొత్తును ఇచ్చి పోవుట సాధారణమై కోర్టులలో అంగీకరింపబడుచు వచ్చెను. (ఎఫ్. మెక్ నాటన్ 335; 2 మూ. ఇ. అ. 390; 8 మూ. ఇ. అ. 66; 14 మూ. ఇ. అ. 289).

ధర్మకార్యములు, విగ్రహములు, వగైరా

**226.** మీద చెప్పబడిన ధర్మకార్యములు, విగ్రహములు వగైరాలకు సంబంధపడిన ఉయిల్లులో ఆస్తి విషయమై సర్వకాలమును చెల్లదగిన యేర్పాట్లు చేయబడియున్నను చెల్లుచున్నవి. (4 క. హై. 103, 231; 9 క. హై. 377; 15 క. హై. 176. చూడు - 14 క. హై. 175; ఇ. లా. రి. 3 బాం. 84). కాని, ధర్మకార్యములు వగైరాల మిషను బూని, ఆస్తిని ఎల్లప్పటికిని పరంపరగా వారసుల అనుభవములో నుంచినట్టి యేర్పాట్లు చే

శాశ్వతముగా చెల్లదగిన యేర్పాట్లు.

యబడినయెడల, అవి చెల్లక, సదరు ఆస్తి వారసుదార్లకు సంపూర్ణ స్వాతంత్ర్యముతో చెందుచున్నది. (ఇ. లా. రి. 4 మ. 200).

ఏదైనను దేవతా విగ్రహము నిమిత్తము దానము చేయబడినప్పుడు అట్టి దానకాలమునందు గాని, ఉయిలు మూలముగా దానము జరిగినప్పుడు ఉయిలుదారుని మరణకాలమునందుగాని, ఆ విగ్రహము ప్రతిష్ఠయై యుండవలయును ముందు ప్రతిష్ఠచేయబడగల విగ్రహమునకియ్యబడుదానములు చెల్లవు. (ఇ. లా. రి. 29 క. 260; 30 క. 521).

ధర్మకర్తలను ఏర్పరచుట.

**227.** విగ్రహములు మున్నగునవి స్వయముగా దానమును తీసికొనజాలవు గావున, ధర్మకర్తల నేర్పరచవచ్చును. లేక, దాతయే స్వయముగా వ్యవహరించి సదరు కార్యములను జరుపవచ్చును. ఈ రెండవ సందర్భమున కొంతకాలము ధర్మకార్యములను జరిపి పిమ్మట మానుకొన్నయెడల బలవంతపెట్టి జరిపించుటకు వీలులేదు. (1853 సం॥ మ. తీ. 104; 1854 సం॥ మ. తీ. 100; 1862 సం॥ మ. తీ. 90; 15 క. హై. 176, 167; ఇ. లా. రి. 3 క. 324; ఇ. లా. రి. 11 అ. 22-37). కాని యేవైనను ధర్మకార్యములు వగైరాలను జరుపునట్టి భారము ఆస్తిదారుడు తన తాలూకు కొంత ఆస్తిమీద స్పష్టముగా మోపి యేర్పాటు చేసియుండినయెడల, ధర్మకర్తల నేర్పరచక తానే వ్యవహరించుచున్నను, అతడుగాని అతని వారసులుగాని సదరు ధర్మకార్యములను జరుపక వదిలివేయుటకు వీలులేదు. (ఇ. లా. రి. 4 క. 56; ఇ. లా. రి. 12 మ. 391; 5 బం స. తీ. 268; 15 క. హై. 178; 10 స. 299; 13 స. 200; 8 మూ. ఇ. అ. 66; ఇ. లా. రి. 17 క. 498; 32 క. 129; 9 క. 75).

**228.** ధర్మకార్యములు, దేవస్థానములు, మొదలగువాని విషయమై యేర్పరచబడు ధర్మకర్త (ట్రస్టీ) లకు ధర్మద్రవ్యముమీద సంపూర్ణాధికారములేదు. ఆయా ధర్మములకు ఏర్పరచబడి, లేక, సంబంధపడియుండు కార్యముల నిమిత్తమే ధర్మద్రవ్యమును ట్రస్టీలు ఉపయోగపరచ వచ్చునుగాని, ఇతర కార్యముల నిమిత్తము, లేక స్వంతకార్యముల నిమిత్తము ఉపయోగించ గూడదు. మైనర్ల ఆస్తి విషయమై గార్డియనులకు ఎంత యధికారము కలదో, ధర్మద్రవ్యముమీద ధర్మకర్తలకును అంతే యధికారముకలదు. (14 క. హై. 450; ఇ. లా. రి. 2 క. 341; 15 స. 75, 339; 12 బొం. హై. 214; ఇ. లా. రి. 9 బొం. 422; ఇ. లా. రి. 15 క. 329; ఇ. లా. రి. 25 అ. 296; ఇ. లా. రి. 5 బొం. 393; ఇ. లా. రి. 6 బొం. 546; ఇ. లా. రి. 15 బొం. 625; ఇ. లా. రి. 27 మ. 466; ఇ. లా. రి. 16 మ. 67; ఇ. లా. రి. 18 మ. 359, ఇ. లా. రి. 16 మ. 490; 13 మూ. ఇ. అ. 270; 12 స. 299; 15 స. 228; 18 స. 439; 20 స. 471; 21 స. 41; ఇ. లా. రి. 19 బొం. 271; 22 క. 989; 13 మ. 277, 402; 18 మ. 266; 19 మ. 485; 28 మ. 391).

ధర్మకర్తల అధికారము.

**229.** దేవస్థానములు మొదలగువాని ధర్మకర్తలు మృతి చెందిన పక్షమున, దానశాసనము (ట్రస్టుడీడ్)నందు చెప్పబడి యుండు ప్రకారముగాని, దానశాసనము లేనియెడల ఆయా దేవస్థానములయందు పరంపరగా జరుగుచుండెడు పద్ధతులప్రకారముగాని, క్రొత్త ధర్మకర్త లేర్పడనలయును. (11 మూ. ఇ. అ. 428; ఇ. లా. రి. 9 క. 766; ఇ. లా. రి. 9 అ. 1; ఇ. లా. రి. 7 మ. 499; ఇ. లా. రి. 13 మ. 524). కొన్ని కొన్ని సందర్భములయందు ధర్మకార్యములను నెరవేర్చునట్టి షరతు ఆస్తిక

క్రొత్త ధర్మకర్తల యేర్పాటు.

చేర్చబడుటవలన, వారసులే పరంపరగా ధర్మకర్తలై యుం డురు. (1 బం. స. తీ. 180; 1853 సం॥ మ. తీ. 104; 18 స. 359; ఇ. లా. రి. 12 బొం. 331; ఇ. లా. రి. 23 మ. 271; 2 మ. హై. 19; 4 మ. హై. 23; 14 క. హై. 166; ఇ. లా. రి. 6 బొం. 298; ఇ. లా. రి. 3 మ 93; ఇ. లా. రి. 1 మ. 235; ఇ లా. రి. 6 మ. 270. చూడు 5 క. హై. 181; ఇ. లా. రి. 5 క. 228). మఠాధిపతులు తమయనంతర పీఠస్థులను తామే నియ మించుట వాడుకగా నున్నది. (1848 సం॥ బం. స. తీ. 253; 1858 సం॥ మ. తీ. 33; 11 మూ ఇ. అ. 405; ఇ. లా. రి. 11 బొం. 514; ఇ లా. రి. 16 మ. 490; ఇ. లా. రి. 24 మ. 219). మఠమునకు సంబంధించిన వారందరును చేరి నియమించుటయు కలదు. (1850 సం॥ బం. స. తీ. 250; 2 బం. స. తీ. 151; 19 స. 215; ఇ. లా. రి. 1 అ. 539).

ధర్మకర్తలపైని దావాలు.

**230.** దేవస్థానములు, ధర్మకార్యములు మొదలగు వాని నిమిత్తము ఏర్పరచబడిన సొత్తును ధర్మకర్తలు దుర్వినియోగ ము చేయుచున్న పక్షమున, లేక, సదరు ధర్మకార్యముల నిమిత్త ము వినియోగింపక యున్న పక్షమున, సదరు ధర్మములకు లేక దేవస్థానములకు ఏ విధముగా నైనను ఇలాకా గలవారు దావా తెచ్చి ధర్మద్రవ్యము క్రమముగా వినియోగింప బడునట్లు తీర్పు పొందవచ్చును. (11 స. 443; 12 స. 132; 23 స. 76; 26 స. 1; 4 మూ. ఇ. అ. 190; ఇ. లా. రి. 3 క. 563; ఇ. లా. రి. 5 క. 700; ఇ. లా. రి. 8 క. 788; ఇ. లా. రి. 3 బొం. 27; ఇ. లా. రి. 6 బొం. 122; ఇ. లా. రి. 12 బొం. 247; ఇ. లా. రి. 24 బొం. 50; ఇ. లా. రి. 28 మ. 319). ధర్మములనుగూర్చి అడ్వొకేట్ జనరల్ గారి అనుమతిని పొంది తెచ్చేదావాల విష యమై సివిల్ ప్రొసీడరు కోడ్డు 539 సె॥ చూడవలసినది.

దుర్నడత మొదలగు కారణములవలన ధర్మకర్తలను తొలగించుటకై దావా తేవచ్చును. (ఇ. లా. రి. 6 క. 11 ; ఇ. లా. రి. 23 మ. 483). 1863 సం॥ 23 నెం॥ దేవస్థానపు ఆక్టు చూడవలసినది.

---

# ప్రకరణము 10.

---:o:---

## జీవనాంశము.

జీవనాంశపు హక్కు.

**231.** సమష్టి కుటుంబమునందు కొందరు పురుషులు సమష్టి ఆస్తికి భాగస్థులుగా నుందురనియు, కొందరు జీవనాంశమునకు మాత్రము హక్కు కలిగి యుందురనియు, స్త్రీలు మితాక్షర ధర్మశాస్త్రము ప్రకారము జీవనాంశమునకు మాత్రమే హక్కు కలిగియుందురనియు, వెనుక చెప్పియుంటిమి. ఈ ప్రకరణములో - జీవనాంశపు హక్కుయొక్క స్వభావము, ఆ హక్కు ఏయే సందర్భములయందు ఎవరెవరికి కలిగియుండునో, లేక తప్పిపోవునో, యీ విషయమును, జీవనాంశముయొక్క మొత్తము వగైరా విషయములును - వివరింపబడును.

సమష్టి కుటుంబపు భాగస్థులు - భాగనర్హులు.

**232.** కుటుంబము సమష్టిగా నున్నంతవరకు ఆస్తిలో భాగస్థులుగానుండు వారి యొక్కయు, వారి భార్యలయొక్కయు, బిడ్డలయొక్కయు, జీవనాంశమును - అనగా, వారి అన్నవస్త్రములు వివాహాది కార్యములు మొదలగువాని నిమిత్తము కావలసిన ఖర్చులను-సమష్టి సొత్తునుండి యజమానుడు జరుపవలెను. (ఇ. లా. రి. 23 మ. 512; 26 మ. 197). కుష్ఠరోగము, పుట్టుకనుండియు పిచ్చి గ్రుడ్డితనము మూగతనము చెవుడు-ఇట్టి కారణములవల్ల సమష్టి ఆస్తికి భాగస్థులు కాజాలని పురుషుల యొక్కయు, వారి భార్యల యొక్కయు, బిడ్డల యొక్కయు, జీవనాంశమునుగూడ సమష్టి సొత్తు భరింపవలయును.

తలిదండ్రులు, కుమారులు, కుమార్తెలు.

**233.** పిత్రార్జితపుసొత్తు ఉన్నను లేకున్నను, తన శక్త్యానుసారముగా, వృద్ధులయిన తలిదండ్రులను, భార్యను, యుక్తవయస్సురాని మగబిడ్డలను, పెండ్లికాని ఆడుబిడ్డలను, వీరిని సం

రక్షించుట ప్రతి మనుష్యునకును విధాయకముగా నున్నది. (2 క. హై. 15; 1855 సం॥ మ. తీ. 238; ఇ. లా. రి. 8 మ. 236; ఇ. లా. రి. 2 బొం. 597; ఇ. లా. రి. 11 మ. 91). యుక్త వయస్సువచ్చిన కుమారులను సంరక్షించుటకు తండ్రి బద్ధుడు కాడు. కాని, పిత్రార్జితపు సొత్తునందు వారు భాగస్థులుగా నుందురు గనుక, వారి పోషణమున కావశ్యకమగు ఖర్చులను కుటుంబపు సొత్తు భరింపవలసి యుండును. మరియు, అవిభాజ్యమగు జమీందారీ వగైరా విషయములో ఆస్తి యావత్తును ఒకని స్వాధీనమందే యుండునప్పుడు, తక్కిన వారు జీవనాంశమునకు హక్కు కలిగియుందురు. (12 బొం. హై. 94; ఇ. లా. రి. 2 బొం. 346; 12 మూ. ఇ. అ. 203, 495; 7 మూ. ఇ. అ. 18; 9 మూ. ఇ. అ. 66; 12 మూ. ఇ. అ. 203; 2 క. హై. 15, 72; ఇ. లా. రి. 24 మ. 147). కుమారులకు పెండ్లి సేయుట తండ్రికి విధాయకము కాదు. (ఇ. లా. రి. 27 మ. 206).

**234.** తోడబుట్టిన పడుచులకు పెండ్లి చేయుటయు, అంత వరకు వారికి అన్నవస్త్రములిచ్చి సంరక్షణ చేయుటయు, సహోదరునికి విధాయకమని ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. (2 డబ్లియు మెక్. 113, 118; వె. బు. 234; 2 క. హై. 15; 1855 సం॥ మ. తీ. 238; ఇ. లా. రి. 2 బొం. 597). కాని, పిత్రార్జితపు సొత్తు బొత్తిగా లేనిపక్షమున, తోడబుట్టిన పడుచులకు జీవనాంశమిమ్మని సహోదరులను కోర్టువారు బలవంత పెట్టుదురని తోచదు. పెండ్లియైన పిమ్మటగూడ తోబుట్టినపడుచులకు భర్తయింట గతి లేనియెడల పుట్టింటనే సంరక్షణ జరుపుట సత్కార్యమని ధర్మ శాస్త్రములయందు చెప్పబడి యున్నది. (ఇ. లా. రి. 23 బొం. 291; 27 క. 555; 28 క. 278). తోబుట్టువులు.

సవతితల్లి - సవతి తోబుట్టువులు.

**235.** జీవనాంశము విషయములో సవతితల్లిని సవతితో బుట్టువులను, కన్నతల్లితోడను స్వంతతోబుట్టువులతోడను, సమానులనుగా భావించవలసినదని ధర్మశాస్త్రములయందు చెప్పబడి యున్నది. (2 డర్నియు మెక. 113, 118; వ. బు. 234, 245, 437). కాని, పిత్రార్జితపు సొత్తు లేనప్పుడు సవతితల్లిని కాపాడుటకు కుమారుడు బద్ధుడు కాడని తీరుమానింపబడి యున్నది. (ఇ. లా. రి. 9 బొం. 279; 13 క. 336).

అత్తగారు

**236.** అత్తగారికి - అనగా భార్య తల్లికి - వేరు గతి లేని యెడల, అల్లుడే అన్నవస్త్రములిచ్చి సంరక్షించవలసినదని ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. కాని, కోర్టువారు ఈ విధినిబట్టి అల్లుని నిర్బంధింపజాలరు.

వితంతువు.

**237.** సమష్టి కుటుంబపు భాగస్థుడు మృతిచెందినయెడల, సమష్టి సొత్తునుండి జీవనాంశమునకును కుటుంబ గృహమునందు నివాసమునకును, అతని వితంతువు హక్కు కలిగి యుండును. సదరు సమష్టిసొత్తు ఎవరి స్వాధీనములో నుండునో, వారుఆమెకు జీవనాంశమిచ్చుటకు జవాబుదార్లుగా నుందురు. భార్య రజస్వలకాకమునుపు భర్త మృతిచెందినను గూడ, ఆమెకు జీవనాంశ మియ్యక తప్పదు.

భర్తయింట కాపురము.

జీవనాంశమును పొందుటకై భర్తయొక్క కుటుంబ గృహమునందే అతని వితంతువు కాపురముండవలెనని నిర్బంధము లేదు. (12 క. హై. 238; 5 మ. హై. 150, ఇ. లా. రి 3 బొం. 372; ఇ. లా. రి. 6 మ. 85; ఇ. లా. రి. 14 బొం. 490; ఇ. లా. రి. 29 క. 557). కాని, సమష్టి ఆస్తి అతిస్వల్పముగాను ఆదాయము లేనిదిగాను ఉండుటవలన ప్రత్యేకముగా జీవనాంశ మిచ్చుటకు సాధ్యముకానప్పుడు, భర్తయొక్క గృహమును విడిచిపోయిన వితంతువునకు కోర్టువారు ప్రత్యేకముగా జీవ

నాంశ మిప్పించజాలరు. (ఇ. లా. రి. 3 బొం. 44 ; ఇ. లా. రి. 4 బొం. 261 ; ఇ. లా. రి. 22 బొం. 52 ; 1869 సం॥ మ. తీ. 59). భర్తయొక్క యింటనే వితంతువు కాపురముండునట్టి షరతుతో జీవనాంశ మేర్పరచి అతడు ఉయిలు చేసిపోయినయెడల, ఆమె ఆ యిల్లు విడిచిపోయి జీవనాంశమును కోరగూడదు. (1859 సం॥ బం. స. తీ. 457 ; ఎఫ్. మెక్. 62 ; 12 క. హై. 247 ; ఇ. లా. రి. 13 బొం. 218 ; ఇ. లా రి. 15 బొం. 236). భర్త యింటనే వితంతువు కాపుర ముండునపుడు ఆమెకు ఏర్పరచిన స్థలమునందు కాపుర ముండవలసినదే గాని, ఫలానా భాగముగాని యిల్లుగాని తన కియ్యవలసినదని ఆమె కోరగూడదు. (4 అ. హై. 153). ప్రత్యేకపు జీవనాంశమును కోరినయెడల, కుటుంబ గృహమునందు కాపుర ముండుటగూడ కోరుటకువీలు లేదు. (1 మై. 58).

వ్యభిచారిణిగా సంచరించుచుండు వితంతువునకు జీవనాంశపు హక్కు లేదు. (1 మ. హై. 373; 2 మ. హై. 337; 5 మ. హై. 160 ; 4 మ. హై. 185 ; 13 క. హై. 72, 88 ; ఇ. లా. రి. 9 బొం. 108). జీవనాంశము విషయమై వితంతువు కోర్టుమూలముగా డిక్రీ పొందిన పిమ్మట, ఆమె వ్యభిచారిణిగా సంచరించిన యెడల సదరు జీవనాంశము పొట్టకూటికి మాత్రమే అయ్యెండు సందర్భములో నిలుపుదల చేయబడదని ఒక కేసులో బొంబయి హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 1 బొం. 559 ; చూడు, ఇ. లా. రి. 17 క. 674) - కాని, దరిమిలాను మరికొన్ని కేసులలో వ్యభిచార ప్రవర్తనమువల్ల జీవనాంశపు డిక్రీయొక్క అమలు నిలుపుదల చేయబడునని తీరుమానింపబడెను. (ఇ. లా. రి. 7 బొం. 84 ; 9 బొం. 108 ; 17 మ. 392 ; 19 మ. 6 ; 15 అ. 382. చూడు, 12 బొం. 26) సదరు జీవనాంశము ఏదైనా రాజీవల్లగ్గె వ్యభిచారము.

రా ఒడంబడికవల్ల ఏర్పడి యుండునప్పుడు, వ్యభిచార ప్రవర్తన సంబంధమైన ఆక్షేపణము చేయగూడదు. (ఇ. లా. రి. 26 అ. 321).

ప్రత్యేక కాపురము.

తగిన కారణములేక భర్తను వదిలిపెట్టి ప్రత్యేకముగా కాపురము చేయుచుండిన భార్య, భర్త మృతిచెందిన పిమ్మట మామగారి స్వాధీనములోనుండు పిత్రార్జితపు సొత్తునుండి జీవనాంశము ను కోరవచ్చును. వ్యభిచార ప్రవర్తనము లేనియెడల మాత్రమే ఆమెకు ఈ హక్కు నిలిచియుండును. కాని, అట్టి సందర్భమున ఆమెకిప్పించునట్టి జీవనాంశముయొక్క మొత్తమును నిర్ణయించుటలో, ఆమె భర్తను వదిలిపెట్టిన విషయమును కోర్టువారు ఆలోచనలోనికి తీసికొందురు. (ఇ. లా. రి. 31 మ. 338).

పిత్రార్జితపు సొత్తుగాని స్వార్జితపు సొత్తుగాని లేని వాని వితంతువు.

ఎంతమాత్రమును పిత్రార్జితపు సొత్తుగాని స్వార్జితపు సొత్తుగాని లేకుండ మృతిచెందినవాని వితంతువునకును, విభక్తుడుగా మృతిచెందినవాని వితంతువునకును, ఆమె మామగారు, బావ, మరదులు మొదలగువారు జీవనాంశమిచ్చుటకు బద్ధులుకారని మదరాసు తీర్పులవల్ల ఏర్పడుచున్నది. (1858 సం॥ మ. తీ. 225; 1859 సం॥ మ. తీ. 5, 265, 272; ఇ. లా. రి. 11 మ. 191. కాని, ఇ. లా. రి. 22 మ. 305 లో ఈ తీర్పులు సంశయింపబడెను). బొంబయి హైకోర్టువారుగూడ భర్తయొక్క సొత్తు చెందియుండుటను బట్టియే జీవనాంశపుహక్కు ఏర్పడునని తీరుమానించిరి. (2 డబ్లియు మెక్. 119; 9 బొం. హై. 283). ఆలాగే కలకత్తాలోను అలహాబాదులోను మైసూరులోను తీరుమానింపబడెను. (24 స. 274; 5. మై. 219; 7 అ. హై. 26; 2 క. హై. 15; ఇ. లా. రి. 6 క. 36; ఇ. లా. రి. 2 బొం. 573, 632; ఇ. లా. రి. 7 బొం. 127; ఇ. లా. రి. 8 బొం. 15; మూడు- ఇ. లా. రి. 11 బొం. 199; 23 బొం. 608; 29 క. 570; 25

బొం. 263). ఒక కేసులో అలహాబాదు హైకోర్టువారు, మామ గారి స్వార్జితపు సొత్తునుండి జీవనాంశమును కోరుటకు కోడ లికి హక్కు లేకున్నను, ఆమెకు అన్నవస్త్రలిచ్చి సంరక్షించుట మామగారికి ధర్మమయ్యున్నందున, అతని స్వార్జితపు సొత్తు త క్కిన కుమారులకు చేరినప్పుడు, దానిలోనుండి ఆమెకు జీవనాంశ మిచ్చుటకు వారు బద్ధులుగా నుందురని తీర్మానించిరి. (ఇ. లా. రి. 11 అ. 194; 17 క. 373; 22 క. 410; 22 మ. 303).

**238.** వ్యభిచార సంబంధము కలిగియుండునంత మాత్ర ముచేత నే ఏ స్త్రీకిగాని జీవనాంశ మియ్యవలసిన విధి యేర్పడదు. కాని, స్థిరముగా నుంచుకొనియుండు లంజకు జీవనాంశ మియ్య వలయును. (10 బొం. హై. 381; 12 బొం. హై. 229; 8 మ. హై. 144; చూడు, ఇ. లా. రి. 23 మ. 282; 26 బొం. 163). మరియు, అట్టి లంజకు పుట్టిన కుమారులను గూడ సంరక్షించు టయు విధాయకము. (2 మ. హై. 293; 12 మూ. ఇ. అ. 203; 2 క. హై. 15; 7 మూ. ఇ. అ. 18; ఇ. లా. రి. 1 బొం. 97; ఇ. లా. రి. 1 మ. 306; ఇ. లా. రి. 8 మ. 325; ఇ. లా. రి. 6 అ. 329; ఇ. లా. రి. 17 మ. 160, ఇ. లా. రి. 27 మ. 32). లంజ కుమారుల కుమాళ్లను సంరక్షించునట్టి విధి లేదు. (ఇ. లా. రి. 18 అ. 253; 22 అ. 191). లంజయొక్క కూతుళ్లను సంరక్షించు నట్టి విధియు లేదు. (ఇ. లా. రి. 18 బొం. 183). లంజ, లంజబిడ్డలు

**239.** వివాహబంధ మేర్పడినది మొదలు, భార్యయొక్క సంరక్షణ భర్తకు చేరుచున్నది కాబట్టి, ఆమె రజస్వలకాక పూ ర్వము పుట్టింటనే యుండునప్పుడు, ఆమె సంరక్షణ నిమిత్తముకా వలసిన ద్రవ్యము ఇమ్మని ఆమె తలిదండ్రులు పేదరికమువల్లగాని మరియే కారణమువల్లగాని భర్తను కోరినయెడల, ఇచ్చుటకు భర్త బద్ధుడుగా నుండును. (1858 సం॥ మ. తీ. 154). రజస్వ భార్య.

లానంతరము భర్త యింటనుండి అతనితో గూడ సంసారముచే యుట భార్యకు విధాయకము. కాబట్టి, తగిన కారణము లేకుండ భర్తను విడిచిపెట్టి, పుట్టింటగాని మరియొకచోటగాని ఆపె ప్రత్యేకముగా కాపురము చేయుచున్న యెడల, జీవనాంశమునకు హక్కు కలిగి యుండదు. (ఇ. లా. రి. 2 బొం. 634. వెనుక 42-వ పేరా చూడవలసినది). భర్త తిట్టెననిగాని కొట్టెననిగాని కోపించుకొనెననిగాని రెండవవివాహము చేసికొనెననిగాని లంజను ఉంచుకొనెననిగాని - యీ కారణములవల్ల అతనిని వదిలిపెట్టి వేరుగా కాపురమున్నను, భార్యకు జీవనాంశ మిప్పించ బడదు. (ఇ. లా. రి. 4 అ. 374; 1 మ. హై. 375; 1 మ. తీ. 366; ఇ. లా. రి. 17 మ. 260; 20 మ. 470. వెనుక 40-వ పేరా చూడవలసినది). మరియు, వ్యభిచార వృత్తియందు సంచరించు భార్యకు జీవనాంశపు హక్కు లేదు. (1 మ. హై. 372). కాని, పిమ్మట వ్యభిచారవృత్తి మానియున్న యెడల, ఆపెపై భర్త కనికరించి పొట్టకూటికి గతి చూపవలసినదని ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. అట్టి సందర్భమున భార్యను బొత్తిగా నిరాధారురాలనుచేసి వదిలిపెట్ట గూడదని కొన్ని తీరుమానముల వలన గూడ కన్పట్టుచున్నది. (7 బం. స. తీ. 144; 2 మ. హై. 337; 1 బొం. హై. 560; ఇ లా. రి. 7 బొం. 84; ఇ. లా. రి. 17 క. 679).

మేజిస్ట్రేటువారి ద్వారా భార్య జీవనాంశమును పొందుట.

**240.** ఎవరైనను తన భార్యను ఈమురాని బిడ్డలను సంరక్షణచేయక వదిలివేసిన యెడల, అతని భార్య జీవనాంశము నిమిత్తము సివిల్ కోర్టులో దావా తెచ్చుటకు బదులుగా, 1-వ క్లాసు మేజిస్ట్రేటువారివద్ద పిటిషను (అర్జీ) దాఖలు చేసినయెడల, వారు విచారణచేసి, భర్తయొక్క స్థితిగతుల ననుసరించి నెల 1 కి రూ. 50 లు మించకుండ జీవనాంశ మిచ్చునట్లు ఉ

త్తరువు చేయగలరు. అట్టి ఉత్తరువు ప్రకారము భర్త జీవనాంశ మియ్యనియెడల, అతనిని ఖయిదు శిక్షకు లోబరచి స్వాధీనపర్చు తురు. కోర్టు ఖర్చులకు చేతిలో సొమ్ములేక కష్టపడుచుండు భార్యలు సులభముగా జీవనాంశమును పొందుటకు ఇదే మంచి ఉపాయము. వ్యభిచార వృత్తియందు సంచరించుచుండు భార్యకును, నిష్కారణముగా భర్తను వదిలివేసియుండు భార్యకును, భర్తవద్ద నుండుటకు నిష్కారణముగా నిరాకరించు భార్యకును, మేజిస్ట్రేటువారు జీవనాంశ మిప్పించజాలరు. మరియు, జీవనాంశము నిమిత్తము మేజిస్ట్రేటువారు ఉత్తరువు చేసినపిమ్మట భార్య వ్యభిచారిణిగా సంచరించుచున్నట్లు రుజువు చేయబడిన యెడల, సదరు ఉత్తరువు రద్దుచేయబడును. (క్రిమినల్ ప్రొసీడరుకోడు, సె. 488-490).

మేజిస్ట్రేటువారు ఎట్టి ఉత్తరువు చేసినను, సివిల్ కోర్టులో క్రమముగా దావా తెచ్చి జీవనాంశమును స్థాపించుకొనుటకు గాని రద్దుపరచుటకుగాని ఏ అభ్యంతరమును లేదు.

ఉంచుకొన్న లంజకూడ పైన చెప్పిన ప్రకారము మేజిస్ట్రేటు వారివద్ద అర్జీ యిచ్చుకొని జీవనాంశమును పొందవచ్చును.

**241.** భార్యకు జీవనాధారము లేకుండ యావదాస్తియును భర్త తన యిష్టమువచ్చిన వారికి దాన రూపకముగా లేక ఉయిలు మూలముగా ఇచ్చివేసిన యెడల, ఆమెయొక్క జీవనాంశపు హక్కునకు లోబడియే సదరు ఆస్తి వారికి చేరును. (8 క. హై. 228; 8 మూ. ఇ. అ. 66; ఇ. లా. రి. 5 బొం. 99; ఇ. లా. రి. 18 బొం. 452; ఇ. లా. రి. 2 అ. 315; ఇ. లా. రి. 23 అ. 86; 1860 సంII బం. స. తీ. 489; ఇ. లా. రి. 17 క. 886; ఇ. లా. రి. 8 బొం. 98; ఇ. లా. రి. 12 మ. 267; ఇ. లా. రి. 10 క. 638; ఎఫ్. మెక్. 92).

భార్యకు జీవనాధారము లేకుండ యావదాస్తిని దానము చేయుట, లేక, ఉయిలు చేయుట.

ఆ స్తిలోనుండి భార్యకుగాని కుమార్తెకుగాని మనోవర్తియియ్యగూడదని సూచనగా నైనను స్పష్టముగా నైనను ఉయిలులో వ్రాయబడినయెడల, అట్టి నిషేధము చెల్లనేరదు. భార్యయొక్క జీవనాంశపు హక్కు వివాహమువల్లను కుమార్తెయొక్క జీవనాంశపుహక్కు జననమువల్లను ఏర్పడి, తద్విషయమగు భారమును భర్త, లేక, తండ్రియగువాడు వహించుటయేగాక, అతని మరణానంతరము అతని ఆస్తి వహించునట్టి కారణమువల్ల, సదరు జీవనాంశములను యిష్టమువెంబడి వదిలించుకొనుటకు మార్గములేదు. అట్లు వదిలించుకొనగూడని హక్కులకు భంగము కలుగునట్లు ఆస్తిని పరాధీనము చేయుటకును వీలుండజాలదనుట స్పష్టము. (ఇ. లా. రి. 12 మ. 267).

కుటుంబపు ఆస్తి యొక్క విక్రయమును జీవనాంశపు హక్కు ఎప్పుడు బాధించును?

**242.** జీవనాంశముయొక్క భారము కుటుంబపు ఆస్తికి చేరినదయ్యును, డిక్రీవల్లగాని ఒడంబడికవల్లగాని కుటుంబపు ఆస్తితో అది జతపరచబడి యుండనియెడల, సదరు ఆస్తిని విక్రయము తాకట్టు వగైరా మార్గములలో పరాధీనము చేయుటకు ఆక్షేపణ యుండనేరదు. కాబట్టి, అట్టి సందర్భమున పరాధీనమును పొందినవాని స్వాధీనములో సదరు ఆస్తి జీవనాంశపు హక్కునకు లోబడియుండదు. (8 క. హై. 225; ఇ. లా. రి. 1 క. 365; 12 బొం. హై. 69; ఇ. లా. రి. 2 బొం. 494, 524; ఇ. లా. రి. 12 మ. 285; ఇ. లా. రి. 27 క. 194; ఇ. లా. రి. 11 క. 102; 20 స. 126; ఇ. లా. రి. 4 అ. 296; చూడు. ఇ. లా. రి. 10 మ. 283; 24 మ. 689; 19 మ. 271). డిక్రీమొదలగు వానివల్ల జీవనాంశపు హక్కు కుటుంబపు ఆస్తితో జతపరచబడి యుండునప్పుడు, సదరు ఆస్తిని క్రయమునకు తీసికొనువాడు జీవనాంశపు హక్కునకు లోబడియే తీసికొనును. (6 స.

253; ఇ. లా. రి. 2 అ. 162; ఇ. లా. రి. 18 బొం. 679; 4 బొం. హై. 73; 12 బొం. హై. 73).

జీవనాంశము లిచ్చుటకు పూర్వము ఋణములను తీర్చుట ముఖ్యముగా నున్నందున, వాని నిమిత్తము యావదాస్తిని విక్రయించినను, అది జీవనాంశములకు లోబడి యుండదు. (ఇ. లా. రి. 2 మ. 126; ఇ. లా. రి. 1 క. 365, 470; ఇ. లా. రి. 2 బొం. 494; ఇ. లా. రి. 4 అ. 296; ఇ. లా. రి. 5 అ. 367).

**243**. జీవనాంశముల భారమును తప్పించవలెనను ఉద్దేశముతో కుటుంబపు ఆస్తి విక్రయించ బడినప్పుడు, అట్టి ఉద్దేశమును ఎరిగియుండి యెవరైనను దానిని తీసికొన్న యెడల, సదరు జీవనాంశముల భారమునకు లోబడియే అది వారికిచేరును. పైన చెప్పబడిన ఉద్దేశమును ఎరుగక కొన్నవాడు, జీవనాంశములతో నిమిత్తము లేకుండ సదరు ఆస్తిని పొందును. (ఇ. లా. రి. 23 బొం. 342; 6 మై. 184; ఇ. లా. రి. 2 బొం. 494, 524; ఇ. లా. రి. 3 మ. 184; ఇ. లా. రి. 6 మ. 83; ఇ. లా. రి. 22 అ. 326; ఇ. లా. రి. 24 అ. 160). మీద చెప్పబడిన ఉద్దేశమును ఎరిగియుండినను ఎరుగకున్నను సరే, కుటుంబపు ఆస్తిని దానముగా పొందినవాడు, దానివలన జరుపబడవలయు జీవనాంశముల భారముతోడనే దానిని తీసికొనును. (8 క. హై. 288). 1882 సం॥4 నెం॥ట్రాంసుఫరు ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు 39 సెక్షనుగూడ ఇట్లే విధించుచున్నది. మొదట పరాధీనమును పొందినవాని స్వాధీనములోనుండి మరియొకరి స్వాధీనములోనికి ఆస్తి పోయిన యెడల, పైనచెప్పబడిన జవాబుదారీ యుండనేరదు. (ఇ. లా. రి. 5 అ. 389).

జీవనాంశమును పంగవరముట్టై విక్రయము వర్తిలా.

**244**. మృతిచెందిన భాగస్థుని వితంతువునకు జీవనాంశమిచ్చుట యెంత ముఖ్యమో నివాసమునకు గృహమిచ్చుటయు అం

కుటుంబపు గృహము వితంతువునకు నివాస గృహము.

తే ముఖ్యముగావున, ఆపెకు తగిన స్థల మేర్పాటు చేయకుండ కుటుంబ గృహము విక్రియింప బడిన యెడల, ఆపెను అచ్చటి నుండి వెడలగొట్టి సదరు గృహమును స్వాధీన పరచు కొనునట్టి హక్కు విక్రయము పొందినవానికి కలుగ నేరదు. (4 క. హై. 72; ఇ. లా. రి. 13 బొం. 101; ఇ. లా. రి. 1 అ. 262; ఇ. లా. రి. 3 అ. 353; 15 మై. 135, ఇ. లా. రి. 2 అ. 141; ఇ. లా. రి. 6 మ. 130; ఇ. లా. రి. 7 బొం. 282). సమష్టి అప్పుల నిమిత్తము కుటుంబ గృహము విక్రియింపబడిన యెడల, అచ్చటి నుండి వితంతువును వెడలగొట్టుటకు అభ్యంతర ముండదు. (ఇ. లా. రి. 12 మ. 260; 17 మై. 177; ఇ. లా. రి. 17 బొం. 398).

జీవనాంశము నిమిత్తము దావా.

**245.** జీవనాంశ మియ్యవలసినవారు ఇయ్యక నిరాకరించినయెడల, వారిమీద దావా తెచ్చి డిక్రీ పొందవచ్చును. లిమిటేషను (కాలదోషము) తగులక యుండు లోగడ జీవనాంశపు బాకీకూడ చేర్చి దావా తేవచ్చును. (1 బొం. హై. 194; 2 మ. హై. 36; 2 అ. హై. 170; 12 క. హై. 238; ఇ. లా. రి. 5 బొం. 99; కాని, ఇ. లా. రి. 3 బొం. 44 చూడుడు). మరియు అట్టి దావాలో, ప్రతివాది స్వాధీనములోనుండు ఏదైనను స్థిరాస్తిమీద సదరు జీవనాంశపు భారము మోపి డిక్రీయియ్యబడిన పిమ్మట సదరు సొత్తును ప్రతివాది విక్రయించినయెడల, జీవనాంశపు హక్కునకు లోబడియే విక్రయము చెల్లును. (ఇ. లా. రి. 2 బొం. 524; ఇ. లా. రి. 1 క. 365; ఇ. లా. రి. 12 మ. 285; ఇ. లా. రి. 10 మ. 283).

జీవనాంశము నిమిత్తము, నెలకు, లేక, సంవత్సరమునకు, ఇంత సొమ్ము ఇప్పించవలసినదని మాత్రము దావా తెచ్చి డిక్రీ పొందినపిమ్మట, సదరు జీవనాంశమునకు ఏదైనను స్థిరాస్తినిలో

బరచవలసినదని తిరుగా దావా తీసికొని రాగూడదు. (ఇ. లా. రి. 10 మ. 347).

కుటుంబపు ఆస్తిని స్వాధీనమందు కలిగియుండు వారిమీద జీవనాంశము నిమిత్తము దావా తెచ్చునప్పుడు, కుమార్తెల జీవనాంశము నిమిత్తమును వారి పెండ్లిండ్ల నిమిత్తమును కావలసిన సొమ్ముగూడ చేర్చి దావా తేవలయును. (ఇ. లా. రి. 6 అ. 263).

జీవనాంశము నిమిత్తము డిక్రీపొందబడిన తర్వాత, దానిక్రింద ఎప్పుడెప్పుడు బాకీ యేర్పడునో అప్పుడు దానినిమిత్తము కోర్టు ద్వారా అమలు జరిగించి వసూలు చేసికొనవచ్చును.

**246.** సాధారణముగా సమష్టి కుటుంబముయొక్క యావత్తు సొత్తునుండియు జీవనాంశమును కోరవచ్చును. కాని, కొన్ని సందర్భములయందు మాత్రము, అట్లు కోరుటకు వీలు లేదు. ఇది యేలాగనగా:—

జీవనాంశపు భారము వహించునట్టి సొత్తు.

మృతిచెందిన యొక ఆస్తిదారునికి ఇద్దరు భార్యలును, వారివలన కలిగిన చెరియొక కుమారుడును ఉండిరి. తండ్రి మృతిచెందిన పిమ్మట ఈ కుమారు లిద్దరును ఆస్తిని విభాగించుకొనిరి. అప్పుడు వారి తల్లుల జీవనాంశపు హక్కు, తమతమ కుమారులకు చేరిన ప్రత్యేక భాగములకు చేరియుండునుగాని, యావదాస్తికిని చేరియుండదు. (ఇ. లా. రి. 16 క. 758; 27 క. 551).

**247.** మితాక్షరధర్మశాస్త్రమును అనుసరించు అవిభక్త కుటుంబములో భాగస్థుడు కొంత స్వార్జితపుసొత్తును ఉంచి మృతిచెందినప్పుడు, దానివల్లనే అతనివితంతువుయొక్క జీవనాంశము నెరవేరవలెననియు, సదరు స్వార్జితపుసొత్తు జీవనాంశమునకు చాలకయుండిననేతప్ప చాలియుండు పక్షమునందు కుటుంబము తాలూకు పిత్రార్జితపు సొత్తునుండి జీవనాంశమును కోరుటకు

స్వార్జితమును ఉంచి భర్త మృతిచెందినప్పుడు, వితంతువునకు జీవనాంశము.

ఆపెకు హక్కు కలిగి యుండదనియు, అలహాబాదు హైకోర్టు వారు ఒక కేసులో తీరుమానించిరి. (4 అ. హై. 63).

జీవనాంశముయొక్క మొత్తమును నిర్ణయించుట.

**248.** జీవనాంశము యొక్క మొత్తమును నిర్ణయించుటలో, వారివారి యోగ్యత, స్థితిగతులు, ఆస్తియొక్క మొత్తము, ఆస్తివలనవచ్చు ఆదాయము, పరువుమర్యాదలకు తగినట్లు జీవించుటకు ఆవశ్యకమైన ఖర్చులు, ఈ మొదలగు అంశములు ఆలోచింపబడును. (ఇ. లా. రి. 12 అ. 558; ఇ. లా. రి. 22 క. 410; ఇ. లా. రి. 21 అ. 232; 9 క. హై. 413; 7 స. 286).

ఎంతమాత్రమును తప్పిదములేక నిష్కారణముగా వదిలిపెట్టబడిన భార్యకు భర్తయొక్క ఆస్తిలో మూడింట ఒక భాగము ఇయ్యవలయుననియు, సదరు భాగము జీవనమునకు చాలనియెడల జాస్తియియ్యవలయుననియు వ్యవహార మయూఖమునందు చెప్పబడియున్నది. బొంబాయి హైకోర్టువారును కొన్ని కేసులలో ఈ ప్రకారమే తీరుమానించియున్నారు. (1 బొరో. 63; 9 బొం. హై. 283). వితంతువునకిప్పించబడు జీవనాంశము ఆపె భర్త జీవించియున్న యెడల కుటుంబపు ఆస్తియొక్క ఆదాయమునుండి అతనివంతునకు ఎంత భాగము రాదగియుండునో దానిని మించియుండ జాలదు. (ఇ. లా. రి. 2 బొం. 639; ఇ. లా. రి, 11 బొం. 199).

వితంతువునకు జీవనాంశ మిప్పించునప్పుడు ఆపెయొక్క వస్త్రాభరణములు మొదలగు ఆదాయమురాని స్త్రీధనమును గణింపకూడదు. కాని, ఆదాయమువచ్చు భూస్థితి మొదలగు స్త్రీధన ముండినయెడల, సదరు ఆదాయమును లెక్కలోనికి తీసికొని జీవనాంశపు మొత్తమును తగ్గించ వచ్చును. (4 అ. హై. 63; 2 బొం. హై. 341; ఇ. లా. రి. 2 బొం. 584; 5 మై. 244; ఇ. లా. రి. 14 బొం. 490). వితంతువు యొక్క జీవనమునకు

చాలినంత సించను ఆపెకు సర్కారు వారివలన వచ్చుచుండున పుడు, వేరు జీవనాంశ మిప్పించబడదు. (1857 సం॥ను. స.తీ. 69).

జీవనాంశముయొక్క మొత్తమేర్పరచబడిన పిమ్మట కుటుంబముయొక్క ఆస్తిగాని దానివలనవచ్చు ఆదాయముగాని క్షీణించినయెడల, కోర్టులో అర్జీ దాఖలుచేసి దాని కనుగుణ్యాముగా జీవనాంశము యొక్క మొత్తమును తగ్గించవచ్చును. (ఇ. లా. రి. 1 అ. 594). కాని, సదరు కుటుంబపుఆస్తి, లేక దాని ఆదాయము, జీవనాంశమియ్యవలయు బాధ్యతను వహించియుండువారి తప్పిదమువల్ల క్షీణించిన యెడల, జీవనాంశము యొక్క మొత్తము తగ్గింపబడ నేరదు. (ఇ. లా. రి. 8 మ. 94; ఇ. లా. రి. 24 బొం. 386). అలాగుననే, కుటుంబముయొక్క ఆస్తిగాని ఆదాయముగాని హెచ్చినప్పుడు, కోర్టువారికి అర్జీయిచ్చుకొని జీవనాంశముయొక్క మొత్తమును హెచ్చించుకొనవచ్చును. (9 స. 152; ఇ. లా. రి. 22 మ. 175).

జీవనాంశముయొక్క మొత్తము ఈదేశములో కోర్టులవల్ల నిర్ణయమై యుండునప్పుడు దానిని అప్పీలులో ప్రివీకౌన్సిలువారు మార్చరు. (ఇ. లా. రి. 28 మ. 512).

**249**. ప్రతి సంవత్సరమును జీవనాంశ మిచ్చుటకు బదులుగా, ఒకటేసారి మొత్తముగా కొంత సొత్తు ఇచ్చి జీవనాంశపు హక్కు గల వారితో ఒడంబడిక చేసికొనవచ్చును. అట్టి ఒడంబడిక ప్రకార మిచ్చిన సొత్తు యావత్తును ఖర్చు చేసికొన్న యెడల, తిరుగా జీవనాంశమును కోరుటకు హక్కు కలిగియుండదు. (ఇ. లా. రి. 2 బొం. 573). జీవనాంశము నిమిత్తము మొత్తముగా కొంత సొత్తిచ్చుట

జీవనాంశము నిమిత్తము ఆదాయము మాత్రము ఖర్చు చేసికొనునట్టి షరతుమీాద వితంతువునకు ఏర్పడెసను ఆస్తి యియ్యబడినప్పుడు, ఆపె దానిని విక్రయించగూడదు. ఆపె మరణా

ఆపెకు హక్కు కలిగి యుండదనియు, అలహాబాదు హైకోర్టు వారు ఒక కేసులో తీరుమానించిరి. (4 అ. హై. 63).

జీవనాంశము యొక్క మొత్తమును నిర్ణయించుట.

**248.** జీవనాంశము యొక్క మొత్తమును నిర్ణయించుటలో, వారివారి యోగ్యత, స్థితిగతులు, ఆస్తియొక్క మొత్తము, ఆస్తివలనవచ్చు ఆదాయము, పరువుమర్యాదలకు తగినట్లు జీవించుటకు ఆవశ్యకమైన ఖర్చులు, ఈ మొదలగు అంశములు ఆలోచింపబడును. (ఇ. లా. రి. 12 అ. 558; ఇ. లా. రి. 22 క. 410; ఇ. లా. రి. 21 అ. 232; 9 క. హై. 413; 7 స. 286).

ఎంతమాత్రమును తప్పిదములేక నిష్కారణముగా వదిలిపెట్టబడిన భార్యకు భర్తయొక్క ఆస్తిలో మూడింట ఒక భాగము ఇయ్యవలయుననియు, సదరు భాగము జీవనమునకు చాలనియెడల జాస్తీయియ్యవలయుననియు వ్యవహార మయూఖమునందు చెప్పబడియున్నది. బొంబాయి హైకోర్టువారును కొన్ని కేసులలో ఈ ప్రకారమే తీరుమానించియున్నారు. (1 బారో. 63; 9 బొం. హై. 283). వితంతువునకిప్పించబడు జీవనాంశము ఆపె భర్త జీవించియున్న యెడల కుటుంబపు ఆస్తియొక్క ఆదాయమునుండి అతనివంతునకు ఎంత భాగము రాదగియుండునో దానిని మించియుండ జాలదు. (ఇ. లా. రి. 2 బొం. 639; ఇ. లా. రి, 11 బొం. 199).

వితంతువునకు జీవనాంశ మిప్పించునప్పుడు ఆపెయొక్క వస్త్రాభరణములు మొదలగు ఆదాయమురాని స్త్రీధనమును గణింపకూడదు. కాని, ఆదాయమువచ్చు భూస్థితి మొదలగు స్త్రీధన ముండినయెడల, సదరు ఆదాయమును లెక్కలోనికి తీసికొని జీవనాంశపు మొత్తమును తగ్గించ వచ్చును. (4 అ. హై. 63; 2 బొం. హై. 341; ఇ. లా. రి. 2 బొం. 584; 5 మై. 244; ఇ. లా. రి. 14 బొం. 490). వితంతువు యొక్క జీవనమునకు

చాలినంత సంచను ఆపెకు సర్కారు వారివలన వచ్చుచుండున పుడు, వేరు జీవనాంశ మిప్పించబడదు. (1857 సం॥ ను. స.తీ. 69).

జీవనాంశముయొక్క మొత్తమేర్పరచబడిన పిమ్మట కుటుంబముయొక్క ఆస్తిగాని దానివలనవచ్చు ఆదాయముగాని క్షీణించినయెడల, కోర్టులో అర్జీ దాఖలుచేసి దానికి ననుగుణ్యాముగా జీవనాంశము యొక్క మొత్తమును తగ్గించవచ్చును. (ఇ. లా. రి. 1 అ. 594). కాని, సదరు కుటుంబపుఆస్తి, లేక దాని ఆదాయము, జీవనాంశమియ్యవలయు బాధ్యతను వహించియుండువారి తప్పిదమువల్ల క్షీణించిన యెడల, జీవనాంశము యొక్క మొత్తము తగ్గింపబడ నేరదు. (ఇ. లా. రి. 8 మ. 94; ఇ. లా. రి. 24 బొం. 380). అలాగుననే, కుటుంబముయొక్క ఆస్తిగాని ఆదాయముగాని హెచ్చినప్పుడు, కోర్టువారికి అర్జీ యిచ్చుకొని జీవనాంశముయొక్క మొత్తమును హెచ్చించుకొనవచ్చును. (9 స. 152; ఇ. లా. రి. 22 మ. 175).

జీవనాంశముయొక్క మొత్తము ఈదేశములో కోర్టువల్ల నిర్ణయమై యుండునప్పుడు దానిని అప్పీలులో ప్రివీకౌన్సిలువారు మార్చరు. (ఇ. లా. రి. 28 మ. 512).

**249**. ప్రతి సంవత్సరమును జీవనాంశ మిచ్చుటకు బదులుగా, ఒకటేసారి మొత్తముగా కొంత సొత్తు ఇచ్చి జీవనాంశపు హక్కుగల వారితో ఒడంబడిక చేసికొనవచ్చును. అట్టి ఒడంబడిక ప్రకారమిచ్చిన సొత్తు యావత్తును ఖర్చు చేసికొన్న యెడల, తిరుగా జీవనాంశమును కోరుటకు హక్కు కలిగియుండదు. (ఇ. లా. రి. 2 బొం. 573). జీవనాంశము నిమిత్తము మొత్తముగా కొంత సొత్తిచ్చుట

జీవనాంశము నిమిత్తము ఆదాయము మాత్రము ఖర్చు చేసికొనునట్టి షరతుమీద వితంతువునకు స్థిరాస్తిని ఆ స్త్రీకియ్యబడినప్పుడు, ఆపె దానిని విక్రయించగూడదు. ఆపె మరణా

నంతరము సదరు ఆస్తి యిచ్చిన వారికే చేరును. (22 స. 225; ఇ. లా. రి. 4 మ. 193; ఇ. లా. రి. 5 క. 113; ఇ. లా. రి. 10 అ. 462; 1850 సం॥ మ. స. తీ. 160; 10 మూ. ఇ. అ. 490). కాని, జీవనాంశపు హక్కునకు బదులు సంపూర్ణ స్వాతంత్ర్యముతో ఏదైన కొంత ఆస్తి వితంతువునకు ఇయ్యబడినచో, దాని నామె యిచ్చవచ్చినట్లు అనుభవించవచ్చును, విక్రయించనువచ్చును. (9 మూ. ఇ. అ. 55; ఇ. లా. రి. 4 మ. 371).

జీవనాంశపు దావాకు లిమిటేషను, స్టాంపు.

**250.** జీవనాంశపు హక్కును స్థాపించుటకొరకు దావా సదరు హక్కు లేదని జీవనాంశ మియ్యవలసినవారు చెప్పినకాలము మొదలు 12 సంవత్సరములలోగా తీసికొని రావలయును. (1877 సం॥ 15 నెం॥ లిమిటేషను ఆక్టు, 1 షెడ్యూల్ 129 ఆర్టికిల్). లోగడ జీవనాంశమునుకూడ చేర్చి దావా తెచ్చినప్పుడు, 12 సం॥ లకు లోపుగా నుండు కాలమునకు రావలసిన జీవనాంశపు మొత్తము మాత్రమే చేర్చవచ్చును. (128 ఆర్టికిల్).

జీవనాంశపు దావాలకు, 10 సం॥ ల జీవనాంశపు మొత్తము మీద స్టాంపు డ్యూటీ పెట్టవలెను. (కోర్టుఫీసు ఆక్టు సె. 7.).

జీవనాంశపు హక్కుయొక్క పరాధీనము, జప్తు.

**251.** జీవనాంశపుహక్కు శరీర సంరక్షణార్థ మేర్పడినది కాబట్టి, దానిని విక్రయము తాకట్టు వగైరా మార్గముల పరాధీనము చేయుటకు వీలులేదు. మరియు, జీవనాంశపు హక్కు డిక్రీ అమలులో జప్తు కాబడనేరదు. (5 స. 111; 8 స. 41).

జీవనాంశపు డిక్రి క్రింద ముందుకాలమునకు రాదగిన సొమ్మును అప్పులవాండ్రు జప్తు చేయించుటకు వీలులేదు. (సివిల్ ప్రొసీడరు కోడ్డు, 266 సె.). కాని, లోగడ జీవనాంశము నిమిత్తము రావలసియుండు బాకీ సొమ్మును జప్తు చేయించవచ్చును. (3 హైకోర్టు రిపోర్టులు, 207).

# ప్రకరణము 11.

---

## విభాగము.

**252.** సమష్టి కుటుంబపు భాగస్థులు సమష్టిఆస్తిలో తను తను నంతు భాగములను పంచుకొని వేరుపడ వచ్చునని వెనుక చెప్పియుంటిమి. అట్టి వేరుపాటు విభాగమని చెప్పబడుచున్నది. ఈ ప్రకరణములో - ఏయే సొత్తులు విభాగయోగ్యములో ఏవి విభాగయోగ్యములు కావో, ఎవరెవరికి ఎంతవరకు విభాగపు హక్కు కలదో, ఏప్రకారము విభాగము జరిగించుకొనవలయునో, ఏయే అంశములు విభాగమును స్థాపించుటకు చాలియుండునో - యీ మొదలగు విషయములు వివరింపబడును. విభాగము.

**253.** పిత్రార్జితపు సొత్తు - అనగా, తండ్రి, తాత, ముత్తాత, వీరివద్దనుండి వారసు హక్కువలన, లేక ఉయిలువలన, లేక దానరూపకముగా వచ్చిన సొత్తు - మరియు సమష్టి భాగస్థులకు జాయింటు హక్కు కలిగియుండు ఇతర విధమయిన సొత్తు - ఇవి మాత్రమే విభాగయోగ్యములు. మితాక్షర ధర్మశాస్త్రము ప్రకారము పిత్రార్జితమునందు మూడు తరముల వరకుగల పుత్ర సంతతివారికి హక్కు వ్యాపించునని యిదివరకే చెప్పియుంటిమి. (146-వ పేరా. ఇ. లా. రి. 32 మ. 88; 27 మ. 300). ఏసొత్తులు విభాగ యోగ్యములు?

**254.** స్వార్జితపు సొత్తులు - అనగా, ఒకడు తన స్వప్రయోజకత్వము వలన సంపాదించిన, లేక, తండ్రి, తాత, ముత్తాత లవలన గాక, తల్లి, తల్లితల్లి, తల్లి తండ్రి, అన్నదమ్ములు, పినతండ్రి పెత్తండ్రులు, వీరి కొమరులు, ఈ మొదలగు వారివద్ద నుండి పొందిన సొత్తులు - విభాగ యోగ్యములు కావు. వాని ఏసొత్తులు అవిభాజ్యములు?- స్వార్జితము.

యందు పుత్రసంతతి వారి కట్టి హక్కు గాని కలుగదు. (146-వ పేరా. ఇ. లా. రి. 32 మ. 88; 27 మ. 300).

పురాతన జమీందారీ.

రాజ్యముగా భావింపబడి జ్యేష్ఠపుత్రునకుమాత్రమే పాలించునట్టి వాడుక యేర్పడియుండు పురాతనజమీందారీఆస్తి విభాగయోగ్యము కాదు. మరియు, అట్టి అవిభాజ్య జమీందారీ ఆస్తి నుండి జమీందారుడు చేయునట్టి ఆదాయమును, సదరు ఆదాయముతో అతడు సంపాదించునట్టి ఆస్తియును, అతని స్వాధీనములోనున్నంతవరకు అవిభాజ్యముగానే భావింపబడును - కాని, అతని యనంతరపాలకుని స్వాధీనములో నదియు ఆదాయము వగైరాలు పిత్రార్జితముగా భావింపబడి విభాగయోగ్యము లగుచున్నవి. (5 మ. హై. 31; 7 మూ. ఇ. అ. 476).

సర్కారువారి వలన ఇయ్యబడిన ఆస్తి.

గ్రామ మునసబులు, కరణములు, మణేగార్లు, మొదలగు సర్కారు నౌకర్లకు వారిఉద్యోగ సంబంధముగా ఏర్పరచబడియుండు ఇనాము భూములు వగైరాలు విభాగయోగ్యములు కావని మదరాసు కలకత్తా కోర్టులలో తీరుమానింపబడి యున్నది. (6 బం. స. తీ. 169; 6 మూ. ఇ. అ. 125; 2 మ. తీ. 85; ఇ. లా. రి. 7 మ. 236). కాని, బొంబాయి ప్రెసిడెన్సీలో, పాటేలు, దేశముఖ్, దేశపాండ్య మొదలగు గ్రామాధికార్లకు సర్కారువారి వలన ఏర్పరచబడిన ఇనాము భూములు వగైరాలు విభాగయోగ్యములుగా కొన్ని కేసులలో తీరుమానింపబడెను. (10 బొం. హై. 228; ఇ. లా. రి. 4 బొం. 494; ఇ. లా. రి. 10 బొం. 327, 598; ఇ. లా. రి. 27 బొం. 353; ఇ. లా. రి. 21 బొం. 458).

బిరుదుల నిమిత్తము ఏర్పాటు చేయబడిన ఆస్తి.

బిరుదులు మొదలగు రాజసమ్మానముల గౌరవమును కాపాడుటకై సర్కారువారి వలనగాని, సర్కారువారి మూలముగా గాని, యేర్పాటు చేయబడియుండు ఆస్తి విభాగయోగ్యము కాదు. (6 మూ. ఇ. అ. 426; ఇ. లా. రి. 7 మ. 191).

**255.** మితాక్షర ధర్మశాస్త్రము ప్రకారము తండ్రియొక్క స్థిరచర పిత్రార్జితపు సొత్తులయందు కుమారులకు హక్కు ఏర్పడుచున్నందున, సదరు సొత్తులను విభాగించ వలసినదని కోరుటకు వారు స్వతంత్రులుగా నుందురు. కూడదని ఆక్షేపించుటకు తండ్రికి హక్కు లేదు. కుమారుడు లేనప్పుడు మనుమడును, మనుమడు లేనప్పుడు ముని మనుమడును, పిత్రార్జితపు సొత్తు విషయమై విభాగమును కోరవచ్చును. (1 మ. హై. 77; ఇ. లా. రి. 1 మ 76; ఇ. లా. రి. 18 మ. 179; 12 క. హై. 373; ఇ. లా. రి. 1 అ. 159; ఇ లా. రి. 5 అ. 430; వె. బు. 365, 370, 373; 10 బొం. హై. 463; ఇ. లా. రి. 10 బొం, 529, 578; ఇ. లా. రి. 12 బొం. 280, 294). తండ్రియొక్క స్వార్జితపుసొత్తు విషయమై విభాగమును కోరుటకు కుమారుడు మొదలగు వారికి హక్కు లేదు.

కుమారులకు ఇష్టమున్నను లేకున్ననుసరే పిత్రార్జితపు సొత్తుయొక్క విభాగము విషయమై వారిని తండ్రి బలవంతపెట్టవచ్చును వారు సమ్మతింపక పోయినను అతడు విభాగము చేసి వేయ వచ్చును. (ఇ. లా. రి. 2 మ. 317, 321).

విభాగము విషయమైన హక్కు, కుమారుడు, మనుమడు, ముని మనుమడు – వీరివరకు మాత్రమే వ్యాపించును. మూడు తరములు దాటిన వాడైనందున మునిమనుమని కుమారునికి సదరు హక్కు లేదు. (వెనుక 142, 143, 144 పేరాలు చూడవలసినది). మరియు, కుమారుడు జీవించియుండగా మనుమడుగాని, మనుమడు జీవించియుండగా మునిమనుమడుగాని, అతని తండ్రి యిష్టమునకు విరోధముగా విభాగమును కోరుటకు, లేక, విభాగము నిమిత్తము తండ్రిని బలవంత పెట్టుటకు హక్కు కలిగియుండడు. (ఇ. లా. రి. 6 అ. 574; ఇ. లా. రి. 16 బొం.

కుమారుడు, మనుమడు, మునిమనుమడు – వీరికిగల విభాగపు హక్కు– మితాక్షర ప్రకారము.

29; కాని, చూడు ఇ. లా. రి. 5 అ. 430; ఇ. లా. రి. 31 క. 111).

దాయభాగము. బంగాళా దేశమునందు, తండ్రి జీవించియుండగా అతని స్వార్జితపు పిత్రార్జితపు సొత్తుల యందు కుమారులకు ఏవిధమయిన హక్కును కలుగజాలదు. కాబట్టి, అతని జీవితకాలములో విభాగమును కోరుటకు కుమారులకు హక్కు లేదు. కాని, తండ్రి మృతిచెందిన పిమ్మట కుమారులు, పినతండ్రి పెత్తండ్రులను విభాగము నిమిత్తము నిర్బంధించవచ్చును. (145-వ పేరా చూడు).

దాసీ పుత్రుల హక్కు. **256.** బ్రహ్మ క్షత్రియ వైశ్య జాతులలో దాసీ పుత్రులకు (లంజమొక్క కొడుకులకు) విభాగము కోరునట్టి హక్కుగాని, విభాగకాలమునందు భాగమును పొందునట్టి హక్కుగాని లేదు. (7 మూ. ఇ. అ. 18; 2 మ. హై. 369; 13 మూ. ఇ. అ. 497; ఇ. లా. రి. 22 అ. 191). శూద్రులలోగూడ దాసీ పుత్రులకు, తండ్రినిగాని తండ్రి మృతిచెందినయెడల పినతండ్రి పెత్తండ్రులనుగాని వారి కుమారులనుగాని విభాగము నిమిత్తము నిర్బంధించగల హక్కు లేదు. కాని, ఔరస సోదరులను విభాగము నిమిత్తము వారు బలవంత పెట్టవచ్చును. (ఇ. లా. రి. 4 బొం. 44, 45; ఇ. లా. రి. 11 క. 714; ఇ. లా. రి. 12 మ. 401; ఇ. లా. రి. 7 మ. 407; ఇ. లా. రి. 8 మ. 557).

తండ్రి సమ్మతించి విభాగము చేయునప్పుడు, దాసీ పుత్రులకు ఔరస పుత్రులతో సమానముగా నుండువరకు అతని యిష్టము వచ్చినంత భాగము నియ్యవచ్చుననియు, తండ్రి మృతిచెందిన పిమ్మట జరుగునట్టి విభాగములో, ఔరసపుత్రుని కియ్యదగిన భాగమునందు సగముభాగము దాసీపుత్రున కియ్యవలెననియు మితాక్షరమునందు చెప్పబడియున్నది. ఔరసపుత్రులతో తప్ప ఇతరులతో విభాగము జరిగినప్పుడు, దాసీ పుత్రునకు తక్కున భాగస్థు

లతో సమాన భాగమును పొందునని దాయభాగ దాయక్రమ సంగ్రహ గ్రంథములయందు చెప్పబడియున్నది. ఈ విషయము ముందటి ప్రకరణమునందు సవిస్తరముగా వివరింపబడును.

**257.** జాతిభ్రష్టుడు మృతప్రాయుడుగా భావింపబడుచున్నందున, అతనికి విభాగపుహక్కు తప్పిపోవునని హిందూ ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. కాని, జాతిభ్రష్టతవలన ఆస్తి హక్కులు నశింపజాలవని 1850 సం॥ 21 నెం॥ చట్టము ఏర్పాటు చేయబడి యున్నందున, జాతిభ్రష్టుడు విభాగమును కోరవచ్చును. జాతిభ్రష్టుని హక్కు.

**258.** తండ్రియును కుమారులును విభాగము చేసికొను కాలమునందు, తల్లి గర్భిణిగా నుండునెడల, ఆమె ప్రసవించువరకును విభాగము చేసికొనక నిలిపియుంచవలయుననియు - గర్భిణియని యెరుగక విభాగము చేసికొన్న పిమ్మట పుత్రుడు జన్మించిన యెడల, మొదటి విభాగమును రద్దుపరచి పునః విభాగము చేసికొనవలయుననియు - మితాక్షర, దాయభాగ, వీరమిత్రోదయాది గ్రంథములయందు చెప్పబడి యున్నది. తీరుమానములును ఆ ప్రకారముగానే యున్నవి. (4 మ. హై. 307 ; 2 క. హై. 118 - 121). విభాగానంతరము జన్మించిన పుత్రుని హక్కు.

తండ్రికిని కుమారులకును విభాగము జరిగిన పిమ్మట గర్భమునందై జన్మించు పుత్రుడు, తండ్రివంతు భాగమునందు మాత్రమే హక్కు కలిగియుండును. (ఇ. లా. రి. 4 అ. 427). తండ్రివంతును కేమాత్రమును ఉంచుకొనబడక యావదాస్తియు కుమారులకు పంచి పెట్టబడిన యెడల, వారందరును తమతమ భాగములనుండి కొంతకొంత విడదీసి క్రొత్తగా జన్మించిన వానికి భాగమును ఏర్పాటు చేయవలయునని చెప్పబడియున్నది. (1 డబ్లియు మెక్. 47 ; ఇ. లా. రి. 20 మ. 75).

ఒక తండ్రికి ముగ్గురు కుమారులుండిరి. వారిలో యిద్దరు మైనర్లుగానుండునప్పుడు విభాగము చేసికొనబడి ఆస్తిలో మూడింట ఒకపాలు తీసికొని పెద్దకుమారుడు వేరుపడెను. తక్కిన రెండు పాళ్లను మైనర్ల తరఫున తన స్వాధీనములో నుంచుకొని తండ్రియును మైనర్లును ఏకకుటుంబముగా నుండిరి. కొంతకాలమునకు పిమ్మట మరియొక పుత్రుడు జన్మించి యావత్తు ఆస్తిలో తనకు నాల్గవపాలు రావలయునని దావా తెచ్చెను. సదరు దావా పెద్ద కుమారుని మీద చెల్లదనియు వానితో ఏక కుటుంబముగానున్న తండ్రిమీదను తక్కినయిద్దరు కుమారులమీదను చెల్లుననియు బొంబాయి హైకోర్టువారు తీరుమానించిరి. పెద్దకుమారుడు తన వంతు భాగము తీసికొని కుటుంబము నుండి విడిపోయెనే గాని, తక్కినవారికి విభాగమే జరుగనట్లు భావించిరి. (ఇ. లా. రి. 23 బొం. 636).

మైనర్ల హక్కు.

**259**. మైనర్లవలన గాని మైనర్ల తరఫునగాని విభాగము నిమిత్తము దావా తీసికొని రాబడగూడదు. కాని, సమష్టి ఆస్తియందు వారికిగల భాగమునకు అపాయము సంభవించునట్లుగా నుండినయెడల, సదరు మైనర్ల శ్రేయస్సు కోరువారు వారికి గార్డియనులుగా నేర్పడి దావా తెచ్చి వారి భాగములను భద్రపరచవచ్చును. (1 మ. హై. 105; 3 మ. హై. 69, 94; 5 మ. హై. 193; ఇ. లా. రి. 8 క. 537; ఇ. లా. రి. 12 మ. 401; ఇ. లా. రి. 29 అ. 373; ఇ. లా. రి. 19 బొం. 99; కాని, చూడు 31 బొం. 373).

సమష్టి కుటుంబములో ఒక భాగస్థుడు మైనరుగా నున్నందువల్ల, తక్కినవారు విభాగమును కోరుటకుగాని జరిగించుకొనుటకుగాని అభ్యంతరము లేదు. (2 మ. హై. 182). కాని, అట్టి విభాగములో సదరు మైనరువంతు భాగమును న్యాయముగాను

క్రమముగాను ఏర్పాటుచేసి అతనికి యుక్తవయస్సు వచ్చేవరకు దానిని భద్రముగా కాపాడవలయును. (8 క. హై. 363). సదరు భాగమును ఏర్పరచుటలో అన్యాయముగా ఏదైనాగాని జరిగినట్లు కనుపడినప్పుడును, అది న్యాయముగా ఏర్పరచబడినదో లేదో, యీవిషయమును తెలిసికొనుటకు ఆవశ్యకమయిన లెక్కలు వగైరాలు లేకుండ విభాగము జరిగింపబడినప్పుడును, సదరు మైనరు యుక్తవయస్సు వచ్చిన తర్వాత దావా తెచ్చి విభాగమును రద్దుపరచవచ్చును. (2 మ. హై. 182; 4 బొం. హై. 159; 8 క. హై. 363; ఇ. లా. రి. 17 బొం. 271; 23 స. 68; ఇ. లా. రి. 19 బొం. 593; ఇ. లా. రి. 30 క. 752; ఇ. లా. రి. 29 అ. 37; చూడుము, ఇ. లా. రి. 31 క. 262; ఇ. లా. రి. 14 అ. 498; ఇ. లా. రి. 18 బొం. 197; ఇ. లా. రి. 19 బొం. 593).

**260.** సమష్టి కుటుంబపు భాగస్థులలో ఒకడు దేశాంతరగతుడుగా నుండినయెడల, అతనివంతు భాగమును న్యాయముగా ఏర్పరచి భద్రపరచి, తక్కిన వారు విభాగమును చేసికొనవచ్చును. (1 స్ట్రే. 206; 2 స్ట్రే. 341). దేశాంతర గతుడైన భాగస్థుని హక్కు అతని సంతతివారిలో ఏడుతరములవరకు చెల్లుగలదని ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. కాని, ఇప్పుడు, 1877 సం|| 15 నెం|| లిమిటేషను ఆక్టు ప్రకారము 12 సం||లలోపల దావా తీసికొని రావలయును. (2-వ షెడ్యూలు, 123, 127, 144). అలాగుననే ఒక భాగస్థునికి భాగమియ్యక, యావదాస్తిని తక్కిన భాగస్థులే విభాగించుకొన్నయెడల, అట్లు త్రోసివేయబడిన భాగస్థుడు, సదరు విభాగము సంగతి అతనికి తెలిసినది మొదలు, 12 సం||ల లోపల తనభాగము నిమిత్తము దావా తేవలెను. (ఆర్టికిల్ 127; ఇ. లా. రి. 3 క. 228).

దేశాంతరగతుడైన భాగస్థుని హక్కు.

వ్యాధిగ్రస్తుల హక్కు.

**261.** కుష్ఠరోగులు, నపుంసకులు, పిచ్చివాండ్రు, పుట్టుక మొదలు అనివార్యమగు గ్రుడ్డితనముగాని మూగతనముగాని చెవుడుగాని కలిగియుండువారు, కాలుసేతులులేని వికలాంగులు, సన్యాసాశ్రమము నవలంబించి లోకవ్యవహారమును విసర్జించిన వారు - ఇట్టి వారు జీవించియున్నను మృతతుల్యులుగా భావింపబడుటచేత విభాగపుహక్కు కలిగియుండరు. ఇతరులు విభాగించుకొన్న యెడల, వీరికి భాగమియ్యవలసిన పనిలేదు. వారి జీవనాంశమును మాత్రము ఏర్పాటు చేయవలెను. (ఇ. లా. ర. 8 క. 149).

వారి కుమారుల హక్కు.

మీద చెప్పబడిన వ్యాధిగ్రస్తులకు విభాగపు హక్కు లేకున్నను, వారికి కుమాళ్లుగాని మనుమలుగాని మునిమనుమలుగాని వ్యాధిగ్రస్తులు కానివారు ఉన్న యెడల, వీరు విభాగపుహక్కు కలిగియుందురు. కాని, మూడు తరములు దాటినవారుగా నుండగూడదు. ఇది యేలాగనగా:—ఈ ప్రక్కను కనుపరచబడి




నట్టి వంశవృక్షములో "ఈ" యనువాడు వ్యాధిగ్రస్తుడైన యెడల, అతడు మృతిచెందిన వాడుగా భావింపబడును. కాబట్టి, "ఎఫ్" అనువాడు "సీ" యనువానితో విభాగమును కోరవచ్చును. కాని, "ఈ" యనువాడుకూడ మృతిచెంది, "ఎఫ్" అనువాడు వ్యాధిగ్రస్తుడుగా నున్న యెడల, "జీ" యనువాడు మూడు తరములు దాటినవాడైనందున విభాగపు

హక్కు కలిగియుండదు. (13 మూ. ఇ. అ. 519; 2 క. న్యా. 115).

వ్యాధిగ్రస్తుల దత్తపుత్రులకు మీాద చెప్పబడిన తీరున హక్కు లేదు. (1857 సం॥ స. తీ. 270. వెనుక 55-వ పేరా చూడుడు.)

భాగస్థులలో నెవరైనను విభాగానంతరము వ్యాధిగ్రస్తులైన యెడల వారి భాగములకు బాధకము కలుగజాలదు. (1857 సం॥ స. తీ. 210).

**262.** వ్యాధిగ్రస్తులను వదిలిపెట్టి విభాగము జరిగించు కొనబడిన పిమ్మట, వారి వ్యాధి నివారణమైన యెడల, వారు విభాగానంతరము జన్మించిన పుత్రులవలెనే భాగమునకు అర్హులుగా నుందురని ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. ఈ విధియొక్క వ్యాప్తి క్రింది యుదాహరణములవల్ల తెలియగలదు. విభాగానంతరము వ్యాధి నివారణమగుట, [illegible], పుత్రు[illegible] జన్మించుట.

(1.) తండ్రియును కుమారులును విభాగము చేసికొన్నప్పుడు కుమారులలో నొకడు వ్యాధిగ్రస్తుడుగా నుండినందున అతనికి భాగమియ్య లేదు. పిమ్మట అతనికి వ్యాధి నివారణమైన యెడల, తండ్రికి చెందిన భాగమునందు మాత్రమే అతడు హక్కు కలిగి యుండును.

(2.) అన్నదమ్ములు విభాగించుకొన్నప్పుడు వారిలో నొకడు వ్యాధిగ్రస్తుడుగా నుండినందున, అతనికి భాగమియ్య లేదు. పిమ్మట, అతనికి వ్యాధి నివారణమైనయెడల, ధర్మశాస్త్రములలో చెప్పబడియుండు ప్రకారము అతడు తండ్రి మరణకాలమున గర్భమునందుండినట్టుగా భావింపబడవలెను. కాబట్టి, ముందటి విభాగమును రద్దుపరచి పునఃవిభాగమును జరిగించవలయును. కాని, యీ ప్రకారము చేసినచో, అనేకములగు చిక్కులు తటస్థించును గనుక, కోర్టువారు అంగీకరింతురని చెప్పుటకు వీలులేదు.

(3.) తండ్రియును కుమారులును విభాగముచేసి కొన్నప్పుడు కుమారులలో ఒకడు వ్యాధిగ్రస్తుడుగా నుండినందున అతనికి భాగమియ్యలేదు. పిమ్మట అతనికి వ్యాధి నివారణము కాలేదు గాని, పుత్రుడు జన్మించెను. ఇతడు విభాగ కాలమునందే గర్భగతుడుగా నుండినయెడల, భాగమునకు హక్కుదారుడగును. విభాగమునకు పిమ్మట గర్భగతుడై జన్మించినచో, తాతగారికి చెందిన భాగమునందు మాత్రమే అతడు హక్కు కల్గియుండును.

(4.) అన్నదమ్ములు విభాగించుకొన్నప్పుడు వారిలో నొకడు వ్యాధిగ్రస్తుడుగా నుండినందున అతనికి భాగమియ్యలేదు. పిమ్మట అతనికి వ్యాధి కుదురలేదుగాని, పుత్రుడు జన్మించెను. ఇతనికి భాగములేదు (2 క. హై. 118-121; ఇ. లా. రి. 9 మ. 64).

**263.** విభాగమును కోరునట్టి హక్కు ప్రథమతః సమష్టి కుటుంబపు భాగస్థులకే చెందినదయ్యెను, సదరు భాగస్థులలో ఒకనితాలూకు హక్కును, క్రయము, తాకట్టు, వగైరా మార్గముల వల్లగాని డిక్రీ వేలములోగాని ప్రాంసుఘము పొందినవాడు విభాగము నిమిత్తము దావా తేవచ్చును, అనగా, కుటుంబపు యావదాస్తిని విభాగించి తనకు రాగల భాగమును ఇప్పించవలసినదని దావా తేవచ్చును. తనకు రాగల భాగము మాత్రము ప్రత్యేకపరచి యిప్పించవలసినదని దావా తేగూడదు. (6 మూ. ఇ. అ. 539; ఇ. లా. రి. 3 క. 198; 3 క. హై. 14; 18 స. 23; 21 స. 190; 22 స. 116, 294; ఇ. లా. రి. 7 మ. 588; ఇ. లా. రి. 9 క. 580; ఇ. లా. రి. 10 క. 244; ఇ. లా. రి. 12 క. 209; ఇ. లా. రి. 25 మ. 690; చూడు, ఇ. లా. రి. 22 బొం. 297; ఇ. లా. రి. 23 బొం. 73). 192-వ పేరా చూడు.

కుటుంబముతో చేరనివారికిగల విభాగపు హక్కు.

సమష్టి కుటుంబపు భాగస్థునియొక్క హక్కును ఉయిలు మూలముగా, లేక, దానరూపకముగా పొందిననాడు విభాగము నిమిత్తము దావా తెచ్చుటకు హక్కు కలిగి యుండడు. (191, 192 పేరాలు).

**264.** పూర్వకాలమునందు పురుషులు విభాగము చేసికొనునప్పుడు, తల్లి, అవ్వ, కుమార్తె, భార్య మొదలగు స్త్రీలకు గూడ కొంతభాగ మిచ్చునట్టి యాచారముండెనని ధర్మశాస్త్రములవలన తెలియవచ్చుచున్నది. కాని, యిప్పుడట్టి యాచారము నశించినది. ఆస్తిదారునికి పుత్రసంతతి యుండునప్పుడు అన్ని సంప్రదాయముల ప్రకారమును సమష్టి కుటుంబపు స్త్రీలకు జీవనాంశపు హక్కు మాత్రమే కలిగియుండునుగాని విభాగపు హక్కు కలిగియుండదు. (2 డబ్లియు. మెక్. 65; ఎఫ్. మెక్. 45, 57; 1853 సం॥ మ. తీ. 61, ఇ. లా. రి. 6 మ. 130; ఇ లా. రి. 8 మ. 123; 9 క. 61; 12 క. వ్లి. 90, 373; ఇ. లా. రి. 5 క. 845; ఇ. లా. రి. 8 క. 17; ఇ. లా. రి. 12 క. 165; ఇ. లా. రి. 31 క. 262; కాని, చూడుము 2 బారో. 454; ఇ. లా. రి. 2 బొం. 494, 504; ఇ. లా. రి. 31 బొం. 54).

స్త్రీలకు భాగమీయుట.

ఆస్తిదారుని కుమారులు విభాగించుకొనునప్పుడు తల్లికి జీవనాంశము నిమిత్తము వారు తమతోపాటు ఒక భాగమియ్యవలయుననియు – ఆస్తిదారుని మనుమలు విభాగించుకొనునప్పుడు, తండ్రియొక్క తల్లికి జీవనాంశము నిమిత్తము వారు తమతో పాటు ఒకభాగ మియ్యవలయుననియు చెప్పుచున్నారు. (ఇ. లా. రి. 3 అ. 88; ఇ. లా. రి. 7 క. 191; ఇ. లా. రి. 8 క. 619; ఇ. లా. రి. 16 క. 758; ఇ. లా. రి. 31 క. 1065; 12 క. వ్లి. 385; ఎఫ్. మెక్. 29, 52, 64; ఇ. లా. రి. 3 క. 149; ఇ. లా. రి. 4 క. 756; ఇ. లా. రి. 13 క. 39, ఇ. లా. రి. 10 క. 1017).

దాయభాగ సంప్రదాయము.

తండ్రి మృతిచెందిన పిమ్మట అన్నదమ్ములు విభాగించుకొనునప్పుడు, పెండ్లికాని తోబుట్టువులకు వారి పెండ్లిండ్లు వగైరాల నిమిత్తము తమ భాగములో నాల్గవపాలు ఇయ్యవలయునని ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. కాని, సదరు నాల్గవ పాలనగా, వారి పెండ్లిండ్లు వగైరాల నిమిత్తము అవశ్యకమైనంత భాగమని ఇప్పుడు అర్థము చేయబడియున్నది. (ఎఫ్. మెక్. 55, 98; 1 డబ్లియు. మెక్. 50).

తల్లి సొత్తునకు తాము వారసులుగానుండు సందర్భమునందు ఆమె జీవించియుండగానే తమకు భాగము పంచిపెట్టుమని కోరుటకు కుమార్తెలకు హక్కు లేదు. (ఇ. లా. రి. 4 బొం. 545).

బంగాళా దేశములో సమష్టి కుటుంబపు భాగస్థుడు పుత్రహీనుడుగా మృతిచెందిన యెడల, అతనివంతు భాగమునకు పితంతువు హక్కుదారురాలగుచున్నది. కాబట్టి, ఆమె విభాగమును కోరవచ్చును. (3 మూ. ఇ. అ. 229, 241; ఇ. లా. రి. 2 క. 262; ఇ. లా. రి. 1 అ. 688; ఇ. లా. రి. 9 క. 244, 250). మరియు, ఆమెయొక్క హక్కును క్రాంనుఘను పొందినవాడు కూడ విభాగమును కోర వచ్చును. (ఇ. లా. రి. 9 క. 580). భర్త జీవించియుండగా విభాగమును కోరుటకుగాని, అతడు తన సంరక్షణ జరుపుచుండగా తన జీవనాంశము నిమిత్తము విభాగమును కోరుటకుగాని భార్యకు హక్కు లేదు. (ఇ. లా. రి. 31 క. 476).

మితాక్షర సంప్రదాయము.

మితాక్షర సంప్రదాయము ప్రకారము, సమష్టి కుటుంబపు భాగస్థునియొక్క భార్యకు జీవనాంశపు హక్కు మాత్రమే కలదుగాని, యే సందర్భమునందును విభాగమును కోరునట్టి హక్కు లేదు. భర్త మృతి చెందిన పిమ్మట కుమారులు విభాగించుకొనుటకు ఇష్టపడని యెడల, విభాగించుకొన వలసినదని వారిని బల

వంత పెట్టుటకు తల్లికి హక్కు లేదు. భర్త పుత్రహీనుడుగా మృతిచెందిన యెడల, అతనివంతు భాగమును తన కిష్టమైన తక్కిన భాగస్థులను కోరుటకు వితంతువునకు హక్కు లేదు.

**265.** కుమారులు ఎన్నటికిని విభాగము చేసికొనగూడదని గాని, కొంతకాలము వరకు విభాగము చేసికొనగూడదని గాని, తండ్రి ఉయిలు వగైరాలలో ఏర్పాటు చేసిపోయినయెడల, హిందూ ధర్మశాస్త్రముల ప్రకారము న్యాయమైన మార్గములయందు ఆస్తిని అనుభవించునట్టి హక్కును భంగించును కాబట్టి అట్టి యేర్పాటు చెల్లజాలదు. తండ్రియొక్క ఆజ్ఞను భిన్నముగా కుమారులు విభాగము చేసికొనవచ్చును. (ఎస్. మెక్. 323; ఇ. లా. రి. 1 క. 104; 23 స. 297; ట్రాన్స్ఫర్ ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు — 1882 సం॥ 4 నెం॥ చట్టము — 10, 11 సెక్షనులు కూడ చూడవలసినది).

విభాగము చేసికొనగూడదని యేర్పాటు.

విభాగము చేసికొనగూడదని సమష్టికుటుంబపు భాగస్థులు తమలో తాము ఏర్పాటు చేసికొన్న యెడల, అట్టి యేర్పాటువల్ల వారు బద్ధులుగా నుండవచ్చును. కాని, వారి వారసులు బద్ధులు కాజాలరు. (4 మ. హై. 345). మరియు, వారి భాగములను క్రయము వగైరా మార్గములయందు పరాధీనము పొందిన వారుగూడ బద్ధులు కాజాలరు. (3 క. హై. 14; 8 క. హై. 60; ఇ. లా. రి. 6 క. 107) ఈ చెప్పబడిన ప్రకారము ఏర్పాటు చేసికొన్న భాగస్థులుగూడ సదరు ఏర్పాటువలన బద్ధులుగా నుండరని బొంబాయి హైకోర్టువారు తీర్మానించియున్నారు. (ఇ. లా. రి. 7 బొం. 538) ఇటీవల నొక కేసులో, ఎన్నటికిని ఆస్తి విభాగించుకొనక సమష్టిగా నుందుమనట్లు చేసికొనబడు ఒడంబడిక చెల్లనేరదనియు, తగిన ప్రతిఫలముతో చేసికొనబడిన యెడల కొన్ని సంవత్సరముల కాలము సమష్టిగా నుందుమను

చేసికొనబడు ఒడంబడిక చెల్లుననియు, కలకత్తా హైకోర్టువారు అభిప్రాయపడిరి. (ఇ లా. రి. 28 క. 786).

ఆలాగుననే, విభాగించుకొను భాగస్థులు తమతమ భాగములను ఎవరికిగాని దానరూపకముగా లేక ఉచితముగా ఇచ్చివేయ గూడదనియు, వారిలో నెవ్వరైనను సంతానహీనులుగా మృతిచెందిన పక్షమున అతనివంతు భాగము తక్కినభాగస్థులకు చెందవలసినదనియు, ఏర్పాటు చేసికొన్న యెడల, అట్టి యేర్పాటు చెల్లజాలదు. (4 మ. హై. 348).

పిత్రార్జితము యొక్క విభాగము - సమానభాగములు.

**266**. పిత్రార్జితపు సొత్తును విభాగించు కొనునప్పుడు, తండ్రియును కుమారులును సమాన భాగములకు హక్కుదార్లుగానుందురు. (1 బం. స. తీ. 28, 58; 3 బం. స. తీ. 301; ఇ. లా. రి. 1 బొం. 561). పూర్వ కాలమునందు తండ్రికిని జ్యేష్ఠ పుత్రునికిని ఎక్కువభాగ మిచ్చునట్టి ఆచారముండెనని ధర్మశాస్త్రములవలన కనబడుచున్నది. కాని, యిప్పుడట్టి యాచారము కానంబడదు. ఎచ్చటనైనను అట్టి కులాచార మున్నట్టు స్పష్టముగా రుజువు అయిన యెడల మాత్రమే, అసమాన విభాగము చెల్లుచున్నది. (2 బం. స. తీ. 265). కొన్నికొన్ని సందర్భములలో రెట్టింపుభాగ మిచ్చునట్టి రీతిమానములు వెనుక 156, 157 పేరాలలో తెలిపియుంటిమి. అట్టి రెట్టింపుభాగపు హక్కు, ఆస్తిని సంపాదించిన భాగస్థునికే కాక, అతడు విభాగము చేసికొనక పూర్వము మృతిచెందిన యెడల అతని పుత్రసంతతి వారికి గూడ నిలిచియుండును.

పత్నీ విభాగము.

తండ్రికి ఇద్దరు ముగ్గురు భార్య లుండునప్పుడు, కుమారులందరు చేరి సమభాగములు తీసికొన వలయునేగాని, పత్నీ విభాగము కూడదు - అనగా, తండ్రి భార్యలవెంబడి ముందుగా ఆస్తిని విభజించి, పిమ్మట సదరు భాగములను ఆయా భార్యలవల్ల కలి

గిన కుమారులకు పంచిపెట్ట గూడదు. కొన్ని కొన్ని కుటుంబములలో మాత్రము పత్నీవిభాగపుపద్ధతి యున్నట్లు కానంబడుచున్నది. దీని ప్రకారము ఆస్తిదారునికి ఇద్దరు భార్యలుండి ఒక భార్యవల్ల యిద్దరు కుమారులును మరియొక భార్యవల్ల ముగ్గురు కుమారులును ఉన్నయెడల, ఆస్తిలో సగము భాగము ప్రథమ భార్య కుమారుల కిద్దరికిని తక్కిన సగము ద్వితీయ భార్య కుమారులు ముగ్గురికిని చెందును. (2 బం. స. తీ. 110). ఈ యాచారము అయోధ్యాపట్టణములో కన్పట్టుచున్నది.

మనుమలును మునిమనుమలును, వారివారి తండ్రుల భాగములలో హక్కు దార్లగుదురు. (వెనుక 143, 144 పేరాలు. 1849 సం॥ మ. తీ. 27; 1856 సం॥ మ. తీ. 5; ఇ. లా. రి. 5 మ. 362).

స్వార్జితము: తండ్రి దానము - స్వ [illegible] ఇష్టానుసార విభాగము.

**267.** తండ్రి సమ్మతించి తన స్వార్జితపు సొత్తును కుమారులకు విభాగము చేయునప్పుడు, ఆయన యిష్టమువచ్చిన పాళ్లు ఏర్పాటు చేయవచ్చునా? కూడదా?—ఈ విషయమై ధర్మశాస్త్రములును తీర్పులును గూడ అంత స్పష్టముగా లేవు. తండ్రి యిష్టము చొప్పున తన స్వార్జితపు సొత్తును కుమారులకుగాని యితరులకుగాని దానము చేయుటకు ఏ యాక్షేపణయును ఉండదు. (178-వ పేరా). కాని, దానము విషయములో ఆస్తి స్వాధీనపరచుట ఆవశ్యకము. (202-వ పేరా). విభాగము విషయములో - ఫలానా ఫలానా వారికి ఇంతింత భాగములు చేరవలసినదని యేర్పాటు చేయబడిన యెడల, సదరు భాగములు వారివారికి స్వాధీనపరచబడక పోయినను, అట్టి యేర్పాటు చెల్లగలదు. కాబట్టి, దానరూపకముగా ఇచ్చివేయునట్టి విషయములో స్వార్జితము మీద తండ్రికి సంపూర్ణ స్వాతంత్ర్యముండినను, దానివిషయమై యిచ్చవచ్చినట్లు విభాగపు యేర్పాటు

చేయుటకు అతనికి అధికారము లేదనియు, జ్యేష్ఠ పుత్రుడని, బుద్ధిశాలియని, బహు కుటుంబీకుడని, లేక అర్భకుడని, యిట్టి శాస్త్రోక్త కారణములు లేనప్పుడు తన స్వార్జితమును అసమాన భాగములుగా కుమారులు విభాగించుకొనునట్లు తండ్రి ఏర్పాటు చేయగూడదనియు—ధర్మశాస్త్రములు వక్కాణించుచున్నవి. ఒక మదరాసు కేసులో, ఒక ఆస్తిదారుడు తన స్వార్జితపు ఆస్తిలో, 9 పాళ్లు తన భార్యకును కుమార్తెకును చెందునట్లును, 1 పాలు తన కుమారునికి చెందునట్లును, విభాగము ఏర్పాటు చేసెను. అట్టి విభాగము చరసొత్తు విషయమై చెల్లినను, స్థిర సొత్తు విషయమై చెల్లజాలదని సదరుకోర్టు పండితులు అభిప్రాయమును తెలిపిరి. (1853 సం॥ మ. తీ. 61).

బంగాళా సంప్రదాయము. అసమాన విభాగము.

**268.** బంగాళా సంప్రదాయము ప్రకారము ఇచ్చవచ్చినట్లు స్వార్జిత పిత్రార్జితములను పరాధీనపరచునట్టి స్వాతంత్ర్యము తండ్రికి కలిగియున్నను, విభాగము చేయు విషయములో అసమాన భాగము లేర్పాటు చేయుటకు అతనికి అధికారము లేదని స్మృతికర్తలు చెప్పుచున్నారు. జ్యేష్ఠపుత్రుడని, విద్యార్థకుడని, గుణశాలియని, బహు కుటుంబీకుడని, అర్భకుడని, యిట్టి శాస్త్రోక్త కారణము లుండిననే కుమారులలో నెవ్వనికైనను అధిక భాగ మియ్యవచ్చునుగాని లేకున్న నియ్యగూడదనట్లు దాయ భాగమువలన కన్పట్టుచున్నది. (ఎఫ్. మెక్. 260, 265). స్థిర రూపక పిత్రార్జితముయొక్క విభాగము విషయములో జ్యేష్ఠ పుత్రుడను కారణముతప్ప మరి యేకారణముగాని అధిక భాగ మిచ్చుటకు వినియోగించదనియు, చరరూపక పిత్రార్జితము, స్వార్జితము, వీనియొక్క విభాగము విషయములో మీద చెప్పబడిన కారణములలో నేదియున్నను అధిక భాగ మియ్యవచ్చుననియు,

దాయక్రమసంగ్రహగ్రంథము అభిప్రాయపడుచున్నది. (2 బాం. స. తీ. 202; 2 ఢబ్లియు. మెక్. 2, 16).

**269.** విభాగార్హమైన సొత్తు ఫలానా అనియు విభాగించుకొనవలసినవారు ఫలానా వారనియు ముందుగా నిర్ణయించి, సదరు సొత్తుయొక్క కిమ్మతునుండి, సమష్టి కుటుంబముయొక్క అప్పులనిమిత్తమును జీవనాంశములనిమిత్తమును తోబుట్టువులు మున్నగువారి వివాహాది కార్యముల నిమిత్తమును ఆవశ్యకమగు మొత్తమును మినహాయించవలెను. భాగస్థులలో నెవరివద్దనైనను కుటుంబద్రవ్యము నిలిచియున్నయెడల దానిని లెక్కలోనికి తీసికొనవలయును. (ఇ. లా. రి. 10 బొం. 529; ఇ. లా. రి. 7 బొం. 272; ఇ. లా. రి. 31 బొం. 54). మరియు, ఒక భాగస్థుడు తన స్వంతఖర్చులనిమిత్తము కుటుంబద్రవ్యము వినియోగపరచుకొని, లేక, పరాధీనముచేసి యుండినయెడల దానిని అతని భాగములో మినహాయించవలెను. (ఇ. లా. రి. 1 బొం. 561; ఇ. లా. రి. 5 బొం. 589; ఇ. లా. రి. 11 మ. 248; ఇ. లా. రి. 17 బొం. 271). సమష్టి కుటుంబమునిమిత్తము ఒక భాగస్థుని యొక్క స్వార్జితద్రవ్యము వ్రయాపరచబడి యుండినచో, దానిని సమష్టి సొత్తునుండి అతనికి తీర్చవలయును. (1 మ. హై. 309). ఒక భాగస్థుని బిడ్డలు మొదలగువారి విషయమై సమష్టి ద్రవ్యము అధికముగా ఖర్చుపడెనను కారణమువల్ల అతని భాగము తగ్గించుటకు వీలులేదు. (138-వ పేరా). కుటుంబద్రవ్యమును చక్కగా వృద్ధిపరచ లేదనిగాని, దుబారాగా ఖర్చుచేసెననిగాని, యిట్టి కారణములవల్ల మేనేజరుయొక్క భాగమును తగ్గించగూడదు. కాని, అతడు కుటుంబ ద్రవ్యమును అపహరించియుండిన యెడల దాని మొత్తమును అతని భాగములో మినహాయించవచ్చును. (137-వ పేరా).

విభాగించదగు విషయము

విభాగమునకు అనుకూలను కాని సొత్తు.

**270.** బావి, విగ్రహము, ఇట్టి పిత్రార్జితపు సొత్తును విభాగము చేసికొనవలసి వచ్చినప్పుడు, దానిని వరుసగా అందరును అనుభవించునట్లు ఏర్పాటు చేసికొనవచ్చును. లేక, భాగస్థులలో ఒకడు మాత్రమే సదరు సొత్తును తీసికొని తక్కినవారిని ద్రవ్యరూపకముగా తృప్తిపరచవచ్చును. అట్టి కుటుంబ గృహమును అందరు భాగస్థులును విభాగించుకొన్నచో ఒక్కనికిగూడ ఉపయోగముగా నుండకపోవు పక్షమున, ఎవ్వరైనను ఒకభాగస్థుడు యావత్తు గృహమును తీసికొని తక్కినవారికి దాని ఖరీదులో వారివంతు భాగము లిచ్చివేయ వలయును. (ఇ. లా. రి. 10 క. 675; ఇ. లా. రి. 3 క. 514; ఇ. లా. రి. 17 బొం. 271).

అసంపూర్ణ విభాగము.

**271.** సమష్టి కుటుంబములో కొందరు భాగస్థులు మాత్రమే విభాగము చేసికొని తక్కినవారు సమష్టిగానే యుండవచ్చును. లేక, కొన్ని సొత్తులను మాత్రమే అందరును విభాగించుకొని తక్కిన సొత్తులను సమష్టిగా అనుభవించవచ్చును. (ఇ. లా. రి. 2 మ. 324; 4 మూ. ఇ. అ. 168; ఇ. లా. రి. 5 క. 474; ఇ. లా. రి. 18 మ. 418; ఇ. లా. రి. 18 బొం. 611; 5 బం. స. తీ. 349; ఎఫ్. మెక్. 46; 1 డబ్లియు. మెక్. 53; ఇ. లా. రి. 29 అ. 93). అలాగుననే ఒక భాగస్థుడు తన భాగమును తీసికొని సమష్టి కుటుంబమునుండి విడిపోవచ్చును. (ఇ. లా. రి. 9 క. 817; ఇ. లా. రి. 25 మ. 156; చూడు 30 క. 736). విభాగము జరిగినప్పుడు సాధారణముగా యావదాస్తియు విభాగించుకొనబడినదని కోర్టువారు ఊహింతురు గనుక, కొన్ని సొత్తులు మాత్రమే విభాగించుకొనబడెననియు కొన్ని సొత్తులు సమష్టిగానే అనుభవించబడుచుండెననియు ఎవరు వాదింతురో వారే ఆ విషయము రుజువు చేయవలసియుండును. (7 బొం. హై. 153)

**272.** సమష్టి కుటుంబములో ఎవరైనను భాగస్థుడు సమష్టి ఆస్తిలో తనవంతు భాగమును వదిలివేయ వచ్చును. అట్లు వదిలివేసిన యెడల అతని వారసులు బద్ధులుగా నుండరు. (ఇ. లా. రి. 3 బొం. 54; ఇ. లా. రి. 1 మ. 312). కాని, సమష్టి కుటుంబములో ఒక భాగస్థుడు తనవంతు భాగమును వదిలి వేయునట్లు తక్కినవారితో ఒడంబడిక చేసికొన్నయెడల సదరు ఒడంబడికకు ప్రతిఫలము లేనందున దానివలన అతడు బద్ధుడుకాడని మద్రాసు హైకోర్టువారు తీర్మానించియున్నారు. (ఇ. లా. రి. 6 మ. 71). సమష్టి కుటుంబములో ఒక భాగస్థుడు తనవంతు భాగమును మరియొక భాగస్థునికి ఇచ్చివేయవచ్చును. అప్పుడాతని భాగము విభాగకాలమునందు సదరుదానము పొందిన భాగస్థునకే చెందును గాని తక్కిన వారికి చెందజాలదు. (ఇ. లా. రి. 11 మ. 406).

ఒక భాగస్థుడు తన భాగమును వదులుకొనుట, ఇచ్చివేయుట.

**273.** ఒకసారి విభాగము చేసికొనబడిన పిమ్మట దానిని రద్దుపరచి తిరుగా విభాగము చేసికొనుటకు సాధారణముగా వీలు లేదు. విభాగకాలమునందు కొంత సమష్టి సొత్తు పొరబాటున వదిలివేయబడినప్పుడును, మోసముగా దాచబడి తరువాత కనుగొనబడినప్పుడును, సదరు సొత్తును మాత్రము విభాగించుకొనవలయును. (ఇ. లా. రి. 1 అ. 543).

విభాగము రద్దు పరచుట.

కొందరు భాగస్థులయొక్క మోసమువల్ల విభాగము బొత్తిగా అన్యాయమైనదిగాను కృత్రిమమైనదిగాను ఏర్పడినప్పుడును, మరియు సదరు విభాగమువల్ల హెచ్చు విషయమై అన్యాయము లేక దగా జరిగియుండునప్పుడును, నష్టపడినవారు కోరినయెడల కోర్టువారు సదరు విభాగమును రద్దుపరచి పునః విభాగము చేసికొనునట్లు తీరుమానింతురు. (1859 సం॥ మ. తీ. 84; 10 బొం. హై. 444).

నామకార్థము విభాగము.

**274**. విభాగము చేసికొనదగిన సమష్టి సొత్తు లేకున్నను, వారి వారి స్వార్జితముల విషయమై ముందుముందు తకరార్లురాకుండుట కొరకు, నామకార్థము విభాగము చేసికొనవచ్చును. (13 మూ. ఇ. అ. 113).

విభాగము విషయమైన రుజువు - ఉద్దేశము ముఖ్యము.

**275**. విభాగమునకు పారీఖత్తుగాని మరియెట్టి దస్తావేజు గాని ఆవశ్యకము కాదు. (4 మూ. ఇ. అ. 168). సమష్టి దశ తప్పి, తమకు ప్రత్యేకపు హక్కులు కలుగవలెనను ఉద్దేశముతో సమష్టి ఆస్తి విషయమై ఏ విధముగానైనను వేర్వేరు అనుభవమును భాగస్థులు ఏర్పాటు చేసికొన్నయెడల, అట్టి ఏర్పాటే విభాగముగా చెల్లుచున్నది. (14 స. 31 ; 8 క. హై. 396). ఈ చెప్పబడిన ఉద్దేశముతో ఏర్పాటు చేసికొనబడినప్పుడు, ఆ స్తిని వేర్వేరు భాగములుగా హద్దులుపెట్టి విడదీసికొనక పోయినను బాధకము లేదు ; ఇచ్చవచ్చినప్పుడు విడదీసికొనవచ్చును. (11 మూ. ఇ. అ. 75; 13 మూ. ఇ. అ. 113; 3 మ. హై. 40, 287; 13 క. హై. 235 ; ఇ. లా. రి. 30 క. 738, 231 ; ఇ. లా. రి. 4 బొం. 157; ఇ. లా. రి. 9 బొం. 111 ; ఇ. లా. రి. 12 క. 96 , ఇ. లా. రి. 5 అ. 532 ; ఇ. లా. రి. 13 బొం. 25). అట్లు ప్రత్యేకముగా విడదీసికొనకపూర్వము సమష్టి భాగస్థులలో నెవరైనను పుత్రహీనుడుగా మృతిచెందినయెడల, అతనివంతు భాగము అతని వితంతువునకు చెందును గాని, తక్కిన భాగస్థులకు చెందజాలదు. (13 మూ. ఇ. అ. 497 ; 14 స. 33).

మీాద చెప్పబడిన ఉద్దేశము లేనప్పుడు సమష్టి కుటుంబపు భాగస్థులు దూరదేశములయందు ఉద్యోగములో నుండుటవల్లగాని, వేర్వేరు గృహములలో కాపురము లుండుటవల్లగాని, వేర్వేరుగా భోజనములు లేక శుభాశుభ కృత్యములు జరుపుకొన్నందువల్లగాని, వేర్వేరుగా కొన్నిసొత్తులు అనుభవించుచున్నందు

వల్లగాని, కొంత ఆదాయమును వేర్వేరుగాపొంది ఖర్చు చేసికొన్నందువల్లగాని, ఒకరితో నొకరు లేవాదేవీలు పెట్టుకొన్నందువల్లగాని, యిట్టిసంగతులవల్ల మాత్రమే సమష్టిదశ తప్పి విభక్తత ఏర్పడజాలదు. విభక్తులు కావలెనను ఉద్దేశము ఏర్పడిన యెడలమాత్రమే మీదిఅంశములు విభాగమును స్థాపించుటకు చాలియుండును. (4 మూ. ఇ. అ. 168; 12 మూ. ఇ. అ. 540; 14 మూ. ఇ. అ. 412; 3 బొం హై. 87; 1855 సం॥ మ. తీ. 230; 1861 సం॥ మ. తీ. 101; 8 మ. హై. 25; 8 మూ. ఇ. అ. 66; ఇ. లా. రి. 1 అ. 437; ఇ. లా. రి. 20 మ. 256; ఇ. లా. రి. 18 అ. 176; 23 స. 412; ఇ. లా. రి. 15 బొం. 201; ఇ. లా. రి. 10 అ. 490; ఇ. లా. రి. 31 క. 262; ఇ. లా. రి. 31 మ. 482).

సాధారణముగా హిందూకుటుంబము అవిభక్తముగానే భావింపబడునుగాపున, విభక్తమని వాదించువారే ఆ విషయమును స్థాపించవలసి యుండును. (9 మూ. ఇ. అ. 66; 12 మూ. ఇ. అ. 523). అవిభక్త కుటుంబములో ఒక భాగస్థుడు మాత్రము భాగము చేసికొన్నట్టు కనుపడినంత మాత్రముచేత, తక్కిన వారందరు విభాగమైనట్టు ఊహింప గూడదు. (ఇ. లా. రి. 9 క. 817). సర్కారు లెక్కలు వగైరాలలో సమష్టి కుటుంబపు ఒక భాగస్థునిపేర మాత్రమే కొంత ఆస్తి నమూదు చేయబడియుండునంత మాత్రముచేత, అది అతని స్వార్జితమనిగాని, విభాగము జరిగినట్టుగాని, ఎంచబడ నేరదు. (ఇ. లా. రి. 1 అ. 347).

**276.** విభాగమునకు పారీఖత్తు ఆవశ్యకము కాకపోయినను, పారీఖత్తు వ్రాసికొన్న యెడల ముందుముందు తగాదాలకు అవకాశముండదు. విభాగపు పారీఖత్తును ఆస్తియొక్క మొత్తము కిమ్మతునకు ఏర్పడియుండు పత్రపు స్టాంపుమీద వ్రాయవలయును. (స్టాంపు ఆక్టు 1 - వ షెడ్యూలు, 47, 37). రూ. 100 లు విభాగపు పారీఖత్తు

గాని జాస్తి కిమ్మత్తుగానిగల స్థిరసొత్తు విషయమైన విభాగపు పారీఖత్తులను రిజిస్టరు చేయించుట ఆవశ్యకము — (రిజిస్ట్రేషన్ చట్టము, సె. 17). రిజస్టరు చేయించుట ఆవశ్యకమైన పారీఖత్తు రిజిస్టరు చేయించబడని యెడల అది ఎవిడెన్సు ఆక్టు ప్రకారము సాక్ష్యమునకు వినియోగించదు. కాని, విభాగము జరిగినట్లు యితర విషయములవల్ల రుజువు చేయవచ్చును. (ఇ. లా. రి. 5 బాం. 232).

పంచాయతీవల్ల విభాగము జరిగించుకొనబడినప్పుడు, సదరు పంచాయతీదార్ల తీర్పును అందరు భాగస్థులు అంగీకరించి దాని మీద దస్కతులు చేసినయెడల, అదే విభాగపు పారీఖత్తుగా భావింపబడును. (ఇ. లా. రి. 9 బాం. 50; చూడు 19 మ. 290; 20 మ. 490).

...భాగము నిమిత్తము దావా.

**277**. సమష్టి కుటుంబపు భాగస్థులు తమంతో తామే సమ్మతపడి విభాగము చేసికొనుటకు వీలుకానియెడల, విభాగమునిమిత్తము దావా తీసికొని రావచ్చును. విభాగపు దావా ఒక్క భాగస్థునివల్ల మాత్రమే తేబడినను చెల్లుచున్నది. కాని, తక్కిన భాగస్థులందరును ప్రతివాదులుగా చేర్చబడవలెను. (ఇ. లా. రి. 2 క. 149; చూడు 16 బాం. 608).

విభాగము నిమిత్తము తేబడు దావాలో యావత్తు సమష్టి ఆస్తియును చేర్చ బడవలెను. (1861 సం॥ మ. తీ. 86; 22 స. 333; 7 బాం. హై. 46; 11 బాం. హై. 71; ఇ. లా. రి. 24 బాం. 128; ఇ. లా. రి. 12 క. 566; ఇ. లా. రి. 14 క. 122). ఆస్తి వేర్వేరు కోర్టుల జూరిస్డిక్షను (స్థలసల అధికారము)నకు చేరియుండునప్పుడు వేర్వేరుదావాలు తీసికొని రావచ్చును. (3మ. హై. 376; ఇ. లా. రి. 4బాం. 482; ఇ లా. రి. 5 క 474; ఇ. లా. రి. 14 క. 835; ఇ. లా. రి 22 బాం. 922; ఇ. లా. రి.

28 మ. 216). సమష్టి ఆస్తిలో స్వతైనను కొంతసొత్తు ఒక భాగస్థునివలన పరాధీనపరచబడిన యెడల, దానిలో తమవంతు భాగముల నిమిత్తము మాత్రము తక్కిన భాగస్థులు దావా తేవచ్చునని మదరాసు హైకోర్టు వారును అలహాబాదు హైకోర్టు వారును తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 5 మ. 196; ఇ. లా. రి. 28 అ. 50). కాని, అట్టి సందర్భమునందు గూడ, యావత్తు సమష్టిసొత్తును చేర్చి విభాగము నిమిత్తము దావా తేవలయునని కలకత్తా హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 11 క. 396).

తాకట్టుక్రింద, లేక గుత్తక్రింద, ఇతరుల అనుభవములోనుండుటవల్ల కొంత ఆస్తి విషయమై విభాగము సాధ్యముకాని యెడల, దానిని దావాలో చేర్చనక్కర లేదు. (5 మ. హై. 419; 12 బొం. హై. 148; ఇ. లా. రి. 23 మ. 608). ఒక భాగస్థుడు విభాగము నిమిత్తము దావా తెచ్చినప్పుడు తన స్వాధీనములో నుండు యావత్తు సమష్టిసొత్తును దావాలో చేర్చవలెను. అది, యితర కోర్టుయొక్క జూరిస్డిక్షను (ఫైసలు అధికారము) నకు చేరియున్నను, దావాలో చేర్చుట విధాయకము. (15 స. 111; 25 స. 353; ఇ. లా. రి. 7 బొం. 272; ఇ. లా. రి. 22బొం. 928). బ్రిటిష్ ఇండియా రాజ్యమునకు వెలుపటనుండు సొత్తును చేర్చనక్కర లేదు. (ఇ. లా. రి. 18 బొం. 389).

విభాగము నిమిత్తము తేబడునట్టి దావాకు సాధారణముగా లిమిటేషను లేదు. కాని, సమష్టి భాగస్థులలో నెవరికైనను సమష్టి సొత్తులో అతనికి హక్కు లేదని చెప్పి దాని అనుభవము నుండి తక్కినవారు తొలగించిన యెడల, అట్లు తొలగించిన కాలము మొదలు 12 సం॥ల లోపల అతడు దావా తేవలయును. (లిమిటేషన్ ఆక్టు, 2-వ షెడ్యూల్, ఆర్టికల్ 127; ఇ. లా. రి. 3 క. 328).

గతఫలము. **278.** విభాగమునకు పూర్వము కలిగిన ఫలములో భాగము కోరుటకు సాధారణముగా వీలులేదు. ఎందుచేతననగా_ అట్టి గతఫలము సమష్టి కుటుంబము నిమిత్తము వినియోగింపబడినట్లు, లేక, సమష్టిద్రవ్యముతో చేర్చబడినట్లు, ఎంచబడును. కాని, సమష్టి కుటుంబపు భాగస్థుడు సమష్టి సొత్తుయొక్క అనుభవమునుండి బొత్తిగా తొలగింపబడినప్పుడును, అవిభాజ్యమను మిషవల్ల సమష్టి ఆస్తిని ఒక్కడే అనుభవించుచుండినప్పుడును, ఆ ఆస్తియొక్క విభాగముతో గతఫలమునందలి భాగముకూడ తీరుమానింపబడును. (ఇ. లా. రి. 5 బొం. 595; ఇ. లా. రి. 2మ. 128; ఇ. లా. రి. 5 మ. 236; ఇ. లా. రి. 7 మ. 564; ఇ. లా. రి. 19 బొం. 532; ఇ. లా. రి. 16 క. 397).

విభాగపు డిక్రీ. **279.** విభాగము నిమిత్తము దావా తేబడినప్పుడు, డిక్రీ కాక పూర్వము భాగస్థులలో నెవరైనను మృతిచెందిన యెడల, అతడు అవిభక్తుడుగా మృతిచెందినట్లే భావింపబడును. విభాగము నిమిత్తము కోర్టువారు డిక్రీ యిచ్చినక్షణము మొదలు సమష్టి భాగస్థులు విభక్తులుగా నెంచబడుదురని మద్రాసు కలకత్తా హైకోర్టులవారు తీరుమానించి యున్నారు. (ఇ. లా. రి. 4 క. 434; ఇ. లా. రి. 29 క. 797, ఇ. లా. రి. 2 మ. 83; ఇ. లా. రి. 24 బొం. 152; ఇ. లా. రి. 30 క. 231; ఇ. లా. రి. 19 మ. 345). కాని, విభాగపు డిక్రీ అప్పీలులో నున్నంతవరకు కుటుంబపు సమష్టిదశ తప్పజాలదనియు, భాగస్థులలో నెవరైనను ఈ లోపల మృతిచెందిన యెడల తక్కినవారి భాగములు హెచ్చుననియు, బొంబయి హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 6 బొం. 113; చూడు, ఇ. లా. రి. 32 క. 483).

విభాగము నిమిత్తము పొందబడునట్టి డిక్రీ, సాధారణముగా రొక్కసొమ్ము విషయమై పొందబడు డిక్రీలవంటిది కాదు. ఎందు

వల్లననగా — విభాగపు డిక్రీనిబట్టి వాదులుగాని ప్రతివాదులుగాని అమలు జరిపించి తమతమ భాగములను వేరుపరచుకొనవచ్చును. (ఇ. లా. రి. 3 క. 551; ఇ. లా. రి. 9 క. 568).

**280.** సమష్టి భాగస్థులు ఒకసారి విభాగము చేసికొన్న పిమ్మట, వారిలో అందరుగాని కొందరుగాని సమష్టిగా చేరియుండుట సంసృష్టియని చెప్పబడుచున్నది. సంసృష్టి విషయమై, బృహస్పతి వాక్యము మూలాధారముగా నున్నది. అది యేమనగా — "ఒకసారి విభక్తుడై తిరుగా ప్రీతివలన, తండ్రి, సోదరుడు, పినతండ్రి, పెత్తండ్రి - వీరితో చేరి యెవడు నివసించునో, వాడు సంసృష్టుడని చెప్పబడును." ఈ వాక్యమునకు భిన్నార్థములు చేయబడి యున్నవి. సంసృష్టి.

మితాక్షర దాయభాగముల ప్రకారము, మీద తెలుపబడిన బృహస్పతి వాక్యములో చెప్పబడియుండు బంధువులతో మాత్రమే సంసృష్టి కూడును గాని, యితరులతో సంసృష్టి కూడదు. అనగా తండ్రి కుమారులు, అన్నదమ్ములు, వీరు ఒంటోరులతోడను - పినతండ్రి పెత్తండ్రులు అన్నదమ్ముల కొడుకులతోడను - ఇట్లు సంసృష్టి జరుగవచ్చును. కాని, యితర బంధువులకు సంసృష్టి లేదు. దక్షిణ హిందూస్థానమునందును బంగాళా దేశమునందును ఈ యభిప్రాయము అనుసరింపబడు చున్నది. (5 స. 249; ఇ. లా. రి. 30 క. 753; 33 క. 371).

మయూఖగ్రంథకర్త యొక్క అభిప్రాయ మేమనగా :— బృహస్పతి వాక్యములో చెప్పబడిన బంధువులు ఉదాహరణము నిమిత్తము సూచింపబడినందున, తండ్రి, అన్నదమ్ములు, పినతండ్రి పెత్తండ్రులు-వీరితో మాత్రమేగాక, తాత,మనుమడు, పినతండ్రి పెత్తండ్రులకొడుకు, ఇట్టివారితో గూడ సంసృష్టి జరుగవచ్చును. కాని, మొదటి విభాగమునకు భాగస్థులుగా నుండని క్రొత్త

వారితో సంసృష్టి కూడదు. మొదట విభాగించుకొన్న వారి కుమారులతోనైనను సంసృష్టి కూడదు. ఈ యభిప్రాయము బొంబయి ప్రెసిడెన్సీలో అనుసరింపబడుచున్నది. (3 బొం. హై. 69; 4 బొం. హై. 166).

మిథిలదేశమునందు చెల్లుచుండెడి వివాద చింతామణి మొదలగు గ్రంథములు మొదట విభాగించుకొన్న వారితో మాత్రమే గాక, యితరులతో గూడ సంసృష్టి జరుగనచ్చునని అభిప్రాయమును తెలుపుచున్నవి.

సంసృష్టియొక్క రుజువు.

**281.** ఒకసారి విభాగము జరిగిన పిమ్మట సంసృష్టి జరిగినదని యెవరు వాదింతురో, వారే ఆ విషయమును రుజువు చేయవలసిన భారమును వహింతురు. విభాగించుకొన్న భాగస్థులు విభాగానంతరము ఒక యింటనే కలిసియుండుట, లేక కలిసి వ్యాపారము చేయుట, లేక వారిలో నొకరు మైనరుగా నుండుటవలన అతడు మరియొక భాగస్థుని సంరక్షణ క్రింద నుండుట, ఈ అంశములు మాత్రము సంసృష్టిని స్థాపించుటకు చాలియుండవు. (2 మ. హై. 235). ఈ చెప్పబడిన ప్రకారము చేరినవారు ముందటివలెనే తమకు సమష్టిదశ సిద్ధించవలెనను ఉద్దేశముతో సంసృష్టులైనట్లు స్పష్టముగా రుజువుకావలెను. (10 మూ. ఇ. అ. 403; 7 స. 35; 7 క. హై. 336; 2 అ. లా. జ. 467; చూడుడు, ఇ. లా. రి. 22 మ. 470; ఇ. లా. రి. 33 క. 371).

సంసృష్టియొక్క ఫలము.

**282.** లా ప్రకారము క్రమమైన సంసృష్టి జరిగినప్పుడు, దానివలన సంసృష్టులకును వారి సంతతి వారికిని విభాగమునకు పూర్వమునందువలె, అనగా విభాగము జరుగనియట్లే, సమష్టిదశ సిద్ధించునని భావింపదగియున్నది. కాని, మొట్టమొదటనుండియు సమష్టిగా నున్న వారికిని, ఒకసారి విభాగించుకొని పిదప సంసృష్టులైనవారికిని, చెల్లునట్టి ఆస్తిహక్కులవిషయమై కొంతవ్యత్యా

సమున్నట్లు కనబడుచున్నది. ఇది ముందటి ప్రకరణమున తెలుపబడును. (330-వ పేరా చూడుడు).

సమష్టి కుటుంబములో ఒకరిద్దరు భాగస్థులు మాత్రమే తమ భాగములను తీసికొని విడిపోయినప్పుడు, తక్కినవారు ముందటి సమష్టి కుటుంబపువారుగానే భావింపబడుదురు గాని, ఒకసారి విభాగించుకొని సంసృష్టులైనవారుగా భావింపబడరు. (ఇ. లా. రి. 25 మ. 149).

---

# ప్రకరణము 12.

—:o:—

## వారసుహక్కు.

అయిదు భాగము
...లు.

**283.** సమష్టి కుటుంబపు భాగస్థులకుగల సమష్టి హక్కు యొక్క స్వభావమును, విస్తృతియును, దానితో సంబంధించి యుండు విభాగపు హక్కును, ఇంతవరకు 5-వ, 11-వ ప్రకరణములయందు వివరించియుంటిమి. ఈ ప్రకరణమునందు—

(1.) వారసుహక్కు యొక్క స్వభావము,
(2.) వారసుదార్ల సంబంధము,
(3.) వారసుదార్ల క్రమము,
(4.) వారసుహక్కు విషయమైన అనర్హతలు,
(5.) స్త్రీ వారసులకు సంబంధించిన విశేష నిబంధనలు—

ఈ అంశములు వివరింపబడును.

---

### (1.) వారసు హక్కుయొక్క స్వభావము.

---

వారసుహక్కు అ...
...నగా నేమి?

**284.** మితాక్షరము ప్రకారము - సమష్టికుటుంబమునుండి విభాగము చేసికొని, పిమ్మట ఎవరితోడను సమష్టిగా నుండక - లేక, సమష్టి కుటుంబములో తక్కిన భాగస్థులందరు మృతిచెందుటవల్ల యావదాస్తికిని ఒక్కడే హక్కుదారుడుగా నిలిచి - లేక, ఇతరులకు సమష్టి హక్కులేని స్వార్జితపు సొత్తును కలిగియుండి - తన ఆస్తి విషయమై ఉయిలు అనగా మరణశాసనపు ఏర్పాటు చేయక, ఒక ఆస్తిదారుడు మృతిచెందినయెడల, అతని ఆస్తి ఎవరెవరికి చెందవలయునో, ఈ విషయమును నిర్ణయించునట్టి హక్కు వారసుహక్కు అని చెప్పబడుచున్నది. సమష్టిభాగస్థులలో ఒకడు మృతిచెందినయెడల, అతని భాగము విషయమై

5 - వ ప్రకరణములో చెప్పబడిన ప్రకారము మితాక్షర రీత్యా సమష్టిహక్కు చెల్లునుగాని, ఈ ప్రకరణములో వివరింపబడునట్టి వారసుహక్కు వ్యాపించదు.

దాయభాగము ప్రకారము సమష్టి కుటుంబపు భాగస్థులు సమష్టి ఆస్తిలో ప్రత్యేక భాగములకు హక్కు కలిగియుండునట్లు భావింపబడుదురు కాబట్టి, వారిలో ఒకడు తనవంతు భాగమును ఉయిలుమూలముగా ఎవరికిని ఇచ్చివేయక మృతి చెందినయెడల, దాని విషయమై వారసు హక్కు వ్యాపించుచున్నది. అనగా, మితాక్షరమునందువలె తక్కినవారి భాగములు హెచ్చక, మృతి చెందినవాని పుత్ర పౌత్ర ప్రపౌత్రులకు గాని, వారు లేనియెడల, అతని భార్య మొదలగు వారసులకుగాని, అతనివంతు భాగము చెందుచున్నది.

**285**. ఆస్తిదారుని మరణకాలమునందు శాస్త్రరీత్యా ఎవరు అతనికి సమీప వారసులుగా నుందురో వారికి అతని యావదాస్తియును తక్షణమే తప్పక చెందును. ముందెన్నటికో వారికంటె సమీప వారసులు పుట్టుదురను నిరీక్షణముచేత సదరుఆస్తి అనామతుగా నిలిచియుండజాలదు. అట్లు, సంపూర్ణ స్వాతంత్ర్యముగల పురుషవారసుదార్లకు ఆస్తి చేరినపిమ్మట, వారికంటె సమీప వారసులు జన్మించినను, వారికేవిధమైన హక్కును కలుగజాలదు. (6 బం. స. తీ. 224; 1 స. 353; 2 క. హై. 103; ఇ. లా. రి. 26 బొం. 467; కాని, ఇ. లా. రి. 9 మ. 64). గర్భగతుడై యుండు శిశువు విషయములోను, దత్తపుత్రుని విషయములోను మాత్రము, ఈ నిబంధన చెల్లదు. ఏలాగనగా—

ఆస్తి అనామతుగా నిలిచియుండ జాలదు.

(I.) ఒక ఆస్తిదారుని మరణకాలమునందు, అతనికి ఒక పుట్టు గ్రుడ్డియగు కుమారుడును విభక్తసోదరుని కుమారుడును తప్ప, మనుమడు, మునిమనుమడు, భార్య, కుమార్తె, దౌహి

త్రుడు మొదలగు సమీపవారసు లెవ్వరును లేనియెడల, సదరు పుట్టుగ్రుడ్డియగు కుమారుడు వారసుహక్కు కలిగియుండడు కాబట్టి, ఆస్తి యావత్తును విభక్తసోదరుని కుమారునికి చెందును. సదరు పుట్టుగ్రుడ్డియగు కుమారునికి వ్యాధిగ్రస్థుడుకాని కుమారుడు పుట్టునేమోయను నిరీక్షణముచేత ఆస్తి అనామతుగా నిలిచియుండ జాలదు. విభక్తసోదరునికుమారునికి ఆస్తిచేరిన పిమ్మట సదరు గ్రుడ్డివానిభార్యకు గర్భముకలిగి పుత్రుడు జన్మించినను, అట్లు జన్మించినవానికి సదరు విభక్తసోదరుని స్వాధీనములోనుండి తన తాతగారి ఆస్తిని రాబట్టుకొనునట్టి హక్కు కలుగనేరదు.

(2.) మీది యుదాహరణములో ఆస్తిదారుని మరణకాలమునందు అతని గ్రుడ్డి కుమారుని భార్య గర్భిణిగానుండి పిమ్మట పుత్రుడు జన్మించినయెడల, ఆస్తికి ఇతడు హక్కుదారుడగును. (9 క. హై. 397 ; 5 బం. స. తీ. 315).

(3.) ఆస్తిదారుని మరణానంతము స్వీకరింపబడు దత్తపుత్రుకి ఆస్తి చేరునట్టి విషయమై వెనుక 109 - వ పేరా చూడవలసినది.

స్త్రీల వారసుహక్కు అసంపూర్ణము.

**286**. వారసుహక్కు వల్ల పురుషునకు ఆస్తి వచ్చినప్పుడు దానియందు అతనికి సంపూర్ణమైన హక్కు ఏర్పడును. కాబట్టి అతని యనంతరము సదరు ఆస్తికి అతని వారసులే హక్కుదార్లగుదురుగాని, మొదటి ఆస్తిదారుని వారసులు హక్కుదార్లు కాజాలరు.

వారసు హక్కువల్ల పురుషులయొక్క ఆస్తి ఒక స్త్రీకి వచ్చినప్పుడు, దానియందు ఆమెకు సంపూర్ణ స్వాతంత్ర్యము కలుగక, యావజ్జీవమును అనుభవించునట్టి హక్కు మాత్రమే కలుగును. కాబట్టి ఆమె యనంతరము సదరు ఆస్తి ఆమెయొక్క వా

రసులకు చెందక, మొదటి ఆస్తిదారుని వారసులకే చెందును. ఈ విషయము ఈ ప్రకరణము కడపట విరళముగా తెలుపం బడును.

(2.) వారసుదార్ల సంబంధము.

**287.** ప్రతి పురుషునకు, సపిండులు సమానోదకులు బంధువులు అని మూడు తరగతుల వారసులు కలరు. మితాక్షర ధర్మశాస్త్రము ప్రకారము సామీప్యత అనగా రక్తసంబంధమును బట్టియు, దాయభాగము ప్రకారము పిండప్రదానాదికర్మనుబట్టియు, ఈవారసు లేర్పడుచున్నారు. (ఇ. లా. రి. 2బొం. 425; ఇ. లా. రి. 5 బొం. 110; ఇ. లా. రి. 19 బొం. 631; 8 బొం. హై. 262; ఇ. లా. రి. 6 క. 119; ఇ. లా. రి. 9 క. 318; ఇ. లా. రి. 22 క. 339; 2 క. హై. 33).

మూడు తరగతుల వారసులు.

**288.** ప్రతి మనుష్యుడును, (1.) తండ్రి, (2.) తాత, (3.) ముత్తాత, వీరికి పిండప్రదానము చేయుటకును-(4). ముత్తాత తండ్రి, (5.) ముత్తాతతాత, (6.) ముత్తాత ముత్తాత, వీరికి లేప ప్రదానము (అనగా తండ్రి వగైరాలకు పిండప్రదానము చేయునప్పుడు చేతులయందంటుకొన్న మెతుకులయొక్క దానము) చేయుటకును - ముత్తాత ముత్తాత పైని యేడుతరముల వారికి ఉదకదానము చేయుటకును - బద్ధుడని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. దీనినిబట్టి ప్రతి మనుష్యుడును, (1.) కుమారుడు, (2.) మనుమడు, (3.) మునిమనుమడు, వీరివలన పిండప్రదానమును పొందుటకును-(4) మునిమనుమనికొడుకు, (5.) మునిమనుమని మనుమడు, (6.) మునిమనుమని మునిమనుమడు, వీరివలన లేప ప్రదానమును పొందుటకును-మునిమనుమనియొక్క మునిమనుమని క్రింది యేడుతరముల వారివల్ల ఉదకదానమును మాత్రము

సపిండులు, సకుల్యులు, సమానోదకులు.

పొందుటకును - అస్థాపుగానుండునని యేర్పడుచున్నది. ఈ చెప్ప బడిన దానపరిగ్రహములే దాయభాగము ప్రకారము సపిండ, సకుల్య, సమానోదక సంబంధములకు మూలముల య్యున్నవి. పిండప్రదాన సంబంధమును, లేపప్రదాన సంబంధమునుగల ఆరు తరములవారికిని సపిండనామము దాయభాగమునందు కొన్నిచో ట్ల ఉపయోగింపబడుచున్నను, సామాన్యముగా పిండప్రదానము నిచ్చువారును గ్రహించువారును మాత్రమే ఒండొరులకు సపిం డులని చెప్పబడుచు, లేపప్రదానమునిచ్చువారును గ్రహించువా రును ఒండొరులకు సకుల్యులని చెప్పబడుచున్నారు. ఉదకదాన మమాత్ర మిచ్చువారును గ్రహించువారును ఒండొరులకు స మానోదకులని చెప్పబడుచున్నారు.

ఇట్లే చెప్పబడిన పిండప్రదానము లిచ్చుటవల్లను గ్రహించుట వల్లను మాత్రమే గాక, ఒకడు పిండప్రదానము చేయవలసిన పె ద్దలలో అందరుగాని కొందరుగాని మఱియొకడు పిండప్రదానము చేయవలసిన పెద్దలుగా నేర్పడినయెడల, వారిరువురకిని సపిండ సంబంధము కలుగుచున్నది. ఈ విషయము దీనితర్వాతవచ్చు పేరావల్ల స్పష్టముకాగలదు. (5 క. హై. 39; 2 క. హై. 34).

మితాక్షర సంప్రదాయము ప్రకారము సపిండులును సకుల్యు లును చేరిన ఆరుతరముల వారికిని సపిండులను సామాన్య నామ మే వర్తించుచున్నది.

సపిండుల సకుల్యుల వంశావళి.

**289.** ప్రక్క పేజీలో కనుపరచబడిన వంశావళియందలివా రందరు ఆస్తిదారునికి సపిండులుగా నున్నారు. అదియెట్లనగా—

కుమారుడు, మనుమడు, మునిమనుమడు, వీరు ముగ్గురును ఆస్తిదారునికి పిండప్రదానయు చేయుదురు గనుకను - తండ్రి, తాత, ముత్తాత, వీరు ముగ్గురును ఆస్తిదారునివలన పిండప్రదా

# సపిండులు.


ముత్తాత
తాత
పినతాత పెత్తాత
కుమారుడు
మనుమడు
తండ్రి
పినతండ్రి పెత్తండ్రి
కుమారుడు
మనుమడు
ఆస్తిదారుడు
అన్న తమ్ముడు
కుమారుడు
కుమారుడు
మనుమడు
మనుమడు
మునిమనుమడు

నము గ్రహింతురు గనుకను-ఈ ఆరుగురును ఆ_స్తిదారునికి సపిండులగుచున్నారు.

ఆ_స్తిదారుడు పిండప్రదానముచేయవలసిన తండ్రి, తాత, ముత్తాత, వీరిలో ముగ్గురికిగాని యిద్దరికిగాని ఒక్కరికిగాని - అన్న, తమ్ముడు, పినతండ్రి, పెత్తండ్రి, పినతాత, పెత్తాత - వీరియొక్క కుమారుడు, మనుమడు - వీరుగూడ పిండప్రదానము చేయుదురు గనుక, వీరందరును ఆ_స్తిదారునికి సపిండులగుచున్నారు.

మునిమనుమని క్రింది మూడు తరములవారు, ముత్తాత పైని మూడుతరములవారు, అన్నదమ్ములమనుమల క్రింది మూడుతరములవారు, పినతండ్రి పెత్తండ్రి మనుమలక్రింది మూడుతరములవారు, పినతాత పెత్తాతమనుమల క్రింది మూడుతరములవారు - వీరికిని ఆ_స్తిదారునికిని లేప మాత్రము యొక్క దానగ్రహణ సంబంధ ముండుటచేత, వారందరును ఆ_స్తిదారునికి సకుల్యులు అగుచున్నారు.

స్త్రీ సపిండులు. **290.** తండ్రి, తాత, ముత్తాత -వీరికి చెల్లించబడునట్టి పిండ ప్రదానములను వారి భార్యలు గూడ ఆరగింతురు కాబట్టి, ప్రతి పురుషునకును, తల్లి, తాతభార్య, ముత్తాతభార్య - వీరుగూడ సపిండు లగుచున్నారు. (ఇ. లా. రి. 2 బొం. 420, 440, 445). మరియు, భ_ర్తయొక్క శరీరములో అర్థభాగముగా భావింపబడునట్టి కారణము చేతను పుత్రహీనుడుగా మృతిచెందిన భ_ర్తకు అపరక్రియలు జరుపునట్టి కారణముచేతను, భార్య, భ_ర్తయొక్క సపిండురాలగుచున్నది.

ముత్తాతతండ్రి, ముత్తాతతాత, ముత్తాతముత్తాత- వీరి భార్యలు మితాక్షరముప్రకారము సపిండులగుచున్నారు.

బొంబయి ప్రెసిడెన్సీలో ప్రమాణముగా చెల్లుచుండెడి మయూఖగ్రంథము ప్రకారము, కుమా_ర్తె, అక్క, చెల్లెలు, అన్న

దమ్ముల భార్యలు - వీరుగూడ సగోత్రసపిండులుగా భావింపబడు చున్నారు.

**291.** సపిండులు, సమానోదకులు, బంధువులు - ఈ తరగతుల వారసులు, దాయభాగము ప్రకారము పిండప్రదానాది కర్తనుబట్టియు, మితాక్షరము ప్రకారము సామీప్యత అనగా రక్త (శరీరపిండ) సంబంధమును బట్టియు, ఇట్లు వేర్వేరు పద్ధతుల ప్రకారము ఏర్పడుచున్నను - సపిండులు, సమానోదకులు, ఈ రెండుతరగతుల వివరములో రెండు సిద్ధాంతములకును భేదము లేదు. పేర్లయందు మాత్రమే కొంచెము భేదముకన్పట్టుచున్నది. మితాక్షరములో ఆరుతరములవరకు గల వారసులు సపిండులని పిలువబడుచున్నారు. దాయభాగమునందు మొదటి మూడు తరములవారికి మాత్రమే సపిండులని పేరు. నాలుగు అయిదు ఆరుతరములవారు సకుల్యులని చెప్పబడుచున్నారు. ఆపైని యేడుతరములవారు సమానోదకులనియే మితాక్షరమునందును దాయభాగమునందునుగూడ పిలువబడుచున్నారు.

మితాక్షర దాయభాగ సిద్ధాంతములు.

బంధువుల వివరములో మాత్రము రెండు సిద్ధాంతములకును భేదము కన్పట్టుచున్నది. కాబట్టి, దాయభాగ సిద్ధాంతరీత్యా యేర్పడునట్టి బంధువర్గమును ముందుగా వివరించి, పిమ్మట మితాక్షరము సమ్మతించునట్టి బంధువులను పేర్కొనుచున్నాము.

**292.** మీద చెప్పబడిన సపిండులు, సకుల్యులు, సమానోదకులును ఆస్తిదారునికి సగోత్రులయియున్నారు. కాని, భిన్న గోత్రులుగూడ సపిండులుగా నుండవచ్చును. వీరి సపిండత్వము పార్వణశ్రాద్ధమువలన కలుగుచున్నది. అది యెట్లనగా — పార్వణశ్రాద్ధమును జరుపునప్పుడు, తండ్రి, తాత, ముత్తాత - వీరికి మాత్రమేగాక, తల్లితండ్రి, తల్లితాత, తల్లిముత్తాత - వీరికిగూడ పిండప్రదానము చేయబడుచున్నది. కాబట్టి, వీరు భిన్నగోత్రు

దాయభాగము ప్రకారము బంధువుల వివరము.

# పితృ బంధువులు.



ముత్తాత
పినతాత పెత్తాత
తాత
తాతయొక్క అక్క చెల్లెలు
కుమారుడు
కుమార్తె
కుమారుడు *
మనుమరాలు
కుమారుడు *
కుమారుడు *
పినతండ్రి పెత్తండ్రి
తండ్రి
మేనత్త
కుమారుడు *
కుమారుడు
కుమార్తె
మనుమరాలు
కుమారుడు *
కుమారుడు *
అన్న తమ్ముడు
అక్క చెల్లెలు
ఆస్తిదారుడు
కుమారుడు *
కుమారుడు
కుమార్తె
మనుమరాలు
కుమారుడు *
కుమారుడు *
కుమారుడు
కుమార్తె
కుమారుడు *
మనుమడు
మనుమరాలు
మునిమనుమరాలు
కుమారుడు *
కుమారుడు *

లయ్యును సపిండులగుచున్నారు. మరియు, అట్టి పిండప్రదానమును ఒకనివల్ల పొందునట్టి పెద్దలలో అందఱుగాని కొందరుగాని భిన్నగోత్రుడగు మరియొకనివల్ల పిండప్రదానమును పొందునట్టి పెద్దలుగా నుండు నెడల, వారిరువురును భిన్నగోత్రులయ్యును సపిండులగుచున్నారు.

భిన్నగోత్ర సపిండులకు బంధువులని పేరు. వీరు, దాయభాగముప్రకారము పితృబంధువులు, మాతృబంధువులు, అని రెండు తెగలవారు. పితృబంధువులవంశావళి ఎడమప్రక్క పేజీలో కనుపరచబడియున్నది. దానిలో * నక్షత్రపు గుర్తు కలవారందరు ఆ ఆస్తిదారుని భిన్నగోత్ర సపిండులై పితృబంధువులగుచున్నారు. ఎందువల్లననగా — ఆ ఆస్తిదారుడుగాని ఆ ఆస్తిదారుని పితృవర్గములో చేరిన తండ్రి తాత ముత్తాతలలో ముగ్గురుగాని ఇద్దరుగాని ఒక్కరుగాని సదరు నక్షత్రపు గుర్తువారి మాతృవర్గములో చేరిన పెద్దలై వారివలన పిండప్రదానమును గ్రహించుచున్నారు. పితృ బంధువులు.

మాతృబంధువులయొక్క వంశావళి దీనితర్వాతి పేజీలో కనుపరచబడియున్నది. దానిలో * ఒక నక్షత్రపు గుర్తుగలవారును ** రెండు నక్షత్రముల గుర్తుగలవారును, వీరందరు ఆ ఆస్తిదారుని భిన్నగోత్ర సపిండులై మాతృబంధువులగుచున్నారు. అది యెట్లనగా — ** రెండు నక్షత్రముల గుర్తుగలవారు ఆ ఆస్తిదారుని మాతృవర్గములో చేరినపెద్దలుగనుక అతనివల్లనే పిండప్రదానమును పొందుచున్నారు. మరియు, ఆ ఆస్తిదారునివల్ల పిండప్రదానము పొందదగిన సదరు ** రెండు నక్షత్రములగుర్తుగల అతని మాతృవర్గపు పెద్దలలో ముగ్గురుగాని ఇద్దరుగాని ఒక్కరుగాని, * ఒక నక్షత్రపు గుర్తు వారియొక్క పితృవర్గములో, లేక మాతృవర్గములో చేరిన పెద్దలై, వీరివలన పిండప్రదానమును గ్రహించుచున్నారు. మాతృ బంధువులు

# మాతృ బంధువులు.




☞ పితృబంధువుల యొక్కయు మాతృబంధువుల యొక్కయు వంశావళులయందు కనుపరచబడియుండు బంధువులలో అందరును దాయభాగ దాయక్రమ సంగ్రహ గ్రంథములయందు పేర్కొనబడక కొందరు మాత్రమే పేర్కొనబడి యున్నారు. అట్లున్నను, పేర్కొనబడినవారు ఉదాహరణము నిమిత్తముచెప్ప

**293.** మితాక్షరములో మూడు తరగతుల బంధువులు చెప్పబడియున్నారు. (1.) ఆత్మబంధువులు, (2.) పితృబంధువులు, (3.) మాతృబంధువులు. మితాక్షరము ప్రకారము బంధువుల వివరము.

తనయొక్క మేనత్తకొడుకులు, తనయొక్క పినతల్లి పెత్తల్లి కొడుకులు, తనయొక్క మేనమామ కొడుకులు - వీరు ఆత్మబంధువులు. తండ్రియొక్క మేనత్త కొడుకులు, తండ్రియొక్క పినతల్లి పెత్తల్లికొడుకులు, తండ్రియొక్క మేనమామ కొడుకులు- వీరు పితృబంధువులు. తల్లియొక్క మేనత్త కొడుకులు, తల్లియొక్క పినతల్లి పెత్తల్లి కొడుకులు, తల్లియొక్క మేనమామ కొడుకులు - వీరు మాతృబంధువులు.

మీద చెప్పబడిన మూడు తరగతుల బంధువులలో - ఆత్మబంధువులు, తండ్రియొక్క మేనత్త కొడుకులు, తల్లియొక్క మేనత్తకొడుకులు-వీరు మాత్రమే దాయభాగ సిద్ధాంతము ప్రకారము గూడ బంధువులుగా నున్నారు. తక్కినవారు, అనగా, తండ్రియొక్కయు తల్లియొక్కయు పినతల్లి పెత్తల్లి కొడుకులును మేనమామ కొడుకులును, దాయభాగరీత్యా బంధువులు కారు. ఎందువల్లననగా— వీరు, ఆస్తిదారునికిగాని, అతని పితృమాతృ

---

బడిరనియు, ఇతరులుగూడ భిన్నగోత్ర సపిండులుగా నుండినేడల బంధు వర్గములో చేరుదురనియు, తీరుమానములియ్యబడియున్నవి. (12. మూ. ఇ. అ. 448; 2 క. హై. 28; 5 క. హై. 15. చూడు 22 స. 264; 24 స. 229; 3 క. హై. 435; 12 మూ. ఇ. అ. 448; 4 మూ. ఇ. అ. 292; ఇ. లా. ది. 26 క. 285; 2 మూ. ఇ. అ. 132; 3 క. హై. 435; ఇ. లా. ది. 11 క. 343; ఇ. లా. ది. 8 క. 460; 10 క. హై. 341; 15 క. హై. 35; ఇ. లా. ది. 9 క. 563; ఇ. లా. ది. 15 క. 780).

పరంపరవారికిగాని, పిండప్రదానము చేయునట్టి యోగ్యతయే మాత్రమును కలిగియుండరు.

మితాక్షరములో పేర్కొనబడిన మూఁడుతరగతుల బంధువులును ఉదాహరణ నిమిత్తము చెప్పబడిరనియు, పేర్కొనబడకయున్నను అక్కచెల్లెండ్ర కుమారులు మున్నగువారుగూడ కొందరు మితాక్షర సిద్ధాంతముప్రకారము బంధువులగుదురనియు, ప్రివీకౌన్సిలువారివల్లను, హైకోర్టులవారివల్లను తీరుమానింపబడి యున్నది. (12 మూ. ఇ. అ. 448; 2 క. హై. 28; 5 క. హై. 15; 6 మ. హై. 278).

బొంబయి ప్రెసిడెన్సీలో ప్రమాణముగా చెల్లుచుండెడి మయూఖగ్రంథము ప్రకారము, అక్కసెల్లెండ్రు, అక్కసెల్లెండ్ర కుమార్తెలు, అన్నదమ్ములకుమార్తెలు, కుమార్తె కుమార్తెలు - మొదలగు స్త్రీవర్గము వారనేకులు బంధువులుగా అంగీకరింపబడుచున్నారు.

---

(3.) వారసుదార్ల క్రమము.

---

మితాక్షర దాయభాగ సిద్ధాంతముల కు భేదము.

**294.** వారసుదార్లను నిర్ణయించుటలో మితాక్షర దాయభాగ సిద్ధాంతములు వేర్వేరుపద్ధతులను అనుసరించునట్లు చెప్పియుంటిమి. మితాక్షరమునందు, సామీప్యత (రక్తసంబంధము) ప్రధానముగా భావింపబడి, ఆ విషయమై కలిగియుండు హెచ్చుతగ్గుల ప్రకారము వారసుదార్ల క్రమము ఎర్పరచబడియున్నది. దాయభాగమునందు మృతిచెందినవానికి పిండప్రదానకర్త జరిగించునట్టి యోగ్యతయే ప్రధానముగా భావింపబడి, ఆ విషయమై కలిగియుండు ఆధిక్యతనుబట్టి వారసుదార్ల క్రమము ఏర్పరచబడి యున్నది. దీనివల్లనే, వారసుదార్ల క్రమమునందు మితాక్షర దాయభాగ సిద్ధాంతములకు భేదము కానంబడుచున్నది.

దాయభాగము ప్రకారము, పిండప్రదానమును పొందువారి కంటె ఇచ్చువారు సమీపవారసులుగా భావింపబడుచున్నారు. మరియు, ఉదకదానముకంటె లేపదానమును లేపదానముకంటె పిండదానమును హెచ్చుగా భావింపబడుటచేత, సమానోదకుల కంటె సకుల్యులును సకుల్యులకంటె సపిండులును సమీపవార సులుగా భావింపబడుచున్నారు. మరియు, పితృవర్గము వారిలో ఒకరికి గాని ఎక్కువమందికి గాని పిండప్రదానము చేయువారు మాతృవర్గము వారికి పిండప్రదానము చేయువారికంటెను, పితృ మాతృవర్గముల వారికి ఉభయులకును పిండప్రదానము చేయు వారు వారిలో ఒక తరగతివారికి మాత్రమే పిండప్రదానము చేయువారికంటెను, ఎక్కువగా భావింపబడుచున్నారు. (5 క. హై. 38; 15 క. హై. 47; ఇ. లా. రి. 9 క. 563; ఇ. లా. రి. 26 క. 285; ఇ. లా. రి. 8 క. 460). ఇట్టి విధులనుబట్టి దాయ భాగమునందు వారసుదార్ల క్రమము ఏర్పరచబడి యుండుటచేత, భిన్నగోత్రులయ్యును పిండప్రదాన యోగ్యతకలిగియున్నారు గ నుక బంధువర్గము వారందరును, లేపప్రదానములు చేయునట్టి సకుల్యులకంటెను ఉదకదానములుచేయు సమానోదకులకంటె ను ముందుగా వారసులగుచున్నారు. మితాక్షరమునందు పిండ ప్రదాన యోగ్యత పాటింపబడక యుండుటచే, బంధువర్గము వా రు భిన్నగోత్రులయ్యుండు కారణమువలన సగోత్రులైన సకుల్య సమానోదకుల తర్వాత వారసులగుచున్నారు.

అన్ని సంప్రదాయముల ప్రకారమును, ముందు పుత్రసంతతి వారు, పిదప వితంతువు, కుమార్తె, దౌహిత్రుడు (కుమార్తెయొ క్క కొడుకు), తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అన్నదమ్ముల కుమా రులు, ఇట్లు కొంతవరకు వారసుదార్ల క్రమము ఒక్కటిగానే యుండి పిదప భేదించుచున్నది. కాబట్టి, సామాన్యక్రమనుగల

వారసులకు సంబంధించియుండు విషయములను ముందుగా వివరించి పిమ్మట భేదాంశములను తెలుపుచున్నాము. అటుతర్వాత, ఆయా సంప్రదాయముల ప్రకారము ఏర్పడియుండు వారసుదార్ల క్రమమును సులభముగా సూచించునట్టి పట్టీలు జతపరచుచున్నాము.

పుత్ర పౌత్ర ప్రపౌత్రులు.

**295.** పుత్ర, పౌత్ర, ప్రపౌత్రులు - (అనగా కుమారుడు, మనుమడు, మునిమనుమడు)—మృతిచెందినవాని ఆస్తికి, అందరికంటె ముందు అతని పుత్ర పౌత్ర ప్రపౌత్రులు వారసులుగా నుందురు. దాయభాగ సంప్రదాయము ప్రకారము, సమష్టి కుటుంబము యొక్క భాగస్థులు ప్రత్యేక భాగములకు హక్కు కలిగియుండునట్లు భావింపబడుదురు గనుక, వారికి వారసుహక్కు చెల్లునుగాని మితాక్షరము నందువలె సమష్టిహక్కు చెల్లదు. మితాక్షరము ప్రకారము సమష్టి కుటుంబమునందు సమష్టిహక్కు చెల్లునుగాని వారసుహక్కు చెల్లదు. అనగా, ఒక భాగస్థుడు మృతిచెందినప్పుడు తక్కిన వారి భాగములు హెచ్చును.

తండ్రియును కుమారులును విభాగించుకొన్న పిమ్మట మరి కొందరు కుమారులు జన్మించినయెడల, వీరు మితాక్షర రీత్యా తండ్రితో సమష్టి భాగస్థులగుదురు. కాబట్టి, అతని యావదాస్తియు వీరికే చెందును. (ఇ. లా. రి. 32 మ. 377). అట్లు సమష్టిగానుండు పుత్ర పౌత్ర ప్రపౌత్రులెవ్వరు లేనియెడల, మితాక్షర సంప్రదాయము ప్రకారము తండ్రియొక్క ఆస్తికి, విభక్తులైన పుత్ర పౌత్ర ప్రపౌత్రులు వారసులగుదురు. విభక్తులైననుసరే, అవిభక్తులైననుసరే, పుత్ర పౌత్ర ప్రపౌత్రులున్నంతవరకు ఆస్తిదారుని భార్యకు జీవనాంశపు హక్కుమాత్రమే కలిగియుండును గాని, వారసుహక్కు కలిగియుండదు. ఉదాహరణము—

ఒకడు తన కుమారులతో విభాగము చేసికొని, వితంతువును మాత్రము విడిచి మృతిచెందెను. అతని ఆస్తి, సదరు విభక్తకుమారులకు చెందునుగాని వితంతువునకు చెందజాలదు. (ఇ. లా. రి. 2 మ. 182; ఇ. లా. రి. 3 బొం. 54).

**296.** వారసుహక్కు విషయములో, పుత్ర పౌత్ర ప్రపౌత్రులు (కుమారుడు, మనుమడు, మునిమనుమడు)- ఈమూడు తరగతులవారును, సమానమగు హక్కు కలవారుగావున ఒకటే మెట్టువారుగా భావింపబడుచున్నారు. ప్రపౌత్రుని పుత్రునికి వారసుహక్కు లేదు. మరియు, ఈచెప్పబడిన పుత్ర పౌత్ర ప్రపౌత్రులలో తండ్రి జీవించియుండగా కుమారులకు వారసుహక్కు లేదు. ఒక కుమారుడు మృతిచెందినయెడల అతనివలన కలిగిన మనుమలును - కుమారుడును మనుమడునుగూడ మృతిచెందినయెడల వారివల్లకలిగిన మునిమనుమడును-ఆ స్తిదారునియొక్క జీవించియుండు కుమారులతో సమానముగా హక్కు కలిగియుందురు. ఉదాహరణములు— సమానమగు వారసుహక్కు.

(1.) ఒకఆస్తిదారుని మరణకాలమునందు, "ఏ, బీ" యను కుమారులును, "ఏ" వలన "సీ, డీ" యను మనుమలును, "బీ" వలన "ఈ" యను మనుమడును, ఉండిరి. ఆస్తికి, "ఏ, బీ" యను కుమారులు మాత్రమే వారసుదార్లగుదురు. "సీ, డీ, ఈ" యను వారు, వారి తండ్రులతో సమష్టిగానున్నయెడల వారి భాగములలో హక్కుదార్లగుదురు. (చూడుడు, ఇ. లా. రి 30 మ. 348).

(2.) ఒక ఆస్తిదారుని మరణకాలమునందు, "ఏ" యను కుమారుడును, అంతకు పూర్వము మృతిచెందిన మరియొక కుమారునివల్ల "బీ, సీ" యను మనుమలును, మరియు అంతకు పూర్వము మరియొక కుమారుడును మనుమడును మృతిచెందగా వారి సంతతిలో నిలిచిన "డీ" యను మునిమనుమడును, ఉండిరి.

ఆస్తికి - "ఏ" యను కుమారుడును, "బీ, సీ" యను మనుమలును, "ఈ" యను మునిమనుమడును సమాన వారసుదార్లగుదురు. కాబట్టి, యావదాస్తిలో ఒకపాలు "ఏ" యను కుమారునకును, ఒకపాలు "బీ, సీ" యను మనుమలకును, ఒకపాలు "ఈ" యను మునిమనుమనికిని చెందును. (143, 144 పేరాలు చూడుము. ఇ. లా. రి. 30 మ. 348).

(3.) మృతిచెందినవాని ఆస్తి అతని కుమారుల కందరికిని సమాన భాగములుగా చేరునుగాని, పత్నీ భాగముల వెంబడి చేరదు. (266 పేరా).

విభాగయోగ్యముకాని జమీందారీకి వారసుహక్కు.

**297.** విభాగయోగ్యముకాని జమీందారీ లేక జహాగీరు విషయములో సాధారణముగా - మృతిచెందినట్టి జమీందారుని లేక జహాగీరుదారుని జ్యేష్ఠపుత్రుడుమాత్రమే వారసుదారుడై తక్కినవారు జీవనాంశమునకు మాత్రము హక్కు కలిగియుందురు. (ఇ. లా. రి. 4 మ. 250; చూడుము, ఇ. లా. రి. 29 క. 343; 30 క. 843). జమీందారునికి అనేక భార్యలవల్ల కుమారులుండునప్పుడు, ఏ భార్యవల్లనైననుసరే ముందు జన్మించినవాడే జ్యేష్ఠపుత్రుడుగా భావింపబడునుగాని మొట్టమొదట వివాహమాడిన భార్యకు జన్మించిన పుత్రులలో జ్యేష్ఠుడు జ్యేష్ఠపుత్రుడు కాడు. (7 బం. స. తీ. 126; 5 బొం. హై. 161; 14 మూ. ఇ. అ. 570; ఇ. లా. రి. 2 మ. 286; 23 అ. 369; కాని, చూడుము - భిన్నాచారము, ఇ. లా. రి. 17 మ. 422; 22 మ. 515, (ప్రి. కౌ.). మరియు, జ్యేష్ఠపుత్రుని సంతతివారున్నంతవరకు తక్కిన కుమారులకు వారసుహక్కు కలుగజాలదు. (6 మ. హై. 93; ఇ. లా. రి. 4 మ. 250). అనగా, జ్యేష్ఠపుత్రుని తర్వాత అతని జ్యేష్ఠపుత్రుడును, ఇతనితర్వాత ఇతని పుత్రులలో జ్యేష్ఠుడును, రాజ్యపాలకు లగుదురు. ఒక జమీందారునికి ముగ్గురు నల్గురు కుమారులుండి

వారిలో జ్యేష్ఠుడు మృతిచెందినయెడల, ఈ మృతి చెందిన జ్యేష్ఠుని కుమారుడే హక్కుదారుడగునుగాని, జమీందారుని తక్కిన కుమారులలో పెద్దవాడు హక్కుదారుడు కాడు. కుటుంబములో పురుషులుండగా స్త్రీలు వారసులు కాజాలరు. మరియు అవిభాజ్యమగు జమీందారీయొక్క పాలకుడు మృతిచెందినప్పుడు, అతనికి ఎవరు సమీప వారసులుగా నుందురో వారిలో పెద్దవాడు రాజ్యమునకు హక్కుదారుడగును. (12 మూ. ఇ. అ. 523, 540; 3 క. హై. 13). అవిభాజ్యమగు జమీందారీ వారసత్వము విషయమై యీక్రింది తీర్పులు చూడవలయును. (9 మూ. ఇ. అ. 539; ఇ. లా. రి. 10 అ. 272; ఇ. లా. రి. 18 క. 151; 12 మూ. ఇ. అ. 523, 540; ఇ. లా. రి. 16 మ. 16; 19 మ. 451; 17 మ. 325-27; 31 క. 224; 29 క. 343, 828; 20 క. 649; 24 మ. 613, 562; 32 క. 11; 28 మ. 508).

**298**. బ్రహ్మ క్షత్రియ వైశ్య జాతులలో దాసీపుత్రులకు (లంజకుమారులకు) జీవనాంశపు హక్కు మాత్రమేగాని వారసు హక్కులేదు. (7 మూ. ఇ. అ. 18; 2 మ. హై. 369; 13 మూ. ఇ. అ. 497; ఇ. లా. రి. 22 అ. 191). కాని, శూద్రజాతివారిలో దాసీ పుత్రులకు కొంతవరకు వారసుహక్కు కలదని ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. తీర్పులును అప్రకారముగానే యున్నవి. (13 మూ. ఇ. అ. 159). దాసీపుత్రులు.

ధర్మశాస్త్రములయందు కానంబడుచున్న దాసీపుత్రుడను పదమునకు భిన్నార్థములు చేయంబడియున్నవి. వెలకు కొని యింట దాసిగా నుంచుకొన్న స్త్రీతోడగాని దాని సంతతివారితోడగాని సంభోగించుటవలన కలిగిన పుత్రుడే దాసీపుత్రుడు గాని, సాధారణపు లంజవలన కలిగిన పుత్రుడు దాసీపుత్రుడు కాడని కలకత్తా హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా.

ర. 1 క. 1; ఇ. లా. రి. 19 క. 91; ఇ లా. రి. 28 క. 194).
ఈయర్థము ప్రకారము ఈ కాలమునందు దాసీ పుత్రుడుండ జాలడు. ఎందువల్లననగా—1843 సం॥ 5 నం॥ చట్టము ప్రకారము బానిసలను విక్రయించుటయు కొనుటయు సర్కారువారివల్ల నిషేధింపబడి నేరములుగా చేయబడియున్నవి.

బొంబయి, మద్రాసు, అలహాబాదు హైకోర్టువారు "దాసీ పుత్రుడు" అను పదమునకు "ఉంచుకొన్న లంజకుమారుడు" అని అర్థముచేసి యున్నారు. (ఇ. లా. రి. 1 బొం. 110; ఇ. లా. రి. 4 బొం. 37, 44; ఇ. లా. రి. 7 మ. 412; ఇ. లా. రి. 12 మ. 86; 13 మూ. ఇ అ. 159, ఇ. లా. రి. 2 అ. 134; ఇ. లా. రి. 6 అ. 329). మరియు, మదరాసు ప్రెసిడెన్సీలో "దాసీ" యను పదము వేశ్యను సర్వసాధారణముగా తెల్పుచున్నట్లు అనేక కేసులలో ఋజుమానింపబడియున్నది. (1849 సం॥ మ. తీ. 50; 1 మ. హై. 478; 13 మూ. ఇ. అ. 41; 2 మ. హై. 293; 12 మూ. ఇ. అ. 203; 4 మ. హై. 204). కాబట్టి, బొంబయి మద్రాసు అలహాబాదు ప్రెసిడెన్సీలలో శూద్రజాతివారెవ్వరైనను భోగమువాండ్రు మొదలగు లంజలను స్థిరముగా ఉంచుకొన్న యెడల, వారికిపుట్టిన పుత్రులు వారసుహక్కు కలిగియుందురని తెలిసికొనవలయును.

లంజగా ఉంచుకొనక, అప్పుడప్పుడు సంభోగించిన లేక వ్యభిచరించినంత మాత్రముచేత, అట్టి సంభోగము లేక వ్యభిచారము వల్ల కలిగిన పుత్రులు దాసీపుత్రులుగా భావింపబడజాలరు. మరియు, నావివాహసలు చెల్లని స్త్రీని లంజగా నుంచుకొన్న యెడల, అట్టి స్త్రీవల్ల కలిగిన పుత్రుడు దాసీ పుత్రుడుగా భావింపబడడు. కాబట్టి అట్టి పుత్రులకు ఎంతమాత్రమును వారసుహక్కు లేదు. (4 మ హై. 204, 215; 8 మ. హై. 134; ఇ. లా. రి. 1 బొం.

97, 113; ఇ. లా. రి. 8 మ. 325; ఇ. లా. రి. 8 అ. 387; ఇ. లా. రి. 23 మ. 16).

**299.** ఉంచుకొన్న లంజయొక్క కుమారునకు శూద్రజాతి వారిలో మాత్రమే వారసుహక్కు కలదు. వారిలోగూడ, తండ్రియొక్క ఆస్తివిషయమైమాత్రమే అతనికి వారసుహక్కు కలదు గాని, అతని పినతండ్రి పెత్తండ్రి మొదలగు దాయాదుల ఆస్తి విషయమై వారసుహక్కు లేదు. (ఇ. లా. రి. 7 మ. 407; 8 మ. 557; ఇ. లా. రి. 12 మ. 403; ఇ. లా. రి. 25 మ. 429; ఇ. లా. రి. 21 అ. 99; చూడు, ఇ. లా. రి. 4 బొం. 37; ఇ. లా. రి. 11 క. 714; ఇ. లా. రి. 28 క. 194). శూద్రులలో దాసీ పుత్రుల వారసు హక్కు.

శూద్రులలో దాసీ పుత్రునకుగల వారసుహక్కు విషయమై ధర్మశాస్త్రములలో చెప్పబడియున్న దేమనగా;—"ఔరస పుత్రుని భాగములో సగముభాగమునకు దాసీపుత్రుడు హక్కుదారుడుగా నుండును. ఆస్తిదారునికి పుత్రుడుగాని, కుమార్తెగాని, కుమార్తె కుమారుడుగాని లేనియెడల, యావదాస్తికిని దాసీపుత్రుడు హక్కుదారుడగును."

ఈ ధర్మశాస్త్ర వాక్యమునుబట్టి యిప్పుడు తీర్పులవలన స్థిరపడియుండున దేమనగా:—ఆస్తిదారునికి ఒక ఔరసపుత్రుడును ఒక దాసీ పుత్రుడును ఉన్నయెడల, ఈ దాసీపుత్రుడు ఔరసుడుగా నుండిన పక్షమున అర్థభాగమునకు హక్కుదారుడగును కాబట్టి, దానిలో అర్థభాగము అనగా యావదాస్తిలో నాల్గవ భాగము అతనికి చెందును. తక్కిన మూడుపాళ్లును ఔరసపుత్రునకు చెందును.* ఔరసపుత్రుడుగాని పౌత్రుడుగాని ప్రపౌత్రుడుగాని

* "ఔరస పుత్రుని భాగములో సగముభాగము"—అను ధర్మశాస్త్రవచనమునుబట్టి దాసీపుత్రునకు ఆరపాలును, అతనితో హక్కుదారులగు ఔరసపుత్రునకు, భార్యకు, కుమార్తెకు, కుమార్తె కుమారునికి ఒకపాలును చేరవలయునని కొందరి యభిప్రాయము. అనగా దాసీపుత్రునకు యావదాస్తిలో మూడింట ఒకపాలువచ్చును.

యుండక ఆస్తిదారుని భార్య, లేక కుమార్తె, లేక కుమార్తె కుమారుడు ఉండునెడల, ఔరసపుత్ర పౌత్ర ప్రపౌత్రులుండునప్పుడు వీరిలో నెవ్వరును హక్కుదార్లు కాకున్నను, దాసీపుత్రుడు మాత్ర ముండునప్పుడు హక్కుదార్లగుదురు. ఇది యెట్లనగా — దాసీ పుత్రుడే ఔరసపుత్రుడుగా నుండినయెడల యావదాస్తికిని అతడు హక్కుదారుడుగానుండును కాబట్టి, దానిలో సగముమాత్రమే అతనికి చెంది, తక్కిన సగము ఆస్తిదారుని భార్యకు, లేక కుమార్తెకు, లేక కుమార్తె కుమారునకు చెందును. (ఇ. లా. రి. 8 మ. 561; 14 బొం. 282; 25 మ. 522).

దాసీపుత్రుని హక్కు విషయమై మీద ఉదహరింపబడిన ధర్మశాస్త్రవాక్యములో, ఆస్తిదారుని కుమారుడును, కుమార్తెయును, కుమార్తె కుమారుడును మాత్రమే చెప్పబడి, ఆస్తిదారుని భార్యమాట స్పష్టముగా చెప్పబడకయున్నది. ఈ కారణముచేత, దాసీ పుత్రుడు ఉన్నప్పుడు ఆస్తిదారుని భార్యకు జీవనాంశపు హక్కుమాత్రమే కలిగియుండునని అర్థముచేసి ఆ ప్రకారము రెండు కేసులలో బొంబాయి హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 1 బొం. 97, 104; ఇ. లా. రి. 4 బొం. 37, 52). కాని, యిటీవల మరియొక కేసులో ఆస్తి దారుని దౌహిత్రుల (అనగా కుమార్తె కుమారుల) వరకు ఏ వారసులున్నను, ఔరసపుత్రునకు చెందగల భాగములో సగముమాత్రమే దాసీపుత్రునకు చెంది, తక్కిన సగము, సదరు ఇతర వారసులకు చెందునని యే అర్థముచేసి బొంబాయి హైకోర్టువారు తీరుమానించి యున్నారు. (ఇ. లా. రి. 14 బొం. 282; 23 బొం. 265). శూద్రజాతివారిలోగూడ విభక్త సోదరునికంటె ముందు లంజకుమార్తె వారసురాలు కాజాలదు. (ఇ. లా. రి. 32 బొం. 562).

విభాగయోగ్యముకాని జమీందారీ విషయములో జమీందారుని దాసీపుత్రునికంటె ముందుగా వితంతువు వారసురాలగునని మదరాసు హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 10 మ. 334; 15 మ. 307).

**300.** దాసీపుత్రునకు ఔరసపుత్రునితో గూడ సమష్టి హక్కు కలిగిన పిమ్మట, ఔరసపుత్రుడు పుత్రసంతతి లేక మృతి చెందినయెడల, యావదాస్తియు దాసీపుత్రునికే చేరునుగాని, వెనుకటి ఆస్తిదారుని భార్య, కుమార్తె, మొదలగువారికి ఎంత మాత్రమును చేరజాలదు. ఉదాహరణము—

శూద్రులలో దాసీపుత్రుని సమష్టి హక్కు.

బొంబాయి దేశములో ఒక శూద్రుడు మృతిచెందినప్పుడు, అతనికి ఔరసపుత్రుడు, దాసీపుత్రుడు, ఇద్దరు భార్యలు, కుమార్తె - వీరు అయిదుగురుండిరి. యావదాస్తికి ఔరసపుత్రుడును దాసీపుత్రుడును జాయింటుగా హక్కుదార్లయి సమష్టి కుటుంబము ఏర్పడుటవల్ల, భార్యలయొక్క జీవనాంశము విషయమైన భారమును కుమార్తెయొక్క వివాహాదికార్యముల విషయమైన భారమును, సదరు ఆస్తి వహించియుండెను. పిమ్మట ఔరసపుత్రుడు పుత్రసంతతి లేక మృతిచెందెను. అప్పుడు యావదాస్తియు దాసీపుత్రునికే చేరి ముందటివలెనే భార్యలయొక్కయు కుమార్తెయొక్కయు జీవనాంశాదిభారమును వహించియుండునని బొంబాయి హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 4 బొం. 37, 42; ఇ లా. రి. 11 క. 702; ఇ. లా. రి. 18 క. 151). తండ్రి జీవితకాలములోనే ఔరసపుత్రుడు నిస్సంతానుడుగా మృతిచెంది యుండినయెడల, దాసీపుత్రునకు యావదాస్తిలో సగముభాగము మాత్రమే చెంది, తక్కినసగముభాగము ఆస్తిదారుని భార్యకు చెందియుండును.

దాసీపుత్రుని ఔరస సంతతి.

**301.** దాసీపుత్రునికి ఎట్టి హక్కులు కలవో, అతడు లేనప్పుడు అతని ఔరస సంతతికిని అవే హక్కులు కలిగియుండునని మదరాసు హైకోర్టువారు తీరుమానించియున్నారు. ఇది యెట్లనగా— "ఏ" యనువాడు మృతిచెందునప్పుడు అతనికి ఔరస పుత్రుడును దాసీ పుత్రునియొక్క ఔరసపుత్రుడును ఉన్నయెడల, ఉభయులును తండ్రి ఆస్తికి హక్కుదారులగుదురు. మరియు, సదరు "ఏ" యనువాడు మృతిచెందినకాలమందు అతనికి ఔరస సంతతిలేక దాసీ పుత్రునియొక్క ఔరసపుత్రుడుమాత్ర మున్నయెడల, ఆస్తి యావత్తు ఇతనికే చెందునుగాని విభక్తుడైనయుండు సోదరునికి చెందదు. (ఇ. లా. రి. 25 మ. 519). దాసీపుత్రుని యొక్క ఔరససంతతికి ఎట్టిహక్కులు కలవో తీరుమానించ్గరి.

దాసీపుత్రుల ఆస్తి

**302.** దాసీపుత్రులు ఒండొరుల ఆస్తికి వారసుదార్లు కావచ్చును. కనుక, యిద్దరు దాసీపుత్రులకు సమష్టిగా ఆస్తి సంక్రమించినపిమ్మట వారిలో నొకడు మృతిచెందినయెడల, యావదాస్తియు సమష్టి హక్కువల్ల రెండవవానికి చెందును. దాసీపుత్రులకును వారి తల్లికిని పరస్పరము వారసుహక్కు కలిగియుండుటకెట్టి యాక్షేపణాయు నుండజాలదు. (1 మ. హై. 478; 2 మ. హై. 197; 8 మూ. ఇ. అ. 400; ఇ. లా. రి. 11 మ. 397; 12 మ. 277; 13 మ. 133; 21 మ. 40).

భార్య.

**303.** భార్య.—పుత్ర పౌత్ర ప్రపౌత్రులెవ్వరును లేనియెడల, మృతిచెందినవాని భార్య వారసురాలగుచున్నది. (ఇ.లా. రి. 2 మ. 182; ఇ. లా. రి. 3 బొం. 54; 2 స. 49). భార్యయందు సంతానవిహాపకముగా భర్త జన్మించునను భావమువల్ల, భర్త మృతిచెందినను, అతని భార్య జీవించియున్నయెడల భర్త శరీరములో అర్ధభాగముండునని ధర్మశాస్త్రములు వక్కాణించుచున్నవి. ఈ కారణమువల్లను, పుత్రహీనుడుగా మృతిచెందిన భర్త

కు అపరక్రియలు జరుపునట్టి కారణమువల్లను, భర్తయొక్క సపిండురాలుగా భావింపబడి, భార్య, పుత్రసంతతికి పిమ్మట వారసురాలుగా నేర్పడినది. (9 మూ. ఇ. అ. 610; ఇ. లా. రి. 1 మ. 228).

మితాక్షరము ప్రకారము సమష్టికుటుంబములోని భాగస్థుడు పుత్రసంతతి లేక మృతిచెందినయెడల అతని వితంతువునకు జీవనాంశపుహక్కు మాత్రమే కలిగియుండును గాని వారసుహక్కు కలిగియుండదు. భర్తయొక్క స్వార్జితపు సొత్తునకు మాత్రము ఆమె వారసురాలగును. (9 మూ. ఇ. అ. 539; ఇ. లా. రి. 1 మ. 312; ఇ. లా. రి. 4 క. 190; 10 మూ. ఇ. అ. 490). దాయభాగము ప్రకారము సమష్టికుటుంబపు భాగస్థులకు ప్రత్యేకపుహక్కులు కలిగియుండునట్లు భావింపబడుటచేత, వారిలో ఒకడు పుత్రసంతతి లేక మృతిచెందినయెడల, అతనివంతు భాగమునకు అతనిభార్య వారసురాలగుచున్నది.

**304.** ఆస్తిదారునికి ఇద్దరు ముగ్గురు భార్యలుండునపుడు యావదాస్తియు వారికి మొత్తముగా చేరును. అవిభాజ్యమగు జమీందారీ విషయములో జ్యేష్ఠభార్య పరిపాలనకర్తగా ఏర్పడి తక్కినభార్యలు జీవనాంశమునకు మాత్రము హక్కు కలిగియుందురు. (1 మ. తీ 453; 2 మ. తీ. 40; ఇ. లా. రి. 29 క. 828). విభాగ యోగ్యమగు ఆస్తి విషయములో అందరు భార్యలును సమానహక్కుదారులై, వారు కలిసియున్నపక్షమందు జ్యేష్ఠభార్య యావదాస్తికిని మేనేజరుగానుండును. వారిలో ఒకరొకరికి సరిపడక పోయిన యెడల కరారుమూలముగాగాని డిక్రీమూలముగాగాని ఆస్తి విభజించుకొని వారు తమతమ భాగములను ప్రత్యేకముగా అనుభవించ వచ్చును. (3 మ. హై. 51; ఇ. లా. రి. 24 మ. 441). కాని, అట్లు విభాగించుకొన్న పిమ్మట వారిలో నొకరు మృతిచెందినయెడల, ఆమెయొక్క భాగము తక్కిన భార్య

అనేక భార్యలు.

లకే చేరునుగాని అనంతర వారసులకు చేరదు. ఆ స్త్రీదానుని భార్య లందరును మృతిచెందిన పిమ్మటనే సదరు ఆస్తి అనంతర వారసులకు చెందునుగాని, ఒక్కభార్యయైన జీవించియుండునంతవరకు చెందజాలదు. (I బాం. హై. 66; 3 మ. హై. 268, 424; 11 మూ. ఇ. అ. 487; ఇ. లా. రి. 1 మ. 290; ఇ. లా. రి. 6 బాం. 85; ఇ. లా. రి. 7 అ. 114; ఇ. లా. రి. 16 మ. 1; కాని, చూడుడు - ఇ. లా. రి. 22 మ. 522, ఒండొరులకు సంపూర్ణ స్వాతంత్ర్యముతోడ భార్యలు ఆస్తిని విభాగించుకొనుట).

అసంపూర్ణ స్వాతంత్ర్యము.

**305**. భార్య మొదలగు స్త్రీ వారసులకు వారసుహక్కువలన పురుషుల ఆస్తి వచ్చినప్పుడు, దానివిషయమై వారికి సంపూర్ణ స్వాతంత్ర్యము కలుగక, యావజ్జీవమును అనుభవించుటకును అగత్యమయిన కార్యముల నిమిత్తము వ్రయపెట్టుటకును మాత్రము హక్కు కలిగియుండును. కాబట్టి, మీద చెప్పబడిన తీరున భార్యలందరును ఆస్తిని విభాగించుకొని అనుభవించుచున్నను, వారిలో ఎవరుగాని తమయొక్క భాగమును పరాధీనము చేయుటకు స్వతంత్రులుగా నుండరు. ఒకవేళ పరాధీనముచేసినను, సదరు పరాధీనము ఆమెయొక్క జీవితకాలమునందుమాత్రమే చెల్లి, ఆమె మృతిచెందిన పిమ్మట ఆమెయొక్క భాగము యావత్తును సవతులకు చెందుచున్నది. ఆస్తిని విభాగించుకొనకపోయినను, ఆస్తిదారుని భార్యలలో నెవ్వరైనను తనవంతు భాగము తన జీవితకాలమువరకు పరాధీనము చేయవచ్చును. మరియు, ఇట్లు పరాధీనము పొందినవాడు తక్కిన భార్యల మీద విభాగము నిమిత్తము దావా తేవచ్చును. సదరు పరాధీనము ఏభార్య వలన చేయబడునో ఆమె జీవితకాలమునకు పిమ్మట చెల్లజాలదు. (ఇ. లా. రి. 9 క. 580; ఇ. లా. రి. 11 మ. 304; ఇ. లా. రి. 26 మ. 334; ఇ. లా. రి. 31 బాం. 560).

**306.** భర్త జీవించియుండగా వ్యభిచారిణిగా సంచరించి వ్యభిచారదోషము.
నట్టి భార్యకు వారసుహక్కువల్ల భర్తయొక్క ఆస్తి రాజాలదు. (13 క. హై. 1). వ్యభిచార కారణమువల్ల భర్తచేత వదిలి పెట్టబడిన భార్యవిషయమై మాత్రమే యీవిధి చెల్లునుగాని భర్త సమ్మతించి వద్దనుంచుకొన్న భార్యకు చెల్లజాలదని చెప్ప దగియున్నది. మరియు, వ్యభిచారదోషము రుజువుచేయబడని సందర్భమున భర్తవల్ల వదిలిపెట్టబడినంత మాత్రముచేత అతని యొక్క ఆస్తి విషయమై భార్యకుగల వారసుహక్కు నశింపజా లదు. (6 మై. 118).

భర్త మృతిచెందిన పిమ్మట భార్య వ్యభిచారిణిగా సంచరించిన యెడల, అతని ఆత్మోజ్జీవనమునకు వలయు వైదిక కర్మలు జరిపిం చుటకు ఆమె యోగ్యురాలుగానుండదు కాబట్టి, వారసుహక్కు వలన ఆమెకు వచ్చియుండు భర్త తాలూకు ఆస్తి తప్పిపోవును - అని పూర్వకాలమునందు కొందరుఅభిప్రాయపడిరి. కాని, యిటీ వల ఈ విషయము చక్కగా చర్చింపబడి భర్త మృతిచెందిన పి మ్మట అతని భార్య వ్యభిచారిణిగా సంచరించినను, ఆమెకు వచ్చి యుండు భర్త తాలూకు ఆస్తి పోజాలదని హైకోర్టువారివల్లను ప్రివీకౌన్సిలు వారివల్లను గూడ తీరుమానింపబడి యున్నది. (13 క. హై. 1; ఇ. లా. రి. 5 క. 776-ప్రి కౌ.; 4 బొం. హై. 25; ఇ. లా. రి. 2 అ. 150, 171; ఇ. లా. రి. 24 మ. 441; చూడు 1858 సం॥ బం. స. తీ. 1891).

**307.** ఆస్తిదారుడు మృతిచెందిన పిమ్మట అతని ఆస్తికి పునర్వివాహము.
వారసురాలుగా నేర్పడిన భార్య మరల వివాహమాడిన యెడల, ఆమె మృతిచెందినట్టుగా భావింపబడును. కాబట్టి, భర్తయొక్క ఆస్తియందు ఆమెకు కలిగియుండు యావత్తు హక్కులును న శించి, ఆమె కనంతరమువచ్చువారసులకు సదరు ఆస్తి చెందును.

మరల వివాహమాడవచ్చునని భర్త అనుజ్ఞయిచ్చి మృతిచెందిన యెడల సదరు ఆస్తియందు ఆపె హక్కులు నిలుచును. (1856 సం॥ 15 నెం॥ హిందూవితంతు వివాహ చట్టము, సె. 2; ఇ. లా. రి. 19 క. 289, 292; 13 క. హై. 75. హిందూ వితంతు వివాహచట్టమువల్ల వితంతు వివాహములు లాప్రకారము చెల్లునని మాత్రమే విధింపబడి యున్నదిగాని, సదరు పునర్వివాహ కారణమువల్ల దేవాలయ ప్రవేశనిషేధము వగైరా జాతిసంబంధమగు చర్యలు కూడవని నియమింపబడి యుండలేదు - ఇ. లా. రి. 13 మ. 293).

కులాచారమువలన పునర్వివాహము చెల్లునట్టి జాతులలో పునర్వివాహము చేసికొన్న హిందూవితంతువునకు తన ప్రథమ భర్తయొక్క ఆస్తివిషయమైన వారసుహక్కుగాని జీవనాంశపు హక్కుగాని నశింపదని అలహాబాదు హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 11 అ. 330; 20 అ. 476; 29 అ. 122; 31 అ. 161). కాని, మద్రాసు బొంబయి కలకత్తా హైకోర్టులవారు, కులాచారమువల్ల పునర్వివాహము చెల్లునట్టి జాతులలో గూడ మృతిచెందిన భర్తయొక్క వితంతువుగా, అనగా అతనిశరీరముయొక్క జీవించియున్న అర్థభాగముగా, ఆపెనిలిచియున్నంతకాలమే అతనిఆస్తివిషయమై హక్కునిలిచియుండుననియు, అన్యమతావలంబనము వగైరా యేకారణములవల్లను సదరుహక్కు ఎక్కువకాజేరదనియు తీరుమానించిరి. (1 బొం. 431; 2 బొం. 361; 3 మై. 239; ఇ. లా. రి. 1 మ. 226; ఇ. లా. రి. 7 మ. 321; ఇ. లా. రి. 19 క. 289; ఇ. లా. రి. 22 క. 589).

కుమార్తె. **308.** కుమార్తె.— మృతిచెందిన ఆస్తిదారునికి పుత్రపౌత్ర ప్రపౌత్రులుగాని భార్యగాని లేనియెడల, కుమార్తె వారసురాలగుచున్నది. మరియు ఆస్తిదారుని భార్య వారసురాలు

గా నేర్పడినను, ఆపెకు తన జీవితకాలమంతయు ఆస్తిని అనుభవించునట్టి హక్కుమాత్రమే కలిగియుండును గనుక, ఆపె మృతి చెందినప్పుడు తిరుగా వెనుకటి ఆస్తిదారునికి ఎవరు సమీపవారసులుగా నుందురో వారికే ఆస్తి చెందుచున్నది. కాబట్టి, భార్యకు పిమ్మట కుమార్తె వారసురాలగును. సపిండ వర్గములో చేరనిదయ్యును, ఇట్లు భార్యకు పిమ్మట అనేక సపిండులకు ముందుగా కుమార్తె వారసురాలుగా చేర్చబడి యుండుటకు రెండు కారణము లూహింపదగియున్నవి. ఒకటి, తండ్రితోగల సమీప రక్తసంబంధము - రెండు, పిండప్రదాన యోగ్యతగల కుమారుని (దౌహిత్రుని) కలిగించునట్టి విషయము.

**309**. వారసుహక్కు విషయములో భార్యకువలెనే కుమార్తెకుగూడ వ్యభిచారదోషమువలని భాధకము కలదని కలకత్తా హైకోర్టువారు తీరుమానించియున్నారు. అనగా, వ్యభిచారిణిగానుండిన కుమార్తెకు వారసుహక్కువల్ల ఆస్తి రానేరదుగాని, ఆస్తికి హక్కుకలిగినపిమ్మట కుమార్తె వ్యభిచారిణిగా సంచరించినయెడల,సదరు హక్కుతప్పజాలదు. (13 క. హై. 4ర; ఇ. లా. రి. 4 క. 550; ఇ. లా. రి. 22 క. 347). మహమ్మదీయ మతములో చేరి ఒక మహమ్మదీయునివలన నిక్కావివాహము చేసికొనబడి బిడ్డలనుగన్న హిందూ స్త్రీకి తండ్రియొక్క ఆస్తి విషయమై వారసుహక్కు లేదనియు వ్యభిచారదోష కారణము వల్ల సదరుహక్కు నశించెననియు కలకత్తా హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 32 క. 871). వ్యభిచారదోషము.

బొంబయి హైకోర్టువారు వ్యభిచారదోష విషయమైన స్మృతివాక్యములనుచక్కగా పరిశీలించి వారసుహక్కునకు వ్యభిచార దోషమువల్ల కలుగునట్టి బాధకము భార్యతక్క తక్కిన స్త్రీ వారసుల విషయములో లేదనియు, వ్యభిచారిణిగానుండిన

కుమార్తె వారసురాలగుటకు ఆక్షేపణ లేదనియు తీరుమానించి యున్నారు. (ఇ. లా. రి. 4 బొం. 104). మదరాసు అలహాబాదు హైకోర్టులవారు గూడ ఇట్లే యభిప్రాయపడి యున్నారు. (ఇ. లా. రి. 5 మ. 149 ; 2 అ. హై. 363 ; ఇ. లా. రి. 1 అ. 46 ; ఇ. లా. రి. 26 మ. 506 ; ఇ. లా. రి. 31 మ. 100 ; ఇ. లా. రి. 31 బొం. 495).

పునర్వివాహము. 1856 సం॥ 15 నెం॥ హిందూ వితంతు పునర్వివాహ చట్టము ప్రకారము పునర్వివాహము చేసికొన్న కుమార్తె, తండ్రి ఆ స్తికి వారసురాలుగా నుండుటకు ఆక్షేపణ యుండజాలదు.

అనేక కుమార్తెలు. **310**. మృతిచెందిన ఆస్తిదారునికి ఒక భార్యవల్లగాని పెక్కు భార్యలవల్లగాని అనేకమంది కుమార్తెలుండునప్పుడు వారందరిలో వివాహము కాని కుమార్తెలే అన్ని సంప్రదాయముల ప్రకారమును ముందుగా వారసు లగుదురు. వివాహము కాని కుమార్తెలు లేనప్పుడును, వారందరు మృతిచెందిన పిమ్మటను, ఏ కుమార్తెలు వారసులగుదురను విషయమునుగూర్చి ఆయా సంప్రదాయములకు కొంత భేదము కనబడుచున్నది.

దాయభాగ సంప్రదాయము ప్రకారము - (1.) వివాహము కాని కుమార్తెలు ముందుగా వారసులగుదురు. (2.) వీరు లేనప్పుడును వీరందరు మృతిచెందిన పిమ్మటను, పుత్రసంతతి కలిగి యుండు కుమార్తెలును కలుగదగిన కుమార్తెలును చేరి వారసు లగుదురు. పుత్రసంతతి కలిగియున్న యెడల విధవ కుమార్తెలు గూడ వారసులగుదురు - (ఇ. లా. రి. 18 క. 327). పుత్రసంతతి లేని విధవకుమార్తెలును, గొడ్రాండ్రుగానుండు కుమార్తెలును, స్త్రీ సంతానము మాత్రమే కలిగియుండు కుమార్తెలును - వీరు ఏసందర్భమునందును వారసులు కాజాలరని తీర్పులు చేయబడి యున్నవి. (2 డబ్లియు. మెక్. 39, 44, 46, 49, 58 ; 3 బం. స.

తీ. 362; 2 స. 176). ఆస్తి వచ్చినపిదప గొడ్రాలితనము ఏర్పడినయెడల, సదరు ఆస్తియందలి హక్కు తప్పజాలదు. (15 క. హై. 10). మరియు, ఈకాలమున 1856 సం॥ 15 నెం॥ చట్టము వల్ల వితంతువు వివాహమాడి పుత్రసంతతిని కలిగింపవచ్చును కాబట్టి, వితంతువుగా నుండునంత మాత్రముచేత బంగాళా సంప్రదాయము ప్రకారము కుమార్తెకు వారసుహక్కు లేదని చెప్పుటకు వీలులేదు. (19 స. 189).

మితాక్షర సంప్రదాయము ప్రకారము - (1.) వివాహముకాని కుమార్తెలు ముందుగా వారసులగుదురు. (2.) వీరు లేనప్పుడును వీరందరు మృతిచెందిన పిమ్మటను, వివాహమైన కుమార్తెలలో బీదలుగానుండు వారందరును వారసులగుదురు. వీరు విధవలుగా నున్నను ముత్తయిదువలుగా నున్నను సరే సమానమగు హక్కు కలిగియుందురు. (3.) వీరు లేనప్పుడును వీరికి పిమ్మటను, వివాహమైన కుమార్తెలలో భాగ్యవంతురాండ్రుగా నుండువారు వారసులగుదురు. వీరికిగూడ విధవలు ముత్తయిదువలు, అను భేదము లేదు. ఈ సంప్రదాయము ప్రకారము కుమార్తెలయొక్క వారసుహక్కు వారికి పుత్రసంతతి కలిగియుండుటనుబట్టి యుండదు. కాశీరాజ్యమునందును బొంబయి మదరాసుప్రెసిడెన్సీలయందును ఈమితాక్షరసిద్ధాంతము చెల్లుచున్నది. (ఇ. లా. రి. 14 బొం. 4, 12; 2 బొం. హై. 5; 6 బొం. హై. 183; ఇ. లా. రి. 3 మ. 265; ఇ. లా. రి. 4 అ. 243; ఇ. లా. రి. 2 అ. 561; ఇ. లా. రి. 3 క. 587; 2 స. 176; ఇ. లా. రి. 23 బొం. 229).

మిథిల సంప్రదాయము ప్రకారము - (1.) వివాహముకాని కుమార్తెలు ముందుగా వారసులగుదురు. (2.) వీరు లేనప్పుడును వీరికి పిమ్మటను, వివాహమైన కుమార్తెలు వారసులగుదురు.

వీరికి విధవలు ముత్తయిదువలు, అను భేదములేదు. మరియు, పుత్రసంతతినిబట్టిగాని భాగ్యమునుబట్టిగాని భేదముగూడ లేదు.

సమానముగుహక్కు.

**311.** పై పేరాలో చెప్పబడిన తరగతులలో ఏ తరగతికు మార్తెలకు గాని వారసుహక్కువలన తండ్రియొక్క ఆస్తివచ్చినప్పుడు, వారందరును సదరు ఆస్తికి జాయింటుగా సమాన హక్కుదార్లగుదురు. ఇంతకు ముందు అనేక భార్యల విషయమై 304-వ పేరాలో చెప్పబడిన సంగతులన్నియు జాయింటుగా హక్కుదార్లయిన కుమార్తెలకుగూడ చెల్లుచున్నవి. ఒకరొకరికి సరిపడనియెడల, వారు ఆస్తిని విభాగించుకొని అనుభవించవచ్చునుగాని పరాధీనపరచ గూడదు. పరాధీనపరచినను అట్టి పరాధీనము ఆపె జీవితకాలమువరకు మాత్రమే చెల్లును. వారిలో ఒకరు మృతిచెందినయెడల, ఆపెయొక్క భాగము, ఆ తరగతి కుమార్తెలలో తక్కినవారికి చెందునుగాని ఆపె కుమారులకు చెందజాలదు. ఆ తరగతి కుమార్తెలందరు మృతిచెందినయెడల, పిమ్మట రాదగిన కుమార్తెలు వారసులగుదురు. వీరందరుగూడ మృతిచెందిన పిమ్మట, ఇతరులు వారసులగుదురు. అవిభాజ్యమగు జమీందారీ విషయములో-ఏ తరగతి కుమార్తెలు వారసులగుదురో వారిలో జ్యేష్ఠురాలు రాజ్యాధికారము కలిగియుండును. (3 మ. హై. 317; 14 క. హై. 246; 15 క. హై. 10; 6 మ. హై. 310; ఇ. లా. రి. 24 క. 339; ఇ. లా. రి. 25 అ. 546; ఇ. లా. రి. 23 మ. 504; ఇ. లా. రి. 9 క. 154).

బొంబయి ప్రెసిడెన్సీలో మాత్రము కుమార్తెలకు వారసు హక్కువలన ఆస్తి వచ్చినప్పుడు, దానియందు వారు పురుషులవలెనే సంపూర్ణ స్వాతంత్ర్యముకలిగి యుందురు. కాబట్టి, వారికి పుత్రసంతతి లేనప్పుడు, వారు దానిని పరాధీనము చేయుటకు అభ్యంతరముండదు. (ఇ. లా. రి. 6 బొం. 85).

**312.** దౌహిత్రుడు (అనగా కుమార్తెకొడుకు).—మృతి చెందిన ఆస్తిదారునికి, పుత్రపౌత్ర ప్రపౌత్రులుగాని, భార్యగాని, కుమార్తెలుగాని లేనప్పుడును - కుమార్తెలకు ఆస్తివచ్చి వారందరును మృతిచెందిన పిమ్మటను - దౌహిత్రుడు (కుమార్తెకొడుకు) వారసుదారుడగుచున్నాడు. దౌహిత్రుడు భిన్నగోత్రుడగుటచేత బంధువర్గములో చేరినవాడయ్యెను, మాతామహునికి (తల్లి తండ్రికి) అతడు చేయగల పిండప్రదానమువల్లను, పుత్రహీనుడగువాడు తన కుమార్తెయొక్క పుత్రుని తనపుత్రునిగా నియమించుకొనునట్టి పూర్వాచారమువల్లను, సగోత్రసపిండులనేకులకంటె ముందుగా దౌహిత్రుడు వారసుదారుడగుట సంభవించెనని చెప్పదగియున్నది. కుమార్తెలకు పిమ్మట దౌహిత్రుడు వారసుదారుడగునట్టి విషయమై మిథిల సంప్రదాయము ప్రకారము పూర్వకాలమునందు సంశయముండెనుగాని, ఇప్పుడా సంశయముతీరి తక్కిన ప్రదేశములయందునలెనే తీరుమానింపబడి యున్నది. (6 బం. స. తీ. 140). దౌహిత్రుడు.

కుమార్తెయొక్క దత్తపుత్రుడుకూడ ఔరసపుత్రునివలెనే వారసు హక్కు కలిగియుండును. (2 మెక్. 74).

**313.** మృతిచెందిన ఆస్తిదారునికి భార్యగాని, ఏ తరగతి కుమార్తెయైనను సరే ఒక కుమార్తెగాని, జీవించియుండు నంతవరకు దౌహిత్రునికి వారసుహక్కు కలుగజాలదు. ఆస్తిదారుని భార్యయు అన్నితరగతుల కుమార్తెలును మృతిచెందిన పిమ్మటనే దౌహిత్రుడు వారసుడగును. (15 క. హై. 10; 1861 సం॥ మ. తీ. 137; 1 డబ్లియు. మెక్. 24; 2 డబ్లియు. మెక్. 44, 57; 1 అ. హై. 200; ఇ. లా. రి. 1 అ. 608; 5 బొం. హై. 139; ఇ. లా. రి. 8 అ. 365). మరియు, దౌహిత్రుల వారసుహక్కు, వారికి తమ తల్లులతోగల సంబంధమువల్ల కలుగుటచే, మాతామ దౌహిత్రులకు సమాన భాగములు.

హుని (తల్లితండ్రి)తో గల సంబంధమువల్ల కలుగుచున్నది కాబట్టి, అనేకమంది కుమార్తెలవల్ల అనేక దౌహిత్రులుండునప్పుడు, వారి కందరికి ఆస్తి సమాన భాగములుగా చేరునుగాని, తల్లుల సంఖ్య వెంబడి చేరజాలదు. అనగా, ఒకకుమార్తెవలన ఇద్దరు దౌహిత్రులును, మరియొక కుమార్తెవలన ముగ్గురు దౌహిత్రులును, ఇంకొక కుమార్తెవలన నలుగురు దౌహిత్రులును ఉండు నెడల, ఆస్తి తొమ్మిది భాగములుగా భాగింపబడి, సదరు దౌహిత్రులకు ఒక్కొక భాగము చేరును. (3 బం. స. తీ. 100).

అవిభాజ్యమగు జమీందారీకి దౌహిత్రులు వారసులుగా ఏర్పడినప్పుడు వారందరిలో జ్యేష్ఠుడైనవాడు రాజ్యాధికారమునకు హక్కుదారుడై యుండునుగాని, సదరు జమీందారీసొత్తును కడపట అనుభవించుచుండిన కుమార్తెయొక్క కుమారుడు హక్కుదారుడు కాడు. (6 మ. హై. 310; ఇ. లా. రి. 3 మ. 290).

దౌహిత్రుని సంపూర్ణ స్వాతంత్ర్యము.

**314.** దౌహిత్రునికంటె సమీపవారసులగు భార్య, కుమార్తె - వీరు మృతిచెందిన కాలమందు మూలపురుషుడే మృతిచెందినట్లు భావింపబడి, అతని ఆస్తి దౌహిత్రులకు సమభాగములుగా చెందుచున్నది. కాబట్టి, దౌహిత్రులకు వారసుహక్కు కలుగకమునుపే వారిలో ఒకడు మృతిచెందిన యెడల, ఆస్తియావత్తును తక్కిన దౌహిత్రులకే చెందునుగాని, మృతిచెందిన దౌహిత్రునియొక్క కుమారులకు ఎంతమాత్రమును చెందదు. (ఇ. లా. రి. 8 అ. 614; ఇ. లా. రి. 12 మ. 411). భార్యవలెను కుమార్తెవలెనుగాక, దౌహిత్రుడు సంపూర్ణ స్వాతంత్ర్యముగల వారసుదారుడు కాబట్టి, అతని యనంతరము అతని వారసులకే ఆస్తి చెందునుగాని భార్యకు పిమ్మటను కుమార్తెకు పిమ్మటను వలె అసలు ఆస్తిదారుని వారసులకు చెందజాలదు. (ఇ. లా. రి. 3 అ. 134; 16 మ. 11; 19 మ. 451).

**315.** వేర్వేరు కుటుంబములకు చేరిన దౌహిత్రులకు - అనగా వేర్వేరుకుమార్తెల కుమారులకు - మాతామహుని (తల్లి తండ్రి) యొక్క ఆస్తి వారసు రీత్యా వచ్చినప్పుడు, దానికి వారు ప్రత్యేక భాగస్థులుగానే యుందురు. (ఇ. లా. రి. 27 మ. 385). కాని, సమష్టిగానుండు ఇద్దరు ముగ్గురు దౌహిత్రులకు మాతామహుని ఆస్తి వారసురీత్యా వచ్చినప్పుడు, దానివిషయమై వారు ప్రత్యేక భాగములకు హక్కుదార్లుగా నుందురా, సమష్టి భాగస్థులుగా నుందురా, అను అంశము అంత స్పష్టముకాదు. మితాక్షర సంప్రదాయమునకు సంబంధించినట్టి యొక కేసులో ఈ చర్చ కలుగగా, దౌహిత్రులు ప్రత్యేక భాగములకే హక్కుదార్లుగా నుందురని కలకత్తా హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 17 క. 33). మదరాసు హైకోర్టువారు రెండు కేసులలో ఈ తీరుమానమును అనుసరించిరి. (ఇ. లా. రి. 19 మ. 70; 20 మ. 207). కాని, రెండవ కేసులో దాఖలుకాబడిన అప్పీలులో ప్రివీకౌన్సిలువారు హైకోర్టువారి తీరుమానమును త్రిప్పివేసి కలకత్తా తీరుమానమును ఖండించుచు సమష్టి కుటుంబమునందలి దౌహిత్రులకు వారసురీత్యా వచ్చినట్టి మాతామహుని ఆస్తికి వారు సమష్టిభాగస్థులుగానే యుందురని తీరుమానించిరి. (ఇ. లా. రి. 25 మ. 678). ఈ తీరుమానము ననుసరించి మద్రాసు హైకోర్టువారు దరిమిలాను ఒక కేసులో మాతామహుని ఆస్తి దౌహిత్రులకు వారసురీత్యా చెందగా, దానియందు అతడును అప్పటికి జన్మించియున్న అతని కుమారులును సమష్టి భాగస్థులుగా నుందురనియు ఈ కుమారులు తమ భాగముల నిమిత్తము దావా తేవచ్చుననియు తీరుమానించిరి. (ఇ. లా. రి. 27 మ. 382). ఇట్లుండియు, కుమారులకు తల్లి యొక్క స్త్రీధన ద్రవ్యమును, మేనల్లుళ్లకు మేనమామయొక్క-

దౌహిత్రుల వారసుహక్కు సమష్టి హక్కా, ప్రత్యేకపు హక్కా?

ఆస్తియు, వారసు రీత్యా వచ్చినప్పుడు దానివిషయమై వారు ప్రత్యేక భాగములకే హక్కుదార్లుగా నుందురుగాని సమష్టి భాగస్థులుగా నుండరని మదరాసు హైకోర్టుఫుల్ బెంచి వారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 27 మ. 300).

తలిదండ్రులు.

**316.** తలిదండ్రులు - దౌహిత్రుడు లేనియెడల, ఆస్తిదారుని తల్లిదండ్రులు వారసులగుదురుగాని, దౌహిత్రుని కుమారుడు వారసుకాజాలడు. మితాక్షర సంప్రదాయము ప్రకారము ముందు తల్లియు,పిమ్మట తండ్రియు, వారసులగుచున్నారు. మదరాసుబొంబయి ప్రెసిడెన్సీలయందును మిథిల కాశీరాజ్యములందును ఈ పద్ధతి చెల్లుచున్నది. (2 డబ్లియు. మెక్. 55; వె. బు. 110, 448; ఇ. లా. రి. 14 బొం. 605; దత్తుతల్లి - 33 బొం. 404). గుజరాతు దేశమునందు మయూఖగ్రంథాభిప్రాయము ననుసరించి ముందు తండ్రియు, పిమ్మట తల్లియు వారసులగుచున్నారు. (ఇ. లా. రి. 6 బొం. 541). బంగాళా సంప్రదాయము ప్రకారముగూడ ముందు తండ్రియు, పిదప తల్లియు వారసులగుచున్నారు. (2 డబ్లియు. మెక్. 54; 7 బం. స. తీ. 108).

తల్లియొక్క అసంపూర్ణ స్వాతంత్ర్యము.

**317.** వారసుహక్కువలన కుమారుని ఆస్తి తల్లికి వచ్చినప్పుడు, దానియందు ఆమెకు సంపూర్ణ స్వాతంత్ర్యము కలుగక, భార్య, కుమార్తె, మొదలగు స్త్రీ వారసులవలెనే యావజ్జీవమును అనుభవించుటకు మాత్రము హక్కు కలిగియుండును. (2 మ. హై. 402; 8 మ. హై. 91; 8 మూ. ఇ. అ. 500; ఇ. లా. రి. 32 బొం. 26).

వ్యభిచార దోషము.

భార్యవిషయములో వలె తల్లి విషయములోగూడ వారసుహక్కును వ్యభిచారదోషము బాధించునని కలకత్తా హైకోర్టువారు తీరుమానించియున్నారు. అనగా, వ్యభిచారిణిగానుండిన తల్లి, కుమారునిఆస్తివిషయమై వారసుహక్కు కలిగియుండదు.

కాని, ఆ స్తికి హక్కు కలిగిన పిమ్మట వ్యభిచారిణిగా సంచరించినయెడల బాధకము లేదు. (ఇ. లా. రి. 4 క. 550). బొంబయి మదరాసు హైకోర్టులవారి అభిప్రాయముల ప్రకారము వ్యభిచారదోషము భార్యయొక్క వారసుహక్కునుమాత్రమే బాధించునుగాని, కుమార్తె, తల్లి, మొదలగు స్త్రీ వారసుల హక్కును బాధింపజాలదు. అలహాబాదు హైకోర్టువారి యభిప్రాయమును అట్లే కానంబడుచున్నది. (ఇ.లా.రి. 4 బొం. 104; 2 అ. హై. 363; ఇ. లా. రి. 1 అ. 46; ఇ. లా. రి. 5 మ. 149; ఇ. లా. రి. 31 మ. 100).

1856 సం॥ 15 నెం॥ చట్టము 5-వ సె॥ ప్రకారము, తల్లి పునర్వివాహము చేసికొన్నను ఆమెకు తన కుమారుని ఆస్తియందలి యమైన వారసు హక్కు నశింపదు. (2 క. హై. 199; ఇ. లా. రి. 26 బొం. 388; 29 బొం. 91; 28 మ. 425). ఉదా.— పునర్వివాహము.

,,ఏ" యను వితంతువు వివాహమాడినపిమ్మట, ఆమె మొదటి భర్తవలన కలిగిన ,,బీ" యను కుమారుడును, పుత్రసంతతిగాని కుమార్తెగాని దౌహిత్రుడుగాని లేక మృతిచెందెను. ,,బీ" యొక్క ఆస్తికి, ,,ఏ" వారసుగా నుండుటకు ఆక్షేపణ లేదు.

పునర్వివాహమాడిన వితంతువునకు మృతిచెందిన భర్తయొక్క ఆస్తియందుగాని అతని పుత్ర పౌత్రాది క్రిందితరముల వారసులయొక్క ఆస్తియందుగాని యే విధమైన హక్కును నిల్వజాలదని 1856 సం॥ 15 నెం॥ వితంతు పునర్వివాహ చట్టము 2-వ సెక్షనువల్ల విధింపబడియున్నది. కాబట్టి, ఒక వితంతువునకు కుమారుని వద్దినుండి వారసుహక్కువలన వచ్చిన ఆస్తియందలి హక్కులు ఆమె పునర్వివాహము చేసికొన్న తక్షణము నశించి, సదరుఆస్తి ఆమె తర్వాతి వారసులకు చెందుననియు (ఇ.లా. రి. 22 బొం. 321, ఫుల్ బెంచ్) - పునర్వివాహము చేసికొన్న

మ్మట ఆపె ప్రథమవివాహపు కుమారుడు మృతిచెందిన యెడల, అతని ఆస్తికి ఆపె వారసురాలగుటకు ఆక్షేపణ లేదనియు (ఇ. లా. రి. 26 బొం. 388) - తీరుమానింపబడి యున్నది.

సవతి తల్లి.

**318.** దాయభాగము ప్రకారమును మితాక్షరము ప్రకారమునుగూడ, సవతితల్లికి వారసుహక్కు లేదు. (5 బం. స. తీ. 315; 6 బం. స. తీ. 53; 1852 సం॥ బం. స. తీ. 563; ఇ. లా. రి. 4 బొం. 208; తండ్రి సవతితల్లి - క. హై. సప్లిమెంటల్ వాల్యూం 67, ఇ. లా. రి. 16 అ. 221; ఇ. లా. రి. 5 మ. 29, 32; ఇ. లా. రి. 8 మ. 107).

బొంబయి ప్రెసిడెన్సీలో మాత్రము సవతితల్లికి వారసుహక్కు కలదని తీరుమానింపబడి యున్నది. అచ్చటగూడ, తల్లియను కారణమువల్ల ఆపె వారసురాలుకాజాలక, సగోత్ర సపిండుని భార్యయై తానుగూడ సగోత్ర సపిండురాలగునట్టి కారణమువల్ల వారసురాలగుచున్నది. (ఇ. లా. రి. 4 బొం. 188. కాని, ఇ. లా. రి. 11 బొం. 47 చూడుడు). స్పష్టముగా ఉదహరింపబడిన వారసులతర్వాత, అనగా, తండ్రితల్లి తర్వాత సవతితల్లి వారసురాలగుననియు, పినతండ్రిపై త్తండ్రి కుమారులకు ముందే ఆపెకు వారసుహక్కు కలుగుననియు, తీరుమానింపబడియున్నది. (ఇ. లా. రి. 19 బొం. 707).

దత్తతల్లి.

**319.** దత్తుతల్లి కన్నతల్లివలెనే భావింపబడుచున్నది. (ఇ. లా. రి. 33 బొం. 404). స్వీకర్తకు ఇద్దరు ముగ్గురు భార్యలుండి వారిలో ఒకరు మాత్రమే మాతృస్థానమున ఉంచుకొనబడి స్వీకారము చేసికొనబడిన యెడల, ఆపె జ్యేష్ఠభార్య కాకున్నను దత్తుని తల్లిగా భావింపబడి, తక్కినవారు సవతితల్లులుగా భావింపబడుదురు. కాబట్టి, దత్తుని మరణానంతరము అతనికి ఇతర సమీపవారసులు లేనియెడల, మాతృస్థానమునకు నియమింప

బడిన తల్లి మాత్రమే హక్కుదారురాలగును. (ఇ. లా. రి. 18 మ. 277; 23 మ. 1; చూడు 104 పేరా).

**320.** అన్నదమ్ములు.—తల్లిదండ్రుల తర్వాత అన్నదమ్ములు వారసులుగా నున్నారు. వీరిలో, ఏకోదరులు అనగా ఒకతల్లి బిడ్డలును, భిన్నోదరులు అనగా సవతి అన్నదమ్ములును గూడ ఉన్నయెడల, ఏకోదరులుమాత్రమే వారసులగుదురు - సవతి అన్నదమ్ములకు ఆస్తిలో ఏభాగమును రాజాలదు. ఏకోదరులైన అన్నదమ్ములొక్కరును లేనిపక్షమందు, ఆస్తికి సవతి అన్నదమ్ములు వారసుదారులగుదురు. గుజరాతు దేశమునందును బొంబయి పట్టణమునందును మాత్రము, అచ్చట ముఖ్యప్రమాణముగా చెల్లుచుండెడి మయూఖగ్రంథము ప్రకారము, ఏకోదరులైన అన్నదమ్ములొక్కరును లేకున్నను వారి కుమారులున్నయెడల యావదాస్తియు వీరికే చెందును.గాని సవతి అన్నదమ్ములకు చెందజాలదు. (12 మూ. ఇ. అ. 523; 3 క. హై. 13; 12 బొం. హై. 65).

అన్నదమ్ములలో కొందరు విభక్తులుగాను కొందరు సమష్టిగాను ఉండి, సమష్టిగా నున్నవారిలో ఒకడు మృతిచెందిన యెడల, అతని ఆస్తియావత్తును సమష్టిగానున్న సోదరులకే చెందునుగాని విభక్త సోదరులకు చెందనేరదు. (3 క. హై. 7).

మృతిచెందిన ఆస్తిదారుడును అతని సవతి సోదరుడును సమష్టిగానుండి, స్వంతసోదరుడు విభక్తుడుగా నున్న పక్షమందు, దాయభాగము ప్రకారము వీరిద్దరును ఆస్తికి సమానభాగస్థులగుదురు. (ఇ. లా. రి. 1 క. 27). ఈ సందర్భమున మితాక్షరము ప్రకారము యావదాస్తికిని సవతిసోదరుడే హక్కుదారుడగును.

మితాక్షరము ప్రకారమును మయూఖము ప్రకారమును గూడ ఏకోదర భిన్నోదర భేదము అన్నదమ్ములకును వారి పుత్ర

అన్నదమ్ములు - ఏకోదరులు, భిన్నోదరులు.

సంతతికిని మాత్రమే చెల్లునుగాని, పినతండ్రి పెత్తండ్రి పినతాత పెత్తాత మొదలగు దూరపుమెట్లను చేరిన వారసులకు చెల్లదని బొంబయి హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 6 బొం. 394; 24 బొం. 317; 26 బొం. 715). అలహాబాదు హైకోర్టువారు భిన్నముగా తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 19 అ. 215). దాయభాగము ప్రకారము గూడ భిన్నముగానే యుండును.

అన్నదమ్ముల కుమారులు.

**321**. అన్నదమ్ముల కుమారులు.—స్వంత అన్నదమ్ములుగాని సవతి అన్నదమ్ములుగాని ఎవ్వరును లేనియెడల, అన్నదమ్ముల కుమారులు వారసులగుచున్నారు. ఆస్తిదారుడు మృతినొందిన కాలమున, అతని స్వంత, లేక, సవతి అన్నదమ్ములలో ఒకడైనను జీవించియున్న పక్షమందు, ఆస్తి యావత్తును అతనికే చెందునుగాని, అంతకుపూర్వము మృతిచెందిన అన్నదమ్ముల కుమారులకు చెందజాలదు. (3 బం. స. తీ. 106, 289; 23 స. 272). గుజరాతు దేశమునందును బొంబయి పట్టణమునందును మాత్రము, అచ్చట ప్రమాణముగా అంగీకరింపబడుచుండెడి మయూఖగ్రంథము ప్రకారము, స్వంత అన్నదమ్ముల కుమారులున్నయెడల వీరే ఆస్తికి వారసులగుదురుగాని సవతి అన్నదమ్ములు వారసులు కాజాలరు. (12 మూ. ఇ. అ. 523; 3 క. హై. 13; 12 బొం. హై. 65). మరియు, సదరు మయూఖగ్రంథము ప్రకారము, ఆస్తిదారుని మరణకాలమున, అన్నదమ్ములు కొందరును, అంతకు పూర్వము మృతిచెందిన సోదరుని కుమారుడును జీవించియున్నయెడల, ఇతడు అన్నదమ్ములతోగూడ సమభాగమునకు హక్కుదారుడుగానుండును.

ఆస్తిదారుడు మృతిచెందిన కాలమునందు జీవించియుండి ఆస్తికి వారసుదార్లుగా నేర్పడిన అన్నదమ్ములలో ఒకడు ఆస్తిని

విభాగించుకొనకముందే మృతిచెందిన యెడల, అతని వంతు భాగము అతని కుమారులు వగైరా వారసులకు చెందునుగాని తక్కిన అన్నదమ్ములకు చెందనేరదు. (2 స. 123; 24 అ. 273).

మృతిచెందిన ఆస్తిదారుని స్వంత అన్నదమ్ముల కుమారులును సవతి అన్నదమ్ముల కుమారులునుగూడ ఉన్న పక్షమందు, స్వంత అన్నదమ్ముల కుమారులే వారసులగుదురు. మరియు అన్నదమ్ముల కుమారులలో, కొందరు మృతిచెందిన ఆస్తిదారునితో సమష్టిగానుండి కొందరు విభక్తులుగానున్న యెడల, ఆస్తి యావత్తును సమష్టిగా నున్నవారికే చెందును. సవతి అన్నదమ్ముల కుమారులు ఆస్తిదారునితో సమష్టిగానుండి, స్వంత అన్నదమ్ముల కుమారులు విభక్తులుగా నున్న యెడల, దాయభాగము ప్రకారము వీరిద్దరును సమాన భాగస్థులగుదురు. (3 స. 43; 6 స. 93; 3 క. హై. 7; ఇ. లా. రి. 1 క. 27; ఇ. లా. రి. 35 క. 721). స్వంత అన్నదమ్ముల కుమారులు - సవతి అన్నదమ్ముల కుమారులు.

అన్నదమ్ముల కుమారులు సహోదరుల వలెనే సమభాగములకు హక్కుదార్లగుదురుగాని, తండ్రుల సంఖ్యనుబట్టి భాగములను పొందరు. ఇది యెట్లనగా—ఒక ఆస్తిదారుని మరణకాలమునందు అతనికి "ఏ" యను అన్నయొక్క కుమారులిద్దరును, "బీ" యను అన్నయొక్క కుమారులు ముగ్గురును వారసులుగా నేర్పడిరి. ఈ 5-గురును వారి పినతండ్రి ఆస్తిని సమభాగములుగా పొందుదురు. (15 స. 70; 6 స. 93; 9 స. 403) సమభాగములు.

అన్నదమ్ముల దత్తపుత్రులుగూడ ఔరసపుత్రులవలెనే వారసుహక్కు కలిగియుందురు. (2 ఢిల్లీయు నుక్. 74).

**322.** <u>అన్నదమ్ముల మనుమలు</u> —దాయభాగముప్రకారము, అన్నదమ్ముల కుమారుల తర్వాత అన్నదమ్ముల మనుమలు అన్నదమ్ముల మనుమలు.

వారసులగుచున్నారు. వీరిలో సహోదరులగు (స్వంత) అన్నదమ్ములయొక్క మనుమలుండగా, భిన్నోదరులగు (సవతి) అన్నదమ్ములయొక్క మనుమలు వారసులు కాజాలరు. (ఇ. లా. రి. 9 క. 563). మితాక్షరము ప్రకారముగూడ అన్నదమ్ముల కుమారుల తర్వాత అన్నదమ్ముల మనుమలు వారసులగుదురని మిథిలదేశమునుండి వచ్చిన యొక కేసులో బంగాళా సదరు కోర్టువారు తీరుమానించిరి. (1855 సం॥ బా. స. తీ. 382). పశ్చిమహిందూస్థానమునందు అన్నదమ్ముల మనుమడు వారసుడగునని తీరుమానించిరిగాని ఫలానావారి తర్వాత వచ్చునట్లు నిర్ధారణ చేయలేదు. (వె. బు. 480). మదరాసు హైకోర్టువారు ఈ విషయమును చక్కగా చర్చించి, మితాక్షరము ప్రకారము అన్నదమ్ముల కుమారుల తర్వాత అన్నదమ్ముల మనుమలు వారసులు కారనియు, అన్నదమ్ముల మనుమలకంటె ముందుగా పినతండ్రి పెత్తండ్రి కుమారులు వారసు లగుదురనియు, తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 5 మ. 291). దీనికి తల్లక్రిందుగా అలహాబాదు హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 24 అ. 128).

మితాక్షర దాయ భాగములు విడిపోవుట.

**323**. సకుల్యులు, సమానోదకులు — వారసుల క్రమములో అన్నదమ్ముల కుమారుల తర్వాత మితాక్షర దాయభాగములకు ముఖ్యమైన భేదమేర్పడుచున్నది. దాయభాగమునందు పిండప్రదాన యోగ్యతనుబట్టి వారసుహక్కు నిర్ణయింపబడుటచేత, సగోత్ర సపిండులతోగూడ కలిసి భిన్నగోత్ర సపిండులు (అనగా బంధువులు) వారసులుగావచ్చి, పిమ్మట సకుల్య సమానోదకులు వారసులగుచున్నారు. మితాక్షరమునందు సామీప్యత అనగా రక్తసంబంధమునుబట్టి వారసుహక్కు నిర్ణయింపబడుటచేత, సగోత్ర సపిండులందరును - అనగా సపిండ సకుల్య సమా

నోదకులందరును - గడచిన పిమ్మటగాని భిన్నగోత్ర సపిండులు (బంధువులు) వారసులుగా నేర్పడరు. మితాక్షర దాయభాగ సిద్ధాంతముల ప్రకారము వారసుదార్ల క్రమములను తెలుపునట్టి పట్టీలు 325, 328 - పేరాలలో వివరింపబడియున్నవి.

**324.** బంధువులు.—దాయభాగమునందును మితాక్షర మునందును స్పష్టముగా చెప్పబడి యుండునట్టి బంధువులుగాక, యింకననేకులు బంధువర్గములో చేరునట్లు వెనుకవివరించితిమి. (260 - వ పేజీలోని వంశావళి క్రింది రిమార్కు; 262 - వ పేజీ). ఈ యితరబంధువులలో, అక్కచెల్లెండ్రును, అక్కచెల్లెండ్ర కుమారులును, పెక్కు కేసులలో చిక్కులకు లోబడియెట్టకేలకు ఈ క్రింద వివరింపబడిన తీరున వారసులుగా నిలిచియున్నారు. బంధువర్గమువారు

బంగాళా సంప్రదాయము ప్రకారము, అక్కచెల్లెండ్రకు వారసుహక్కు లేదు. దాయభాగమునందు వారు బంధువులుగా చెప్పబడి యుండలేదు సరేగదా, వారికి పిండప్రదాన విషయమైన యోగ్యతకూడ ఎంతమాత్రమును లేదు. (7 బం. స. తీ. 192; 2 స. 180; 5 స. 215; 5 క. హై. అప్పెండిక్సు, 87; 1860 సం॥ బం. స. తీ. ii. 340). కాశీ సంప్రదాయము ప్రకారము మితాక్షరములో స్పష్టముగా ఉదహరింపబడని స్త్రీలు వారసులు కాజాలరు గనుక, అక్కచెల్లెండ్రు వారసులుకారు. (ఇ. లా. రి. 5 అ. 311; 28 అ. 117). అక్కచెల్లెండ్రు భిన్నగోత్రమునకు చేరినవారయ్యును అన్నదమ్ములతో శరీరసంబంధము కలవారుగనుక మితాక్షర సిద్ధాంతము ప్రకారము బంధువర్గములో చేరుదురని నిర్ధారణచేసి, వారికి వారసుహక్కు కలదని మదరాసు హైకోర్టువారు తీరుమానించియున్నారు. (8 మ. హై. 88; ఇ. లా. రి. 5 మ. 241). మదరాసు ప్రెసిడెన్సీలో సవతి అక్కచెల్లెండ్రకు వారసుహక్కు లేదు. (ఇ. లా. అక్కచెల్లెండ్రు.

రి. 5 మ. 29). బొంబయి ప్రెసిడెన్సీలో అక్క-చెల్లెండ్ర వారసు హక్కు సంపూర్ణముగా స్థిరపడియున్నది. అన్నదమ్ములవలెనే ఒకటే కుటుంబమున జన్మించినవారగుటచే అక్క-చెల్లెండ్రు సగోత్రసపిండు లగుదురనియు, భిన్న గోత్రులను వివాహమాడిన కారణమువల్ల సగోత్రజత్వము నశింపదనియు, మయూఖ గ్రంథము చెప్పుచున్నది. ఈ గ్రంథము ప్రకారము, తండ్రితల్లికి తర్వాతను తాతకు పూర్వమును అక్క-చెల్లెండ్రు వారసులగుచున్నారు. (వె. బు. 131, 463; ఇ. లా. రి. 2 బొం. 445). ధార్వాడజిల్లాలో, అన్నదమ్ముల వితంతువుకంటె ముందుగా అక్క-చెల్లెండ్రు వారసులగుదురని ఒక కేసులో బొంబయి హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 28 బొం. 82). సవతి అన్నదమ్ములకంటె ముందుగాను అన్నదమ్ముల కుమారుల తర్వాతను అక్క-చెల్లెండ్రు వారసులగుదురనియు కొన్ని కేసులలో తీరుమానింపబడెను. (ఇ. లా. రి. 3 బొం. 353; 24 బొం. 563). కాని, బొంబయి ప్రెసిడెన్సీయందు మయూఖము ముఖ్యప్రమాణముగానుండు ప్రదేశములలోమాత్రమే యీస్థితి చెల్లునుగాని మితాక్షరము ముఖ్యప్రమాణముగానుండు ప్రదేశములయందు అక్క-చెల్లెండ్రు, తండ్రి తల్లి తర్వాత వారసులగుదురనియు, మితాక్షరమునందు స్పష్టముగా ఉదహరించబడిన సవతి అన్నదమ్ములకుమారులకు ముందుగా వారసులు కాజాలరనియు, దరిమిలాను ఒక కేసులో తీరుమానించిరి. (ఇ. లా. రి. 32 బొం. 300). మరియు, స్వంత అక్క-చెల్లెండ్రు లేనియెడల, సవతి అక్క-చెల్లెండ్రు వారసులగుచున్నారు. (వె. బు. 469-70; 1 బొం. హై. 118; 9 మూ. ఇ. అ. 516; ఇ. లా. రి. 3 బొం. 353, 369; ఇ. లా. రి. 4 బొం. 188, 198). కుమార్తెలవలె వివాహము కానివారు వివాహమైనవారు బీదలు భాగ్యవంతురాం

ద్రుల అను భేదము లేక, అనేకమంది అక్కచెల్లెండ్రు వారసులుగా నేర్పడినప్పుడు వారందరు సమాన హక్కుదార్లుగా నుందురు. (ఇ. లా. రి. 5 బొం. 264; 26 బొం. 710).

అక్కచెల్లెండ్ర కుమారులు.

దాయభాగమునందు అక్కచెల్లెండ్ర కుమారులు బంధువర్గములో స్పష్టముగా చెప్పబడి యున్నందున, బంగాళా దేశమునందు వారిహక్కు మొదటినుండియు స్థిరపడి యున్నది. (6 బం. స. తీ. 234; 1 బం. స. తీ. 43; 5 బం. స. తీ. 46, 55, 315; 9 స. 463; 15 స. 433; 22 స. 264). మరియు, బంగాళా సంప్రదాయము ప్రకారము, స్వంత అక్కచెల్లెండ్రకును సవతి అక్కచెల్లెండ్రకును వారసుహక్కు విషయములో భేదము లేనందున రెండు తెగలవారును చేరి వారసులగుదురు. (2 డబ్లియు మెక్. 86; ఇ. లా. రి. 11 క. 69). మితాక్షరమునందు అక్కచెల్లెండ్ర కుమారుడు బంధు వర్గములో స్పష్టముగా చెప్పబడి యుండలేదు. ముందటికాలమునందు అతనికి వారసుహక్కు లేదనియే తీరుమానింప బడెను. (11 మూ. ఇ. అ. 386). కాని, అతనియొక్క వారసుహక్కు ఇప్పుడు స్థిరపడియున్నది. (2 క. హై. 28, ఫుల్ బెంచ్; 12 మూ. ఇ. అ. 448; 6 మ. హై. 278; ఇ. లా. రి. 2 మ. 304; ఇ. లా. రి. 20 అ. 191; సవతి అక్కచెల్లెండ్ర కుమారుడు - ఇ. లా. రి. 15 మ. 300). మరియు, అక్కచెల్లెండ్రకంటె ముందుగా వారికుమారుడు వారసుడగుననికూడ స్థిరపడియున్నది. (ఇ. లా. రి. 5 మ. 241). బొంబయి దేశములో, అక్కచెల్లెండ్ర కుమారుల వారసు హక్కు మొదటినుండి స్థిరపడియున్నది. స్వంత అక్కచెల్లెండ్ర కుమారులు లేనియెడల, సవతి అక్కచెల్లెండ్ర కుమారులు వారసులగుదురు. (వె. బు. 493, 495).

మితాక్షరము ప్రకారము
సపిండ వారసుల క్రమమును తెలుపు వంశావళి.
దీనిలో, ▢ చతుష్కోణమునందుండువారు స్త్రీలు.

---



**325.** మితాక్షరము ప్రకారము వారసుదార్ల క్రమము ఈ క్రింద ఉదహరింపబడి యున్నది. సమానోదకుల పర్యంతము గల 57 వారసుదార్లయొక్క క్రమము, ఎడమప్రక్క పేజీలోని వంశావళివల్ల స్పష్టముగా బోధపడగలదు. అన్నదమ్ముల కుమారుల తర్వాత అన్నదమ్ముల మనుమలు వారసులుకారని మద్రాసు హైకోర్టువారు తీరుమానించి యుండుటచే (322-వ పేరాచూడు), అన్నదమ్ముల కుమారుల తర్వాత తాతభార్య మొదలగువారు వారసులుగా చేర్చబడియున్నారు. మొదటి మూడు తరముల సపిండులయొక్క వారసుక్రమము ననుసరించి తర్వాత వచ్చువారి క్రమము ఏర్పరచబడి యున్నది. బంధువర్గము వారసులయొక్క క్రమము, మెయినుదొరవారి హిందూ లా గ్రంథమునందు 579-వ పేరాలో తెలుపబడిన పద్ధతి ననుసరించియున్నది. మితాక్షరము ప్రకారము వారసుదార్ల క్రమము.

సపిండులు.

1. కుమారుడు. ...... 295-302 పేరాలు చూడు.
2. మనుమడు. ,, ,,
3. మునిమనుమడు. ,, ,,
4. భార్య. .......... 303-7 ,,
5. కుమార్తె ........ 308-11 ,,
6. దౌహిత్రుడు...... 312-15 ,,
7. తల్లి. ............ 316-19 ,,
8. తండ్రి. 316 ,,
9. అన్నదమ్ములు. ... 320-వ పేరా.
10. అన్నదమ్ముల కుమారులు. 321-వ పేరా.
11. తండ్రి తల్లి.

12. తండ్రి తండ్రి - అనగా, తాత.
13. తండ్రి అన్నదమ్ములు - అనగా, పినతండ్రి పెత్తండ్రులు.
14. పినతండ్రి పెత్తండ్రుల కుమారులు.
15. తాత తల్లి.
16. తాత తండ్రి - అనగా - ముత్తాత.
17. పినతాత పెత్తాతలు.
18. పినతాత పెత్తాతల కుమారులు.
19. మునిమనుమని కుమారుడు.
20. ,, మనుమడు.
21. ,, మునిమనుమడు.
22. అన్నదమ్ముల మనుమలు.
23. ,, మునిమనుమలు.
24. ,, మునిమనుమల కుమారులు.
25. ,, మునిమనుమల మనుమలు.
26. పినతండ్రి పెత్తండ్రుల మనుమలు.
27. ,, మునిమనుమలు.
28. ,, మునిమనుమల కుమారులు.
29. ,, మునిమనుమల మనుమలు.
30. పినతాత పెత్తాతల మనుమలు.
31. ,, మునిమనుమలు
32. ,, మునిమనుమల కుమారులు.
33. ,, మునిమనుమల మనుమలు.
34. ముత్తాత తల్లి.
35. ,, తండ్రి.
36. ,, అన్నదమ్ములు.
37. ,, అన్నదమ్ముల కుమారులు.

మితాక్షరము ప్రకారము వారసుదార్ల క్రమము.

38. ,, తండ్రి తల్లి.
39. ,, తండ్రి తండ్రి – అనగా, ముత్తాత తాత.
40. ,, పినతండ్రి పెత్తండ్రులు.
41. ,, పినతండ్రి పెత్తండ్రుల కుమారులు.
42. ,, తాత తల్లి.
43. ,, ముత్తాత.
44. ,, తాతయొక్క అన్నదమ్ములు.
45. ,, తాతయొక్క అన్నదమ్ముల కుమారులు.
46. ముత్తాత అన్నదమ్ముల మనుమలు
47. ,, ,, మునిమనుమలు.
48. ,, ,, మునిమనుమల కుమారులు.
49. ,, ,, మునిమనుమల మనుమలు.
50. ముత్తాత పినతండ్రి పెత్తండ్రుల మనుమలు.
51. ,, ,, మునిమనుమలు.
52. ,, ,, మునిమనుమల కుమారులు.
53. ,, ,, మునిమనుమల మనుమలు
54. ముత్తాత తాతయొక్క అన్నదమ్ముల మనుమలు.
55. ,, ,, మునిమనుమలు.
56. ,, ,, మునిమనుమల కుమారులు.
57. ,, ,, మునిమనుమల మనుమలు.

## సమానోదకులు.

58. 21 నెం॥ క్రింద ఏడు తరములవరకు.
59. 25 నెం॥ ,,
60. 29 నెం॥ ,,
61. 33 నెం॥ ,,

మితాక్షరము ప్రకారము వారసుదార్ల క్రమము.

62. 49 నం॥ క్రింద ఏడు తరములవరకు.

63. 53 నం॥ ,,

64. 57 నం॥ ,,

65. 43 నం॥ యొక్క తల్లి.

66. 43 నం॥ యొక్క తండ్రి.

67. 43 నం॥ యొక్క పినతండ్రి పెత్తండ్రులు, వారి పుత్రసంతతివారు, 13 తరములవరకు.

68. 66 నం॥ యొక్క తల్లి.

69. 66 నం॥ యొక్క తండ్రి.

70. 66 నం॥ యొక్క పినతండ్రి పెత్తండ్రులు, వారి పుత్రసంతతివారు, 13 తరములవరకు.

71. ఈలాగుననే 13 తరములవరకు సమానోదకులు వారసులగుదురు. పిమ్మట బంధువులు—

---

బంధువులు.

1. కుమారుని దౌహిత్రుడు.
2. మనుమని దౌహిత్రుడు.
3. తండ్రి దౌహిత్రుడు, అనగా, అక్క చెల్లెండ్ర కుమారుడు
4. అన్నదమ్ముల దౌహిత్రుడు.
5. అన్నదమ్ముల కుమారుని దౌహిత్రుడు.
6. తాత దౌహిత్రుడు, అనగా, మేనత్త కుమారుడు.
7. పినతండ్రి పెత్తండ్రుల దౌహిత్రుడు. (3 అ. లా. జ. 146)
8. మేనమామ. (ఇ. లా. రి. 5 బొం. 597; 19 మ. 405).
9. మేనమామ కుమారుడు.
10. పినతల్లి పెత్తల్లి కుమారుడు.
11. ముత్తాత దౌహిత్రుడు, అనగా, తండ్రి మేనత్త కుమారుడు.

12. పినతాత పెత్తాతల దౌహిత్రుడు.
13. తండ్రి మేనమామ.
14. తండ్రి మేనమామ కుమారుడు.
15. తండ్రి పినతల్లి పెత్తల్లి కుమారుడు.
16. తల్లి తండ్రి. (ఇ. లా. రి. 15 మ. 421).
17. తల్లి పినతండ్రి పెత్తండ్రులు.
18. తల్లి పినతండ్రి పెత్తండ్రుల కుమారుడు.
19. తల్లి మేనత్త కుమారుడు.
20. తల్లి మేనమామ.
21. తల్లి మేనమామ కుమారుడు.
22. తల్లి పినతల్లి పెత్తల్లి కుమారుడు.
23. తల్లితాత.
24. తల్లి పినతాత పెత్తాతలు.
25. తల్లి పినతాత పెత్తాతల కుమారుడు.
26. తల్లితండ్రియొక్క మేనత్త కుమారుడు.
27. తల్లి ముత్తాత.
28. కుమారుని కుమార్తె. (ఇ. లా. రి. 14 మ. 149).
29. అక్క, చెల్లెలు. (8 మ. హై. 88; ఇ. లా. రి. 5 మ. 241).
30. మేనత్త. (ఇ. లా. రి. 13 మ. 10).

మితాక్షరను ప్రకారము వారసుల దార్ల క్రమము.

---

**326.** మితాక్షరము ప్రకారము ఇంకను అనేకమంది స్త్రీ పురుషులు బంధువర్గములోచేరు వారసులగునట్లు తీర్పులుచేయబడియున్నవి - కుమార్తెకుమార్తె (ఇ. లా. రి. 17 మ. 182; 31 మ. 321) - కుమార్తె కుమార్తె కుమారుడు (6 అ. లా. జ. 557; ఇ. లా. రి. 30 మ. 406) - దౌహిత్రుని కుమారుడు (ఇ. లా. రి. 30 మ. 406; 11 మ. 287; 17 అ. 523). అక్క

మితాక్షరను ప్రకారము ఇతర బంధువులు.

పెత్తండ్రి కుమారుని కుమారుడు (ఇ. లా. రి. 20 మ. 342)-అక్క-పెత్తండ్రి కుమార్తె (ఇ. లా. రి. 18 మ. 198)- అన్నదమ్ముల కుమార్తె (ఇ. లా. రి. 21 మ. 263)- మేనత్తకుమారుని కుమారుడు (ఇ. లా. రి. 31 మ. 321)- మేనత్తకుమార్తె కుమారుడు (ఇ. లా. రి. 23 మ. 123; 29 మ. 115)-తండ్రి మేనత్త మనుమడు (ఇ. లా. రి. 12 మ. 155)- మేనమామ మనుమడు (ఇ. లా. రి. 5 మ. 69).

బొంబయి దేశపు విశేష విధులు.

**327.** బొంబయి ప్రెసిడెన్సీలో-ముఖ్యముగా గుజరాతు దేశమందును బొంబయి పట్టణమందును-ప్రమాణముగా చెల్లుచుండునట్టి మయూఖగ్రంథము ప్రకారము, గోత్రజ సపిండుల భార్యలుగూడ సపిండులుగా భావింపబడి, భర్తలు మృతిచెందియుండు పక్షమునందు వారి స్థానములయందు వారసులుగా ఏర్పడుచున్నారు. (వె. బు. 131, 481; 6 బొం. హై. 152; ఇ. లా. రి. 2 బొం. 388; ఇ. లా. రి. 5 బొం. 110; ఇ. లా. రి. 4 బొం. 219; ఇ. లా. రి. 9 బొం. 31; 28 బొం. 453). ఇట్లు, ఆస్తిదారుని కుమారుని భార్య (కోడలు), మనుమని భార్య, మునిమనుమని భార్య, దౌహిత్రుని భార్య, అన్నదమ్ముల భార్య, అన్నదమ్ముల కుమారుల భార్య, పినతండ్రి పెత్తండ్రుల భార్య- ఈ మొదలగు వితంతువులు సామాన్యముగా వారి భర్తల తర్వాత మయూఖగ్రంథము ప్రకారము వారసులగుదురు.

మరియు, ఒక కుటుంబమునందు జన్మించినట్టి కారణమువల్ల అందలి స్త్రీ పురుషులకు సగోత్రజత్వమేర్పడునుగాన, స్త్రీలు భిన్నగోత్రులను వివాహమాడి సగోత్రత లేని వారయ్యు, సగోత్రజత్వముండునట్టి కారణముచేత వారసులగుదురని మయూఖగ్రంథము చెప్పుచున్నది. ఈ అభిప్రాయము ప్రకారము అక్క-పెల్లెండ్రు, అక్క-పెల్లెండ్ర కుమార్తె, అన్నదమ్ముల కుమార్తె,

కుమారుని కుమార్తె, కుమార్తె కుమార్తె, ఈ మొదలగు స్త్రీ వర్గమువారనేకులు వారసులుగా నేర్పడియున్నారు. (వె. బు. 137, 496-8). మేనత్త సగోత్ర సపిండురాలుగా భావింపబడి మేనమామకు ముందుగా వారసురాలగుచున్నది. (8 బొం. హై. 244). స్వంత మేనత్తకును సవతి మేనత్తకును భేదము లేదు. (ఇ. లా. రి. 26 బొం. 710). దౌహిత్రుని వితంతువు - చూడుడు ఇ. లా. రి. 25 బొం. 81.

దాయభాగము ప్రకారము వారసుల క్రమము.

**328**. దాయభాగము ప్రకారము వారసుదార్ల క్రమము ఈ క్రింద ఉదహరింపబడియున్నది. దాయభాగము ప్రకారము మొదటి మూడుతరముల సగోత్ర సపిండులతో కలిసి భిన్నగోత్ర సపిండులగు బంధువులందరు, అనగా పితృ బంధువులునుమాతృ బంధువులును, వారసులగుచున్నారు. అటుపిమ్మట, సకుల్యులు అనగా, 4, 5, 6 తరముల సగోత్రసపిండులును - వారికి పిమ్మట సమానోదకులును - వారసులగుచున్నారు. ఈ క్రింద సూచింపబడిన వారసు క్రమము తీర్పుల కనుగుణ్యముగా ఏర్పరుపబడియున్నది. (15 క. హై. 35 ; ఇ. లా. రి. 4 క. 411; ఇ. లా. రి. 9 క. 563, 566 ; ఇ. లా. రి. 15 క. 780; 5 క. హై. 15; ఇ. లా. రి. 26 క. 285; 6 బం. స. తీ. 234; 5 బం. స. తీ. 46, 55, 315 ; 9 స. 462 ; 12 స. 433; 24 స. 229). బంగాళా సంప్రదాయము ప్రకారము సాధారణముగా స్త్రీలకు వారసు హక్కు లేదు. కాని, భార్య, కుమార్తె, తల్లి, తండ్రితల్లి, తాత తల్లి - యీ అయిదుగురు మాత్రము, వారి విషయమై స్మృతి వాక్యములున్నందున వారసులుగా నిలిచియున్నారు. అక్క చెల్లెండ్ర కుమార్తె కుమారులు వారసులు కానేకారు. (ఇ. లా. రి. 35 క. 361).

దాయభాగము ప్రకారము వారసుదార్ల క్రమము.

## సపిండులు, బంధువులు.

1. కుమారుడు. ...295 - 302 పేరాలు చూడు.
2. మనుమడు. ,, ,,
3. మునిమనుమడు. ,, ,,
4. భార్య. ... 303 - 307 ,,
5. కుమార్తె ... 308 - 311 ,,
6. దౌహిత్రుడు 312 - 315 ,,
7. తండ్రి. ... 316 - 319 ,,
8. తల్లి. ... 316 - వ పేరా. ,,
9. అన్నదమ్ములు 320 - వ పేరా.
10. ,, ల కుమారులు. 321 - వ పేరా.
11. ,, ల మనుమలు. 322 - వ పేరా.
12. అక్కచెల్లెండ్ర కుమారులు.
13. తండ్రితండ్రి - అనగా, తాత.
14. తండ్రి తల్లి.
15. పినతండ్రీ పెత్తండ్రులు.
16. ,, ల కుమారులు.
17. ,, ల మనుమలు.
18. తాత దౌహిత్రుడు.
19. తాత తండ్రి - అనగా ముత్తాత.
20. తాత తల్లి.
21. పినతాత పెత్తాతలు.
22. ,, ల కుమారులు.
23. ,, ల మనుమలు.
24. ముత్తాత దౌహిత్రుడు.

దాయభాగము ప్రకారము వారసుదార్ల క్రమము.

25. కుమారుని దౌహిత్రుడు.
26. మనుమని దౌహిత్రుడు.
27. అన్నదమ్ముల దౌహిత్రుడు.
28. అన్నదమ్ముల కుమారుల దౌహిత్రుడు.
29. పినతండ్రి పెత్తండ్రుల దౌహిత్రుడు.
30. ,, కుమారుల దౌహిత్రుడు.
31. పినతాత పెత్తాతల దౌహిత్రుడు.
32. ,, కుమారుల దౌహిత్రుడు.
33. తల్లి తండ్రి.
34. మేనమామ.
35. ,, కుమారుడు.
36. ,, మనుమడు.
37. పినతల్లి పెత్తల్లి కుమారుడు.
38. తల్లి తాత.
39. తల్లి పినతండ్రి పెత్తండ్రులు.
40. ,, ల కుమారుడు.
41. ,, ల మనుమడు.
42. తల్లి తాత దౌహిత్రుడు.
43. తల్లి ముత్తాత.
44. తల్లి పినతాత పెత్తాతలు.
45. ,, ల కుమారుడు.
46. ,, ల మనుమడు.
47. తల్లి ముత్తాత దౌహిత్రుడు.
48. మేనమామ దౌహిత్రుడు.
49. ,, కుమారుని దౌహిత్రుడు.
50. తల్లి పినతండ్రి పెత్తండ్రుల దౌహిత్రుడు.

దాయభాగము ప్రకారము వారసుదార్ల క్రమము.

51. తల్లి పినతండ్రి పెత్తండ్రి కుమారుల దౌహిత్రుడు.
52. తల్లి పినతాత పెత్తాతల దౌహిత్రుడు.
53. ,, కుమారుల దౌహిత్రుడు.

## సకుల్యులు.

54. మునిమనుమని కుమారుడు.
55. ,, మనుమడు.
56. ,, మునిమనుమడు.
57. అన్నదమ్ముల మునిమనుమలు.
58. ,, మునిమనుమల కుమారులు.
59. ,, మునిమనుమల మనుమలు.
60. పినతండ్రి పెత్తండ్రుల మునిమనుమలు.
61. ,, మునిమనుమల కుమారులు.
62. ,, మునిమనుమల మనుమలు
63. పినతాత పెత్తాతల మునిమనుమలు.
64. ,, మునిమనుమల కుమారులు.
65. ,, మునిమనుమల మనుమలు.
66. ముత్తాత తండ్రి.
67. ,, అన్నదమ్ములు.
68. ,, అన్నదమ్ముల కుమారులు.
69. ,, అన్నదమ్ముల మనుమలు.
70. ,, అక్కచెల్లెండ్ర కుమారులు.
71. ,, తండ్రి తండ్రి - అనగా, ముత్తాత తాత.
72. ,, పినతండ్రి పెత్తండ్రులు.
73. ,, పినతండ్రి పెత్తండ్రుల కుమారులు.
74. ,, పినతండ్రి పెత్తండ్రుల మనుమలు.

దాయభాగము ప్రకారము వారసుదార్ల క్రమము.

75. ,, తాత దౌహిత్రుడు.
76. ,, ముత్తాత.
77. ,, తాతయొక్క అన్నదమ్ములు.
78. ,, తాతయొక్క అన్నదమ్ముల కుమారులు.
79. ,, తాతయొక్క అన్నదమ్ముల మనుమలు.
80. ,, ముత్తాత దౌహిత్రుడు.
81. ముత్తాత అన్నదమ్ముల దౌహిత్రుడు.
82. ,, అన్నదమ్ముల కుమారుని దౌహిత్రుడు.
83. ,, పినతండ్రి పెత్తండ్రుల దౌహిత్రుడు.
84. ,, పినతండ్రి పెత్తండ్రి కుమారుని దౌహిత్రుడు.
85. ,, పినతాత పెత్తాతల దౌహిత్రుడు.
86. ,, పినతాత పెత్తాత కుమారుని దౌహిత్రుడు.
87. ,, అన్నదమ్ముల మునిమనుమలు.
88. ,, ,, మునిమనుమల కుమారులు.
89. ,, ,, మునిమనుమల మనుమలు.
90. ,, పినతండ్రి పెత్తండ్రుల మునిమనుమలు.
91. ,, ,, మునిమనుమల కుమారులు.
92. ,, ,, మునిమనుమల మనుమలు.
93. ,, తాతయొక్క అన్నదమ్ముల మునిమనుమలు.
94. ,, ,, మునిమనుమల కుమారులు.
95. ,, ,, మునిమనుమల మనుమలు.

---

## సమానోదకులు.

96. 56 నెం॥ క్రింద ఏడు తరములవరకు.
97. 59 నెం॥ ,,
98. 62 నెం॥ ,,

దాయభాగము ప్రకారము వారసుదార్ల క్రమము.

99. 65 నం॥ క్రింద నేసు తరములవరకు

100. 89 నం॥ ,,

101. 92 నం॥ ,,

102. 95 నం॥ ,,

103. 76 నం॥ యొక్క తల్లి.

104. 76 నం॥ యొక్క సవతితల్లి పై స్త్రీలు, వారి పుత్రసంతతివారు, 13 తరములవరకు.

105. 103 నం॥ యొక్క తల్లి.

106. 103 నం॥ యొక్క సవతితల్లి పై స్త్రీలు, వారి పుత్రసంతతివారు, 13 తరములవరకు.

107. అలాగుననే 13 తరములవరకు సమానోదకులు వారసులగుదురు.

---

వారసులు లేనియెడల, ఆస్తి సర్కారువారికి చెందును.

**329.** మీాద చెప్పబడిన సపిండులు, సమానోదకులు, బంధువులు - ఈ వారసులలో నెవ్వరును లేనియెడల, బ్రాహ్మణుని యొక్క ఆస్తి, ఆతని గురువునకు, గురువు లేనియెడల శిష్యునకు, శిష్యుడు లేనియెడల సహపాఠికి, ఆతడును లేనియెడల పండితోత్తముడగు బ్రాహ్మణునికి, ఇతడును లేనియెడల ఏ బ్రాహ్మణునికైనను సరే చెందుననియు, బ్రాహ్మణులుతక్క తక్కిన జాతివారి ఆస్తివిషయములో హక్కుదార్లు ఎవరును లేనియెడల అది సర్కారువారికి చెందుననియు, ధర్మశాస్త్రములయందు చెప్పబడి యున్నది. కాని, గురుశిష్యులు మొదలగువారెవ్వరును బ్రాహ్మణుని ఆస్తికి హక్కుదార్లుగా నేర్పడిన కేసులు ఇంతవరకు కానంబడవు. మరియు, బ్రాహ్మణుని ఆస్తియైనను సరే, వారసుదార్లు లేనియెడల సర్కారువారికి చేరునని తీరుమానింపబడియున్నది. (8 మూా. ఇ. అ. 500). హక్కుదా

ర్లు ఎవరును లేనట్లు స్పష్టముగా రుజువుచేసిన పక్షమందే ఆస్తి సర్కారువారికి చేరునుగాని, లేనియెడల చేరదు. (12 మూ. ఇ. అ. 448). సర్కారువారికి ఆస్తి చేరినప్పుడు, వెనుకటి హక్కుదారునివల్ల తాకట్టు వగైరా పరాధీనములకు అది లోబరచబడి యుండినయెడల అట్టి పరాధీనములవల్లను, అతని అప్పుల వల్లను, వారు బద్ధులుగా నుందురు. (11 మూ. ఇ. అ. 619). మరియు, కడపటి వారసు, వితంతువు మొదలగు అసంపూర్ణ హక్కుదారుగా నుండినయెడల, తన స్వాతంత్ర్యమును మీరి ఆమె అనగత్యముగా చేసియుండు పరాధీనములను సర్కారు వారు ఆక్షేపించి రద్దుపరచవచ్చును. (8 మూ. ఇ. అ. 529).

**330.** ఒకసారి విభాగించుకొని పిదప సంసృష్టులైనవారు మితాక్షర కుటుంబమునందువలె సమష్టి హక్కులు కలిగియుండక, కొంచెము హెచ్చుతగ్గుగా దాయభాగ కుటుంబమునందువలె ప్రత్యేకపు హక్కులుకలిగి యుండునట్లు కనుపడుచున్నది. సంసృష్టి భాగస్థులలో ఒకడు మృతిచెందిన యెడల, యాజ్ఞవల్క్యాది స్మృతులనుబట్టి అతని ఆస్తికి, ముందుగా (1.) పుత్ర సంతతివారు వారసులగుదురు. వీరు లేనియెడల, (2.) సంసృష్టులైన అన్నదమ్ములలో ఏకోదరులు వారసులగుదురు. వీరు లేనియెడల, (3.) సంసృష్టులై భిన్నోదరులై యుండు అన్నదమ్ములు, విభక్తులై ఏకోదరులగు అన్నదమ్ములున్నయెడల వారితో జాయింటుగా హక్కుదార్లగుదురు. పిమ్మట, (4.) విభక్తులైన ఏకోదరులగు అన్నదమ్ములును - పిమ్మట, (5.) సంసృష్టులైన తండ్రి, లేక పినతండ్రి పెత్తండ్రి - (6.) విభక్తులైన భిన్నోదరులగు అన్నదమ్ములు, తండ్రి - (7.) తల్లి - (8.) భార్య - (9.) అక్కచెల్లెండ్రు - (10.) వీరెవరు లేనియెడల, ఆస్తిదారుని యితర సపిండులును సమానోదకులును - వారసులగుదురు.

సంసృష్టులైనవారికి గల వారసు హక్కు.

(ఇ. లా. రి. 1 క. 27; 5 స. 249; 7 స. 35; 20 స. 197; ఇ. లా. రి. 19 క. 634; 16 మ. 440; 33 మ. 165).

మైసూరు చీఫ్ కోర్టువారి తీరుమానము భిన్నముగా నున్నది. ఒకసారి విభాగము చేసికొని పిమ్మట సంసృష్టులైన వారికి, విభాగము జరుగని యట్లే సమష్టి హక్కు కలిగి యుండుననియు - వారిలో నెవ్వరైనను మృతి చెందినప్పుడు ఆతనివంతు భాగము తక్కిన భాగస్థులకు చెందునుగాని సంసృష్టులగు భాగస్థులున్నంతవరకు విభక్త భాగస్థులకు చెందదనియు సంసృష్టులైన అన్నదమ్ములలో ఒకడు పుత్రసంతతి లేక మృతిచెందిన యెడల, ఆతనివంతు భాగము సంసృష్టుడగు అతని సోదరునకు చెందును గాని అతని పితంతువు, కుమార్తెమున్నగువారికి చెందదనియు, వారు తీరుమానించిరి. (1 మైసూ. 82)

(4.) వారసు హక్కువిషయమైన అనర్హతలు.

వారసు హక్కు విషయమైన అనర్హతలు.

**331**. జాత్యనుసారముగా శాస్త్రోక్తకర్మలు జరిపించుట కొఱకు ఆస్తి యేర్పడినదనియు, ఆ యాస్తికి వారసులగువారు ఆస్తిదారుని ఆత్మోజ్జీవనమునకు ఆవశ్యకమైన కర్మలు జరిపించుటకు యోగ్యతగలవారుగా నుండవలయు ననియు, అట్టి యోగ్యత లేనివారు దాయాదులు కారనియు, ధర్మశాస్త్రములు వక్కాణించుచున్నవి. దాయానర్హతను కలిగించునట్టి దోషములు అనేకములు చెప్పబడియున్నవిగాని, వానిలో కొన్నిటికి, అనగా, అసత్య ప్రవర్తనము, మోసము, అశౌర్యము, లోభిత్వము, అనాచారము, తండ్రియెడల అవిధేయత, జూదము, పానము - యీ మొదలగువానికి ప్రాయశ్చిత్తము లేర్పరుపబడియున్నందున, అవి యీ కాలమున న్యాయస్థానములందు పాటింపబడ జాలవు. (1 స్ట్రే. 159; 3 అ. హై. 267; 1848 సం॥ బం. స.

తీ. 320; 1858 సం॥ మ. తీ. 118. క్లా., 6 బం. స. తీ. 62; 11 స. 535 చూడుము). కాబట్టి ప్రాయశ్చిత్తమువల్ల వదిలి పోజాలని దోషములుమాత్రమే ముఖ్యమైయున్నవి. అవి యేవనగా - జాతిభ్రష్టత - నపుంసకత్వము-పుట్టుక మొదలు అనివార్యమగు గ్రుడ్డితనము, చెవుడు, లేక మూగతనము - పిచ్చి - అంగహీనత్వము - అనివార్యమగు వ్యాధి. ఈ చెప్పబడ్డదోషములు కలవారు స్త్రీలైనను సరే పురుషులైనను సరే వారసు హక్కువలన ఆస్తిని పొందజాలరని మనుస్మృతి యాజ్ఞవల్క్య స్మృతి మొదలగు ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది.

**332.** మతము మార్చుకొనుటవల్లగాని బహిష్కరణము మొదలగు మరి యే కారణములవల్లగాని జాతిభ్రష్టులైనవారికి ఆస్తి హక్కులును వారసుహక్కులును నశింపజాలవని, సర్కారువారు, 1850 సం॥ 21 నెం॥ చట్టమును ఏర్పరచియున్నారు. జాతిభ్రష్టత.

కాబట్టి, హిందూ పురుషులుగాని, హిందూ స్త్రీలుగాని, క్రీసు మొదలగు అన్యమతములలో చేరినంతమాత్రముచేత, వారికి ఇతరుల ఆస్తివిషయమైన వారసు హక్కులు నశింపవు. (2 అ. హై. 446; ఇ. లా. రి. 1 బొం. 559). ఇతర కారణములవల్ల సదరు హక్కులు నశించినయెడల, మీదచెప్పబడిన చట్టము రక్షింపజాలదు. ఉదాహరణములు___

(1.) ఒక ఆస్తిదారుడు మృతిచెందినప్పుడు, అతని వితంతువును అంతకు ముందు జాతి భ్రష్టుడైన కుమారుడును ఉండిరి. ఆస్తి యావత్తును కుమారునికి చెందును.

(2.) ఒక ఆస్తిదారుడు మృతిచెందినప్పుడు అతనికి పుత్రసంతతివారెవ్వరును లేరు. స్త్రీ పునర్వివాహపు పార్టీవారితో భోజనము చేయుటవల్ల కులమునుండి బహిష్కరణము గావింపబడ్డ

అతని భార్యయు కులమునందున్న దూరపు జ్ఞాతులు కొందరును, ఉండిరి. భార్యయే వారసురాలగును.

(3.) ఒక ఆస్తిదారుడు మృతిచెందినప్పుడు అతనికి పుత్ర సంతతి వారెవ్వరును లేరు. బహిష్కరణము గావింపబడి వ్యభిచారిణిగా సంచరించుచుండిన వితంతువును, దూరపు జ్ఞాతులును మాత్రముండిరి. వితంతువు వారసురాలు కాజాలదు. ఏల యనగా - 1850 సం॥ 21 నెం॥ చట్టమువల్ల బహిష్కరణ దోషము బాధించకపోయినను, వ్యభిచార కారణమువల్ల వారసు హక్కు తొలగిపోవును. (5 క. ప్రై. 460; 13 క. హై. 1, 25, 75; ఇ. లా. రి. 5 క. 770; 32 క. 671).

(4.) అలహాబాదు దేశములో, "ఏ" యను ఒక తండ్రియును, "బీ" యను కుమారుడును హిందూమతమును వదిలి మహమ్మదీయమతము నవలంబించిరి. పిమ్మట "ఏ" మృతిచెందెను. "బీ" యనువాడు, హిందూమతస్థుడైన అతని పినతండ్రియొక్క ఆస్తికి వారసుగా నుండవచ్చునని తీర్మానింపబడెను. (ఇ. లా. రి. 11 అ. 100; చూ. 25 అ. 546).

(5.) మైసూరు మొదలగు కొన్ని స్వతంత్ర రాజ్యములయందు మీాద చెప్పబడిన 1850 సం॥ 21 నెం॥ చట్టము అమలులోనికి తేబడియుండలేదు. కాబట్టి, అట్టి ప్రదేశములయందు జాతిభ్రష్టతవలన వారసుహక్కు నశించుననియే చెప్పదగియున్నది.

నపుంసకత్వము, ...గ్రుడ్డి, మూగ, చె...డు.

**333**. నపుంసకులకు వారసు హక్కు లేదు. గ్రుడ్డితనము, మూగతనము, చెవుడు - ఈ దోషములు పుట్టుక మొదలు కలిగి యుండి నివారింప శక్యముగాక యున్ననే దాయానర్హత సిద్ధించునుగాని, మధ్యకాలమున తటస్థించినవిగా నుండునప్పుడును నివారించుటకు అనుకూలమైనవిగా నుండునప్పుడును, దాయానర్హత కలుగదు. (14 క. హై. 273, ఇ. లా. రి. 1 బొం. 177-

(గ్రుడ్డి); 1 క. హై. 117; 1860 సం॥ బం. స. తీ. 661; ఇ. లా. రి. 6 అ. 322 - (మూగ, చెవుడు); 4 బొం. హై. 135 - (మూగ); ఇ. లా. రి. 1 బొం. 557; ఇ. లా. రి. 18 క. 387, 111).

**334.** పిచ్చివాండ్రు వారసులుగా నుండుటకు తగియుం డరు. పిచ్చియనగా - సంపూర్ణముగా మతిచెడి, దురాగత కృత్యములనుచేసి యితరులకు హానిచేయునట్టి స్థితియని తలచరా డదు. తాను చేయునట్టి కార్యము సరియైనది, సరికాదు - అని తెలిసికొనుటకు అనుకూలముకాని జ్ఞానశూన్యత, పిచ్చిగా భావింపబడును. (1 మ. హై. 214; ఇ. లా. రి. 12 అ. 530). పిచ్చివలన దాయానర్హత కలుగుటకై అది పుట్టుకనుండి యుం డవలెనో, లేక, పిమ్మట కలిగినయెడల చాలునో - ఈ విషయ మున హైకోర్టువారు భిన్నాభిప్రాయులై యున్నారు. బొం బయి హైకోర్టువారి తీరుమానముల ప్రకారము, పుట్టుక మొ దలు కలిగియుండిన పిచ్చివల్లనే దాయానర్హత సిద్ధించునుగాని మధ్యకాలమున కలిగిన పిచ్చివల్ల బాధకములేదు. (ఇ. లా. రి. 1 బొం. 177, 182, 554; 13 మూ. ఇ. అ. 519; 14 మూ. ఇ. అ. 176). బంగాళా అలహాబాదు హైకోర్టువారి తీరు మానముల ప్రకారము, పుట్టుక మొదలు పిచ్చి లేకున్నను, వారసు హక్కు సంక్రమించిన కాలమున కలిగియున్నయెడల, దానివల్ల దాయానర్హత సిద్ధించుననియు, సదరుపిచ్చి బొత్తి గా అనివార్యమైనదిగా నుండుట ఆవశ్యకము కాదనియు, ఏర్ప డుచున్నది. (9 క. హై. 204, 198; ఇ. లా. రి. 10 క. 63, ఇ. లా. రి. 5 అ. 509; ఇ. లా. రి. 8 క. 149).

**335.** కాలుసేతులులేక పనిపాటులకెంతమాత్రము శక్తి కలిగియుండని వికలాంగులు (నిరింద్రియులు) దాయానర్హులని

పిచ్చి.

అంగహీనత్వము.

చెప్పబడియున్నది. పుట్టుక మొదలు వికలాంగులుగాక, మధ్య కాలమున రోగమువల్లగాని మరియే కారణమువల్లగాని కాలు సేతులుచెడి కదలజాలకయుండు మొండివారును కుంటివారును గూడ దాయానర్హులుగా భావింపబడునట్లు కనబడుచున్నది. (ఇ. లా. రి. I బొం. 185). కాని, పుట్టుక మొదలు వికలాంగులుగా నిరింద్రియులుగా నుండువారికి మాత్రమే దాయానర్హా దోషము తగులునని మదరాసు హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 26 మ. 133; చూడు, వె. బు. 578).

అనివార్యమగు వ్యాధి. **336.** అనివార్యమగు కుష్ఠరోగము మొదలగు వ్యాధుల వల్ల బాధపడుచుండువారు దాయానర్హులని చెప్పబడియున్నది. ఈ రోగములు జన్మాదారభ్య కలిగియుండుట ఆవశ్యకము కాదు. మధ్యకాలమునందు కలిగినను, అవి అతి కాఠిన్యముగను అనివార్యముగను ఉండినయెడల, దాయానర్హత సిద్ధించును. శరీరమంతటను ప్రాకి వ్రణములపాలుచేసి, నివారించుటకు అశక్యముగా నున్నపక్షమునందే కుష్ఠరోగమువలన దాయానర్హత సిద్ధించును. (1860 సం॥ మ. తీ. 239; ఇ. లా. రి. 5 బొం. 145; ఇ. లా. రి. I బొం. 554; 19 మ. 74; 22 క. 84). క్షయరోగము, రాచపుండు - ఈవ్యాధులు బొత్తిగా నివారింపగూడని స్థితిలో నుండినయెడల వానివల్ల దాయానర్హత కలుగవచ్చునుగాని నిశ్చయముగా చెప్పుటకు వీలులేదు. (2 స. 125).

వ్యభిచారము. **337.** మృతిచెందిన ఆస్తిదారునికి పుత్రసంతతి వారెవ్వరును లేక అతని భార్య వారసులుగా నుండుట తటస్థించినప్పుడు, అంతకు పూర్వమే ఆమెకు వ్యభిచారదోషము ఏర్పడినయెడల, వారసుహక్కు కలిగియుండదు. కుమార్తె, తల్లి, తండ్రితల్లి, తాతతల్లి ఈ మొదలగు స్త్రీ వారసుల వారసుహక్కునకు బంగాళా దేశమునమాత్రమే వ్యభిచార దోషమువల్ల బాధకము

కలదుగాని, తక్కినచోట్ల బాధకము లేదని ఇదివరకే తెలిపి యున్నాము. (పేరాలు, 306, 309, 317).

భర్త మృతిచెందినపిమ్మట భార్య పునః వివాహమాడినయెడల, భర్తఆస్తియందు ఆమెకు కలిగియుండు యావత్తు హక్కులును నశించి, అనంతరవారసులు హక్కుదార్లగుదురు. (1856 సం॥ 15 నెం॥ చట్టము, సె. 2). సదరు ఆస్తి ఆమెకు భర్తవల్ల దానరూపకముగా ఇయ్యబడినప్పటికిని, పునర్వివాహమాడ వచ్చునని భర్త అనుజ్ఞ యిచ్చి పోయినప్పటికిని మాత్రము భార్యయొక్క హక్కు నశింపజాలదు. (307 - వ పేరా.). కుమార్తె, తల్లి, తండ్రితల్లి, మొదలగు స్త్రీ వారసులు పునర్వివాహమాడినను, వారి వారసు హక్కునకు భంగము కలుగజాలదు. (డిటో చట్టము, సె. 5; పేరాలు, 309, 317). భర్తృమరణము.

**338**. వానప్రస్థ, సన్యాస, నిత్యబ్రహ్మచర్యాశ్రమములలో దేన్నినైనను బూని, సంపూర్ణముగా వైరాగ్యము వహించి, ప్రపంచ వ్యవహారములను సంపూర్ణముగా పరిత్యజించినవారికి వారసు హక్కు నిలువజాలదు. అట్టివారు మృతిచెందినట్టుగా భావింపబడి, వారి పిమ్మటి వారసులు హక్కుదార్లు అగుదురు. ఊరక విరక్తిగా నుండునంత మాత్రముచేతను, బైరాగిగా తిరుగుచున్నంత మాత్రముచేతను, వారసు యోగ్యత తప్పిపోవునని భావింపగూడదు. (I స. 209). మరియు, ఆశ్రమసంబంధమగు దాయానర్హత శూద్రజాతి వారికి చెల్లజాలదని నిరూపింపబడియున్నది. (ఇ. లా. ది. 22 మ. 302). సన్యాసము.

సంపూర్ణముగా ప్రపంచ వ్యవహారసంబంధములు పరిత్యజించక ఒక మతాచార్యస్వాములవారి నామము, లేక, బిరుదులు ధరించినంతమాత్రముచేతగాని, ఏదైన మఠములో చేరినంతమాత్రముచేతగాని, ఎవరికిని తన ఆస్తియందలి హక్కులను అత

స్వాధీనమునందుండు ఆస్తి విషయమై యితరులకు గలుగు హక్కులును నశింపవు. (15 స. 199; 1 క. వ్రై. 114; ఇ. లా. రి. 4 క. 954).

ఔరసత్వము.

**339.** ఏ వారసులుగాని వారి తలిదండ్రులకు క్రమమైన ఔరసపుత్రులు, లేక, ఔరసపుత్రికలు కారని స్పష్టముగు రుజువు కనుపడినయెడల, వారికి వారసు హక్కు కలిగి యుండ నేరదు. 1872 సం॥ I నెం॥ ఎవిడెన్సు ఆక్టు, 112 సె॥ ప్రకారము భార్యాభర్తలు కలిసి కాపురము చేయుచుండగాగాని, వారు వేరుపడి యుండునపుడు, వేరుపడినదినము మొదలు 280 దినములకు లోగాగాని, జన్మించిన సంతానము ఔరస సంతానముగా భావింపబడును. కాని, గర్భోత్పత్తి కాదగిన యేకాలమునందైనను సదరు దంపతులు కూడియుండలేదని స్పష్టముగా రుజువు కనుపడినయెడల, ఔరసత్వము ఊహింపబడజాలదు. ఉదాహరణములు—

(1.) భార్యాభర్తలిద్దరును కలిసి కాపురముచేయుచుండగా పుత్రుడు జన్మించెను. కాని, పుట్టుక మొదలు భర్త నపుంసకుడనియు, అతని నపుంసకత్వము కుదురజాలనిదనియు, కుదురలేదనియు, అతడు సంభోగమునకు అనర్హుడనియు, అతనివలన గర్భోత్పత్తియగుట అసంభవమనియు – ఇట్లు అతనిని పలుమారు చక్కగా పరీక్షించిచూచిన డాక్టర్లు మొదలగువారి సాక్ష్యము కలదు. సదరు పుత్రుడు ఔరసుడుగా భావింపబడజాలడు.

(2.) భర్తనువిడిచి భార్య పుట్టింటికి వెచిపోయెను. తర్వాత ఒక సంవత్సరమునకు, ఆమెకు కుమారుడు, లేక, కుమార్తె కలిగెను. భార్యాభర్తలు విడిపోయిన పిమ్మట, వారు తిరుగా కూడి సంభోగించలేదని రుజువు కనుపడినయెడల, సదరు కుమారునకు, లేక, కుమార్తెకు ఔరసత్వము లేదు.

(3.) భర్త విదేశగతుడై కొన్ని సంవత్సరములు అచ్చటచ్చట నంచరించివచ్చి మరల భార్యతో చేరెను. అట్లు చేరిన నాలుగు నెలలకు వారికి సంతానము కలిగెను. ఇది ఔరససంతానము కానేరదు.

(4.) భర్త మృతిచెందిన కాలమున భార్య గర్భిణిగాయుండి పిమ్మట సంతానము కలిగినయెడల, ఈ సంతానము ఔరససంతానముగా భావింపబడును. మరియు, వారసుహక్కు సంక్రమించిన కాలమునకు ముందే జన్మించియుండు స్త్రీ పురుషుల కెట్టి హక్కులు కలిగియుండునో, సదరు కాలమున గర్భస్థులై యుండి పిమ్మట జన్మించిన వారికిని అవే హక్కులు కలిగియుండును. (9 క. హై. 397 ; 5 బం. స. తీ. 315).

(5.) భర్త మృతిచెందిన కాలమున భార్య గర్భిణియని చెప్పబడెను. కాని, భర్త మృతిచెందిన ఒకసంవత్సరమునకు ఆ పిదప సంతానము కలిగెను. ఈ సంతానము ఔరససంతానముగా భావింపబడజాలదు. కొందరు గర్భిణీస్త్రీలు 2 - 3 - 4 సం॥ ల వరకుగూడ తమ గర్భమును మోయుదురని మన దేశమునందు చెప్పుచున్నారు గాని, యీ విషయము కోర్టులయందు బాహుళః అంగీకరింపబడ జాలదు.

**340**. పై పేరాలలో వివరింపబడిన దోషములు పురుషుల యొక్కయు స్త్రీలయొక్కయుగూడ హక్కులను బాధించును. (2 బొం. హై. 5). కాని, అట్టి దోషములు వారసుహక్కు సంక్రమించక పూర్వము కలిగియుండిననే బాధించునుగాని, వారసుహక్కు సంక్రమించిన పిమ్మట ఏదోషములు కలిగినను బాధకము లేదు. (1854 సం॥ బం. స. తీ. i 244 ; ఇ. లా. రి. 5 అ. 509 ; ఇ. లా. రి. 5 క. 776 ; ఇ. లా. రి. 14 మ. 294 ; ఇ. లా. రి. 22 క. 864). సమష్టి కుటుంబమున జన్మించి సమష్టి భాగ

పై దోషములు ఎవ్వరు ఎంతవరకు బాధించును?

ష్ఠుడుగా నేర్పడియుండువానికి పిచ్చి తటస్థించినయెడల, అతనికి సమస్తి హక్కు నశింపజాలదని అలహాబాదు హైకోర్టువారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 5 అ. 509; 28 అ. 247).

మీాద వివరింపబడిన దోషములు కలవారు వారసుహక్కు వలన ఆస్తిని పొందుటకు అనర్హులుగానున్నను, వారికి దానరూపముగాగాని ఉయిలుమూలముగాగాని ఆస్తి ఇయ్యబడినయెడల దానిని పొందుటకు తగియుండును. (ఇ. లా. రి. 2 అ. 809; ఇ. లా. రి. 18 క. 341).

ఏదోషములవల్లగాని పురుషులకు దాయానర్హత యేర్పడినప్పుడు, వారికిని వారి భార్యలకును వారి దత్తపుత్రులకును జీవనాంశమునకు మాత్రమే హక్కు కలిగియుండును. సదరు దాయానర్హులకు ఏదైనను స్వార్జితపు సొత్తు ఉన్న పక్షమున, అది వారి దత్తపుత్రునకు, లేక పితంతువునకు చేరును. (1857 సం॥ మ. తీ. 210). కాని, సదరు దాయానర్హులకు దోషరహితులగు కుమారులుగాని మనుమలుగాని ఉండునెడల, వీరికి వారసుహక్కు కలిగియుండును.

అనంతరవారసులు హక్కుదార్లగుట.

**341.** పైపేరాలలో వివరింపబడిన దోషములవలన దాయానర్హులైనవారు వారసులుగా నేర్పడినప్పుడు, వారు లేనట్లే అనగా మృతిచెందినట్లే భావింపబడి, వారి అనంతర వారసులకు ఆస్తి చెందుచున్నది. ఉదాహరణములు—

(1.) మృతిచెందిన యొక ఆస్తిదారునికి పిచ్చివలన దాయానర్హుడైన ఒక కుమారుడును, ఒక కుమార్తెయును, ఉండిరి. కుమార్తె వారసురాలగును. (2 డబ్లియు మెక్. 42; చూడు – ఇ లా. రి. 32 బొం. 455; 32 బొం. 275).

(2.) మృతిచెందినయొక ఆస్తిదారునికి పిచ్చివలన దాయానర్హురాలగు ఒక కుమార్తెయును, ఆపెవలన ఇద్దరు దౌహి

త్రులును ఉండిరి. ఈ దౌహిత్రులు వారసుదార్లగుదురు. (13 మూ. ఇ. అ. 519).

(3.) ఒక ఆస్తిదారుడు మృతిచెందిన కాలమునందు అతనికి పుట్టు గ్రుడ్డియగు ఒక కుమారుడును, ఇద్దరు కుమార్తెలును, ఉండిరి. ఆస్తిదారుని మరణకాలమున, సదరు గ్రుడ్డికుమారునిభార్య గర్భిణిగానుండి, పిమ్మట, ఏదోషము లేని మగబిడ్డ కలిగెను. కుమార్తెలకంటె ముందుగా మనుమడు వారసుదారుడగును కాబట్టి, ఈ జన్మించిన బాలుడు వారసుదారుడగును.

(4.) ఒక ఆస్తిదారు మృతిచెందినప్పుడు, అతనికి "ఏ" యను ఒక విభక్తసోదరుడును, పుట్టుమూగయగు "బీ" యను మరియొక విభక్తసోదరుడును, ఇతనికుమారుడు "సీ" యనువాడును, ఉండిరి. ఈ సందర్భమున యావదాస్తియు "ఏ" యనువానికే చెందునుగాని, "సీ" యనువాని కెంతమాత్రమును చెందజాలదు. ఏలయనగా - అన్నదమ్ములుండగా, అన్నదమ్ముల కుమారులు హక్కుదార్లు కాజాలరు.

(5.) అలాగుననే ఒక ఆస్తిదారునికి దాయాదుడగు చెల్లెలి కుమారు డొకడును చెల్లెలి మనుమ డొకడును ఉండినయెడల, చెల్లెలి మనుమడు వారసుదారుడు కానేరడు. ఏలయనగా- చెల్లెలి మనుమనికి అసలే వారసుహక్కు లేదు. (2 క. హై. 115; 9 క. హై. 198, 203).

(6.) మూడవ యుదాహరణములో ఆస్తిదారుడు మృతిచెందిన పిమ్మట, అతని గ్రుడ్డి కుమారుని భార్యకు గర్భోత్పత్తియై పుత్రుడు జన్మించినయెడల, కుమార్తెలవద్దనుండి ఇతనికి ఆస్తి రానేరదు. కాని, కుమార్తెలు అసంపూర్ణ హక్కుగల వారసులు గనుక, అనగా వారి మరణానంతరము వెనుకటి ఆస్తిదారుని వారసులే హక్కుదార్లగుదురు గనుక, కుమార్తెలు

మృతిచెందిన పిమ్మట సదరు గ్రుడ్డివాని కుమారునికి ఆస్తిచెందును.

(7.) ఆస్తిదారునికుమారుడు దాయానస్థుడైయుండి, ఎవరైనను పురుషవారసులకు ఆస్తి చెందినపిమ్మట సదరు దాయానస్థుని భార్య గర్భిణియై కుమారుడు కలిగినయెడల, ఇతనికి వారసుహక్కు కలుగనేరదని బంగాళా హైకోర్టువారును బొంబయి హైకోర్టువారును తీరుమానించి యున్నారు. (2 క. హై. 103; 1 క. హై. 117; ఇ. లా. రి. 5 అ. 509; ఇ. లా. రి. 6 బొం. 616).

(8.) కాని, ఒక కేసులో, దీనికి వ్యతిరేకముగా మదరాసు హైకోర్టువారు తీరుమానించియున్నారు. "ఏ" యను ఆస్తిదారు మృతిచెందినకాలమున, అతనికి "బీ" "సీ" యను ఇద్దరు కుమారులుండిరి. వారిలో "బీ" యనువాడు పుట్టుమూగగా నుండినందున, యావదాస్తియును "సీ" యనువానికి చెందెను. అటుపిమ్మట "బీ" యనువాని భార్యకు గర్భోత్పత్తియై, దోషరహితుడగు కుమారుడు కలిగెను. ఇతడు, "సీ" తో సమష్టిభాగస్థుడై ఆస్తియందు అర్థభాగమునకు హక్కుదారుడగునని మద్రాసుహైకోర్టువారుతీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 9 మ. 64). ఈ తీరుమానములో నెనుక 109-వ పేరా 2-వ ఉదాహరణములోగల అవిభక్తజమీందారుదాదరుని ఉపమానము అనుసరింపబడెను. ఈ ఉపమానమును తీరుమానమును మెయిను దొరవారు ఖండించియున్నారు. యావదాస్తియు "సీ" యనువానికెప్పుడుచెందెనో అప్పుడు సమష్టికుటుంబము అంతరించినట్లు భావింపదగిన సందర్భములో పిమ్మట "బీ" యనువానికి గలుగు సంతతివలన సమష్టి హక్కులు ఏర్పడుట విపరీతముగదా?

**342.** దాయానర్హతను కలిగించునట్టి దోషములు పిమ్మట నివారణమైనయెడల, విభాగానంతరము జన్మించిన పుత్రుల విషయములోవలె వారసు హక్కు తిరుగా కలుగునని ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. కాని, దోషము నివారణమగుటకు పూర్వమే, ఆస్తి మరియొకరికి చేరిపోయినయెడల, తిరుగా అది రానేరదు. (262 - పేరా చూడుడు.) ఉదాహరణములు—

దోషములు నివారణమైన యెడల హక్కు కలుగును.

(1.) ఒక ఆస్తిదారుడు మృతిచెందినకాలమున, అతని భార్యయు పుట్టంధుడగు ఒక కుమారుడును జీవించియుండినందున భార్య వారసురాలుగా నేర్పడెను. పిమ్మట కుమారునకు నేత్రవ్యాధి కుదిరినను వితంతువుయొక్క స్వాధీనమునుండి తప్పి అతనికి ఆస్తి రాజాలదు. కాని, ఆమె యనంతరము, కుమారుడే సమీప వారసుదారుడగును కాబట్టి అతనికి ఆస్తి చేరును.

(2.) ఒక ఆస్తి దారుడు మృతిచెందిన కాలమున, అతనికి ఒక పుట్టంధుడగు కుమారుడును, ఒక విభక్త సోదరుడును ఉండినందున, ఆస్తికి ఈ సోదరుడు వారసు దారుడుగా నేర్పడెను. పిమ్మట, సదరు పుట్టంధునకు నేత్రవ్యాధి కుదిరినను అతనికి ఆస్తి రానేరదు. ఏలయనగా-సదరు విభక్తసోదరుడు సంపూర్ణమగు వారసుహక్కు కలవాడైనందున, అతని యనంతరము అతని కుమారులు మొదలగువారే సదరు ఆస్తికి వారసులగుదురు. (10 మూ. ఇ. అ. 279; 2 క. హై. 103). సదరు విభక్త సోదరునకు కుమారులు మొదలగు వారసు లెవ్వరును లేక, అన్న కుమారుడే సమీపవారసుదారుడైనయెడల, అతనికి ఆస్తి చెందును.

---

(5.) స్త్రీ వారసులవిషయమైన విశేష నిబంధనలు.

స్త్రీ వారసులకు ఆ స్తియందు సంపూర్ణ స్వాతంత్ర్యము లేదు.

**343.** ఒకని మరణానంతరము అతనిఆస్తి అతని వంశము వారి యనుభవములో ఉండవలెనుగాని యితర వంశములవారికి చేరి పోగూడదను అభిప్రాయము మన హిందువులలో చిరకాలమునుండి స్థిరపడియున్నది. ఈ యభిప్రాయమునుబట్టి పురుష వారసులకును స్త్రీ వారసులకును కొన్ని భేదము లేర్పడినవి. పురుషవారసునకు ఆస్తి వచ్చినప్పుడు దానియందు అతనికి సంపూర్ణ స్వాతంత్ర్యము కలిగియుండును. కాబట్టి, సదరుఆస్తిని అతడు ఇచ్చవచ్చినట్లు ఖర్చు పెట్టవచ్చును, పరాధీనము చేయవచ్చును. మరియు, అతని మరణానంతరము అది అతని వారసులకే, అనగా, అతని కుమారులు మొదలగు వారికే చెందును గాని, వెనుకటి ఆస్తి దారుని వారసులకు చెందనేరదు. స్త్రీ వారసులకు, అనగా, భార్య మొదలగు వారికి వారసుహక్కువలన పురుషుల ఆస్తి వచ్చినప్పుడు, దానియందు వారికి సంపూర్ణ స్వాతంత్ర్యము కలుగక యావజ్జీవమును అనుభవించుటకును అగత్యమైన కార్యములనిమిత్తము వ్రయపెట్టుటకును మాత్రము హక్కు కలిగియుండును. ఇంతేకాక, వారి మరణానంతరము, వెనుకటి ఆస్తిదారునికి ఎవరు సమీప వారసులుగా నుందురో వారికే సదరుఆస్తి చెందునుగాని, సదరు స్త్రీలయొక్క వారసుదార్లకు చెందనేరదు. (305, 308-పేరాలు). బొంబయి ప్రెసిడెన్సీలో కొందరు స్త్రీవారసుల విషయములో మాత్రముతక్క తక్కిన అన్ని సంప్రదాయముల ప్రకారము సమస్త స్త్రీవారసులకును, అనగా, భార్య, కుమార్తె, తల్లి, తండ్రితల్లి, తాత తల్లి, అక్క, చెల్లెలు, వగైరా అందరు స్త్రీవారసులకును, ఈ చెప్పబడిన అసంపూర్ణ స్వాతంత్ర్యము ఏర్పడి యున్నది. (11 మూ. ఇ. అ. 139, 173, 487, 509; 8 మూ. ఇ. అ. 529,

550; 13 క. హై. 5, 53, 76; 2 మూ. ఇ. అ. 331; 1 బొం. హై. 130, 122; 2 బొం. హై. 10; 4 బొం. హై. 163; 6 బొం. హై. 1, 215; ఇ. లా. రి. 3 బొం. 353, 369; ఇ. లా. రి. 4 బొం. 187; ఇ. లా. రి. 5 బొం. 670; ఇ. లా. రి. 16 బొం. 229; ఇ. లా. రి. 21 బొం. 744; 3 బం. స. తీ. 128; 6 బం. స. తీ. 77; 4 బం. స. తీ. 330; 14 క. హై. 245, 235; ఇ. లా. రి. 4 క. 744; 3 మ. హై. 312; 6 మ. హై. 310; ఇ. లా. రి. 3 మ. 290; ఇ. లా. రి. 19 మ. 110; ఇ. లా. రి. 25 మ. 678; 1 బం. స. తీ. 162; 4 బం. స. తీ. 310; 6 బం. స. తీ. 53; 7 బం. స. తీ. 108; 3 స. 140; 2 మ. హై. 402; 8 మ. హై. 88; ఇ. లా. రి. 1 మ. 174; ఇ. లా. రి. 1 అ. 661; ఇ. లా. రి. 28 మ. 13; 15 మై. 71; ఇ. లా. రి. 25 అ. 468, 476). సదహు ఆస్తి స్థిరమైననుసరే చరమైననుసరే, వెనుకటి ఆస్తిదారుని పిత్రార్జితమైననుసరే స్వార్జితమైననుసరే, దానియందు స్త్రీ వారసులకు అసంపూర్ణ స్వాతంత్ర్యమే కలిగియుండునని తీర్పులు చేయబడి యున్నవి. (11 మూ. ఇ. అ. 139, 487; ఇ. లా. రి. 31 క. 214; ఇ. లా. రి. 8 మ. 290, 305; ఇ. లా. రి. 17 బొం. 690; ఇ. లా. రి. 28 బొం. 453). కన్యగానుండు కుమార్తెకు వారసుహక్కువలన వచ్చిన తండ్రి ఆస్తి సంపూర్ణముగా ఆపెయొక్క స్వంత ఆస్తి యగుననియు, ఆపె మరణానంతరము అది ఆపెయొక్క వారసులకే చెందుననియు మదరాసు హైకోర్టువారి అభిప్రాయమై యుండునట్లు కానంబడుచున్నది. (ఇ. లా. రి. 19 మ. 109). జైనమతస్థులలో మాత్రము, ఆస్తిదారుని స్వార్జితము మీాద స్త్రీ వారసులకు సంపూర్ణ స్వాతంత్ర్య ముండునట్లును, పిత్రార్జితముమీాద గూడ హెచ్చుగా స్వాతంత్ర్య ముండునట్లును

కనబడుచున్నది. (6 అ. హై. 382; ఇ. లా. రి. 1 అ. 688; 16 అ. 379; 27 క. 379).

విభాగ కాలమున సమష్టి ఆస్తిలో కొంతభాగము స్త్రీలకు ఇయ్యబడినయెడల, దానియందుగూడ వారికి అసంపూర్ణ స్వాతంత్ర్యమే కలిగియుండును. (2 మాగ్లి. 198; ఎఫ్. మెక్. 67, 73; 5 క. హై. 508; 11 మూ. ఇ. అ. 514; ఇ. లా. రి. 15 క. 306; ఇ. లా. రి. 16 క. 758; 4 మై. 28. కాని, చూడుము - ఇ. లా. రి. 24 అ. 67, 82). విభాగపు షరతులవల్ల సంపూర్ణస్వాతంత్ర్య మియ్యబడ వచ్చును. (11 క. హై. 459; 1 అ. హై. 10). విభాగకాలమున కుమారులవల్ల తల్లికియ్యబడునట్టి భాగము ఆమెయొక్క స్త్రీధనముగా భావింపబడుననియు ఆమె యనంతరము అది ఆమెయొక్క వారసులకే చెందుననియు అలహాబాదు హైకోర్టువారు తీరుమానించి యున్నారు. (ఇ లా. రి. 32 అ. 253).

బొంబయి ప్రెసిడె న్సీలో కొందరు స్త్రీ వారసులకు మాత్రము సంపూర్ణ స్వాతంత్ర్యము.

**344.** బొంబయి ప్రెసిడెన్సీలో, కుమార్తె, అక్క-చెల్లెండ్రు, మొదలగు కొందరు స్త్రీ వారసులకు మాత్రము సంపూర్ణ స్వాతంత్ర్యము స్థిరపడియున్నది. అచ్చట ప్రమాణముగా చెల్లుచుండెడి మయూఖగ్రంథమును బట్టియు, ఈ సంబంధమైన మితాక్షర వచనముల కచ్చట చేయబడియుండు అర్థమునుబట్టియు, స్త్రీ వారసులు రెండు తెగలవారుగా ఏర్పడుచున్నారు. (1.) భిన్నగోత్రమునందు జన్మించి వివాహమువలన ఆస్తిదారుని గోత్రములో చేరినవారు, అనగా, భార్య, తల్లి, తండ్రితల్లి, తాతతల్లి, కుమారుని భార్య - మొదలగువారు. (2) భిన్నగోత్రమునకు చేరినవారు - లేక, ఆస్తిదారుని గోత్రములో జన్మించి వివాహమువలన భిన్నగోత్రములో చేరినవారు, అనగా, కుమార్తె, అక్క, చెల్లెలు, మనుమరాలు, అన్నకుమార్తె, అన్న

మనుమరాలు, మేనత్త మొదలగువారు - (ఇ. లా. రి. 5 బొం. 110, 662, 670; ఇ. లా. రి. 11 బొం. 312). మొదటి తరగతి స్త్రీలు పురుషులయొక్క ఆస్తికి వారసులైనప్పుడు, దాని యందు వారికి సంపూర్ణస్వాతంత్ర్యము కలుగక, వారి మరణానంతరము అది వెనుకటి ఆస్తిదారుని వారసులకే చెందును. (1 బొం. హై. 130; 2 బొం. హై. 10; ఇ. లా. రి. 4 బొం. 163; 6 బొం. హై. 1; ఇ. లా. రి. 3 బొం. 353, 369; ఇ. లా. రి. 16 బొం. 229). రెండవ తరగతి స్త్రీలు పురుషుల యొక్క ఆస్తికి వారసులైనప్పుడు, దానియందు వారికి పురుషులకువలెనే సంపూర్ణ స్వాతంత్ర్యము కలుగుచున్నది. (ఇ. లా. రి. 5 బొం. 672; ఇ. లా. రి. 11 బొం. 312; 1 బొం. హై. 130, 209; 8 బొం. హై. 244; ఇ. లా. రి. 3 బొం. 171; ఇ. లా. రి. 4 బొం. 187; ఇ. లా. రి. 5 బొం. 670; ఇ. లా. రి. 6 బొం. 85; ఇ. లా. రి. 11 బొం. 285; ఇ. లా. రి. 14 బొం. 612; 1 బొం. హై. 117, 124; 6 బొం. హై. 1; 9 మూ. ఇ. అ. 516, 538; ఇ. లా. రి. 5 బొం. 671; ఇ. లా. రి. 15 బొం. 206). మరియు, వారి మరణానంతరము సదరు ఆస్తి వెనుకటి ఆస్తి దారుని వారసులకు చెందక, సదరు స్త్రీలే పురుషులుగా నుండిన యెడల వారికి ఎవరు వారసులుగానుందురో అట్టివారికి, అనగా, కుమారుడు, కుమార్తె, దౌహిత్రుడు, తల్లిదండ్రులు, వగైరా వారసులకు చెందుచున్నదని కొన్ని కేసులలో బొంబాయి హై కోర్టువారు తీరుమానించిరి. (8 బొం. హై. 244; ఇ. లా. రి. 12 బొం. 505; ఇ. లా. రి. 9 బొం. 301). కాని, దరిమిలాను ఒక కేసులో జస్టిస్ తెలంగుగారు ఈ తీరుమానములను త్రిప్పి వేసి, కుమార్తె, అక్క, చెల్లెలు మొదలగు స్త్రీలకు పురుషుల వద్దనుండి వారసత్వమువల్ల వచ్చిన ఆస్తికని, వారియొక్క క్రిమ

మైన స్త్రీధనపు ఆస్తికిని, మయూఖగ్రంథముప్రకారము ఏర్పడి యుండు వారసులలో భేదము లేదనియు, క్రమమైన స్త్రీధనపు ఆస్తికి స్త్రీసంతతి వారసులును,పురుషులవద్దనుండి వారసత్వము వల్ల వచ్చిన ఆస్తికి పురుషసంతతి వారసులును ముందుగా వారసులగుట యొక్కటే భేదమనియు తీరుమానించిరి. (ఇ. లా. రి. 17 బొం. 758).

సంపూర్ణ స్వాతంత్ర్యము లేని స్త్రీవారసుల అనుభవపు హక్కు - పరాధీనపు హక్కు.

**345.** బొంబయిదేశములో భార్య మొదలగు సగోత్ర స్త్రీ వారసులకును తక్కినచోట్ల సమస్త స్త్రీ వారసులకును పురుషులవద్దనుండి వచ్చిన ఆస్తియందు, వారికి సంపూర్ణ స్వాతంత్ర్యము లేకున్నను, వారు దానిని తమ యావజ్జీవమును స్వేచ్ఛగా అనుభవించవచ్చును. సదరు ఆస్తియొక్క రాబడి యెంతైనను సరే దానిని కొంచెమైన మిగుల్చక ఖర్చు చేసికొనవచ్చును. దానిని కూడబెట్టవలెననిగాని, దాని విషయమై యెవరికైనను లెక్క చెప్పవలెనని గాని విధి లేదు. అసలు ఆస్తిని వడ్డీ మొదలగు విధములయందు వృద్ధిపరచవలెననియు నిర్బంధము లేదు. దానిని పాడుచేయక, తమ స్వాధీనములోనికి అది యేతీరున వచ్చెనో ఆతీరున తమయనంతర వారసులకు చేరునట్లు కాపాడినయెడల, చాలును. మరియు, రాబడిని ఏ విధముగానైనను ఖర్చుపెట్టవచ్చునుగాని, కొన్ని కొన్ని అత్యావశ్యకమైన కార్యములనిమిత్తము తప్ప తక్కిన యేసందర్భములయందును అసలు ఆస్తిని ఖర్చుపెట్టగూడదు; అసలు ఆస్తిని విక్రయించిగాని, తాకట్టు వగైరా పరాధీనములకు లోబరచిగాని సొమ్ము తెచ్చి వ్రయపరచగూడదు. (8 మూ. ఇ. అ. 529; ఇ.లా.రి. 4 బొం. 462; ఇ. లా. రి. 4 మ. 152; ఇ లా. రి. 9 క. 244; ఇ. లా. రి. 8 బొం. 190; ఇ. లా. రి. 22 బొం. 984; ఇ. లా. రి. 32 బొం. 59; 3 మ. హై. 116; 1850 సం॥ మ తీ. 61; 6 మూ. ఇ. అ.

433 ; 6 క. హై. 747 ; 9 స. 584 ; 4 క. హై. 41; ఇ. లా. రి. 10 క. 335 ; ఇ. లా. రి. 20 క. 433. చూ॥, 22 మ. 126).

ఆ స్త్రీయొక్క రాబడిని యిచ్చవచ్చినట్లు ఖర్చు పెట్టుటకును తమ యిష్టమువచ్చినవారికి దానముచేయుటకును స్త్రీవారసులు స్వతంత్రురాండ్రుగా నున్నను, వారి మరణకాలమున ఖర్చుకాక మిగిలియుండు ఆదాయము అసలుఆస్తిలో చేరును. కాబట్టి, దానిని సదరు స్త్రీవారసులు ఉయిలుమూలముగా ఇచ్చివేయుటకు స్వతంత్రురాండ్రుకారు. మరియు, అసలు సొత్తుయొక్క ఆదాయమును కూడబెట్టికొంతమొత్తము ఏర్పాటు చేయబడినయెడల, లేక దానిలో కొంతఆస్తి సంపాదింపబడిన యెడల, అది అసలుఆస్తికి చేరినట్లే సాధారణముగా భావింపబడి, దానివిషయమై సదరు స్త్రీవారసులకు సంపూర్ణ స్వాతంత్ర్యము తప్పిపోవును. (ఇ. లా. రి. 5 క. 512 ; ఇ. లా. రి. 10 క. 334 ; 7 క. హై. 93 ; 24 స. 168; ఇ. లా. రి. 9 క. 758; 5 అ. హై. 197, 201). కాని, అట్లు ఆదాయమును కూడబెట్టి యేర్పరచుకొన్న సొత్తును, సదరు స్త్రీ వారసురాలు ముందు ముందు స్వానుభవము నిమిత్తము ఉపయోగించుకొనవలెనను ఉద్దేశముతో ఏర్పరచుకొని అసలు ఆస్తిలో చేర్చక ప్రత్యేకముగా నుంచుకొన్నయెడల, దానిని ఆపె జీవితకాలములో యిష్టముగా ఖర్చు పెట్టవచ్చును. (14 క. హై. 159 ; 25 స. 335 ; ఇ. లా. రి. 14 క. 387, 861 ; ఇ. లా. రి. 16 క. 574 ; ఇ. లా. రి. 10 బొం. 478; ఇ. లా. రి. 20 క. 453; ఇ. లా. రి. 25 మ. 351; ఇ. లా. రి. 28 మ. 1).

**346**. రాబడి చాలని పక్షమున కొన్ని కొన్ని అగత్యమైన కార్యములనిమిత్తము, అసలు ఆస్తినిగూడ స్త్రీ వారసురాలు ఖర్చుపెట్టవచ్చును. ఈ అగత్యమైన కార్యము లేవనగా—

అగత్యమైన కార్యములు-శ్రాద్ధాదికర్మలు, తీర్థయాత్రలు, వగైరా.

(1.) సదరు ఆస్తి భర్తవల్ల వచ్చియుండినప్పుడు - అతని అపరక్రియలు తిథి వగైరా కర్మలను, అసలు ఆస్తిని వ్రయపెట్టియైనను జరిగించి అతని ఆత్మకు ముక్తిని కలిగింపవలయును. మరియు, అతనివల్లతిథి వగైరా కర్మలను జరిపించుకొనదగిన తల్లి మొదలైనవారికి గూడ కర్మ జరిపించవలయును. (11 క. హై. 418; ఇ. లా. రి. 8 క. 36). భర్తయొక్క ఆత్మకు ముక్తి లభింపవలెనను ఉద్దేశముతో, తీర్థయాత్రలు, బ్రాహ్మణులకు దానములు, దేవాలయములకు దానములు, దేవాలయప్రతిష్ఠలు, తటాకాదిప్రతిష్ఠలుగూడ చేయవచ్చును. కాని,వీనినిమిత్తము, ఆస్తియొక్క యోగ్యత ననుసరించి ఖర్చుచేయ వలసినదేకాని, అధికముగా ఖర్చుచేయగూడదు. ఆస్తి స్వల్పమైనదిగా నుండునపుడు ఈ విషయమై యెంత మాత్రమును ఖర్చు కూడదు. (1 స. 252; 11 క. హై. 118, 416; ఇ. లా. రి. 8 మ. 552; ఇ. లా. రి. 11 మ. 288; 2 మూర్లి. 119; 21 స. 49; 1 బారో. 394, 405; 2 బారో. 510; 1850 సం॥ మ. తీ. 74; కాని,చూడు 7 స. 146). వితంతువు, తన స్వంత ముక్తికొరకు చేయునట్టి తీర్థయాత్రలు వగైరాల నిమిత్తము అసలు ఆస్తిని వ్రయపరచగూడదు. (ఇ. లా. రి.4 అ. 482; ఇ. లా. రి. 22 క. 506). ఆస్తియొక్క రాబడిని ఖర్చుపెట్టుటకు ఆక్షేపణ లేదు.

అప్పులు.

(2.) ఆస్తిదారుడు చేసియుండు అప్పులను తీర్చుటకొరకు ఆవశ్యకమైనచో, అసలుఆస్తిని విక్రయించవచ్చును. అయోగ్య కార్యముల నిమిత్తము చేయబడిన అప్పులను తీర్చవలసిన విధి లేదు. (8 మూ. ఇ. అ. 319; 9 స. 316; 1860 సం॥ మ. తీ. 15; ఇ. లా. రి. 2 బొం. 499). లిమిటేషను (అనగా కాలదోషము) తగిలిన అప్పులను తీర్చుటకై అసలు ఆస్తిని పరాధీనపరచగూడదని కొన్ని కేసులలో తీరుమానింపబడెను. (6 బొం.

హై. 270; 14 స. 147). కాని, ఇటీవలి తీరుమానములవల్ల, లిమిటేషను తగిలిన అప్పులను తీర్చుటకొరకుగూడ అసలు ఆ స్తిని పరాధీనపరచ వచ్చునని స్థిరపడియున్నది. (ఇ.లా.రి. 11 బొం. 320, 325; ఇ. లా. రి. 13 మ. 189; 21 క. 190). అట్టి కాలదోషము తగిలిన అప్పులను తీర్చుట దగా ఉద్దేశముతో జరిగింపబడగూడదు. (ఇ. లా. రి. 11 బొం. 666. 1882 సం॥ 4నెం॥ ట్రాంసుఫరాఫ్ ప్రాపర్టీ ఆక్టు, 53 సె.; 22 బొం. 111).

(3.) స్త్రీవారసులకు నచ్చియుండు ఆస్తివల్ల జరుగవలసిన జీవనాంశముల నిమిత్తమును వివాహాదికార్యముల నిమిత్తమును ఆవశ్యకమైనయెడల, అసలు ఆస్తిని పరాధీనపరచవచ్చును. (16 స. 52; ఇ. లా. రి. 5 బొం. 450; ఇ. లా. రి. 31 క. 433; వివాహకాలమున కుమార్తెకు ఇయ్యబడుదానము-ఇ. లా. రి. 37 క. 1). కాని, యెన్నటికో అగత్యము కలుగునని, ముందుగా ఆస్తిని పరాధీనపరచి సొమ్ము తెచ్చి యుంచుకొనగూడదు. (6 మదరాసు జూరిస్టు, 261).

జీవనాంశములు, పెండ్లిండ్లు వగైరా.

(4.) మీద చెప్పబడినవిగాక మరి యేదైనను తప్పరాని అగత్యము తటస్థించినయెడల, దానినిమిత్తము గూడ, స్త్రీవారసురాలు అసలు ఆస్తిని పరాధీనముచేసి వినియోగించవచ్చును. సర్కారు శిస్తుబాకీ, ఏదైనను డిక్రీక్రింద చెల్లించవలసిన మొత్తము, ఆస్తివిషయమై తేబడిన దావాలో ప్రతివాదిగానుండి దానిని కాపాడుటవల్ల తగిలినఖర్చులు, చెడిపోకుండ ఆస్తిని కాపాడుటకై పట్టిన మరమ్మతుఖర్చులు - ఇట్టివి అగత్యమైన ఖర్చులుగా నెంచబడును. (ఇ. లా. రి. 18 అ. 474; 22 మ. 113; 1859 సం॥ బం. స. తీ. 421; 19 స. 80; 2 ఆ. హై. 78; ఇ. లా. రి. 14 అ. 420; 11 బొం. 609; 25 క. 189; 24 అ. 547; 10 క. 823; 12 క. 52; 31 క. 433; కాని, చూడు - ఇ. లా. రి.

తప్పరాని అగత్యము.

4 అ. 532). తప్పరాని అగత్యముండెనో లేదో అను విషయము ఆయా సందర్భమునుబట్టి తెలిసికొనవలసి యుండును. సర్కారుశిస్తుబాకీ వగైరా అగత్యములు స్త్రీ వారసురాలియొక్క దుర్వ్యయము వల్ల కలిగియుండినను బాధకము లేదు. ఆ స్తిని పొందినవాని దుష్ప్రవర్తనము వల్ల, లేక ప్రోత్సాహమువల్ల కలిగియుండగూడదు. (6 మూ. ఇ. అ. 423; ఇ. లా. ఌ. 6 క. 843; 4 అ. 420).

స్త్రీ వారసురాలి వల్ల విక్రయము.

**347**. పై పేరాలో చెప్పబడిన అగత్యమైన కార్యములు తటస్థించినప్పుడు, అసలు ఆ స్తిని నయపరచక, అప్పుచేసి సదరు అప్పును తన రాబడివల్ల క్రమక్రమముగా తీర్చుటకుగాని, ఆ స్తిలో ఏభాగముగాని విక్రయించక తాకట్టు పెట్టి సొమ్ము తెచ్చుకొని అందువల్ల తన రాబడిని తగ్గించుకొనుటకుగాని, స్త్రీ వారసురాలు బద్ధురాలుకాదు. ఆ స్తిలో కొంతభాగమును నిరభ్యంతరముగా విక్రయించి సదరు అగత్యమైన కార్యములను జరుపవచ్చును. స్త్రీ వారసురాలికి యుక్తమని తోచిన ప్రకారము ఆ స్తిని తాకట్టు పెట్టినను సరే విక్రయించినను సరే చెల్లుచున్నది. సదరు స్త్రీ వారసురాలును ఆమెవల్ల పరాధీనము పొందిన వాడును ఎంతమాత్రము దురుద్దేశము లేకుండ ప్రవర్తించినపక్షమున, విక్రయముకంటె తాకట్టు లాభకరముగా నుండియుండునను హేతువుచేత అనంతరవారసులు ఆక్షేపించుటకుగాని, సొమ్మిచ్చివేసి క్రయమును రద్దుపరచుటకుగాని వీలులేదు. (9 స. 108; 3 క. హై. 375; ఇ. లా. ఌ. 18 బొం. 534). కాని, అతిస్వల్పక్రయమునకు అధికమైన ఆ స్తి అన్యాయముగా విక్రయింపబడినయెడల, స్త్రీ వారసురాలు మృతిచెందిన పిమ్మట, అనంతర వారసుదారుడు ఆక్షేపించవచ్చును. అప్పుడు, వడ్డితోగూడ క్రయధనమును సదరు అనంతరవారసుదారువల్ల

ఇప్పించివేసి కోర్టువారు క్రయమును రద్దుపరచవచ్చును. (9 స. 108; 11 క. హై. 416). ఎంతో స్పష్టముగా అన్యాయము కనుపడి, విక్రయము పొందినవాడు సదరు అన్యాయమును ఎరిగియుండెనని నిశ్చయముగా ఊహించుటకు వీలుకాని సందర్భములయందు ఈ ప్రకారముగా కోర్టువారు జరిగించజాలరు. (5 క. హై. 508; 13 స. 457). స్త్రీ వారసురాలికి వచ్చిన ఆస్తి తాకట్టునకు లోబడియుండునప్పుడు, సదరు తాకట్టు వదిలించుటకు చాలిన ద్రవ్యము ఆపెవశములో నుండియు, అసలు ఆస్తిలో కొంతభాగమును ఆపె విక్రయించి తాకట్టు వదిలించినయెడల, ఆపె మృతిచెందినపిమ్మట అనంతర వారసుదారుడు దావా తెచ్చి సదరు క్రయమును రద్దుపరచవచ్చును. కాని, క్రయధనము వడ్డీతోగూడనిచ్చివేయుటకు అతడు బద్ధుడుగానుండును. (14 క. హై. 226; ఇ. లా. రి. 5 కల. 450.)

**348.** సమష్టి కుటుంబపు మేనేజరునకు సమష్టి సొత్తు విషయమై ఎట్టి స్వాతంత్ర్యము కలదో, అట్టి స్వాతంత్ర్యమే స్త్రీ వారసురాలికిని కలదని చెప్పవచ్చును. మరియు, మేనేజరునకు అప్పిచ్చి ఆస్తిని స్వాధీనపరచుకొనువానికి ఏయే విధులు చెల్లునో అవి స్త్రీ వారసురాలి కప్పిచ్చువానికిని చెల్లుచున్నవి. (2 బాం. హై. 201; 6 మూ. ఇ. అ. 393; 11 మూ. ఇ. అ. 619. వెనుక 186, 187, 188 పేరాలు చూడుము). ఆస్తిని తీసికొనినవాడు పరాధీనమునకు తగిన అగత్యముండెనని రుజువుచేయుటకు బద్ధుడుగానుండును. అగత్యముండినట్లు రుజువు చేసినయెడల, సదరు పరాధీనమువల్ల పొందబడిన ద్రవ్యమును స్త్రీ వారసురాలు క్రమముగా వ్యయపరచెనని రుజువు చేయవలసిన విధిలేదు. (6 మూ. ఇ. అ. 393; 8 మూ. ఇ. అ. 529; 5 క. హై. 508). మరియు, తగు జాగ్రత్తతో విచారించి,

అప్పిచ్చువానికి సంబంధించిన విషయములు.

నిశ్చయమైన అగత్యముండునట్లు నమ్మి, యెట్టి దురుద్దేశమును లేక సొమ్మిచ్చి ఆ స్త్రీని స్వాధీనపరచుకొన్న వానికి సదరు అగత్యము విషయమై చెప్పబడిన సంగతులు తనకు అబద్ధములుగా నేర్పడినను, బాధకములేదు. (6 మూ. ఇ. అ. 393; ఇ. లా. రి. 6 క. 843; ఇ. లా. రి. 14 అ. 420; 1882 సం॥ 4 నెం॥ త్రాంసుఫరాస్ ప్రాపర్టీ ఆక్టు, సె. 83). సదరో అగత్యముండునట్లు దస్తావేజులో వ్రాయబడినంతమాత్రము చేత సదరు అగత్యము నిజముగా కలిగియుండెననిగాని, దానివిషయమై తగుదర్యాప్తు చేయబడెననిగాని ఊహింపబడదు. (9 స. 285).

అగత్యమైన కార్యముల నిమిత్తము ఒక స్త్రీ వారసురాలు అప్పులు చేసినప్పుడు, సదరు అప్పులకొరకై ఆ స్త్రీని తాకట్టుపెట్టక, ఆమె పత్రము మాత్రము వ్రాసియిచ్చిన యెడల, దానివల్ల అనంతరవారసులు బద్ధులుకాజాలరు. ఇట్లని బొంబయి మదరాసు అలహాబాదు హైకోర్టులవారు తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 3 బొం. 237; ఇ. లా. రి. 4 మ. 375; 19 అ. 300). అగత్యమైన కార్యములనిమిత్తము అప్పులుచేయబడినట్లు రుజువు కనుపరచబడినయెడల, ఆ స్త్రీ తాకట్టు ఉంచకపోయినను సదరు అప్పులను తీర్చుటకు అనంతర వారసులు బద్ధులుగా నుందురని కలకత్తా హైకోర్టు వారు తీరుమానించి యున్నారు. (ఇ. లా. రి. 6 క. 36).

సొమ్ము అప్పిచ్చినవాడు స్త్రీ వారసురాలిమీద తెచ్చునట్టి దావాలో పొందబడు డిక్రీవల్ల, అనంతరవారసులుగూడ బద్ధులు కావలెనని కోరినయెడల, సదరుసొమ్ము అగత్యమైన కార్యముల నిమిత్తము ఇయ్యబడెనని దావాలో ఉదహరించవలయును. అనంతర వారసులను గూడ ప్రతివాదులనుగా చేర్చవలయునని కోర్టువారి అభిప్రాయముగా కనుపడుచున్నది. (11 మూ.

ఇ. అ. 267; 15 క. హై. 160). ఈ చెప్పబడిన ప్రకారము దావాలో ఉదహరించక స్త్రీవారసురాలిమీద డిక్రీ పొందబడినప్పుడు, ఆమె యావజ్జీవపు అనుభవపు హక్కు మాత్రమే సదరు డిక్రీకి లోబడియుండును. (11 మూ. ఇ. అ. 241; ఇ. లా. రి. 1 క. 133; 15 క. హై. 142; 6 స. 304; ఇ. లా. రి. 1 మ. 358; ఇ. లా. రి. 4 మ. 401; ఇ. లా. రి. 16 క. 511).

స్త్రీవారసురాలు చేయునట్టి అనగత్యమైన పరాధీనములు.

**349.** లా ప్రకారము చెల్లదగిన అగత్యము లేనప్పుడు స్త్రీవారసురాలు తన ప్రయివేటు ఖర్చులనిమిత్తము చేయునట్టి ఆస్తి పరాధీనములు అనంతరవారసులను బాధింపవు. కాని, అవి ఆమె జీవితకాలమువరకు చెల్లుటకేమాత్రమును అభ్యంతరము లేదు. (1856 సం॥ బం. స. తీ. 596; 19 స. 80; క. హై. సప్లిమెంటల్ వాల్యూం, 48; 1 మ. హై. 206; 2 మ. హై. 393; 3 మ. హై. 116; 6 బొం. హై. 270; ఇ. లా. రి. 1 బొం. 577; ఇ. లా. రి. 1 అ. 503; ఇ. లా. రి. 8 క. 224). అనంతర వారసులెవ్వరును లేకున్నను, ఆస్తిని అనగత్యముగా పరాధీనముచేయునట్టి స్వాతంత్ర్యము స్త్రీవారసురాలికి కలుగదు. అట్టి సందర్భమున సర్కారువారు హక్కుదార్లగుదురు కాబట్టి సదరు పరాధీనములను వారు ఆక్షేపించవచ్చును. (8 మూ. ఇ. అ. 529).

స్త్రీవారసురాలు తన స్వాతంత్ర్యమును మీరి చేసినట్టి ఆస్తి పరాధీనములను అనంతరవారసులు తమకు హక్కుకలిగిన పిమ్మట స్పష్టముగాగాని ప్రవర్తనము వల్లగాని సమ్మతించినయెడల, అవి చెల్లుటకు ఆక్షేపణలేదు. (ఇ. లా. రి. 25 క. 1; 21 బొం. 749; 30 క. 990; 31 క. 698).

స్త్రీవారసురాలు తన హక్కులను వదులుకొనుట.

**350.** స్త్రీవారసురాలికి వచ్చియుండు ఆస్తి విషయమైన యావత్తు హక్కులను ఆమె యిచ్చవచ్చినప్పుడు వదులుకొని తత్కాలమునందు అనంతర వారసులుగా నుండు వారికి ఆస్తి చెం

దించవచ్చుననియు, దానివల్ల కొందరికి నష్టము కలిగినను ఆక్షే
పణలేదనియు, కలకత్తా బొంబాయి మదరాసు హైకోర్టులవారు
తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 19 క. 236; 8 స. 500;
ఇ. లా. రి. 21 మ. 128; 7 బొంబయి లారిపోర్టు 622). ఇది
యేలాగింటే — భర్తకు వారిసురాలుగా నేర్పడి యాతని ఆస్తిని
అనుభవించుచుండిన యొకవితంతువు, తనకాలమున అనంతర
వారసుదారుడుగా నుండిన దౌహిత్రునకు యావదాస్తిని ఇచ్చి
వేసెను. అటుపిమ్మట కొంతకాలమునకు సదరు వితంతువు జీవిం
చియుండగానే దౌహిత్రుడు మృతిచెందెను. వితంతువు మృతి
చెందినకాలమున, ఆమె మరది సమీపవారిసుడుగా నుండెను. ఈ
సందర్భమున, వితంతువు తనయొక్క హక్కులను వదులుకొనక
యే యుండినయెడల, మరదికి ఆస్తి వచ్చియుండుననుట నిశ్చయ
మే. కాని, ఆమె యెప్పుడు తనయొక్క హక్కులు వదులుకొనె
నో, అప్పుడే దౌహిత్రుడు సంపూర్ణ స్వాతంత్ర్యముగల వారిసు
దారుగా నేర్పడినందున, అతని యనంతరము సదరు ఆస్తి అతని
కుమారులు వగైరా వారిసులకే చెందును.

మీాద చెప్పబడిన విధమున వితంతువు తన హక్కులను వదు
లుకొని ఆస్తిని అనంతరవారిసున కిచ్చివేయుట యనునది, నిశ్చ
యమైన సంపూర్ణ పరిత్యాగముగా నుండవలెనుగాని స్వలాభ
ము నిమిత్తము చేయబడినదిగా నుండరాదు. కాబట్టి, ఒక
వితంతువు తనకుగల అసంపూర్ణ స్వాతంత్ర్యమును వదులుకొని
యావదాస్తిని అనంతర వారిసుని వశముచేసి అతనివల్ల కొంత
భాగమును సంపూర్ణ స్వాతంత్ర్యముతో పొందినయెడల, యీ
భాగము విషయములో ఆమెకు వెనుకటి హక్కులే నిలిచియుండు
నట్లును ట్రాన్సుఫరే జరుగనట్లును భావింపబడును. (ఇ. లా. రి.
22 క. 534). అట్టి సందర్భమునందు యావదాస్తి విషయమై

గూడ ట్రాంసుఫరు చెల్లదనియు ఆనంతర వారసునకు ఏభాగ మును చెందనట్లు భావింపవలెననియు శంకించుటకూడ తగియు న్నది. (ఇ. లా. ర. 23 క. 460). వితంతువు తన హక్కులను వదులుకొని ఆ స్తిని అనంతరవారసున కిచ్చివేయుటలో అతఁడు తనకు జీవనాంశ మిచ్చుచుండునట్లు ఏర్పాటు చేసికొనుటయు కూడదు. (3 అ. లా. జ. 755).

అలహాబాదు హైకోర్టువారి తీరుమానము భిన్నముగా నున్నది. ఒక వితంతువు తన హక్కులు వదులుకొని తత్కాల మున అనంతరవారసుగా నుండువానికి ఆ స్తి ఇచ్చివేసినయెడల, దానియందు అతనికి ఆపె జీవితకాలమువరకే హక్కుకల్గియుం డుననియు, ఆపె మృతిచెందినపుడు ఎవరు అనంతర వారసులు గా నుందురో వారికే సదరు ఆ స్తిచేరుననియు, తీరుమానించిరి. (ఇ. లా. రి. 6 అ. 116, 288; 14 అ. 377). ఈ తీరుమాన మును బట్టి - ఒక వితంతువు తనకు వచ్చియుండు యావదా స్తిని దౌహిత్రునకిచ్చి అతఁడు ఆపె జీవించియుండగానే మృతిచెందిన సందర్భమున, దౌహిత్రుని కుమారుఁడు సదరు ఆ స్తికి ఆపె జీ వితకాలమువరకే హక్కుదారుడై ఆపె మృతిచెందినపుడు మరది మొదలగు సమీప వారసులు హక్కుదార్లగుదురు.

**351.** స్త్రీవారసులు జరిగించునట్టి ఆ స్తి పరాధీనములు అనంతరవారసుల సమ్మతితో జరిగింపబడినయెడల, అవి అగత్య మైనవిగా నున్నను లేకున్నను సరే, చెల్లుచున్నవి. (9 స. 350; ఇ. లా. రి. 5 క. 49). అనంతర వారసులు దస్తావేజులో దస్కతు చేయుట ఆవశ్యకము కాదు. కాని, దస్కతు చేసినయెడల వా రు సమ్మతించినట్లు రుజువుచేయుటకు అనుకూలముగానుండును. (1856 సం॥ బం. స. తీ. 596; 24 స. 127). అనంతర వారసు అసంపూర్ణస్వాతంత్ర్యముగల స్త్రీవారసురాలుగా నుండినయె

అనంతర వారసుల సమ్మతితో చేసిన పరాధీనములు.

డల, ఆమె సమ్మతివల్ల, ఆమె యనంతరము వచ్చు వారసుదారు బద్ధులు కారు. (14 మూ. ఇ. అ. 176; ఇ. లా. రి. 11 అ. 253; 5 బొం. 563; 25 బొం. 135; 25 మ. 731).

ఒకవితంతువు అనంతర వారసుల సమ్మతితో చేయు ఆస్తిపరాధీనములు చెల్లదగియుండునను న్యాయము, ఉచితపరాధీనములకు, అనగా, దానములకు వర్తింపదు. (ఇ. లా. రి. 34 బొం. 165).

ఎవరు సమ్మతింపవలెను?

**352.** అనంతర వారసుల సమ్మతి యన్నప్పుడు - తత్కాలమున సన్నిహితుడుగా నుండు అనంతర వారసుదారుని సమ్మతి చాలునా, లేక, స్త్రీవారసురాలు మృతి చెందినప్పుడు ఎవరు బ్రదికియుందురో వారిలో ఎవరు సమీప వారసులుగా నుందురో తెలియదు గనుక, అనంతర వారసు లందరును సమ్మతింపవలెనా?-యీ విషయము కొంతవరకు చిక్కుగానున్నది. అనంతర వారసులలో సమీపుడుగా నుండువాడు పరాధీనమునకు సమ్మతించియుండి అతడు స్త్రీవారసురాలి జీవితకాలములోనే మృతి చెందిన యెడల, అతని సమ్మతివల్ల తక్కిన యనంతర వారసులు బద్ధులైనను కాకున్నను, అతని కుమారులు మొదలగు వారసులు బద్ధులుగా నుందురు. (1856 సం॥ బం. స. తీ. 604; ఇ. లా. రి. 5 క. 44).

స్త్రీవారసురాలు మృతి చెందిన కాలమున ఎవరెవరు వారసులుగా నుండదగియుందురో అట్టివారందరును సమ్మతించుట ఆవశ్యకమనియు, అనంతర వారసులలో తత్కాలము సమీపుడుగా నుండువాడొక్కడుమాత్రము సమ్మతించినయెడల చాలదనియు, బొంబయి హైకోర్టువారి యొక్కయు అలహాబాదు హైకోర్టువారి యొక్కయు అభిప్రాయముగా నున్నది. ఒక బొంబయి కేసులో - భర్తయొక్క ఆస్తి వితంతువుయొక్క అనుభవములో నుండెను. ఆమె కుమార్తెయు, ఆమె భర్తయొక్క

దూరపుజ్ఞాతియు అనంతర వారసులుగా నుండిరి. బొంబయి దేశపు పద్ధతుల ప్రకారము సంపూర్ణస్వాతంత్ర్యముగల వారసు రాలైయుండు సదరు కుమార్తెయొక్క సమ్మతితో, వితంతువు ఆస్తిని పరాధీనముచేసెను. అటుపిమ్మట, ముందుగా కుమార్తె మృతిచెంది, వెనుక వితంతువు మృతిచెందెను. సదరు పరాధీనము దూరపుజ్ఞాతిని బాధించదని తీరుమానము చేసి ఆస్తిని అతని కిప్పించిరి. (ఇ. లా. రి. 5 బొం. 571; 13 మూ. ఇ. అ. 228; ఇ. లా. రి. 25 బొం. 134; 29 బొం. 400; 3 అ. 362; 6 అ. 116, 288; 10 అ. 407; 14 అ. 377; 24 అ. 107).

కొంతకాలమువరకు కలకత్తా హైకోర్టువారుగూడ బొంబయి హైకోర్టువారివలెనే అభిప్రాయమును కలిగియుండిరి. (ఇ. లా. రి. 9 క. 463; ఇ. లా. రి. 10 క. 225). కాని, ఇటీవల - పరాధీన కాలమున సమీపవారసుగా నుండునట్టి అనంతర వారసుని ఒక్కని సమ్మతియే చాలుననియు, అతడు స్త్రీ వారసురాలి జీవితకాలములోనే మృతిచెందినను పరాధీనము రద్దు కాజాలదనియు, ఫుల్ బెంచి తీరుమానము ఇయ్యబడెను. (ఇ. లా. రి. 10 క. 1102). పరాధీన కాలమున, ఒకటే తరగతికి చేరిన సమీపవారసులు అనేకులున్న యెడల - అనగా, దౌహిత్రులు, అన్నదమ్ములు, మొదలగువారు ఇద్దరు ముగ్గురు ఉన్నయెడల - వారందరి సమ్మతియు ఆవశ్యకమని తీరుమానింపబడి యున్నది. (ఇ. లా. రి. 17 క. 896). ఒక వితంతువు తన భర్తయొక్క ఆస్తిలో కొంతభాగమును తగిన అగత్యము లేకుండ పరాధీనము చేసినను, తత్కాలమున అనంతర వారసుగా నుండువాని సమ్మతితో చేయబడినయెడల సదరు పరాధీనము చెల్లునని కలకత్తా హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 35 క. 939).

వితంతువు తనయొక్క హక్కులను వసూలుకొని ఆస్తిని అనంతర వారసున కిచ్చివేయవచ్చునని మదరాసు హైకోర్టు వారు తీరుమానించియుండియు, అనంతరవారసుదారు సమ్మతి లేకున్నను ఆస్తిని పరాధీనము చేయునట్టి అధికారము ఆపెకు లేదనియు, అట్టి పరాధీనము ఆపె జీవితకాలమువరకే చెల్లి, ఆపెయొక్క మరణకాలమున ఎవరు అనంతర వారసులుగా నుందురో వారికే ఆస్తి చెందుననియు తీరుమానించిరి. (ఇ. లా. రి. 21 మ. 128; 28 మ. 57).

అనంతర వారసుల వల్ల దావాలు.

**353**. తగిన అగత్యములేని సందర్భములయందు స్త్రీవారసురాలు, దాన విక్రయాది మార్గములలో ఆస్తిని పరాధీన పరచినయెడల, సదరు పరాధీనము జరిగిన 12 సం॥ ల లోగా అనంతర వారసుదారుడు దావా తెచ్చి, అది సదరు స్త్రీవారసురాలు బ్రదికియున్నంత వరకే చెల్లుననియు, అనంతరవారసుల ను బాధింపజాలదనియు, తీర్పుపొందవచ్చును. ఈ చెప్పబడిన ప్రకారము దావా తెసికొనినాను ఉపేక్షించినయెడల, సదరు స్త్రీవారసురాలు మృతిచెంది అనంతర వారసుదారునికి హక్కు కలిగిన పిమ్మట 12 సం॥ ల లోగా అతడు దావా తెచ్చి, పరాధీన పరచబడిన ఆస్తిని స్వాధీనము చేసికొనవచ్చును. (1908 సం॥ 9 నెం॥ లిమిటేషను ఆక్టు, 2-వ షెడ్యూల్, ఆర్టికల్ 125, 141; ఇ. లా. రి. 8 క. 442; ఇ. లా. రి. 9 క. 934; ఇ. లా. రి. 23 బొం. 725; చూడు, ఇ. లా. రి. 30 క. 990; 1877 సం॥ 1 నెం॥ స్పెసిఫిక్ రిలీఫ్ ఆక్టు సె. 42, e.i.; ఇ. లా. రి. 8 అ. 70; ఇ. లా. రి. 5 క. 949; ఇ. లా. రి. 10 మ. 90; కాని, చూడు, ఇ. లా. రి. 8 క. 12). కాని, ఆలస్యము చేయుటవల్ల రుజువు మొదలైనవి నశింపవచ్చును కాబట్టి స్త్రీవారసురాలు జీవించియుండగానే దావా తెచ్చి తీర్పుపొందుట అనేక సందర్భ

ములయందు ఉత్తమముగానుండును. (క. హై. సప్లి॥ వా॥ 48; 3 స. 183; 4 క. హై. 1; 3 క. హై. 196; 7 క. హై. 213; 14 క. హై. 226; ఇ. లా. రి. 7 అ. 163; 8 అ. 365, 646; 11 క. హై. 171; 13 క. హై. 222; 14 క. హై. 382; ఇ. లా. రి. 10 క. 1003; చూడు - 25 అ. 330; 5 బొం. 450).

స్త్రీ వారసురాలు జీవించియుండగా అనంతర వారసుదారుడు దావాతెచ్చి, ఆమె యనంతరము సదరు ఆస్తి తనకే చేరవలె నని తీర్పుపొందుటకు వీలులేదు. ఎలయనగా - ఆమె మృతి చెందినకాలమున బ్రదికియుండినగదా ఇతడు వారసుదారుడగును? (15 క. హై. 83; ఇ. లా. రి. 8 క. 12).

అనంతర వారసులకు అధికమగు నష్టము కలుగునట్టి తీరున, స్త్రీ వారసురాలు తనయొక్క ఆస్తిని అనుభవించుచున్నయెడల, తత్కాలపు అనంతరవారసుదారుడు దావాతెచ్చి ఆప్రకారము జరిగించకుండునట్లు కోర్టువారిమూలముగా ఆమెకు ఇంజంక్షన్ ఇప్పించవచ్చును. (6 మూ. ఇ. అ. 433; 1 స. 125; 4 క. హై. 1; ఇ. లా. రి. 22 మ. 126 - గనులు త్రవ్వుట). ఆస్తిని బొత్తిగా నాశము చేయునట్టి సందర్భమునందు, దానిని ఆమెస్వాధీనములోనుండి తప్పించి రిసీవరును ఏర్పరచునట్లు కోరవచ్చును. (1854 సం॥ బం. స. తీ. 351; 1858 సం॥ బం. స. తీ. 1103; 14 మూ. ఇ. అ. 198; 10 క. హై. 1; 2 అ. హై. 424). రిసీవరు ఏర్పరచబడినప్పుడు, ఆస్తియొక్క రాబడి యావత్తును స్త్రీవారసురాలికే ఆమెయావజ్జీవము ఇప్పించబడును. (1854 సం॥ బం. స. తీ. 351; 1859 సం॥ బం. స. తీ. 210, 436, 944; 1 క. హై. 27; 24 స. 26. కాని, 3 క. హై. 362; 21 స. 444). ఆస్తిని చక్కగా మేనేజిమెంటు చేయుటకు అనంతరవారసుదారుడే తగినవాడుగా కనుపడినప్పుడు,

అతడే రిసీవరుగా నియమింపబడవచ్చును. (1859 సం॥ బం. స. తీ. 210).

స్త్రీ వారసురాలివల్ల ఆ ఆస్తిని పొంది, ఎవరైనను అక్రమము యిన రీతిన అనుభవించుచు దానిని నాశము చేయుచున్న యెడల, వారిమీదగూడ అనంతర వారసుదారుడు దావాతీసికొని రావచ్చును. (క. హై. సప్లి॥ వా॥ 48; 3 మ. హై. 119; చూడు 7 క. హై. 669).

దూరపు వారసులు దావా తేవచ్చునా?

**354**. తత్కాలమున అనంతర వారసుగా నుండువాడు మాత్రమే పై పేరాలో చెప్పబడిన దావాలు తీసికొని రావచ్చునుగాని, దూరపు వారసులుగాని, అనంతరవారసు సమ్మతి పొంది మరియెవ్వరుగాని, తేసికొని రాకూడదు. (1859 సం॥ బం. స. తీ. 620; 9 స. 463; 10 స. 301; ఇ. లా. రి. 4 అ. 16; ఇ. లా. రి. 6 అ. 428; 2 అ. హై. 31; 13 మూ. ఇ. అ. 209, 224; 14 మూ. ఇ. అ. 176; ఇ. లా. రి. 1 క. 289; 5 అ. 532; 22 క. 354, 29 క. 269).

అనంతరవారసు, సంపూర్ణస్వాతంత్ర్యము లేని స్త్రీగానుండు నప్పుడు, ఆపె పిమ్మట వారసుదారుడు మీద చెప్పినదావాలు తీసికొని రావచ్చును. (ఇ. లా. రి. 13 మ. 195; 15 మ. 422; 6 అ. 431; 32 క. 62; 15 అ. 132; 33 మ. 410). మరియు, అనంతర వారసుదారుడు స్త్రీవారసురాలితో లాలూచీగా చేరి పరాధీనము జరిగించినప్పుడును, అట్లు లాలూచీగా చేరి దావా తీసికొనిరాక ఉపేక్షించినప్పుడును, అతని పిమ్మట అనంతర వారసుదారుడు దావా తీసికొనిరావచ్చును. (1859 సం॥ బం. స. తీ. 891; 24 స. 86, 399; 14 మూ. ఇ. అ. 176; ఇ. లా. రి. 6 అ. 431; ఇ. లా. రి. 2 అ. 41; ఇ. లా. రి. 9 అ. 441; ఇ. లా. రి. 11 మ. 106; ఇ. లా. రి. 27 అ. 406).

# ప్రకరణము 13.

## స్త్రీధనము.

**355.** పురుషులవద్దనుండి వారసు హక్కువలన వచ్చియుండు ఆస్తియందు స్త్రీలకు సంపూర్ణ స్వాతంత్ర్యము లేదనియు, వారి మరణానంతరము సదరు ఆస్తి, వెనుకటి ఆస్తిదారుని వారసులకే చెందుననియు, ఇంతవరకు తెలిపి యుంటిమి. స్త్రీ వారసులకు వారసు హక్కువలన రాదగిన ఆస్తి, వారికి ఉయిలుమూలముగాగాని దానరూపకముగాగాని ఇయ్యబడియున్నను, దానియందు వారికి సంపూర్ణ స్వాతంత్ర్య మేర్పడజాలదు. (14 క. హై. 226; ఇ. లా. రి. 11 బొం. 69, 573; ఇ లా. రి. 11 అ. 296; ఇ. లా. రి. 14 మ. 274; ఇ. లా. రి. 16 మ. 201). కాని, మరికొన్ని విధములలో స్త్రీలకు చేకూరునట్టి సొత్తునందు వారికి అధికమగు స్వాతంత్ర్య మేర్పడి, అది వారి స్త్రీధనమని చెప్పబడుచున్నది. ఈ ప్రకరణమునందు స్త్రీ ధనముయొక్క భేదములును, దాని విషయమై స్త్రీలకు గలిగియుండు పరాధీన స్వాతంత్ర్యమును ఆయా తరగతుల స్త్రీ ధనములకు ఏర్పడియుండు వారసుదార్ల క్రమమును, వివరింపబడును. స్త్రీధనము.

**356.** ధర్మశాస్త్రములయందు - శుల్కము, అధ్యగ్నికము, అధ్యావాహనికము, అన్వాధేయికము, ప్రీతిదత్తము, అధివేదనికము - అని ఆరువిధములైన స్త్రీ ధనములు వివరింపబడియున్నవి. శుల్కమనకు ఉత్పత్తి ఆసురవివాహమునందు కలిగెను. కన్యనిచ్చినందుకై ఆమె తలిదండ్రులు వరునియొద్ద తీసి ఆరువిధములు - శుల్కము, అధ్యగ్నికము, అధ్యావాహనికము, అన్వాధేయికము, ప్రీతిదత్తము, అధివేదనికము.

కొను సొమ్మునకు అసలు శుల్కమని పేరు. ఇటీవల ఆసురవివాహములు జననింద్యములై బ్రాహ్మవివాహములు ప్రబలముకాగా, కన్యయొక్క తలిదండ్రులు తమ స్వోపయోగము నిమిత్తము శుల్కమును తీసికొనుట మాని, కన్యకు కావలసిన నగలు, వస్త్రములు, గృహోపకరణములు మొదలగువాని నిమిత్తము కొంతమొత్తమును ముందుగా నిష్కర్షచేసికొని నిశ్చితార్థకాలమున కన్యకు అరణముగా ద్రవ్యమును, లేక, వస్తువులను తీసికొనువాడుక యేర్పడెను. అట్లు తీసికొనబడు ద్రవ్యము, నగలు, వగైరాసొత్తు శుల్కమని చెప్పబడుచున్నది. వరునివల్లగాని, వరునియొక్క లేక కన్యయొక్క బంధువులవల్లగాని, స్నేహితులవల్లగాని, ఇతరులవల్లగాని, వివాహదినములలో అగ్నిసన్నిధానమునందు కన్య కియ్యబడునట్టి ఆభరణములు వగైరాసొత్తు, అధ్యగ్నిక స్త్రీధనమని చెప్పబడుచున్నది. (16 స. 115). పుట్టిల్లు విడిచి అత్తింటికి కాపురము పోవునప్పు డియ్యబడునట్టి ద్రవ్యము వగైరా, అధ్యావాహానిక స్త్రీధనము. వివాహానంతరము పుట్టింటివైపు బంధువులవల్లగాని అత్తింటివైపు బంధువులవల్లగాని ఇయ్యబడునట్టి సొత్తులు అన్వాధేయిక స్త్రీధనము. వివాహానంతరము భర్తవలన ప్రీతి పూర్వకముగా ఇయ్యబడు సొత్తు ప్రీతిదత్తము. మరియొక భార్యను పెండ్లియాడునప్పుడు ముందటి భార్యకు తృప్తి కలిగించుటకై భర్త యిచ్చునట్టిసొత్తు అధివేదనిక స్త్రీధనము.

యౌతకము, అయౌతకము.

**357.** సమస్తమైన స్త్రీధనమును యౌతకము అయౌతకము అని రెండు తరగతులు. ఒక స్త్రీకి ఆమెయొక్క భర్తవల్లగాని, పుట్టింటి, లేక అత్తింటివైపు బంధువులవల్లగాని, స్నేహితులవల్లగాని, యితరులవల్లగాని, వివాహకాలమున ఇయ్యబడుసొత్తు యౌతక స్త్రీధనము. వివాహమువల్ల వధూవరులు

యుతమగుట (చేరుట)వల్ల, యౌతకమని పేరువచ్చినది. యౌతకముకాని స్త్రీధనము అయౌతకము.

**358**. వివాహమునకు పూర్వముగాని, వివాహకాలమందుగాని, వివాహమునకు పిమ్మటగాని, ఒక స్త్రీకి, ఆమెయొక్క భర్త, తల్లి, తండ్రి, సోదరులు, పుట్టింటి, లేక అత్తింటి సంబంధువులు - వీరివలన ఇయ్యబడిన వస్త్రములు, ఆభరణములు, భూస్థితి వగైరా స్త్రీధనము సౌదాయికమని చెప్పబడుచున్నది. (6 బం. స. తీ. 77, 5 మ. హై. 111 ; 1 అ. హై. 66 ; 10 స. 139 ; 6 అ. హై. 279 ; ఇ. లా. రి. 1 క. 275; 3 మ. హై. 272). ఈ చెప్పబడిన సొత్తులు ఉయిలుమూలముగా నియ్యబడినను స్త్రీధనములుగానే భావింపబడును. (2 మూర్లి. 65 ; 11 క. హై. 295). ఒక స్త్రీకి అచ్చముగా ఇచ్చివేయక పండుగు పర్వములందు మాత్రము ధరించుటకై భర్త మొదలగు వారివల్ల ఇయ్యబడి మరల తీసికొనబడుచుండు నగలు వగైరాసొత్తు ఆమెయొక్క స్త్రీధనము కాజాలదు. సౌదాయికము.

**359**. జీవనాంశము వగైరాలనిమిత్తము ఏర్పాటువలన, ఒక స్త్రీకి ప్రత్యేకముగా సంపూర్ణ స్వాతంత్ర్యముతో నియ్యబడు ఆస్తి ఆమె స్త్రీధనముగా భావింపబడును. (24 స. 168 ; 3 క. హై. 121 ; ఇ. లా. రి. 1 మ. 166). ఒక స్త్రీకి జీవనాంశము నిమిత్తము రావలసిన బాకీసొమ్ముగూడ స్త్రీధనముగానే భావింపబడును. (16 స. 76). 343 - వ పేరా కడపట చూడుడు. జీవనాంశపుసొత్తు వగైరా.

చిరకాలాక్రమణమువల్ల ఒక స్త్రీ సంపాదించు సొత్తు ఆమెయొక్క స్త్రీధనముగా భావింపబడును. (ఇ. లా. రి. 32 అ. 189).

స్త్రీధనముయొక్క ఆదాయమును, దానితో సంపాదించిన సొత్తును, స్త్రీధనముగానే భావింపబడును. (19 స. 292 ; ఇ. లా. రి. 1 మ. 281 ; ఇ. లా. రి. 1 అ. 762). మరియు, అసలు స్త్రీధనముయొక్క ఆదాయము.

స్త్రీధనము విషయమై చెల్లునట్టి పరాధీన స్వాతంత్ర్యమును వారసు క్రమమును అదాయమువిషయమై కూడ చెల్లును.

వివాహానంతర కాలములందు బంధువులు గాక యితరులవలన ఇయ్యబడు సొత్తులును, ఏదైనను పనిచేసి స్త్రీ సంపాదించునట్టి సొత్తులును, పురుషులవద్దనుండి, లేక, స్త్రీలవద్దనుండి వారసు హక్కువలన ఒక స్త్రీకి వచ్చిన సొత్తులును, స్త్రీ ధనముగా భావింపబడవు.

స్త్రీ ధనము మీద స్త్రీకిగల స్వాతంత్ర్యము.

**360**. సమస్తమైన స్త్రీధనము మీదను స్త్రీకి ఒకటే విధమైన స్వాతంత్ర్య మేర్పడియుండలేదు. కొంత స్త్రీధనము మీద సంపూర్ణ స్వాతంత్ర్యమును, కొంతమీద భర్తయొక్క అధికారమునకు మాత్రము లోబడి సంపూర్ణ స్వాతంత్ర్యమును, కొంతమీద యావజ్జీవము అనుభవించునట్టి స్వాతంత్ర్యమును, కలిగియున్నది.

సౌదాయికముమీద

భర్తవలన ఇయ్యబడియుండు చరరూపకమైన స్త్రీధనము మీదను, భర్తగాక యితర బంధువులవల్ల ఇయ్యబడియుండు స్థిరచరరూపక స్త్రీధనముమీదను, మరియు ఈచెప్పబడిన స్త్రీ ధనములలో తాను సంపాదించియుండు స్థిరరూపక స్త్రీధనము మీదను, స్త్రీకి సంపూర్ణ స్వాతంత్ర్యము కలదు. దానిని తన యిచ్ఛ వచ్చినట్లు ఆమె ఖర్చుచేసికొనవచ్చును, విక్రయించవచ్చును, దానరూపకముగా గాని ఉయిలు మూలముగా గాని ఇచ్చివేయవచ్చును. (19 స. 292; 1 మ. హై. 85; ఇ. లా. రి. 7 బొం. 155; ఇ. లా. రి. 5 అ. 310; ఇ. లా. రి. 2 మ. 333). ఈ విషయమై భార్యను ఆజ్ఞ పెట్టుటకు భర్తకు ఎంత మాత్రముగాని హక్కు లేదు. ఆమె సమ్మతిని పొందక సదరు సొత్తును భర్త ఉపయోగించుకొనకూడదు - ఉపయోగించుకొన్న యెడల, తిరుగా ఇచ్చివేయవలయును. మితిమీరిన కష్ట

కాలము తటస్థించినప్పుడు - అనగా, క్షామము, వ్యాధి, అప్పుల వాండ్రవల్ల జెయిలు ఆపత్తు, విడిచిపెట్టరాని వైదికకర్మ, ఇట్టివి తటస్థించి యితర సాధనము బొత్తిగా కనుపడనప్పుడు, భార్య యొక్క సౌదాయిక స్త్రీధనమును భర్త ఖర్చు చేసికోవచ్చును. అట్లు ఖర్చుచేసికొన్నయెడల, పిమ్మట మంచి కాలము వచ్చినప్పుడు సదరు సొమ్మును తిరుగా ఇచ్చివేయుట ధర్మమని స్మృతికర్తలు చెప్పుచున్నారు. భార్యయొక్క స్త్రీధనమును ఉపయోగించుకొనదగిన సందర్భమున దానిని ఉపయోగించుకొనుటకు భర్త యిష్టపడనియెడల, దానిని జప్తుచేయుటకు అప్పులవాండ్రకు ఎంతమాత్రమును హక్కులేదు. (8 బొం. హై. 129; 6 అ. హై. 279).

భర్తవలన ఇయ్యబడియుండు స్థిరరూపకమైన స్త్రీధనము మీద, అతడు జీవించియుండగాగాని మృతిచెందిన పిమ్మటగాని, దానిని స్వేచ్ఛగా ఖర్చుచేయునట్టి, లేక, పరాధీనపరచునట్టి స్వాతంత్ర్యము లేదు. సదరు సొత్తు స్త్రీధనమైనందునకు ఫలమేమనగా - ఆమె మరణానంతరము అది ఆమె వారసులకే చెందును గాని భర్తయొక్క వారసులకు చెందదు. తక్కిన విషయములలో - పురుషులవద్దినుండి స్త్రీలకు వారసు హక్కువల్ల వచ్చిన ఆస్తికెట్టి నిర్బంధములు చెల్లుచున్నవో అట్టి నిర్బంధములే యీ చెప్పబడ్డ స్త్రీధనమునకును చెల్లుచున్నవి. అనగా - అత్యావశ్యకమగు కార్యముల నిమిత్తము తప్ప ఇతర సందర్భములందు దానిని పరాధీనపరచకూడదు. (5 మ. హై. 111; 10 బొం. హై. 403; ఇ. లా. రి. 1 అ. 734; 25 అ. 351; 7 మ. 387). భర్తవల్ల సంపూర్ణ స్వాతంత్ర్యమియ్యబడినప్పుడు మాత్రము సదరు స్థిరరూపక స్త్రీధనమును స్త్రీ యిచ్ఛవచ్చినట్లు ఖర్చు చేయవచ్చును, పరాధీనపరచవచ్చును. (1 అ. హై. 66; ఇ.

భర్తవలన ఇయ్యబడిన స్థిరసొత్తు మీద.

లా. రి. 5 క. 684; 10 క. వైూ. 267; ఇ. లా. రి. 19 అ. 133; ఇ. లా. రి. 10 అ. 495; చూడు - ఇ. లా. రి. 7 బొం. 491; ఇ. లా. రి. 7 మ. 389).

స్వసంపాద్యము మీద.

స్వకాయ కష్టమువల్ల గాని స్వప్రయోజకత్వము వల్లగాని భార్య సంపాదించిన సొత్తును, బంధువులుగాక యితరులవల్ల ఆ పెకియ్యబడిన సొత్తును, ఇవి భర్తయొక్క సమ్మతిలేక పొంద దగిన సొత్తులుకాబట్టి, ప్రధమతః అవి భర్తకే చెందుచున్నవి. సదరు సొత్తులను ఏకారణమును లేకయే భర్త ఖర్చుచేసికొన వచ్చును. (2 మాక్లి. 65). భర్త జీవించియుండగా అతని సమ్మతి లేక సదరు సొత్తులను భార్య ఖర్చుచేసికొన కూడదు. భర్త కంటె ముందుగా భార్య మృతి చెందినచో, సదరు సొత్తు భర్తకు చెంది అతని యనంతరము అతని వారసులకు చెందును. ముందుగా భర్తయే మృతిచెందినయెడల, సదరు సొత్తునందు భార్యకు సంపూర్ణ స్వాతంత్ర్యమేర్పడి ఆపె యనంతరము అది ఆపె వారసులకే చెందును. (ఇ. లా. రి. 1 మ. 307; 21 మ. 100). ఈ చెప్పబడిన సొత్తులు గల స్త్రీ మృతిచెందినప్పుడు, ఆపె పురుషునుగా భావింపబడి, సదరు సొత్తులకు మయూఖగ్రంథమునుబట్టి ఆపె కుమారులు, మనుమలు వగైరాలు వారసులగుదురని కొన్ని కేసులలో బొంబాయి హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 12 బొం. 505; కాని, 344-వ పేరా కడపట, ఇ. లా. రి. 17 బొం. 758 లో తీరుమానము చూడు).

వారసు హక్కువలన స్త్రీవద్దనుండి వచ్చిన ఆస్తిమీద.

వారసుహక్కువల్ల పురుషులవద్దనుండి స్త్రీలకు వచ్చునట్టి ఆస్తి విషయమై యెట్టినిర్బంధము తేర్పడియున్నవో అట్టినిర్బంధములే, ఒక స్త్రీవద్దనుండి మరియొక స్త్రీకి వారసు హక్కువల్ల వచ్చునట్టి ఆస్తివిషయమైనగూడ చెల్లుచున్నవి. మరియు ఈ రెండవ స్త్రీ మరణానంతరము సదరు సొత్తు ఈపె వారసులకు

చెందక, వెనుకటి స్త్రీయొక్క వారసులకే చెందుచున్నది. (2 క. హై. 144; 14 క. హై. 237; ఇ. లా. రి. 5 క. 222; ఇ. లా. రి. 17 క. 911; 3 మ. హై. 314; ఇ. లా. రి. 19 మ. 109, 118; ఇ. లా. రి. 25 అ. 468, 476 - ప్రి. కౌ; చూడుము 367 పేరా). బొంబయి హైకోర్టువారు భిన్నాభిప్రాయులై ఒక స్త్రీవద్ద నుండి వారసుహక్కువల్ల మరియొక స్త్రీకివచ్చునట్టి ఆస్తియందు ఈమెకు సంపూర్ణస్వాతంత్ర్యము కలదని తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 24 బొం. 209, 213).

**361**. ఒక స్త్రీ మృతిచెంది, ఆపెయొక్క స్త్రీధనమునకు వారసులను నిర్ణయించవలసి వచ్చినప్పుడు, సదరు స్త్రీ, మితాక్షరము వగైరా సంప్రదాయములలో దేనికి చేరినదో, ఆపె స్త్రీధనము ఏయే తరగతులలో చేరునో, మరియు ఆపెకు వివాహమైనచో కన్యాదాన (బ్రాహ్మ) రూపకముగా జరిగెనో కన్యావిక్రయ (ఆసుర) రూపకముగా జరిగెనో - యీ విషయములు ముందు నిర్ణయించుట ఆవశ్యకము. ఏలయనగా - ఈ మూడు విషయములను బట్టి వారసు క్రమము భేదించుచున్నది. స్త్రీధనమునకు వారసులను నిర్ణయించుట.

**362**. వివాహము కాకపూర్వము ఒక కన్య మృతిచెందిన యెడల, ఆపెయొక్క స్త్రీధనము - అనగా, తల్లిదండ్రుల వల్లగాని బంధువులవల్లగాని ఆపెకు ఇయ్యబడియుండు వస్త్రాభరణములు మొదలగు సొత్తులు - అన్ని సంప్రదాయముల ప్రకారమును ఈక్రింద చెప్పబడినవారికి వరుసగా చెందును - (1.) కన్యయొక్క అన్నదమ్ములు, (2.) తల్లి, (3.) తండ్రి, (4.) సమీపబంధువులు. (12 మై. 64; ఇ. లా. రి. 24 బొం. 192). కన్యాధనమునకు, కన్యయొక్క తల్లితండ్రికంటె ముందుగా ఆపెతండ్రియొక్క పినతల్లి పెత్తల్లులు వారసులగుదురని బొంబయి హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 32 బొం. 409). కన్యాధనమునకు వారసులు.

తల్లి మొదలగు స్త్రీలవద్దనుండి వారసు హక్కువలన కన్యకువచ్చియుండు స్త్రీధనమున్నయెడల, అది, 367-వ పేరాలో చెప్పబడు ప్రకారము వారసులకు చెందును. ఇట్లు సంక్రమించిన స్త్రీధనవు సొత్తుగూడ మదరాసు ప్రెసిడెన్సీలో కన్యయొక్క స్త్రీధనముగానే భావింపబడి, 364-వ పేరాలో వివరింపబడిన ప్రకారము ఆమె వారసులకు చెందును. (ఇ. లా. రి. 19 మ. 107. చూడుడు, ఇ. లా. రి. 24 బొం. 192; 32 మ. 521).

శుల్కమునకు వారసులు.

**363.** నిశ్చితార్థముజరిగి వివాహము కాకపూర్వము కన్య మృతిచెందినయెడల, వివాహము నిమిత్తము ఆమెకు వరుని యింటివారివల్ల ఇయ్యబడియుండు శుల్కములో ఖర్చులు మినహాయించుకొని మిగిలినసొత్తు తిరుగా వారికే యిచ్చివేయవలయు నని మితాక్షరమునందును మయూఖమునందును దాయభాగమునందును గూడ చెప్పబడియున్నది. వివాహితమైన స్త్రీ మృతిచెందినప్పుడు, ఆమెకు వివాహమునుగూర్చి యియ్యబడిన శుల్కము, తక్కిన స్త్రీధనములవలె ఆమె కుమార్తెలు మొదలగువారికి చెందక, ముందుగా ఆమె అన్నదమ్ములకును, పిమ్మట ఆమెతల్లికిని, చెందునని - మితాక్షర, మయూఖ, స్మృతిచంద్రిక, వీరమిత్రోదయము కాశీసంప్రదాయ గ్రంథములయందు చెప్పబడియున్నది. దాయభాగముప్రకారము, వివాహిత స్త్రీయొక్క శుల్కమునకు, తక్కిన అయౌతక స్త్రీధనమునకు వలెనే వారసు క్రమమేర్పడియున్నదిగాని, ప్రత్యేకమైన వారసు క్రమము లేదు. (11 క. హై. 286, 297; 366-వ పేరా చూడుడు.)

**364.** మీద చెప్పబడిన కన్యాధనమును శుల్కమును తప్ప, తక్కిన సమస్తమైన యౌతక అయౌతక స్త్రీధనమునకును మితాక్షరము ప్రకారము ఒకటే వారసుక్రమమేర్పడియున్నది. అది యేమనగా:—మృతిచెందిన స్త్రీయొక్క—

1. కుమార్తెలు – వీరిలో ముందుగా పెండ్లికాని కుమార్తెలు; వారు లేనప్పుడును వారికి అనంతరమును, పెండ్లియైన కుమార్తెలలో పేదవారు – వీరుగూడ లేనప్పుడును వీరికి అనంతరమును, పెండ్లియైన కుమార్తెలలో భాగ్యవంతురాండ్రు. (ఇ. లా. రి. 25 క. 354).

చిక్కిన సమస్త యౌతక అయౌతక స్త్రీధనమునకు వారసుదార్లు— మితాక్షరము ప్రకారము.

2. కుమార్తెల కుమార్తెలు – వీరు అనేకులుండినప్పుడు అందరును సమభాగములను పొందక తల్లుల సంఖ్యను బట్టి ముందుగా ఆస్తిని విభాగముచేసి, ఆయా తల్లుల భాగములను వారి వారి కుమార్తెలు భాగించుకొనవలయును. మీద చెప్పబడిన యేతరగతి కుమార్తెగాని జీవించియుండగా, కుమార్తె కుమార్తెకు హక్కు లేదు.

3. కుమార్తెల కుమారులు – వీరికిగూడ తల్లుల వెంబడినే భాగములుగాని అందరికిని సమభాగములు లేవు.

4. కుమారులు – అవిభక్త కుటుంబమునకు చేరిన కుమారులకు తల్లియొక్క స్త్రీధనపు ఆస్తి వచ్చినప్పుడు దానియందు వారికి ప్రత్యేక హక్కు లేగాని సమష్టి హక్కులు ఏర్పడవు. (ఇ. లా. రి. 27 మ. 300).

5. మనుమలు – అనగా, కుమారుల కుమారులు – వీరికి తండ్రుల వెంబడినే భాగములుగాని అందరికిని సమభాగములు లేవు. మరియు, కుమారుడు జీవించియుండగా మనుమనికి హక్కు లేదు. ఎట్లనగా–మృతిచెందిన స్త్రీకి ఒక కుమారుడును ఆమెకు పూర్వమే మృతిచెందిన మరియొక కుమారునివల్ల ఒక మనుమడును ఉన్న యెడల, ఆమె స్త్రీధనము యావత్తును కుమారునికి చెందును. (2 డబ్లియు. మెక్. 121). ☞ మితాక్షరము ప్రకారము, స్త్రీధనమునకు సవతిబిడ్డలు వారసులు కారు.

స్మృతిచంద్రిక ప్రకారము, స్వంతబిడ్డలుగాని భర్తమొదలగు వారసులుగాని లేనిచో, సవతిబిడ్డలు వారసులగుచున్నారు. (ఇ. లా. రి. 33 బొం. 452; 13 మ. 348).

6. పిన్నటను—

i. స్త్రీ యొక్క వివాహము కన్యాదానరూపక మైనయెడల, ఆమెయొక్క భర్తయు, అతనితర్వాత అతని సపిండులును వారసులగుదురు. (ఇ. లా. రి. 12 క. 348; 17 బొం. 114).

ii. స్త్రీ యొక్క వివాహము కన్యావిక్రయరూపక మైనయెడల, ఆమెయొక్క తల్లి, పిన్నటతండ్రి, పిన్నటతండ్రి యొక్క సపిండులును వారసులగుదురు. (ఇ. లా. రి. 12 క. 348; 17 బొం. 114).

ఇట్లని మితాక్షరమునందు చెప్పబడియున్నది. కాని, భర్తయొక్క సపిండులనగా నెవ్వరో, తండ్రియొక్క సపిండులనగా నెవ్వరో, తెలుపబడి యుండలేదు.

స్మృతిచంద్రిక, వీరమిత్రోదయము, వివాదచింతామణి, మయూఖము, వరదరాజీయము — ఈ గ్రంథములయందుదహరింపబడియుండు బృహస్పతులవారి శ్లోకమునుబట్టి, కన్యాదాన వివాహ సందర్భమున భర్తకుపిన్నటను, కన్యావిక్రయ వివాహ సందర్భమున తలిదండ్రులకు పిన్నటను, రాదగిన వారసులెవరు అను విషయములో — మృతిచెందిన స్త్రీ యెవరికి మాతృతుల్యముగానుండునో వారు వారసులగుదురని యేర్పడుచున్నది. వారెవరనగా — స్త్రీయొక్క అక్కచెల్లెండ్ర కుమారుడు, భర్తయొక్క అక్కచెల్లెండ్ర కుమారుడు, భర్తయొక్క అన్నదమ్ముల కుమారుడు, స్త్రీయొక్క అన్నదమ్ముల కుమారుడు, అల్లుడు, భర్తయొక్క తమ్ముడు అనగా మరది. ఈ చెప్పబడినవారిలో,

భర్తవైపు వారు భర్తకు పిమ్మటను, తండ్రివైపు వారు తండ్రికి పిమ్మటను, వారసులగుదురని ఊహింపదగియున్నది. (ఇ. లా. రి. 21 మ. 267).

**365.** కన్యాధనము, శుల్కము - ఈ రెంటికితప్ప, తక్కిన సమస్త యౌతక అయౌతక స్త్రీధనమునకు మితాక్షరము ప్రకారము ఒకటే వారసుదార్ల క్రమము ఏర్పడియున్నది. (364 - వ పేరా). కాని, స్మృతిచంద్రిక, వీరమిత్రోదయము, వివాదచింతామణి, మయూఖము, వరదరాజీయము - ఈ గ్రంథముల ప్రకారము అయౌతక స్త్రీధనమునకు - అనగా, వివాహానంతరము అత్తింటి, లేక, పుట్టింటివైపు బంధువులవల్లగాని భర్తవల్లగాని యియ్యబడిన సొత్తునకు వారసుదార్ల క్రమము భిన్నముగానున్నది. అదియెట్లనగా—(ఇ. లా. రి. 9 బొం. 115; 34 బొం. 385; 21 బొంబాయి లా రిపోర్టరు 310) —

స్మృతిచంద్రిక, వీరమిత్రోదయము, మయూఖ గ్రంథముల ప్రకారము - అయౌతక స్త్రీధనమునకు వారసులు.

(1.) స్త్రీయొక్క కుమారులును పెండ్లికాని కుమార్తెలును చేరి ముందుగా వారసులగుదురు. అనగా, వీరందరుచేరి ఆ ఆస్తిని సమభాగములుగా పొందుదురు. కుమారులు లేనిచో పెండ్లికాని కుమార్తెలకే యావత్తు సొత్తు చేరును. పెండ్లియైన కుమార్తెలకును కుమార్తెల కుమార్తెలకును మర్యాదకొరకు నామకార్థము కొంచెము సొత్తు ఇయ్యవలయును. వితంతువులుగా నుండు కుమార్తెల కెంతమాత్రమును సొత్తు రాదు.

(2.) పెండ్లికానికుమార్తెలు లేనియెడల, సదరు స్త్రీయొక్క కుమారులతో పెండ్లియై ముత్తయిదువలుగా నుండు కుమార్తెలు చేరి సమభాగములను పొందుదురు. కుమారులు లేనిచో కుమార్తెలకు, కుమార్తెలు లేనిచో కుమారులకును యావదాస్తి చేరును.

(3.) కుమారులుగాని, పెండ్లికాని లేక పెండ్లియై ముత్త యిదువలుగా నుండు కుమార్తెలుగాని, లేనియెడల- కుమార్తె కుమార్తెలును కుమార్తె కుమారులును వారసులగుదురు. వీరికి తల్లుల వెంబడి భాగములు గాని, అందరును సమభాగములు పొందరు.

(4.) పిమ్మట - మనుమలు, అనగా కుమారుని కుమారులు, వారసులగుదురు. వీరికి తండ్రుల వెంబడినే భాగము లుగాని, అందరికిని సమభాగములు లేవు.

(5.) పిమ్మట - మృతిచెందిన స్త్రీయొక్క వివాహము కన్యాదానరూపకమైన యెడల, భర్తయు అతనివైపు వారును - కన్యా విక్రయ రూపకమైనయెడల, తల్లియు, తండ్రియు, తండ్రివైపు వారును వారసులగుదురు. వీ రెవరో 364 - వ పేరా కడపట చూడుము).

దాయభాగము ప్రకారము స్త్రీధనమునకు వారసులు.

**366.** దాయభాగము ప్రకారము - యౌతక అయౌతక స్త్రీధనములకు వేర్వేరు వారసుక్రమము లేర్పడియున్నవి. మరియు, యౌతకమైనను అయౌతకమైనను సరే, పితృదత్త స్త్రీధనమునకు - అనగా, స్త్రీయొక్క తండ్రివలన ఇయ్యబడిన సొత్తునకు, ప్రత్యేకమైన వారసుక్రమము ఏర్పడియున్నది. ఈ వారసుక్రమము లన్నియు ఈ క్రింద వివరింపబడి యున్నవి.

యౌతకము.

యౌతక స్త్రీధనమునకు దాయభాగ దాయక్రమ సంగ్రహముల ప్రకారము ఏర్పడియుండు వారసుక్రమ మేమనగా—
(1.) నిశ్చితార్థమైనను జరిగింపబడని కుమార్తెలు. (2.) నిశ్చితార్థము జరిగింపబడి పెండ్లికాని కుమార్తెలు. (3.) పెండ్లియైన కుమార్తెలలో పుత్రసంతతి కలవారు, లేక, కలుగదగినవారు. (4.) గొడ్రాండ్రుగా నుండు కుమార్తెలు, విధవకుమార్తెలు. (5.) కుమారులు. (6.) కుమార్తెల కుమారులు.

(7.) మనుమలు, అనగా, కుమారుల కుమారులు. (8.) ముని మనుమలు. (9.) సవతి కుమారులు. (10.) సవతి మనుమలు. (11.) సవతి మునిమనుమలు — ఆటుపిమ్మట, మృతిచెందిన స్త్రీ యొక్క వివాహమునుబట్టి వారసులేర్పడుదురు. అనగా—

| కన్యాదాన వివాహమైనచో | కన్యావిక్రయ వివాహమైనచో |
|---|---|
| (12.) భర్త. | (12.) తల్లి. |
| (13.) అన్నదమ్ములు. | (13.) తండ్రి. |
| (14.) తల్లి. | (14.) అన్నదమ్ములు. |
| (15.) తండ్రి. | (15.) భర్త. |
| (16.) దూరపువారసులు. | (16.) దూరపు వారసులు. |

ఈ దూరపు వారసులెవరనగా —(16.) భర్తయొక్క తమ్ములు, (17.) భర్తయొక్క అన్నదమ్ముల కుమారులు, (18.) స్త్రీయొక్క అక్కచెల్లెండ్ర కుమారులు, (19.) భర్తయొక్క అక్కచెల్లెండ్ర కుమారులు, (20.) స్త్రీయొక్క అన్నదమ్ముల కుమారులు, (21.) అల్లుడు, (22.) భర్త తండ్రి, (23.) భర్త అన్న, (24.) ఇతర సపిండులు- సామీప్యతనుబట్టి, (25.) సకుల్యులు, (26.) సమానోదకులు, (27.) పండితోత్తములు, (28.) రాజు.

అయౌతకము.

అయౌతక స్త్రీధనమునకు దాయభాగము ప్రకారమేర్పడియుండు వారసుక్రమమేమనగా—(11 క. హై. 286; ఇ. లా. రి. 1 క. 275; 32 క. 261; 33 క. 23) —(1.) కుమారులును నిశ్చితార్థమైన జరిగింపబడని కుమార్తెలును చేరి వారసులగుదురు. (2 క. హై. 144). కుమారులు లేనియెడల, ఈ చెప్పబడిన కుమార్తెలకే యావత్తు స్త్రీధనము చెందును. ఈ చెప్పబడిన కుమార్తెలు లేనిచో, కుమారులకు చెందును. తర్వాత— (2.) నిశ్చితార్థముజరిగి పెండ్లికాని కుమార్తెలు. (3.) పెండ్లి

యైన కుమార్తెలలో పుత్రసంతతి కలవారు, లేక, కలుగదగిన వారు. (4.) మనుమలు, అనగా, కుమారుల కుమారులు. (5.) కుమార్తెల కుమారులు. (6.) మునిమనుమలు. (7.) సవతి కుమారులు. (8.) సవతిమనుమలు. (9.) సవతి మునిమనుమలు. (10.) గొడ్రాండ్రుగానుండు కుమార్తెలు, విధవ కుమార్తెలు. (11.) స్త్రీయొక్క అన్నదమ్ములు. (12.) తల్లి. (13.) తండ్రి. (14.) భర్త. (15.) వెనుక పేజీలో చెప్పిన వరుసను భర్తయొక్క తమ్ములు వగైరా దూరపు వారసులు.

పితృదత్తము.

పితృదత్తమునకు - అనగా - ఎప్పుడైననుసరే స్త్రీయొక్క తండ్రివల్ల ఇయ్యబడియుండు సొత్తునకు - దాయభాగము ప్రకారము వారసుక్రమమేమనగా—(11 క. హై. 286, 300; ఇ. లా. రి. 28 క. 311; 33 క. 315; చూడు 36 క. 86)—

1 - మొదలు 11 వరకు 350 - 351 పేజీలలో చెప్పబడిన యౌతక స్త్రీధనమునకువలె—

(1.) నిశ్చితార్థమైనను జరిగింపబడని కుమార్తెలు.

* * * *

(11.) సవతి మునిమనుమలు.

పిమ్మట, అయౌతక స్త్రీధనమునకువలె—

(12.) స్త్రీయొక్క అన్నదమ్ములు, (13.) తల్లి, (14.) తండ్రి (15.) భర్త, (16.) వెనుక పేజీలో చెప్పిన వరుసను భర్తయొక్క తమ్ములు వగైరా దూరపు వారసులు.

ఒకసారి వారసు హక్కువల్ల వచ్చిన స్త్రీధనమునకు పునః వారసుక్రమము.

**367.** ఒక స్త్రీకి సంపూర్ణస్వాతంత్ర్యము కలిగియుండు స్త్రీధనమును ఆపె మరియొక స్త్రీకి దానరూపకముగా లేక ఉయిలు మూలముగా ఇచ్చినయెడల, అది యీ రెండవ స్త్రీ వశములోగూడ స్త్రీధనముగానే భావింపబడి, యీమెయొక్క వారసుదార్లకే చెందును. (2 మాల్లీ. 65; 11 క. హై. 295).

కాని, దానరూపకముగా, లేక ఉయిలు మూలముగా నియ్య బడక, ఒక స్త్రీయొక్క స్త్రీధనపు సొత్తు, ఆమె మరణానంతరము వారసు హక్కువలన మఱియొక స్త్రీకి వచ్చినయెడల, అది యీ రెండవ స్త్రీయొక్క స్వాధీనములో స్త్రీధనముగా భావింపబడ జాలదని ముందటికాలమునుండియు అనేక కేసులలో తీరుమా నింపబడి, 1903 సం॥లో ప్రివీకౌన్సిలు వారివల్లగూడ స్థిరపరచ బడి యున్నది. (2 క. హై. 144; 3 మ. హై. 314; 6 బొం. హై. 18; 14 క. హై. 237; ఇ. లా. రి. 5 క. 225; 25 అ. 468 - ప్రి - కౌ.). పురుషులవద్దనుండి వారసు హక్కువల్ల స్త్రీ లకు వచ్చునట్టి ఆస్తివిషయమై యెట్టినిర్బంధములు చెల్లునో, వారసు హక్కువల్ల ఒక స్త్రీవద్దనుండి మఱియొక స్త్రీకి వచ్చి స్త్రీధన స్వభావము నశించిన సొత్తు విషయమైకూడ, అట్టి నిర్బం ధములే చెల్లును. కాబట్టి, దీనివిషయమై వారికి సంపూర్ణ స్వా తంత్ర్యము కలిగియుండదు. మఱియు, ఈ రెండవ స్త్రీ మరణా నంతరము, సదరు సొత్తు, ఆమె వారసులకు చెందక, వెనుకటి స్త్రీయొక్క వారసులకే చెందుచున్నది. (ఇ. లా. రి. 5 క. 222; ఇ.లా. రి. 17 క. 911, 917; 25 అ. 476-ప్రి. కౌ.). స్త్రీధనము ఒకసారి పురుష వారసులకు చెందిన పిమ్మట, అది తిరుగా వెను కటి స్త్రీయొక్క వారసులకు చెందనేరదు. (3 మ. హై. 312; ఇ. లా. రి. 5 క. 225). ఉదాహరణములు—

(1.) "ఏ" యను ఒక స్త్రీ మృతిచెందినప్పుడు, "బీ" యను పెండ్లికాని కుమార్తెయు, "సీ" యను పెండ్లియైన కుమార్తె యు ఉండి, "ఏ" యొక్క స్త్రీధనము "బీ" కి చెందెను. పిమ్మట "బీ" యను కుమార్తె కన్యాదాన రూపకముగా వివాహమాడి సంతతిలేక, "డీ" యను భర్తను విడిచి మృతిచెందెను. సదరు స్త్రీధనపుసొత్తు "బీ" యొక్క వశములోగూడ స్త్రీధనముగా

నుండినచో, అది భర్తకు చెందును. కాని, వారసుహక్కువల్ల వచ్చిన స్త్రీధనపుసొత్తు కాబట్టి, "సీ" కి చెందును. అనగా, తిరుగా "ఏ" యొక్క వారసునకు చెందును.

(2.) బంగాళా దేశములో "ఏ" యను తల్లివద్దనుండి కొంత స్త్రీధనపు సొత్తును వారసు హక్కువలన పొంది, "బీ" యను ఒక స్త్రీ మృతిచెందెను. ఆమె మృతిచెందిన కాలమున, ఆమెకు "సీ" యను ఒక కుమార్తెయు, "డీ" యను మేనమామయు,ఉండిరి. సదరు సొత్తు మేనమామకు చేరునని తీరుమానింపబడెను. ఎందువల్లననగా, పైనచెప్పబడిన "ఏ" యను తల్లికి, దాయభాగము ప్రకారము "డీ" యను సోదరుడు సమీపవారసుగాని "సీ" యను మనుమరాలు సమీప వారసుకాదు. (1 బం. స. తీ. 3; ఇ. లా. రి. 17 క. 911).

వ్యభిచారము.

**368.** స్త్రీధనమునకు వారసురాలుగా నేర్పడునట్టి స్త్రీ వ్యభిచారిణిగా ప్రవర్తించుచున్న యెడల, ఆమె హక్కునకు భంగము కలుగునా యను విషయమై ధర్మశాస్త్రములయందేమియు కానంబడదు. ఈ సందర్భమున వ్యభిచార దోషము వలన బాధకము లేదని తీరుమానము లియ్యబడి యున్నవి. (ఇ. లా. రి. 1 అ. 46; 30 క. 521; 26 మ. 509; 4 బొం. 122). వ్యభిచారిణియై కులభ్రష్టురాలైన యొక స్త్రీ భ్రష్టదశలో సంపాదించిన ఆస్తికి, ఆమె మరణానంతరము భ్రష్టబంధువులే వారసులగుదురుగాని, ఆమె జనక కుటుంబపు వారును భర్త కుటుంబపు వారును వారసులు కారనియు, వీరికిని ఆమెకును సంబంధము తెగిపోయినట్లు భావింపవలయుననియు తీరుమానింపబడి యున్నది గదా - (ఇ. లా. రి. 21 క. 697) - భ్రష్టురాలు మాత్రము మంచివారి ఆస్తికి ఎట్లు వారసురాలు కావచ్చునని శంకింపదగి యున్నది. కాని, అలహాబాదు హైకోర్టువారి

తీరుమానమునుబట్టి, యీ శంకకు అవకాశములేదు. ఒక స్త్రీ తనభర్తను వదిలిపెట్టి లంజయై లంజరికమువలన సంపాదించిన సొత్తునకు భర్త వారసుదారు కాదగుననియు, లంజరికము వల్లను కులభ్రష్టత్వమువల్లను బాంధుత్వ సంబంధము విడిపోదనియు వారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 29 అ. 4; చూడు 23 మ. 171).

పునర్వివాహము-జాతి భ్రష్టత.

**369.** ఒక స్త్రీ, పునర్వివాహ మాడినను, ఆపెకు మరియొక స్త్రీయొక్క స్త్రీధనము విషయమైన వారసుహక్కు నశింపదు—1856 సం॥ 15 నెం॥ చట్టము. మరియు, 1850 సం॥ 21 నెం॥ చట్టము ప్రకారము, స్త్రీధనము విషయమైన వారసు హక్కు జాతిభ్రష్టతవల్ల నశింపదు. (332-వ పేరా చూడుము).

ప్రథమ భార్యయొక్క నగలు ద్వితీయ భార్యకిచ్చుట. దావాలు, వాయిదా.

**370.** అనేకులు, తమ ప్రథమభార్యలు మృతిచెందినప్పుడు, వారి ఆభరణాదులను కుమార్తెలు మొదలగు వారసుల కియ్యక తమ ద్వితీయ భార్యల కిచ్చుచున్నారు. ఇది లా ప్రకారము అక్రమమైయున్నది. ఇట్టి సందర్భములయందు, సదరు స్త్రీధనమునకు వారసులుగానుండు కుమార్తెలు మొదలగువారు దావా తెచ్చి సదరు నగలనుగాని వాని కిమ్మతుగాని పొందవచ్చును. ఆ నగలు మార్చబడక ద్వితీయభార్య వశములోనుండునప్పుడు ఆమెనుగూడ ప్రతివాదినిగా చేర్చి దావా తేవలెను. ఈ దావాకు వాయిదా ప్రథమభార్య మృతిచెందిన పిమ్మట 3 సం॥ లు. సదరు స్త్రీధనమునకు వారసుదార్లయిన కుమార్తెవగైరాలు మైనర్లుగానుండిన పక్షమందు, మైనారిటీ గడచినది మొదలు 3 సం॥ లు వాయిదా.

---

# అనుబంధము.

—:o:—

## 1910 సం॥ లగాయతు తీర్పులు వగైరా.

---

1. 1908 సం॥ 5 నెం॥ క్రొత్త సివిల్ ప్రొసీడరు కోడ్డు, 1908 సం॥ 16 నెం॥ క్రొత్త రిజిస్ట్రేషను ఆక్టు, 1908 సం॥ 9 నెం॥ క్రొత్త లిమిటేషను ఆక్టు - అమలులోనికి వచ్చియున్నవి కాబట్టి, యీ గ్రంథములో ఈ క్రింది సవరణలు చేసికొనవలయును.

29 పేజి 9 పంక్తి—" 260 సె. " కు బదులు—" ఆర్డరు 21, రూలు 32. "

34 పేజి 13 పంక్తి—" 245 ఏ " కు బదులు— సె. " 56. "

206 పేజి కడపటి పంక్తి—" 539 సె. " కు బదులు—" సె. 92, 93. "

222 పేజి 23 పంక్తి—" 266 సె. " కు బదులు—" సె. 60. "

185 పేజి 21 పంక్తి—" 1877 సం॥ 3 నెం॥ " కు బదులు—" 1908 సం॥ 16 నెం॥ "

201 పేజి 13 పంక్తి—" 1877 సం॥ 3 నెం॥ " కు బదులు—" 1908 సం॥ 16 నెం॥ "

85 పేజి 3 పంక్తి—" 1877 సం॥ 15 నెం॥ " కు బదులు—" 1908 సం॥ 9 నెం॥ "

222 పేజి 11 పంక్తి—" 1877 సం॥ 15 నెం॥ " కు బదులు—" 1908 సం॥ 9 నెం॥ "

33 పేజి 4 పంక్తి—క్రొత్త లిమిటేషను ఆక్టులో ఈ 35 - వ ఆర్టికిల్ వదిలిపెట్టబడినది గనుక దంపతులు చేరుటకై తేబడు దావాకు లిమిటేషను లేదు.

**2. భార్యాభర్తలకు ఒడంబడిక.**

31 పేజి 8 పంక్తి తర్వాత చేర్చవలయును—"భార్యాభర్తలు తాము విడిపోయి వేర్వేరుగా కాపురము చేయునట్లు ఒడంబడిక చేసికొన్నయెడల, అట్టి యొడంబడిక దేశక్షేమమునకును హిందూధర్మశాస్త్రములకును గూడ విరోధముగానుండుటవల్ల చెల్లజాలదనియు, దంపతులు చేసుకొన్నట్టి దావాను అట్టి యొడంబడిక బాధింపజాలదనియు, మదరాసు హైకోర్టువారు 1910 సం॥ నవంబరు నెలలో తీరుమానించిరి. (కృష్ణయ్యర్ వ. బాలమ్మాళ్).

**3. వ్యభిచారిణియగు భార్య.**

34 పేజీ 4 పంక్తి తర్వాత చేర్చవలయును—"వ్యభిచారిణియగు భార్యను తగు నిర్బంధములకు లోబరచి ప్రాణరక్షణమునకు చాలిన మాత్రము అన్న వస్త్రములిచ్చి యింటనే యుంచుకొనుట భర్తకు విధాయకమనియు, పిమ్మట పశ్చాత్తాపము కలిగి దుష్ప్రవర్తనము విడనాడి పరిశుద్ధి ప్రాయశ్చిత్తము చేసికొన్నయెడల తిరుగా ఆమె సంసారమునకు యోగ్యురాలై గృహమునందును కుటుంబమునందును కులమునందును తన యెప్పటి హక్కులు కలిగి యుండుననియు, తక్కువజాతి పురుషునితో వ్యభిచరించిన సందర్భమున మాత్రము పరిశుద్ధి ప్రాయశ్చిత్తమునకు అవకాశము లేక భర్తయింట నివాసమునకును ప్రాణరక్షణమునకు చాలిన అన్నవస్త్రములకును మాత్రము హక్కు కలిగియుండుననియు, ఏ సందర్భమునందును వ్యభిచారిణియగు భార్యను భర్త తనయింటనుండి వెడలగొట్ట గూడదనియు, బొంబయి హైకోర్టు న్యాయమూర్తులగు జస్టిస్ చంద్రవర్కారు గారు హిందూ ధర్మశాస్త్రములను సాకల్యముగా పరిశీలించి తీరుమానించియున్నారు. (ఇ. లా. రి. 34 బొం. 278)."

4. వేర్వేరు శాఖలవారికి వివాహములు.

27 పేజి 16 పంక్తి తర్వాత చేర్చవలయును— "తిరునెల్వేలి జిల్లాలో కైకొలర్ జాతి మొదలారి యొకడు హిందూమతము నవలంబించిన యొక క్రీస్తుస్త్రీని వివాహమాడెను. వారు ఇరువురు ముప్పది నలువది సంవత్సరముల కాలము తమ జాతివారివల్ల దంపతులుగా అంగీకరింపబడి, భర్త మృతిచెందిన పిమ్మట భార్యకు వచ్చిన ఆస్తి విషయమై దావా కలిగి మద్రాసు హైకోర్టులో అప్పీలు దాఖలుచేయబడెను. ఈ అప్పీలులో, జస్టిస్ శంకరనాయరుగారు—కైకొలర్ మొదలారి జాతి కులాచారమువల్ల హిందూమత మవలంబించిన క్రీస్తుస్త్రీతో వివాహము లా ప్రకారము చెల్లదగినదయనియు, భర్త మృతిచెందిన పిమ్మట వారసుహక్కువల్ల వితంతువునకు వచ్చునట్టి ఆస్తియందు ఆమెకు సంపూర్ణము స్వాతంత్ర్యము లేదనియు, ఆమె మృతిచెందిన పిమ్మట సదరుఆస్తి భర్తయొక్క వారసులకే చేరుననియు తీరుమానించిరి. ఇంతేకాక, వేర్వేరు శాఖలవారిక వివాహములు - ద్విజులలో, అనగా, బ్రహ్మ క్షత్రియ వైశ్య జాతులవారిలో మాత్రమే చెల్లవుగాని శూద్రులలో ఆచారముతో అవశ్యము లేకయే చెల్లుననియు - ద్విజులలో చేరని సమస్త జనులు, అనగా, క్రీస్తుమతము వదిలి హిందూమత మవలంబించినవారు, హిందూ స్త్రీకి యూరోపియను పురుషునివల్ల కలిగిన బిడ్డలు, ఈ మొదలగు సమస్తజనులును శూద్రజాతిలో చేరినవారుగా భావింపబడవలసిన కారణముచే, ఇట్టి సంకీర్ణ శూద్రజాతిలో వేర్వేరు శాఖలవారికి జరుగునట్టి వివాహములు లా ప్రకారము చెల్లదగియుండుననియు - తీరుమానించిరి. (ఇ. లా. రి. 33 మ. 342).

5. మతము మారుట.

9 పేజీ 2 పంక్తి కడపట చేర్చు— "ఇ. లా. రి. 10 మ. 69."

6. మైనర్ల రక్షకత్వము.

114 పేజీ 7 పంక్తి కడపట చేర్చు— "ఇ. లా. రి. 4 అ. 95."

7. లంజబిడ్డల జీవనాంశము.

213 పేజీ 17 పంక్తిలో చేర్చు— "ఇ. లా. రి. 32 క. 479."

8. దాసీపుత్రుడు.

269 పేజీ 10 పంక్తి కడపట చేర్చు— "ఇ. లా. రి. 34 బొం. 321."

270 పేజీ 9 పంక్తి కడపట చేర్చు— "ఇ. లా. రి. 33 మ. 226."

269 పేజీ 2 పంక్తి కడపట చేర్చు— "పునర్వివాహము చేసికొను ఆచారము లేని శూద్రజాతి వారిలో ఒక వితంతువునకు కలిగిన పుత్రుడు వ్యభిచార పుత్రుడుగా భావింపబడును గాని దాసీ పుత్రుడుగా భావింపబడడు. కాబట్టి, అట్టివానికి వారసుహక్కు లేదు. (ఇ. లా. రి. 33 మ. 366)."

9. కుమార్తెల వారసుహక్కు—బొంబాయి ప్రెసిడెన్సీలో—

280 పేజీ కడపటి పంక్తిలో చేర్చు— "ఇ. లా. రి. 34 బొం. 510."

10. సవతి తల్లి.

286 పేజీ 9 పంక్తి కడపట చేర్చు— "ఇ. లా. రి. 37 క. 214."

**11.** పినతల్లి పెత్తల్లి కుమారుడు, మేనమామకుమారుడు.

298 పేజిలో బంధువర్గపు వారసులు — 9-10 నంబర్లు — "మేనమామ కుమారునికంటె ముందుగా పినతల్లి పెత్తల్లి కుమారుడు మితాక్షరము ప్రకారము వారసుదారు డగునని తీరుమానింపబడినది. (ఇ. లా. రి. 33 మ. 439)."

**12.** స్వీకారము.

71 పేజి 22 పంక్తిలో చేర్చు— "పినతండ్రి పెత్తండ్రి కుమారుడు పినతల్లి పెత్తల్లి కుమారుడుగా నుండు నపుడు స్వీకారార్హుడు కాడు. (ఇ. లా. రి. 34 బొం. 491)."

53 పేజి కడపటి పంక్తిలో చేర్చు — "సదరు స్వీకారము కోడలి యొక్క అనుమతితో చేసికొనబడినను చెల్లదు. (ఇ. లా. రి. 33 మ. 228)."

**13.** విద్యాధనము.

138 పేజి 8 పంక్తి తర్వాత చేర్చు— "సమష్టి కుటుంబములో ఒక భాగస్థుడు కుటుంబద్రవ్య సహాయము లేకయే జ్యోతిషవిద్య నేర్చికొని దానివల్ల సంపాదించినసొమ్ము అతని స్వార్జితముగా భావింపబడును. (ఇ. లా. రి. 32 అ. 305).

**14.** తండ్రి ఋణము.

143 పేజి 3 పంక్తి తర్వాత చేర్చు— "తండ్రియొక్క అప్పులలో కాలదోషము తగిలియుండు వానిని తీర్చుటకు కుమారుడు బద్ధుడుకాడని తీరుమానింపబడి యున్నది. (ఇ. లా. రి. 33 మ. 308)."

**15.** దేవతా విగ్రహ ప్రతిష్ఠ - దానము.

204 పేజి 9 వ పంక్తిలో చేర్పు—"ఒక ఆస్తిదారుడు ఉయిలుమూలముగా ఆ స్తికి ట్రస్టీల నేర్పరచి, వారు దానిలో కొంత కాలము ఫలానా ఫలానా వారికిచ్చి వేయునట్లును, మిగతా సొమ్ముతో కాళికాదేవి విగ్రహము ప్రతిష్ఠచేసి పూజ జరిపించే యేర్పాటు చేయునట్లును నియమించగా, ఈ దానము చెల్లదగునని కలకత్తా హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 37 క. 128). ఈ తీరుమానము ననుసరించి - ఒక దేవాలయము సంపూర్తిచేసి దానియందు దేవతావిగ్రహము ప్రతిష్ఠ చేయు నిమిత్తమై చేయబడు దానము చెల్లునని అలహాబాదు హైకోర్టువారు తీరుమానించిరి. (ఇ. లా. రి. 32 అ. 337)."

**16.** సంసృష్టి.

248 పేజి 20 వ పంక్తి తర్వాత చేర్పు—"అన్నదమ్ములు తమ సమష్టి ఆస్తిని ప్రత్యేక భాగములుగా పంచుకొని వేరుపడిన పిమ్మట, వారిలో మైనర్లుగా నుండిన కొందరు, ఒక అన్నతో కలిసి కాపురముచేసినంత మాత్రముచే సంసృష్టి యేర్పడజాలదు. సంసృష్టి యేర్పడుటకు, సమష్టి దశ సిద్ధించవలెనను ఉద్దేశముతో సొత్తులు కలుపుకొనుట ప్రధానమై యున్నది. (ఇ. లా. రి. 37 క. 703)."